శ్రీ సాయి నిలయ ప్రచురణము - 12

# శ్రీ సాయినాథ బోధామృతము

(శ్రీసాయిబాబా అభయప్రదానములు – సూక్తులు)

# SRI SAINADHA BODHAMRUTAM

[Telugu Version of H, H. B. V. Narasimha Swami's Gospel of Sai Baba's Charters and sayings English original]



రచయిత :- కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావు గారు

ప్రచురణకర్త :- బాపట్ల వేంకటపార్థసారధి
శ్రీ సాయినిలయమ్, చెరువు (P.O.)
Pin. 522 113

# శ్రీ సాయినాథ బోధామృతము

## (శ్రీసాయిబాబా అభయప్రదానములు – సూక్తులు)

రచయిత :

కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారు



కం. సాయియె సర్వము, సర్వము
సాయి సమర్పణము సలుపు సఖులకు సాయీ
సాయుజ్యము, సాక్షాత్కృతి
సాయము, సమకూర్చి సాయి సాంకును సతమున్

(ప్రచురణకర్త)

ప్రచురణకర్త:- బాపట్ల వేంకటపార్థసారథి
శ్రీ సాయీనిలయమ్, చెరువు (P.O.)
Pin. 522 113

మొదటి కూర్పు: 1968 - 1000
రెండవ కూర్పు: 1981 - 1000

శాస్త్ర గురు బోధలను మఱి స్వానుభవము
కలిమి నెద్దాని నరుఁ డేదుగడఁగ నమ్మ
నదియె శ్రేష్ఠంబుఁ, బరమమౌనదియు, యు
గంబునన్ వాని కవలంబనంబు, సాయి!

మూల్యము రు. 20/-

ముద్రణ :
మాతృశ్రీ ప్రింటర్స్,
బాపట్ల - 522 101.



ఇచట నే నుండ నింక భయమేల? విడుము । నీ బరువుల నాపై నేన నిర్వహింతు ॥
నమ్మిగను వేయికన్నుల నిన్నుఁ గందు। తనయ! నమ్ము! నాఅభయప్రదానమిదియు!

ర చ యి త:

కీ॥ శే॥ శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు



గురుడవు నీవే! సాయీ
పరమాత్ముఁడవీవె నాకు; పావనమౌ నీ
చరణంబులె శరణంబని
ధర నమ్మి కొలుతుఁ గృపఁగను తండ్రీ! హనుమా!!

(ప్రచురణకర్త)

# ప్రచురణ కర్త



కం॥ నా యజ్ఞానముఁ బాపుము,
నీ యందేకాంత భక్తి నిలుపఁగ నిమ్మా!
సాయీ(!) సాహితి వెలువడ
సాయంబిడు ఆశ్రితులను సత్కృపఁ గనుమా!

శ్రీ సాయినాథాయనమః

# తొ లి ప లు కు

"సుఖం మే భూయాత్, దుఃఖం మే మాభూత్"

(నాకు సుఖము కలుగుఁగాక. దుఃఖము లేకుండుఁగాక) అను కోరిక సకల ప్రాణి సాధారణము. సంసారమున సకల జీవులకును సుఖమల్పముగను, దుఃఖ మధికముగను కలుగుట యనుభవమునఁ గన్పించుచున్నది. జీవులకు దుఃఖము తాము కోరినది లభించక పోవుటచేతను లభించినది నశించుటచేతను గలుగుచున్నది. ఇట్టి దుఃఖము పరమేశ్వరారాధనచే నుపశమించును.

"సంసార విషవృక్షస్య ద్వేఫలేహ్య మృతోపమే
కదాచిత్కేశవే భక్తిః తద్భక్తైర్వాసమాగతమ్"

గీ॥ హేయసంసార మది విషవృక్షః మైన
దాని కమృతోపమము ఫలద్వయము వెలయుఁ
బద్మనాభపదాంభోజ భక్తి యొకటి
తన్మహాభక్తసంగ విస్తరత యొకటి ('నా' యనువాదము)

సంసారమను విషవృక్షమున కమృతోపమగు రెండు పండ్లు కలవఁట. పద్మనాభుని భజించుట యొకటి తద్భక్త సాంగత్యము రెండవది. వీని వలన భక్తుఁడు తరింపగలఁడు

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజామ్యహమ్"

ఎప్పుడెప్పుడు ధర్మమునకుహాని, అధర్మమునకు వృద్ధి కలుగునో అప్పుడే నవతరింతునని శ్రీకృష్ణపరమాత్ముని సూక్తి. శిష్టరక్షణమునకు దుష్ట

శిక్షణమునకు పరమేశ్వరుఁ డవతరించి దుష్టులను దునిమి శిష్టులను రక్షించును. దుష్టులనగా రాక్షసులు, శిష్టులనగా మునులు మాత్రమే కాదు. "సత్యాన్నాస్తి పరోధర్మ, అహింసాపరమోధర్మ" అను సూక్తుల ప్రకారము అహింస అధర్మములు లోకములో నమితమై సత్యాహింసలు తగ్గి ప్రజలు బాధపడుచున్న సమయమున పరమేశ్వరుఁ డవతారమంది వానిని సరిచేయును. అవతారమనగా శంఖ చక్ర గదాదులతో నవత రించనవసరములేదు. మానవునిగా పుట్టవచ్చును. రామకృష్ణాద్యవతారము లట్టివేకదా! దశావతారములేకాక యింకను పెక్కు అవతారములున్నవి. కపిలావతారము, దత్తాత్రేయావతారము మున్నగునవి.

అదేవిధముగా ఆధునికకాలమున కూడ భగవదవతారములుగా పూజింపఁబడుచున్న మహాపురుషులు శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీహర నాథబాబా, శ్రీరమణమహర్షి, శ్రీషిరిడిసాయిబాబా మొదలగు మహనీయులు.

శ్రీ సాయిబాబావారు హిందూ బ్రాహ్మణదంపతులకు జన్మించి మహమ్మదీయ పకీరుచే పెంచబడి యఘటనాఘటన సమర్థుఁడై, జ్ఞాన వైరాగ్య సంపన్నుడై, భక్తమందారమై సకలమతములవారిచేతను గురువుగా నారాధింపఁబడిన మహనీయుఁడు.

"యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః"

ఎవరు నన్నే విధముగా కొలిచిన వారి నావిధముగనే పొందుదును. లోకము లోని ప్రజలేయే కోరికలు కోరిన వారవి పొందుదురు అను గీతాచార్యుని సూక్తి ప్రకారము ఈశ్వరుఁడన్నను, 'అల్లా' యన్నను 'క్రీస్తు' అన్నను ఒక్కఁడే. వివిధ జాతి కుల మతముల వారలకు వేరువేరు దేవుళ్ళులేరు. దేవుఁడొక్కఁడే. అతఁడు పెక్కు రూపముల దాల్చగల సమర్థుఁడని ప్రత్యక్షముగా నిరూపించినాఁడు శ్రీసాయి ప్రభువు.

శ్రీసాయి ప్రభువు నైజామురాష్ట్రమున పత్రి గ్రామమున బ్రాహ్మణదంపతులకు 1835 ప్రాంతమున జన్మించెను. రెండవయేటనే

ప్రతిసమీపమునగల 'బున్వాత్' గ్రామ నివాసియు, 'సూఫీ' మతాను యాయియైన ఫకీరుచే పెంచబడెను. సుమారు 4 సంవత్సరములా ఫకీరా బాలుని పోషించి, మంచి ప్రవర్తనమును భక్తిని సరిగూర్చెను.

ఆఫకీరనంతరము సాయిబాబా వేంకేశుని 12 సంవత్సరములు సేవింప (1843-1855) గుర్వాజ్ఞచే సుమారు మూఁడు సంవత్సరము లటునటు సంచరించి తుదకు 1858 లో షిరిడీపురముజేరి యచటగల మసీదులో నివాసమేర్పరుచుకొని యా మసీదునకు 'ద్వారకామాయి' యను పేరుపెట్టి 1918 వఱకు సుమారు 60 సంవత్సరములు బాబా షిరిడీ పురిలో భౌతిక తనువుతోనుండి అనేకమందిని తరింపఁజేసి, ఆదివ్యాధు లను మాన్పి, దుర్మార్గులను సన్మార్గులగావించి, దుష్టులను శిష్టులుగా నొనరించి నిర్ధనికులను ధనికులుగాఁజేసి, సంతానహీనులను సంతాన వంతులుగా నొనర్చి, యజ్ఞానులను విజ్ఞానులుగా నొనర్చి, స్వర్గమునగల కామధేనువు, కల్పవృక్షము, చింతామణి షిరిడీలోనున్న సాయిబాబా రూపమేయని విజ్ఞులు ప్రస్తుతింప, దీనులు దీనత్వముబాయు, రోగులు- నిరోగులుగామార అజ్ఞానులు విజ్ఞానులైె గ్రాలునట్లుగా నొనర్చి పిపీలికాది బ్రహ్మపర్యంతము తానేయని భక్తులకు నిరూపించిన మహనీయుఁడు శ్రీసాయిబాబా. ఉన్నతోద్యోగులు మొదలు నిరుపేదవఱకు నందఱిని సమముగా నాదరించి వారివాంఛల దీర్చిన సౌజన్యమూర్తి సాయిబాబా. బాబా నిస్వార్థపరుఁడై తనకుగల సర్వశక్తులు భక్తరక్షణార్థమే వినియో గించిన మహాత్యాగి శ్రీ సాయిబాబా. నాఁడేకాదు నేఁటికిని భక్తి ప్రపత్తు లతోఁ దన్ను కొలిచినవారి వాంఛల నీడేర్చుచున్నాడు.

పూజ్యశ్రీ B. V. నరసింహస్వామి మహోదయు లాంగ్లమున రచించిన "Saibaba's Charters and sayings" అని వ్రాసిన గ్రంథమును 'మహాకవి' శ్రీ బాపట్ల హనుమంతరావు మహోదయులు 'శ్రీ సాయినాథ బోధామృత' మను పేరున తియ్యని తెనుఁగులో ననువ దించిరి. ఈ గ్రంథమున బాబాభక్తులకు బోధించిన యమృత సమాన బోధనలన్నియు నొకచోటచేర్చి కూర్చబడినది. భగవద్గీతవలె పరమ పవిత్రమైనది. భక్తుల వాంఛలను బట్టి వారివారి మనస్తత్వముసకు

సరిపడునట్లు బాబాచే నుడువబడిన వివిధ విజ్ఞాన భాండాగారమే యీసాయీబోధామృతము. వేదవేదాంగ విజ్ఞాన క్షీరసాగరము మథించి వెలికితీసినదీ సాయీబోధామృతము.

శ్రీ సాయీబోధామృతము నాంధ్రీకరించినవారు పూజ్యులైన శ్రీ బాపట్ల హనుమంతరావుగారు. వీరు తే 14-9-1902 దిని జన్మించిరి. ఆంధ్ర గీర్వాణ హూణభాషార్ణవములు కుంభసంభవునివలె కడుసార గ్రోలిన మహనీయులు. సంస్కృతాంధ్ర కవిత్వము చిన్ననాడే వీరి కలవడినది. వీరు శతాధిక గ్రంధకర్తలు. Ist grade తెలుగు పండితులుగా నుద్యోగించి పెక్కురు శిష్యులను తనంతవారినిగాఁజేసిన యాదర్శోపాధ్యాయుఁడు. సంస్కృతాంధ్రాంగ్లములే కాక హిందీ మరాటీ మొదలగు భాషలు నేర్చిరి. తులసీదాసు రామాయణమును చాలవఱకు తెనిగించిరి. కృష్ణకర్ణామృతము, భగవద్గీత, శంకరభగవత్పాదుల ప్రబోధ సుధాకరాది వింశతి ప్రముఖ సంస్కృత గ్రంథము లనువదించిన పుంభావ సరస్వతులు. వీరికి శ్రీసాయిబాబా 27—12—1944 న స్వప్నమున సాక్షాత్కరించి, యాశీర్వదించి వీరిని నిజాస్థాన కవిగా జేర్చుకొనెను. అది మొదలు తెనుఁగువారు కనివినని సాయిబాబాను గురించి వ్రాయబడిన వివిధ గ్రంథము లాంగ్లమునుండి, మరాఠ్యాది భాషలనుండియు ననువదించి తెలుఁగువారి జీవితములు సాయీపద కమల భృంగములుగాఁజేసిరి. వీరి గ్రంథములు చదివి పెక్కురు బాబా భక్తులై బాబా కరుణకు పాత్రులై వెలుగుచున్నారనుట యతిశయోక్తి గాదు. భక్తి గ్రంథములు పద్యములలోగాని, వచనములలోగాని వ్రాయుటలో వీరు సిద్ధహస్తులు. బహుశా శ్రీపోతరాజామాత్యుఁడే మఱల శ్రీ సాయిచరిత్రమును నుడువ శ్రీహనుమంతరాయామాత్యుఁడై బొడమి రనుటలోవీరి కవిత్వము చదివిన వారలకించుకయు సందేహములేదు. వీరు వచనములో రచించిన 'ఏమీనిన్నుపేక్షింతునా' యను భక్తుల వృత్తాంతములు రెండవ భాగవతమేయని చెప్పవచ్చును. వీరు 7-11-1973 న శ్రీసాయిలో సైక్యమగువఱకు బాబాను గురించి గ్రంథములు రచించుచునే యుండిరి. వీరు ఆదర్శపురుషులు. ధన్యజీవులు.

'ఆత్మావై పుత్త్రనామాసి' అను శ్రుతివాక్యము సార్థక్యముఁ జేసినవారు శ్రీ బావట్ల హనుమంతరావుగారి ప్రథమ పుత్రరత్నము శ్రీవేంకట పార్థసారథిగారు. వీరుకూడ తండ్రిగారివలెనే బహుభాషా కోవిదులు, సరసకవులు, వినయసంపన్నులు, గ్రంథకర్తలు. వీరు శ్రీసాయిబాబా శతకము, మారుతీ తారావళి మున్నగు గ్రంథములు రచించి పండితామోదమందిరి. వీరు పితృభక్తిలో శ్రీరామచంద్ర మూర్తితోఁ దులతూగ గలిగినవారనుటలో నతిశయోక్తిలేదు. వీరు తమ తండ్రిగారి ముద్రితాముద్రిత గ్రంథములను వెలువరింప కంకణము ధరించి యందుఁ జాలమట్టుకు కృతార్థులైనారు. "శ్రీహనుమంతరావు గారు రచించిన 'ఏమీ నిన్నుపేక్షింతునా? అను గ్రంథము చతుర్థ సంపుటము వెలువరించు సమయమున నేను వ్రాసిన పద్యముదహరించుట అప్రస్తుతము కాదనుకొందును.

"చ॥ జనకుఁడొసంగు భూములు, విశాలగృహమ్ములు, దొడ్డ తోటలున్
ధనము గ్రహించు పుత్త్రకులు ధారుణినుందురుగాని, మీవలెన్
జనకుఁడముద్రితమ్ములగు జాడను వీడిన గ్రంథజాలముల్
పనిగొని యచ్చుఁగూర్చు గుణవర్యులు మృగ్యులు పార్థసారథీ॥"

కాగితమునకు ముద్రణమునకు కఱవేర్పడి, లక్షాధికారులు గూడ గ్రంథములు ముద్రించుట జంకి మిన్నకుండిన నేఁటి కఱవు దినములలో వత్సరమున కొకగ్రంథము చొప్పున వెలువరించుచున్న మహనీయులు శ్రీ వేంకట పార్థసారథిగారు. వీరి సద్గుణములు వర్ణింప వేనోళ్ళవాఁడు కూడ వేసారునన నల్పజ్ఞుఁడనగు నేనెంతవాఁడను. శ్రీసాయి ప్రభువు వీరికాయురారోగ్య భోగభాగ్యము లొసఁగుగాత మని ప్రార్థించు చున్నాను.

ఇట్టి పవిత్ర గ్రంథమునకు తొలిపలుకు వ్రాయమని శ్రీపార్థసారథిగారు నన్నుకోరిరి.

"మన్దః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యేఫలే లోభా దుద్బాహురివ వామనః"

అని కాళిదాస మహాకవియే పలికినాఁడు. నే ననయెంత? అల్పజ్ఞుఁడనగు నేను శ్రీ పార్థసారధిగారి కోరికను బాబా యానతిగా భావించి కలము బట్టి యీ నాలుగు మాటలు వ్రాయ సాహసించితిని. ఆంధ్ర సోదర సోదరీమణు లెల్లరీగ్రంథము నాదరించి పఠించి, తక్కుగల గ్రంథములు కూడ వెలువరించుటకు యథోచిత సాయము నొనరించి ధన్యులై శ్రీసాయి కరుణామృతమున నోలలాడుదురుగాత. ఇట్టి సద్గ్రంథమును వెలువరించిన శ్రీ బాపట్ల వేంకటపార్థసారథిగారికి, సాహాయ్యముచేసిన భక్తబృందమునకు శ్రీ సాయిబాబా సర్వవిధముల కాపాడుగాతమని ప్రార్థించుచున్నాను.

ఉ॥ శ్రీ మహితాత్ములౌ నమరశేఖరు లబ్ధి జనించి నట్టిది
వ్యామృతమాని నిర్జరత నయ్యమృతత్వము నందినట్లుగన్
భూమిని సర్వమానవులు పూజ్యతరమ్మగు సాయినాథబో
ధామృతమానిపొందుఁడ జరామర సౌఖ్యము గూర్పుధామమున్

ఇట్లు
విధేయుఁడు
మధురకవిరత్న, కవిభూషణ
మూలా పేరన్న శాస్త్రి

విజయనగరము
9-2-1981

ఓం

శ్రీ సమర్థ సద్గురు సచ్చిదానంద సాయీనాథ మహారాజునకు
జయము

# శ్యామ సందేశము

సచ్చిదానందుడవు కాగోరుదువేని సదా సాయీనామ సుధామృతమును హాయిగా నాస్వాదించుచుండుము.

భవబంధ విముక్తుడవు కాగోరుదువేని బాబా పవిత్ర పదపద్మముల నాశ్రయించి, నీ సర్వస్వమును ఆ తండ్రిపర మొనరింపుము.

నిష్ఠ, సబూరులను (ప్రగాఢమగు విశ్వాసము, ధైర్యోత్సాహములతో గూడిన ఓర్పు)ని గలిగియున్న, నిర్భీతి నిన్నంటియుండును– నిజధామమును జేరగలవు– నిత్యానందము నందగలవు.

పైన వ్రాయబడిన సందేశములు నిత్యసత్యములని అనుభవజ్ఞులగు శ్రీ సాయీబాబా పదాశ్రితులు సదా వచించుచుందురు. దానికి కారణం – అవన్నీ ఆతండ్రి తన బిడ్డల శ్రేయముల కొరకై అనుగ్రహించిన ఆదేశములే !

శ్రీసాయీబాబా చరిత్రనెందరెందరో పఠించుచున్నారు పారాయణ మొనరించుచున్నారు, కీర్తించుచున్నారు, ఇష్టకామ్యార్థముల బడయుచున్నారు, తరించుచున్నారు.

తెలుసుకోగలిగిన వారికి శ్రీసాయియే సకలదేవతా స్వరూపుడు, సకల సాధు స్వరూపుడు, సకల ప్రాణికోటి స్వరూపుడు, సర్వాంతర్యామి, సర్వగతుడు, సకల చరాచరమున కాధారుడు, సమర్థ, సద్గురుడు.

విమర్శలకంతు దొరకడు, వివాదముల కతీతుడు, విచారముల కనంతుడు, విజ్ఞానమున కాధారుడు, వివేక వైరాగ్యముల కధినాథుడు, విశ్వంభరుడు–శ్రీసాయినాథుడు.

శ్రీసాయి – లోకహితార్థమై శరీరమును ధరించి సర్వజనులకూ, చక్కగా బోధపడు రీతిలో, అనుభవముల కత్యంత సన్నిహితముగా, ఆలోచనల కందుబాటులోనుండురీతిగా తనసందేశములను అనుగ్రహించినాడు. ఆలోచింపజేసి, ఆచరించి, ఆనందించి, తరించునటుల బ్రోచినాడు. సర్వజాతి, మత, కుల, వయో, లింగ భేదముల కతీతుడై, సకల జనామోదుడై, సమ్మోహనుడై నిలచియున్నాడు.

తనవారల ననుగ్రహించుటకై తలకు గుడ్డనుగట్టి, చేత సటకానుబట్టి, మశీదున ధునినిబెట్టి, శరీరమునకు సాయిబాబాయను పేరు బెట్టుకున్నాడు. శరీరము సమాధిగతమైనది కానీ, పేరుమాత్రం ప్రణవమై పావనమై, ప్రభంజనమై, ప్రమోదకరమై, ప్రపంచమందంతట వ్యాపించి యున్నది.

ఇంతట ఉత్కృష్టమగు శ్రీ సాయిబాబా అవతారధారి బోధామృతము నాస్వాదించి, తరించుటకు ఒకింత ఆలోచింతము, ఏమని? బాబా సందేశములు, ఆదేశములు క్రొత్తవా? పాతవేనా? పాతవైనచో యింతవరకు వాటిని అమలు పరచిన వారెవరున్నారు? క్రొత్తవైనచో, భగవానుడేల క్రొంగొత్త నుపదేశముల జేయవలసివచ్చెను?

ముఖ్యముగా, శ్రీసాయి తనవారినందరినీ నిష్టసబూరులను గలిగియుండమని ఆదేశించినాడు.

దైవమునందుగానీ, సమర్థసద్గురునియందుగానీ, ధ్యేయమునందుగానీ నిష్ఠ సబూరులను గలిగియున్న సత్ఫలితముల నందగలరని బాబా నుపదేశించినాడు.

యుగయుగాలుగా భగవద్దర్శనాసక్తులగు వారందరూ గలిగియుండినవి – ఆరెండింటినే.

హిరణ్యకశ్యపుని ధ్యేయము - విష్ణువును దర్శించి, కదన మొనరించుట, కలియుబడుట - దానికి కారణం - తానే అధికుడనన్న అహంకారము, స్వజన, పక్షపాతములు.

మరణము లేకుండునటుల జేసుకొను ధ్యేయమునందుగల ధ్యాసతో, శారీరక, మానసిక బాధల సరకుగొనక నిష్ట, సబూరులతో శ్రమించి, చివరకు సులభ మరణము లేకుండునటుల వరమును బొంద గలిగెను.

హరిని దర్శింపవలయుననెడి కాంక్షతో, తపించి, తపించి, తన కుమారుడే తనకు శత్రువుగామారిననూ మానసిక క్లేశమనంతమైననూ, పరిస్థితులతో రాజీపడక, పరిస్థితుల కనుగుణ్యముగా తన ధ్యేయముల మార్చుకొనక ఏనాటికైననూ తన కోరిక నెరవేరగలదనెడి ప్రగాఢమగు విశ్వాసముతో, ఎంతో ఓర్పుతో, ధైర్యోత్సాహములవీడక అనేక రీతు లలో ప్రయత్నించి చివరకు దర్శించి ఆ దివ్య తేజములోనే లీనము కాగలిగినాడు.

ఇక ప్రహ్లాదునిధ్యేయము - విష్ణువునుదర్శించి, కౌగలించు కొని, కడదేరుట - దానికి కారణం - నిరహంకారము, నిజధామగ మనము, నిర్మల చిత్తము, నిరంతర భగవన్నామ సంకీర్తనానంద సుఖానుభూతి.

"హరి ఎక్కడ?" అన్న తండ్రి ప్రశ్నలకు విసుగుజెందక, శారీరక, మానసిక, క్లేశపరంపరలకు లొంగక, "హరి ఎక్కడ నైననూ గలడనెడి" సమాధానముల నొసంగచూ, తన ధ్యేయము నందుగల నిష్టసబూరులతో భగవానుని దర్శించి తరించెను. కానీ పరిస్థితుల కనుగుణ్యముగా తన ధ్యేయముల మార్చుకొనడయ్యెను.

శిబిచక్రవర్తి పరోపకార పరాయణత్వ ధ్యేయముతో, నిష్టస బూరుల గలిగియుండి తనశరీరమునే కోసి యిచ్చిన కారణము వలననే ఇంతవరకు కీర్తింప బడుచున్నాడు.

విమర్శలకంతు దొరకడు, వివాదముల కతీతుడు, విచారముల కనంతుడు, విజ్ఞానమున కాధారుడు, వివేక వైరాగ్యముల కధినాథుడు, విశ్వంభరుడు-శ్రీసాయీనాథుడు.

శ్రీసాయి – లోకహితార్థమై శరీరమును ధరించి సర్వజనులకూ, చక్కగా బోధపడు రీతిలో, అనుభవముల కత్యంత సన్నిహితముగా, ఆలోచనల కందుబాటులోనుండురీతిగా తనసందేశములను అనుగ్రహించినాడు. ఆలోచింపజేసి, ఆచరించి, ఆనందించి, తరించునటుల ప్రబోధించినాడు. సర్వజాతి, మత, కుల, వయో, లింగ భేదముల కతీతుడై, సకల జనామోదుడై, సమ్మోహనుడై నిలచియున్నాడు.

తనవారల ననుగ్రహించుటకై తలకు గుడ్డనుగట్టి, చేత సటకానుబట్టి, మశీదున ధునినిబెట్టి, శరీరమునకు సాయిబాబాయను పేరు బెట్టుకున్నాడు. శరీరము సమాధిగతమైనది కానీ, పేరుమాత్రం ప్రణవమై పావనమై, ప్రభంజనమై, ప్రమోదకరమై, ప్రపంచమందంతట వ్యాపించియున్నది.

ఇంతటి ఉత్కృష్టమగు శ్రీ సాయీబాబా అవతారధారి బోధామృతము నాస్వాదించి, తరించుటకు ఒకింత ఆలోచింతము, ఏమని? బాబా సందేశములు, ఆదేశములు క్రొత్తవా? పాతవేనా? పాతవైనచో యింతవరకు వాటిని అమలు పరచిన వారెవరున్నారు? క్రొత్తవైనచో, భగవానుడేల క్రొంగొత్త నుపదేశముల జేయువలసివచ్చెను?

ముఖ్యముగా, శ్రీసాయి తనవారినందరినీ నిష్ఠసబూరులను గలిగియుండమని ఆదేశించినాడు.

దైవమునందుగానీ, సమర్థసద్గురునియందుగానీ, ధ్యేయమునందుగానీ నిష్ఠ సబూరులను గలిగియున్న సత్ఫలితముల నందగలరని బాబా నుపదేశించినాడు.

యుగయుగాలుగా భగవద్దర్శనాసక్తులగు వారందరూ గలిగియుండినవి – ఆరెండింటినే.

సత్యవ్రతపాలన యందుగల ధ్యేయము నిష్టసబూరులను గలిగించి హరిశ్చంద్రుని చరితార్థుని జేసినది.

బలిచక్రవర్తి, కర్ణుడు, దానగుణ ధ్యేయమనస్కులై నిష్టసబూరుల గలిగియున్నందున యింతవరకు వారి నామములను స్మరించుచున్నారు.

అలాగే ధృవుడు, మార్కండేయుడు, హనుమంతుడు మొదలగు వారెందరో చిరంజీవులుగానున్నారు.

వారెవ్వరూ పరిస్థితుల కనుగుణముగా తమ ధ్యేయముల మార్చుకొనలేదు. ఆ ధ్యేయముల యందుగల ధ్యాసలే నిష్టసబూరులకు మూలములయ్యెను.

కావున పరిస్థితుల కనుగుణముగా ధ్యేయముల మార్చుకొనిన నిష్టసబూరులభివృద్ధిజెందక సత్ఫలితముల నందరనియే శ్రీ సాయిబాబా తనవారికి బోధించినది – ఇదిసనాతనమే – అధునాతనముకాదు —

శ్రీసాయి సశరీరులుగా నున్నప్పుడు ఆతండ్రిని సేవించిన వారెంతటి ధన్యులో!

ప్రస్తుతము శ్రీసాయీ సచ్చరితముల జదువుచూ, బాబా భక్తుల అనుభవములననేకముల వినుచూ, ఆతండ్రిశక్తి మహత్తులను గురించి అవగాహన గలిగిననూ, పరిపూర్ణముగు నిష్టసబూరులు నాలాంటి వారి మనస్సులలో నెలకొనుట కష్టముగా నున్నది. ఇవన్నియూ ఏమియూ దెలియక ఆతండ్రియందు నిష్టసబూరుల గలిగియుండి, సేవించిన వారిని మించిన భాగ్యవంతులగు వారెవరుందురు?

ఎందరెందరో బాబాను దర్శించిననూ, "భక్తుడా!" యని మహల్సాపతినొక్కనినే పిలిచినాడు. జీవన్ముక్తుగాజేయునెంచి వివేక వైరాగ్యముల గలిగించి, లౌకిక సంపదల ననుభవించనీయక, కడు పేదగా నడపించినాడు మహల్సాపతి తనకు గలిగిన దానితో తృప్తి

పడి జీవించి, ప్రభుని అనుగ్రహమునకు పాత్రుడైనాడు. బాబాభిక్షకై వెడలియుండినపుడు, 72 జన్మలముందునుండి సంబంధముగలిగి యుండిన "శ్యామ" (మాధవరావు దేశపాండే) ఒకసారి బాబాపేర వచ్చిన రెండు రూప్యములను బాబాకీయక తమాషాకై మసీదు ముంగిటనే గుంటలో దాచియుంచెను. 6 నెలలవరకు బాబా దానిని గురించి అడుగనందున బాబాకు దెలియక తాను దాచగలిగితినని భావించిన శ్యామాయింటిలో. దొంగతనము జరిగెను. దొంగతనమును గురించి బాబాకు విన్నవించుకున్న శ్యామాతో బాబా "నీయింటిలో జరిగిన దొంగతనమును గురించి నీవు చెప్పుకుంటే వినుటకు నేనున్నాను కానీ, నా రెండు రూపాయలు 6 నెలలకిృందట పోయిన విషయము నేనెవరితో జెప్పుకోగలనని" అన్నాడు. అంత చిన్న తప్పుకు యింతటి పెద్ద శిక్షయా? యని ప్రశ్నించిన శ్యామాకు "నీకు 250 రూ॥ లెంతో ఫకీరునగు నాకు 2 రూ॥ లంతే" అని జవాబిచ్చినాడు. అప్పటినుండి శ్యామా బాబాతో పరాచికము లాడుట మానివైచెను. మహాత్ములతో పరిహాసము, తమాషాలూ, చేయరాదు. ఇతరుల సొమ్మును తనవద్దనుంచుకొనరాదనీ, ఎవ్వరైననూ తప్పుకు తగిన ప్రతిఫలము ననుభవించవలయుననీ" బాబా ఈ లీలద్వారా బోధించినాడు.

బీదవాడైన పురందరేను ఇల్లుకట్టుకొమ్మని జెప్పగా విననందున శిరోవేదనను గలిగించి, గృహప్రవేశ మొనరించు సమయమునకు దానిని మాయ మొనరించెను. తన బిడ్డల శ్రేయముల కొరకై బాబా అనేక స్వల్ప శిక్షణల నిచ్చుచూ కావలసిన దాని నందించు చుండును. శ్రీ బాబాయే సర్వస్వమని నమ్మిచరించిన పురందరే బరువు బాధ్యతలను ప్రభువే భరియించెను.

దాసుగణు మహరాజు బాబా ఆజ్ఞానుసారముగా పోలీసు కానిస్టేబులు వుద్యోగమునకు రాజీనామాచేయనందున అనేక అడ్డంకులను గల్గించి చివరకు తనంత తానుగా రాజీనామా నిచ్చునటుల జేసి బాబా, ఆయన కీర్తిచంద్రికలను తననామమిలలో స్మరింపబడుచుండునటుల నిలచి యుండునటుల అనుగ్రహించినాడు. వారివారి యిచ్ఛానుసారముగా

గాక, సమర్థ సద్గురువుల ఆదేశానుసారము చరియించుట శ్రేయస్కరము. బాబా అందరియొద్దనుండి దక్షిణల స్వీకరించువాడుగాడు. ఒకపరి దక్షిణ నొసంగబోయిన నొకనితో "నీ ఉంపుడుగత్తె కిచ్చుకొమ్మని" గ్రహింప నిరాకరించెను. ఋజుప్రవర్తన గలిగియుండిననేగాని సద్గురువుల అనుగ్రహమును బొందుట దుర్లభము.

ఇలాంటి భావనలు ప్రతియొక్కరికీ కలుగ గలవు. అలా కలగ డానికి కావలసిన దొకింత ఆలోచన మాత్రమే. శ్రీ సాయినాథునితో భక్తులకుగల సంబంధములను, వాటివలన గలిగిన అనుభవములను ఆలోచించగలినచో, వారి వారి మనోభావముల కనుగుణ్యముగా, శ్రీ సాయీశ్వరుని సంకల్పానుసారముగా అనేకములగు ఆదేశములు, సందేశములు దెలియుచుండును.

శ్రీ సాయీ ప్రభువు బలుకుచుండిన విషయముల నన్నింటినీ, యధాశక్తిగా బడేబాబా గ్రంథస్థ మొనరించెను. తనవద్దకే దేని సమస్యలతో వచ్చిన వారికి, ఆ గ్రంథమును దెరచి అందుగల బాబా వాణిని వినిపించు చుండెను. చిత్రాతి చిత్రముగా, సమస్యల కన్నింటికీ పరిష్కారములు సందేశముల, నుపదేశముల రీతిలో లభించుచుండెను. అలాగే శ్రీ సాయీ చరిత్రములను చదివిన వారినికి శ్రీ సాయిబాబా గురికుదురును. తమకేవేని సమస్యలొచ్చినపుడు ఆ తండ్రిని స్మరించి, భక్తి విశ్వాస, శ్రద్ధ, గౌరవాదులతో శ్రీ సాయీనాథ బోధామృతమును దెరచినచో, తగు సలహాలనూ, పరిష్కార మార్గములనూ, సందేశములనూ బొందగలడు.

ఎవరికెయ్యది శ్రేయమో, దానినే ప్రభువొనరించెను. తాను ఫకీరైననూ, అందరినీ ఫకీరులగమ్మని ఆదేశించలేదు. సంసారులను సన్యాసుల గమ్మన లేదు. బ్రహ్మచారులైనా, సన్యాసులైనా, ఏ ఆశ్రమధర్మ మార్గావలంబకులైనా - బాబా బోధించిన దొక్కటే - అదియే కర్మఫలత్యాగము - శ్రీ కృష్ణ సందేశమే! సద్గురువు యందు నిష్ఠ సబూరుల గలిగియుండి తనకు ప్రసాదింపబడిన ఆశ్రమధర్మమును

త్రికరణ శుద్ధిగా ఆచరించమనీ, తరించమనీ, ఉపదేశించిన బాబా, తాను పాటించి భక్తులకు మార్గముల నిర్దేశించినారు.

అన్నదానము నొనరించమని, తాను స్వయముగా వండి భక్తులకు సంతుష్టిగా దినబెట్టినాడు.

తన నాశ్రయించిన, అర్థాసక్తులగు భక్తులకు ప్రేమతో, అనేకార్థముల ననుగ్రహించినాడు.

ఎవరినుండి ఉచితముగా ఏ సేవనూ గొనక, తగురీతిగా బహూకరించినాడు.

తనను శిష్యునిగా పరిగణించిన "జవ్హరలీ" ఫకీరునకు, శిష్యుని వలె సపర్యలజేసి నిరహంకార తత్త్వము నుపదేశించినాడు.

పంచ ప్రదేశముల దెచ్చుకున్నట్టి భిక్షాన్నమును ఏకొద్దిగనో స్వీకరించుచూ, తనకు సమర్పింపబడుచుండిన సమస్త రుచ్యములగు పదార్థముల యందే మాత్రము ధ్యాసలేక, జిహ్వా చాపల్యమును గలిగి యుండకుడని బోధించినాడు. పాపజీవనులైననూ...., పశ్చాత్తాపము నొంది తనను శరణన్నవారిని పాప విముక్తుల గావించి, సన్మార్గవర్తనుల నొనరించి, సద్గతులనందించినాడు.

మానవ, జంతు, పశు, పక్ష్యాది భేదము లెంచక, అణువణువులో తననే దర్శించినాడు.

తనను దర్శించినవారికి అవ్యక్తానందానుభూతులను ప్రసాదించినాడు.

ప్రేమామృతమును పంచినాడు. అందరిలో పెంచినాడు.

కరుణను బరపి కన్నీరుల దుడిచి లోక కల్యాణమొనరించినాడు.

దయను ప్రసరించి దీనులకు దిక్కై, ధర్మబద్ధమగు కామ్యముల నెరవేర్చినాడు.

అభయప్రదాతయై, తన భక్తులకు నిర్భయత్వముల పాదు గొలిపినాడు.

శరీరమును ధరించినందున, శారీరక బాధలను భరించి ప్రకృతి ధర్మము ననుసరించి శరీరములకు బాధలు సహజములనెడి సత్యమును తన బిడ్డలకవగత మొనరించినాడు.

ఏ ప్రాణినీ నిరాదరించలేదు. నిరాకరించలేదు. వారి వారి భావముల ననుసరించి అనుభవముల ననుగ్రహించినాడు.

ధనాసక్తులకు ధనమును, సంతానాసక్తులకు సత్సంతానమును, ధర్మాసక్తులకు, ధర్మబుద్ధిని మోక్షాసక్తులకు మోక్షమును ప్రసాదించినాడు.

సర్వకాల సర్వావస్థలయందు తానుందుననీ, తన భక్తుల యోగక్షేమములను విచారించుచుందుననీ, నిదర్శనా పూర్వకముగా అనుభూతి మొనర్చుచున్న "శ్రీసాయి" నామరూప ధ్యానమే "ధ్యేయముగా గలిగినచో" సద్గతినందుట సులభసాధ్యము.

అనంత విశ్వములో భూమి ఒక అణువుగా నుండునేమో! ఇక మానవుడెంత?!?

సృష్టి స్థితి లయ కారకుడగు భగవానుని దెలుసుకో గలుగుట మానవున కసాధ్యము.

"భగవంతుడొక పంచదార పర్వతమగునేని, వ్యాస, శుక, నారదాదులు, గండు చీమలవంటివారని" శ్రీరామకృష్ణ పరమహంస విశదీకరించిరి. నారాయణ స్వరూపమగు వ్యాసుడే గండుచీమయైనచో యిక నాలాంటి అల్పజ్ఞుడు....???

దైవతత్త్వమును విశదీకరించుటకు, వివరించుటకు వీలుకాదు. దానిని ఎవరంతట వారు అనుభూతమొనర్చుకొనవలసినదే! షడ్రుచులు, అరిషడ్వర్గములు, తదితరవాసనలు - ఆత్మ శరీరము నంటిపెట్టుకొని యుండునంతవరకు, అనుభూతమగుచుండును. హావభావ ప్రకటనలను చర్య ప్రతిచర్యలను బట్టి మాత్రమే అవి అపగతమగుచుండునేగాని, శరీరమునందెక్కడనూ అవి కనుపించవు.

ఆత్మ శరీరమును వదలిన క్షణముననే అవన్నీ మాయమగును. అలాగే భగవత్స్వరూపుడు శ్రీ సాయీ ప్రభుని ప్రేమ, దయ, కరుణ, అనుగ్రహములను ఎవరంతట వారే అనుభవించి తెలుసుకోవలసినదే గాని, వ్యక్తీకరించుట కసంభవము. ఒక్కొక్క భక్తుని అనుభవములే ఒక్కొక్క బృహద్గ్రంథము కాగలదు. కోట్లాది భక్తుల అనుభవములు....???

శ్రీ సాయీ ప్రభువు ప్రతి యొక్కరికీ స్వంతమే! ఆ తండ్రిని స్మరించుటకు, దర్శించుటకు, అనుగ్రహము నందుటకు యితరుల సిఫార్సులనవసరము. భక్తిభావమే భగవానుని భక్తునకు వశపరచగలదు.

వేదశాస్త్ర, ఉపనిషత్, పురాణాదులను మథించి, శ్రీ సాయీ ప్రభువు నిష్ఠ సబూరులను రెండు అమృత ఫలములను అనుగ్రహించి నాడు. వాటి నారగించి, జీర్ణించుకోగలిగినచో, ఆనందారోగ్య సౌభాగ్య వంతములను భూతములగును.

ఆలోచనలు - సాయియే, ఆచరణ - సాయియే, ఆవేదనా నందానుభూతులు - సాయియే, అణువణువూ - సాయియే, క్షణక్షణమూ - సాయియే, ఇక ఈ దీనుడెక్కడున్నాడు? వీనిదేమి గలదు?

లీలానాటక సూత్రధారి - తన యిచ్ఛవచ్చినటుల - జరిపించు చుండును.

అసాధ్యమని విన్నవించుకోబడిననూ, అర్థరహితమని అర్థించి ననూ, అంగీకరించక "శ్యామ సందేశమని" వ్రాయుమని శ్రీసాయియే - మహాత్ములగు సోదరులు పూజ్యశ్రీ బాపట్ల వేంకటపార్థసారథిగారి ద్వారా ప్రోద్బల మొనరించి తన సంకల్పమును సంఘటింపజేసు కున్నాడు.

తెరవెనుక నుండవలయుననెడి కాంక్షను ఆమోదించక, మెడ బట్టి ముందుకుద్రోసి ఆటల నాడించుచున్నాడు బాబా.

ప్రభునిచేతి ఉపకరణమగు ఈ జీవిని నిమిత్త మాత్రునిగా నుంచుకొని ఏమి జేయనెంచెనో ! ప్రశంసనములు - నృశంసనములు

సమముగా నెంచమని, మదిలో నుంచమని తదనుగుణముగా శిక్షణ నొసగుచున్నాడు. శోధించుచున్నాడు బాబా.

శ్రీసాయీ స్వరూపులగు భక్తులందరకూ ప్రణామశత సహస్రానేకంబులు.

'బాబా' ఈజీవిద్వారా వ్రాయించిన సందేశము సత్ఫలితముల నొసగి, భక్తి, ప్రేమ, నిష్ట సబూరుల నొక్కరిలోనైనా గలిగించినచో ఆనందమే!- లేకుండిననూ!- తండ్రి సంకల్పమే! యని దలంచవలసినదే!

ఎవరి నమ్మకము వారిని నడపించును, అపనమ్మకము-ముంచును.

త్యాగపూరితమగు ప్రేమయే దైవము. అటువంటి ప్రేమగలిగిన దైవస్వరూపులే ఈ లోకములో, ఎవరెంతటి సంపద, ఆరోగ్యము, గౌరవము, అంతస్థులను గలిగియున్ననూ!.... ఎప్పుడో ఒకప్పుడు మనశ్శాంతి కొరకారాటపడక తప్పదు. అప్పుడు దానిని ప్రసాదించగల శక్తి ఒక్కదైవమునకేగలదు. ప్రతియొక్కరూ, ఏదో ఒకరీతిగా ఆదైవము నాశ్రయించక శాంతిని పొందలేరు. దైవమువాఙ్మానసగోచరుడైనందున శరీరధారియగు సద్గురువే శాంతిని ప్రసాదించి మానవులకు ఓదార్పుల నందించగలడు.

మానవుడు సద్గురువుల నాశ్రయించి వారి బోధనల నాచరించి మహాత్ముడు కాగలడు. మహాత్ముడు పరమాత్మతో తాదాత్మ్యమునందగలడు. మానవునిగా నున్నంతవరకు - మహాత్ముల నాశ్రయించక తప్పదు.

ఎవరంతట వారాలోచించుకొని- నిర్ణయించుకుని -ఆచరించుటయే - దైవ నిర్ణయము.

సర్వేజనాః సుఖినో భవంతు !

శ్యామచరణుడు,
24-3-1931

# ప్రశంసలు

(1)

In this world where rank materialism reigns supreme, the effort to bring out books on God is really laudable. Every spiritual aspirant who wants to drown himself in the sea of Sri Sai Baba's benevolence, knows the selfless endeavours of Sri B. V. Pardhasarathi to spread the message of the Great Master. Devotion to Bhagavan Sai Baba runs in the veins of the Bapatlavari family.

The father of Sri B. V. Pardhasarathi, Late Sri B. Hanumantha Rao was the poet laureate of Shiridi. His works on sri Shiridi Saibaba are commendable. He stood in the van of Sri Sai devotees. He was the blessed son of Sri Sai Baba. He presented the profound philosophy of God in an easy vein. His writings show his sincerity and utter devotion to Sri Sai Baba. This pen finds it self quite incompetent to depict the complete picture of that great devotee.

Whenever I read the books on Sri Sai Baba by Sri B. Hanumantha Rao, my heart is filled with joy and tears well up in my eyes. Words canot describe the greatness of Sri Sai Baba. His Kindness is boundless and His greatness is limitless. If we pray to Him surrendering our body, mind and soul, He is always ready to give His guidance and blessings. This is the experience of millions of peopel.

The author did great service to the seekers of Sri Sai Baba's blessings by presenting this book to the world. I sincerely pray to Bhagwan Sai Baba to shower His benisons on Sri B. V. Pardhasarathi and his family.

Markapur
25-9-80

In the service of Sri Sai Baba
*Ramachandra Rao. R*

(2)

Dear Sri Parthasarathi Garu,

Though I am not blessed to have had the personal acquaintance with your father, Pujya Sri Bapatla Hanumantha Rao, before he shed his mortal coil, so as to have the unique benefit of his spiritual influence and blessings directly and personally, yet his works, which at least I am fortunate to come across and go through and which reflect and bespeak of his divine personality, have given me considerable fillip and inspiration on the spiritual path. However feeble and inadequate may be my words in expressing what I actually feel about him in the core of my heart, yet I cannot refrain myself from trying to express in my own humble way what little I can from the vast inexpressible. To be apt and brief, I would only say that I find in him a God-intoxicated person, a saint, a seer, an ardent devotee, a self-surrendered and dedicated soul, a Karma Yogi and, above all, an instrument of God (Sri Sai Baba). I find all these at once in him.

At first I happened to read his poems in 'Sri Sai Mananam'. The poems are superb and thrilling, full of devotional fervour, and the impression they left in me was profound. I felt they are more intuitional and spontaneous, because of his total surrender and dedication to Lord Sri Sai Baba, than a mere literary composition based on his learning. In course of time, I could secure his some other books and read them one by one. All his works are eqally inspiring and elevating. While reading his books, I invariably remember Bhakta Pothana, the famous author of Srimad Andhra Bhagavatam, with whom Sri Bapatla Hanumantha Rao can be well compared, since it is only a divine personality like Pothana who sees only God, God's action, and God's will in everything and attributes and dedicates everything to God, that can write such thrilling poetry.

I have no doubt that the present publication viz., "Sri Sainatha Bodhamrutam" will be a crowned master piece among his works and will shine forth as an invaluable gem in the hearts of all devotees and that it will inspire and embrace hundreds and thousands of people into its divine fold.

I am also very happy to find that you possess the same noble qualities as your father, treading closely on the footsteps of your father, thus proving yourself an ideal son worthy of veneration.

**ALL GLORY & PRAISE**

To him who has thrilled many a devotee with
divine rapture through his immortal
works;

To him who has sown seeds of devotion, faith
and love in the hearts of many a seeker;
and

To him who actually lived the life that he
taught and spoke, worthy of the precious
human life.

TO HIM, IN GREAT REVERENCE,
WE BOW AGAIN AND AGAIN;

MAY HIS DIVINE SPIRIT CONTINUE TO GUIDE US....
With many regards,

*Yours sincerely,*
In the service of Sri Sai Baba,
*N. Venugopal*

1-10-129
Ashok Nagar
Hyderabad-20.

# ఆశీస్సులు

(1)

శ్రీశ్రీశ్రీ బాపట్ల హనుమంతరావు గారిచే వ్రాయబడిన గ్రంథములు ఆమూలాగ్రముగ చదివితిని. ఆపదుద్ధారక శతకము, హనుమాన్ చాలీసా, శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము, శ్రీ మద్భగవద్గీతామృతాంధ్రీకరణము, ఇవి ఒక దానిని మించి ఒకటి, చాల రసవత్తరముగను మృదు మధుర శైలిలోను వ్రాయుటకు వారికే తగినది. వారి యొక్క కీర్తి ఆచంద్రార్కముగ వెలయుటకు సర్వదా శ్రీ సాయిబాబావారిని ప్రార్థించుచు అనేక వందన శతంబులర్పించు చున్నాను.

వారి కుమారుడు చి. శ్రీ బి. వి. పార్థసారథిగారు తండ్రిగారి అముద్రిత గ్రంథములను ముద్రించుచు, ముద్రితగ్రంథములను పునర్ముద్రణ చేయుచు పితౄణము తీర్చుకొనుచు వారిని మృతజీవులుగా చేయుచున్నారు. వారికృషి అనన్య సామాన్యము. వారికి శ్రీసాయిబాబా కరుణవల్ల చిరాయువులు గలిగి సిరిసంపదలతో తులతూగుటకై శ్రీసాయి బాబాను ప్రార్థించుచున్నాను.

గాంధిగ్రాం
ఎ-344
విశాఖపట్టణము

ఇట్లు, శ్రేయోభిలాషి,
నూతులపాటి సత్యనారాయణశర్మ

(2)

చి॥ బాపట్ల వేంకట పార్థసారధి గారికి.

మీరు శ్రీ సాయీనాధ బోధామృతము పునర్ముద్రణ చేయు చున్నట్లు, ఆశీస్సులు పంపమని వ్రాసితిరి. చాలా సంతోషము. స్వర్గీయ అన్నగారి రచనలన్నియు పునర్ముద్రణచేయు మహాద్భాగ్యము కలిగి అసమానమైన సేవచేస్తూ, తండ్రిగారి ఋణము తీర్చుకొంటూ జన్మసార్థకం చేసికొనుచున్నందుకు మా ఆనందంతో కూడిన శుభాశీర్వాదములు. ధన్యుడవు, శ్రీ సాయినాధుడు నిన్ను, నీకుటుంబమును సర్వదా అనుగ్రహించి, ఆశీస్సులను నిరంతరం నీ పై వర్షించు గాత.

కొవ్వూరు

16-2-1981

శుభాశీర్వాదములతో,

మంచిరాజు సూర్యనారాయణమూర్తి,

(3)

**My Dear Pardhasaradhy,**

బాబూ! శ్రీసాయీనాథ బోధామృతమునకు ఆశీస్సులుగాని, తొలిపలుకుగాని, పరిచయ వాక్కులుగాని వ్రాయు అర్హత నాకు లేదు. అందలి బోధలు సాక్షాత్ సర్వసమర్థ సచ్చిదానంద సద్గురు శ్రీసాయీనాథ మహారాజువి. గ్రంథకర్తా, షిర్డీసంస్థాన ఆస్థానకవి. మహాభక్తాగ్రగణ్యులు, బహుభాషాకోవిదులు, సద్గురువు, నా ఆత్మీయ సోదరులు, శ్రీసాయీ దేవుని అంకిత బిడ్డయు నగు కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరాయకవి. శ్రీసాయీనాథుని అపరావతారమైన శ్రీ భగవాన్ సత్యసాయీబాబా వారిచే "ఈతడు నా భక్తుడు!" అని ప్రశంసింప బడిన నా గురుదేవులు శ్రీ హనుమంతరావుగారు. "బాబూ! పార్థసారథీ! నీవు ధన్యుడవు. మహాకవి, భక్తాగ్రగణ్యుడునగు నీ పితృపాదుల రచనల నన్నింటిని శ్రీ సాయీభగవానుని అనుగ్రహంతో ప్రచురణగావించి, తోటి సాయీ భక్తులకు అందించుచున్నావు. నీ తండ్రి ఆకాంక్షను నెరవేర్చుచున్న అదృష్టశాలివి. శ్రీసాయీనాథ బోధామృతము చదివిన వారికి శ్రీసాయీ ప్రభుని దర్శన భాగ్యము తప్పక కల్గునని నా విశ్వాసము. నా అనుభవము. నీ యీ సత్కృషికి స్వామి శ్రీసాయి ఆనందించి, నిన్ను తన వానిగా చేకొని, నీచే అన్నగారి రచనలన్నియు పునర్ముద్రింప చేయుటయే కాక, నీ చేతను శ్రీసాయీ లీలానుభూతులు వ్రాయించి, సోదరీ సోదర సాయీ భక్తుల కందించుచు, ధన్యులనుచేయ శ్రీ సాయీ బాబాను కోరి ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,

S. ఇల్లిందలపర్రు
16-2-1981

శ్రీ సాయీభక్త పాదరేణువు, నీబాబాయి,
హాదిల విశ్వనాథశర్మ

శ్రీ సాయీశ్వరుని యందైక్యముఁ జెందిన

# చీమలకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి.



జననము : 23-1-1959. శివైక్యము : 25-2-79.
(మహా శివరాత్రి)

అదయుఁడే! ఇరువది యేండ్లకె
వదిలముఁగా నిన్ను పిలువఁబంపెనె శివుఁడున్
నదిలో యసువుల బాయఁగ!
సుదినము "శివరాత్రి"నాఁడు సుబ్రహ్మణ్యా!

అతిదుఃఖితులై మాతా
పితరులు సుతుమరువలేక ప్రేమవెలార్పన్
స్మృతిచిహ్నంబుగ యీస
త్కృతిఁబోషించి రవుర! కృతకృత్యులు వారల్!

(ప్రచురణ కర్త)

శ్రీ చోడవరపు సాంబమూర్తి గారు, వీరి ధర్మపత్ని



ప్రకృతి పురుషోత్తమాది దంపతి విలాస
జలధి జలకేళిఁదలపించు ! చోడవరము !
చోళదేశ చూడామణి ! చోడవరము !
శుభము ! చంద్రచూడునిభూతి ! చోడవరము !

అష్టమూర్తి ! చతుర్పురుషార్థమూర్తి !
ఇష్టసాయి కావ్యార్థ నారీశుఁడతఁడు !
మాయవర్తి ! శ్రీసాయిసమర్థగురుఁడు !
మూర్తిగాన్న త్రిమూర్త్యాది మూర్తితలఁప !

అభవశివమూర్తి ! శ్రీమూర్తి ! సాంబమూర్తి !
బృందగోపాల రాధికాకృష్ణమూర్తి !
భూతి శిరిడీశునవతార మూర్తిఁగొలిచి
సాయి శరణొందు భక్తుల స్వానుభూతి !

ఆర్తిభక్తావ నాహృదయాంతవర్తి
పుట్టపర్తీశుఁడవ తారపురుషవర్తి !
సత్యకరుణాంత రంగ విశాలమూర్తి !
సాయిభక్త ! చోడవరపు సాంబమూర్తి

ప్రణవ ఋగ్యజుః స్సామసృట్ బ్రహ్మమూర్తి !
ఆది అర్ధియౌ శివమూర్తి ! అష్టమూర్తి !
అర్ధతనువిడె సతిగ అర్ధాంగి యడుగ
అర్థులకు సకలార్థంబులడుగ నొసఁగె !

ద్వారకామాయి ! భద్రసంధాయి ! సాయి !
దైన్య భక్తాభయ సుఖవిధాయి ! సాయి ;
ప్రణవ సంరాధ నామృత పాయి ! సాయి
ధర్మ సమ్మితాభయ వరదాయి ! సాయి !

హరిహరాత్మ జగన్మయి ! శిరిడిసాయి
వేయినూటపదారు రూపికల నిడిన
త్యాగ శలుచోడవరపు సాంబమూర్తి
నాయురారోగ్య భోగభాగ్యములబ్రోచు !

శేషగిరి వల్మీకావాసు ! శ్రీనివాసు !
ఎంచి నుతులసేవించి, తరించు పూర్వ
పుణ్య పురుషుల వంశము పూర్వమగుట;
'శేషగిరి' వంశనామ విశేషమందుఁ !

శ్రీయె కానోపు ! సత్యనారాయణునకు,
సమ్మతమతి ! కన్సన్నన్ 'ప్రసన్నలక్ష్మి' !
రేపు, మాపు 'సాయి' నెదన్స్మరించువారు
'సాయి నిలయము'నకు వచ్చి సంతసమున
సాయి నాథుండు ప్రేరణఁజేయు కతన
సాయినాథ బోధామృతా సక్తికలిగి
ముద్రణముసేయుడని మునుముందు పలికి
యిచ్చె గొలువ, ధర్మసతియు నిచ్చగింప
వేయినూట పదారు రూపాయలిడిరి
వీరి, సుతు, సుతలను వంశవృద్ధిఁగూర్చి
యున్నతోద్యోగములు, నాయు రున్నతులును
భోగ భాగ్యములిడి 'సాయి' బ్రోచుగాత !

---

డా. శ్రీ శేషగిరి సత్యన్నారాయణగారు

వీరిధర్మపత్ని అ॥ సౌ॥ ప్రసన్నలక్ష్మి.



శ్రీ రాపర్ల శీతారామయ్యగారు, వీరి ధర్మపత్ని

అ॥ సౌ॥ సావిత్రి



వీరి తల్లి స్వర్గీయ, శ్రీమతి సముద్రాలమ్మ.



అరయ తెలుగునాడున "భోగపురము" నందు
పరమ పావనమైన "రాపర్ల" వంశ
మునను "వెంకటస్వామి," "సముద్రిలమ్మ"
లనెడు పుణ్యదంపతులకు జనన మంది
పదవి కతన "ఖర్గపురి" నివాసముండు
సాయి పదభక్తి రతుడు. నిస్వార్థపరుడు
మాతృ పితృ నాజ్ఞపాలనా మతుఁడనంగ
సీతరామయాఖ్య నవనిఁ జెలగు నితఁడు !

○ ○ ○ ○

ఏ జననమందు సంబంధ మిదియొ కాని
సహజ సోదరు పగిది వాత్సల్యముంచి
ప్రీతి పితృ కర్మ ఖర్చు పంపించు చుండు
అంతొ, యింతొ, కొంత ప్రతి వర్ధంతి కితడు!

○ ○ ○ ○

తండ్రి గతియించె ముందుగ; తనయు వీడి,
మాతృమూర్తియు స్వర్గ ధామమునుఁ జేర
ఋణము తీర్చుకొన నిది తరుణ మటంచు
'సాయినాధ బోధామృత' సంకలనము
గ్రంధరూపం బొనర్చ ముద్రిణము కొఱకు
వేయి రూప్యముల్ పయిషష్ఠ వింశతినిడె !

○ ○ ○ ○

పూర్వ సుకృత ఫలంబున పుట్టుకతన
పరమసాధ్వి "సావిత్రి" యు పత్నికాగ,
"అరుణ," "సాయినరేంద్రుడు" నగ వొలచు
సుతయు, సుతుడును వీరి సంతతియుఁగాగ,
ఆయురారోగ్య భోగ భాగ్యముల నిచ్చి
సాయినాధుఁడు వీరల సాకు గాత !!

గోత్రకీలకు సురభితాన్ గోత్ర సంప,
హరితఁబూరిమేయుఁగఁ గల్పతరువు పెంప,
హరి హరుని కృపన్ "హారీతుఁడ" నెడు గోత్ర
ప్రవరుఁడౌదవ "చదలపాక" వంశమలరె.
కన్నవారెటు లరసిరో! మున్నె సుతను
"రుక్మిణి" యటంచు ముద్దుపేరు ననె పిలువ
"కృష్ణుఁడ"ననొప్పు వరుఁడా పెఁ బ్రేమఁగొనియె.

ం ం ం

రాజరాజేశ్వరియని ఆరాధనమున
వింశతీ లక్షనామ దేవీ జపంబు
శ్రితులు "రుక్మిణీకృష్ణ" దంపతు లొనర్ప
అర్చనల "పుష్పగిరి" "శంకరార్యు" బిక్ష!
"షిరిడి" గురుని "శ్రీసాయి" ఆశీస్సు లమర
అరువదారేళ్ళు మని చేరె నమర సీమ
"కృష్ణమూర్తి"ని విడి "రుక్మిణీ"మ తల్లి
"రౌద్రి" కాలాకృతిని "ఉత్తరాయణ" పథి
"జ్యేష్ఠ నిజమాసి"యు "బహుళ" "కృత్తిక"యు, ని
శీథిఁ దోడుకా "నేకాదశిన్" దివిఁగొనె.
"సాయినాథ బోధామృత" సార మరసి
త్యాగి, పట్టభద్రోన్నతోద్యోగి, "కడప"
నున్న వాడిద్దరన్నయ్యలున్న వాఁడు,
అక్కసెల్లెండ్ర నాల్గుర సమరు వాఁడు.
ముగుర తల్లికి మూడవ ముద్దుకొడుకు
అచల మాతృ భక్తుండు "సింహాచలుండు."
సప్త సంతతులన "రూప్యసప్తశతిని"
అష్టమహిషులన్ "రూప్య దశాష్టకము"ను
రూప్యముల నాలుగిడెఁ జతుర్భుజున కటుల
ధనసహాయుఁడీ "గ్రంథముద్రణము" కొఱకు.
ఇతని వంశముఁ బ్రోచుత సతము సాయి!

స్వర్గీయ. శ్రీమతి. చదలవాడ రుక్మిణమ్మగారు.



# చి॥ శ్యామ చరణ్ (తుర్లపాటి బాలగురునాథ్)



దక్షిణామూర్తి! ప్రణవబోధనుఁడు! గురుఁడు!
మునుల కుపదేశ మంత్ర దక్షిణల నొసఁగె
తనతమువు నర్థమిచ్చె నర్ధాంగి యడుగ!
శ్యామచరణ తలాసీనుఁడాది అర్థి!

శ్యామ చరణము కర్మసాక్షీ మహత్తు!
శ్యామ చరణము చల్లని చాయవట్టు!
శ్యామ చరణము మానినీ ధీమతమ్ము!
శ్యామ చరణము మిత్ర సంచార గోష్ఠి!

శ్యామ చరణము మాన్యుల ధీమతమ్ము!
శ్యామ చరణము ముని అనుష్ఠాన గతము!
శ్యామ చరణము లోక బంధూ మరీచి!
శ్యామ చరణముల్ ఓం కృతీ జ్ఞానపథులు!

శ్యామ చరణు బోధలవిను నాశ్రితులను!
శ్యామ! శరణన్నఁబ్రోచుఁ గృష్ణపరమాత్మ!
శ్యామ! శరణన్న యమునాంబ చల్లఁగఁగను!
శ్యామ! శరణన్న పికము పంచమము వినుచు!
శ్యామ! శరణన్న మేఘదౌత్యమ్ము పొసఁగు!
శ్యామ! శరణన్న మనుఁగాళికామతల్లి!

శ్యామ చరణుండనెడి బిరుదాంకితుండు!
బాల గురునాధుఁడను సాయి భక్త గురుడు!
సాయి చరణాశ్రయుణ నిజా చరణసరణి;
ప్రణహిత శ్యామ చరణాశ్రయుణ శరణుఁడు!

ఆశ్రితులు, భక్త లనుయాయు లభినుతింప
పాయకను భక్తినిచ్చు ఉపాయనముల
చేతఁగొను హితకృతులఁజేఁజేత నిడును!
బాల గురునాధుడను సాయిభక్తుఁడితడు!

శ్రద్ధ సేకరించెను సహస్రద్వయంబు
నంత అష్టోత్తర శతత్రయంబు, మరియు
రొఖ్ఖ మేకాదశార్పిత రూప్యములను
సాయి భక్తులనుండి సహాయముగను
శ్యామ చరణుండు యీతని నేమమేమొ!

'శ్యామయె' ప్రేమకు రూపము!
శ్యామయె మూలంబు భక్తి సంభావనకున్
క్షేమము, యోగము, చేకుఱ
శ్యామను రక్షింపు! స్వామి! సాయీ! సతతమున్.

— —

శ్రీ సాయీ నిలయ ప్రచురణములకు యిప్పటి వరకు
మొత్తం రు. 1116/- లు సమర్పించిన రాజపోషకులు

**శ్రీ G. L. నరసయ్యగారు, కర్నూలు.**



ఈ గ్రంథ ముద్రణకు రు. [illegible]24/- లు సమర్పించిన రాజపోషకులు

**చి॥ శ్రీ॥ అంబటి రామేశ్వరరెడ్డి, భీమవరం.**



## రాజ పోషకులు

1. పూజ్యశ్రీ. చోడవరపు సాంబమూర్తి పంతులుగారు
శ్రీ షిరిడీ సాయీప్రేమమందిర్, హైదరాబాదు రు 1116/-
2. చి. శ్రీ. శేషగిరి సత్యనారాయణ, A. E. సాలూరు రు 1116/-
3. చి. శ్రీ. రావర్ల శీతారామయ్య ఖరగ్‌పూర్ రు 1026/-
4. చి. శ్రీ. అంబటి రామేశ్వరరెడ్డి భీమవరం రు 924/-
5. మాతృశ్రీ స్వర్గీయ చదలపాక రుక్మిణమ్మగారి
జ్ఞాపకార్థముగ వీరి కుమార్డు
చి. శ్రీ. సింహాచలం A. E. కడప. రు 784/-

## పోషకులు

1. శ్రీ నల్లగట్ల లక్ష్మీనరసింహులు, నంద్యాల. రు 250/-
2. శ్రీ ప్యావలి పార్వతీశం, భూస్వామి, శిరువెళ్ళ. రు 166/-
3. శ్రీ N. రాధాపతిరావు, కొవ్వూరు. రు 155/-
4. శ్రీ S. రామకృష్ణ, పామర్రు రు 126/-

## రు. 116/- లు యిచ్చినవారు

శ్రీ బి. వి. సుబ్రహ్మణ్యసాయి, M. tech. కోయంబత్తూరు.
,, బి. యస్. రామచంద్రసాయి, M. tech. బొంబాయి.
,, జి. యల్. నరసయ్యగారు, కర్నూలు.
,, యం. జయప్రకాష్, హనుమకొండ.
,, మంగెన సత్యనారాయణమూర్తి, లక్కవరం.
,, యన్. వి. సుబ్బరామయ్య, నందనవనం.
,, యన్. వేణుగోపాల్, హైదరాబాదు.
,, పి. నాగన్నగౌడ్, మైలారమ్‌పల్లి.
,, ఆర్. రామచంద్రరావు యం. ఎ. మార్కాపురం.
,, టి. నారాయణరెడ్డి ఇ. ఇ. కడప,

శ్రీమతి కె. సుమిత్రమ్మ హిందీ పండిట్, పలుకూరు.

,, మంచికంటి వరలక్ష్మి W/O వెంకట శివరామయ్య, పాకాల.

,, యస్. నాగమణెమ్మ టీచరు, గొడ్డుమర్రి.

శ్రీ జి. రామారావు. ఖరగ్‌పూర్ రు 115-00

శ్రీమతి జి. జయలక్ష్మి, అనంతపురం. రు 104-00

శ్రీమతి అండ్ శ్రీ ఒ. గోపాలరెడ్డి L. E. E. అనంతపురం రు 100-00

శ్రీ డి. మోహన్. బి. ఎ. అనంతపూర్. రు 100-00

,, కేశిరాజు నరసింహారావు, బి. డి. ఒ. నరసాపురం. రు 100-00

,, టి. రామమోహనరావు, విజయవాడ. రు 100-00

,, బి. శ్రీనివాసులు, రాజమండ్రి. రు 90-00

,, డి. బి. వి. నారాయణాచార్యులు, ఎ. ఇ. కొవ్వూరు రు 88-00

,, వై. విశ్వనాథం, అనంతపూరు. రు 73-80

,, టి. వెంకట శివయ్య L. C. E. సెక్షన్ ఆఫీసరు (I & P D) నంద్యాల. రు 72-00

,, ఆర్. గోపాలనాయుడు అండ్ బి. గోపాలనాయుడు మదనపల్లి రు 70-00

,, ఆర్. రాఘవేంద్రరావు, జె. ఇ. చీమకుర్తి. రు 70-00

,, పి. మహబూబ్ సాహెబ్, అనంతపూరు. రు 61-00

శ్రీమతి కిలుగు సూర్యం W/O రంగారెడ్డి, కందివలస రు 60-00

,, దిగుమర్తి సూర్యకాంతమ్మ, సాలాప్పవానిపాలెం. రు 59-00

శ్రీ ములుకుట్ల రాధారమణ, B. A., B. Ed., H. M. నంద్యాల రు 58-00

,, జి. రోశయ్య, ప్రొద్దుటూరు. సెక్షన్ ఆఫీసరు (I & P D) రు 58-00

,, గంగరాజు వెంకటేశ్వరసాయిశర్మ, నాగులపాడు. రు 58-00

,, టి. వి. వేణుగోపాలమూర్తి అడ్వకేటు, నల్గొండ. రు 51-00

## రు. 50/- లు యిచ్చినవారు

శ్రీ బి. అశ్వర్థ నారాయణ చెట్టి జె. ఇ. అనంతపురం
,, సి. బాలకోటిరెడ్డి, బళ్ళారి.
,, సి. ఈశ్వరయ్య అనంతపురం.
,, సి. రమేష్, అనంతపురం.
,, C. M. Sahu. Sub. Asst Engineer, Benjanagar ORISSA.
,, డి. వెంకటరమణ. కనికల్.
,, జి. శ్రీరామ ప్రసాద్, కర్నూలు
, గుదేపై డిరావు, సాలాపువానిపాలెం.
,, జి. మల్లిఖార్జునరెడ్డి, మల్యాం
,, కె. సదాసాంబశివరెడ్డి, అనంతపురం.
,, కె. శ్రీనివాసులు L. C. E., సెక్షన్ ఆఫీసరు (I & P D) నంద్యాల.
,, కె. నాగేశ్వరరావు s/o సూర్యారావు. సిద్దిపేట.
,, పి. వెంకటరెడ్డి, L. M. E. సెక్షన్ ఆఫీసరు I & D. C; మార్కాపురం.
,, ఆర్. యెరికలరెడ్డి, అనంతపురం.
,, యస్. ఈశ్వరరెడ్డి. Hospet
,, టి. సత్యన్నారాయణ. బి. ఎ., బి. యల్. అనంతపురం.
శ్రీమతి బూదరాజు వరలక్ష్మమ్మగారు, హైదరాబాదు.

| | |
|---|---|
| శ్రీ జి. రామకృష్ణ, కొవ్వలి. | రు 45-00 |
| ,, ఎ. వి. సుబ్బారావు, సికిందరాబాద్. | రు 40-00 |
| ,, బి. సుబ్బారెడ్డి B. tech. A, E. (I & P D) నంద్యాల | రు 40-00 |
| ,, పి. చంద్రశేఖరదత్తు, B. Com., C. A. Tenali | రు 40-00 |
| ,, యస్. రామకృష్ణయ్య, వెంకటాపురం. | రు 40-00 |
| ,, కె. రాజేశ్వరరావు. w I (R & B) నంద్యాల. | రు 37-00 |
| ,, కిలారు వెంకట కృష్ణారావు | రు 35-00 |
| ,, యమ్. రామమూర్తి S. T. O. సిద్ధవటం. | రు 35-00 |
| ,, M. V. M. ప్రసాద్, హైదరాబాదు. | రు 32-00 |
| ,, బి. వెంకటరమణమూర్తి, రాజమండ్రి. | రు 30-00 |

శ్రీ Ch. లక్ష్మీనారాయణ, S. B. I. ఉలవపాడు.	రు 30-00
,, గిరిరాజు శేషగిరిరావు, కరణం, గుండ్లపల్లి.	రు 30-00
,, S. A. నబి సాహెబ్ L. C. E., సెక్షన్ ఆఫీసరు నంద్యాల.	రు 30-00
,, వి. హరనాథ్‌బాబు, సౌభాగ్యమ్మ, ప్రొద్దుటూరు.	రు 30-00
,, మాధవపెద్ది లక్ష్మీ నరసింహ్వాం, బరోడ బ్యాంకు, పెదనందిపాడు	రు 30-00
,, నాయక్ ఫకీరు నాయక్, భూస్వామి, నంద్యాల.	రు 28-00
శ్రీమతి మిరియాల శ్యామసుందరమ్మ, నంద్యాల	రు 26-00
,, కీ॥ శే॥ బచ్చు చంద్రకళావతి, నంద్యాల	రు 23-00

## రు 25/- లు యిచ్చినవారు

శ్రీ A. V. S. R. జోశ్యులు, గుంటూరు.
,, చోడవరపురాజు s/o కృష్ణారావుగారు, విజయవాడ.
,, డి. వెంకటేశ్వరశర్మ M. A., M. Sc.
,, M. S. నాయుడు, తిరుపతి.
,, S. B. V. గోపాల్, B. E. J. E. శ్రీశైలం
,, తిరునగరి వీరవెంకట సత్యనారాయణ. చెరుకువల్లి
,, తుట్టగుంట సత్యనారాయణ, Sangaigudem.
,, యు. వి. సుబ్బారావు, నిడదవోలు.
,, వి. బి. చారి, వరంగల్లు.
,, వై. మారెప్ప, టీచరు, అనంతపురం.
కుమారి ఎ. హైమవతి, మండపేట.
శ్రీమతి ఒ. మీనాక్షమ్మ, అనంతపూరు.
శ్రీమతి అండ్ శ్రీ యస్. మాణిక్యం మరియు రాజు, విజయవాడ.

## రు, 20/– లు యిచ్చిన వారు

శ్రీ A. S. కిషోర్, హైదరాబాదు.
,, దిగుమర్తి సన్యాసిరావు, సాలాపువానిపాలెం.
,, జాస్తి రామకృష్ణ, నందితవారె
,, కె. వీరరాఘవ పిళ్లై L. C. E. Supervisor 1 & P. D., అనంతపూర్
,, ఎస్.ఎల్. సోభారాంసింగు, మచిలీపట్టణము
,, ఎం. కృష్ణానందం, గుండవోలు
,, ఆర్. నరసింహమూర్తి, Khargpur
,, ఎం. శ్రీరామారావు, కదిరి
,, నారాయణం శ్రీనివాసాచార్యులు, సంగం జాగర్లమూడి
,, నార్పల మృత్యుంజయరావు, Land Lord, నార్పల
,, నిడదవోలు సత్యనారాయణ, వినాయక్‌నగర్
,, నూతులపాటి సత్యనారాయణశర్మగారు, విశాఖపట్టణం
,, నెక్కంటి కృష్ణమూర్తి, నందితవారె
,, P. V. K. రావు, A. E., ఉయ్యూరు
,, ఆర్. పురుషోత్తమరెడ్డి; B E. A. E. (1 & P. D) కడప
,, ఆర్. బుకారి, విశాఖపట్టణం.
,, పెంకురాత్రి నాగేశ్వరరావు, నందితవారె.
,, వి. భరతుడు. జె. యి. తాడేపల్లిగూడెం.
,, వి. కృష్ణారావు, D. R. గుంటూరు.
,, వి. సుబ్బారాయుడు H. C. (1 & P. D) కడప.
,, తుర్లపాటి శ్రీరాములుగారు, పుత్తూరు
శ్రీమతి తుర్లపాటి వరలక్ష్మమ్మ, ,,
కుమారి చెంచులక్ష్మి (కల్యాణి) హిందీ పండిట్ పుత్తూరు
కుమారి నాగమణి ,,
కుమారి శివకామాక్షమ్మ ,,
శ్రీ రామకృష్ణ (జితేంద్ర) B. Sc. T. C. (Rly) నిజామాబాదు
కుమారి తుర్లపాటి గాయత్రీదేవి పుత్తూరు

శ్రీ తుర్లపాటి వెంకటసుబ్రహ్మణ్యం ,,
శ్రీమతి మేడం విజయలక్ష్మి, ఎమ్మిగనూరు
,, చెన్నశెట్టి పద్మావతి, గుంటూరు
,, రాజేశ్వరమ్మ అండ్ శ్రీ వెంకటసత్యం, కర్నూలు
శ్రీ K. Khyrooplappa–Samgala Rs. 18–00
,, టి. రామచంద్రయ్య, పొద్దుటూరు రు. 18–00
కుమారి బేబిసాయి సరితారాణి, నంద్యాల రు. 17–00

## రు. 15/– లు యిచ్చినవారు

శ్రీ బి. సి. కృష్ణమూర్తి, కడప.
,, భద్రి మహదేవయ్య, నెల్లూరు.
,, కె. వి. యన్. రామచంద్రరావు, మచిలీపట్టణం.
,, కె. వెంకటస్వామి, L. D. C. ) I & P. D. ) నంద్యాల.
,, మద్దులేటి చౌదరి, యం. ఎ. లెక్చరర్, నంద్యాల.
,, యం. కృష్ణానందం, గుండవోలు.
,, సోమిరెడ్డి చంద్రశేఖర్, విజయవాడ.
,, వి. వెంకయ్యశర్మ, మచిలీపట్టణం.
,, డాక్టర్. వి. యన్. శర్మ, మద్రాసు.
,, వి. వి. సుబ్రహ్మణ్యం, గూడూరు.
,, చలమయ్య W I ( I & P. D ) నంద్యాల
శ్రీమతి. లక్ష్మీవరసమ్మ, నారాయణపురం.
,, Devakamma, Banglore.
శ్రీ మురారి పుల్లయ్య, Tracer ( I & P. D ) నంద్యాల. రు 14–50
కుమారి ఎ. నిర్మల, హుజూర్‌నగర్. రు 12–00
శ్రీ డి. యస్. శివకుమార్, రాజమండ్రి. రు 12–00
,, కె. పుల్లయ్య, కోట. రు 11–00
,, మల్లెపూల బాలస్వామి, భీమవరం. రు 11–00
,, ఆర్. వి. సుబ్బారావు, అడ్వకేట్, హైదరాబాద్, రు 1'–00

# రు 10/- లు యిచ్చిన వారు

శ్రీ ఎ. మాధవయ్య, బి. ఇ. ఎ. ఇ. రాజాం.
,, ఎ. శౌరిరెడ్డి హెచ్. యమ్. చాగలమర్రి.
,, బి. తిరుపతయ్య, బి. ఇ. ఎ. ఇ. ప్రొద్దుటూరు.
,, బి. మాలకొండారెడ్డి, (I & P. D.) కడప.
,, బచ్చు రామయ్యశెట్టి, నంద్యాల.
,, జి. యస్. కొండయ్య, H. D. (I & P. D) నంద్యాల.
,, యం. శివశాస్త్రి, L. C. E. S. O. (I & P D) నంద్యాల.
,, శివరామరెడ్డి D' Man (I & P D) నంద్యాల
,, డి. నారప్ప, సిండికేట్ బ్యాంక్, నంద్యాల
,, డా॥ సుమిత్రారెడ్డి, నంద్యాల
,, సి. యస్. రావు, మద్రాసు
,, సి. శివారెడ్డి, కంట్రాక్టర్, దడివాండ్లపల్లి
,, సి. హెచ్. బుచ్చిరాజు, ఖరగపూర్
,, దిగుమర్తి సాయిరాంప్రసాద్, సాలాపువానిపాలెం
,, గుండెప్రెడ్డి భూపాలరెడ్డి. హెచ్. యం. చిలకలగూడూరు.
,, జి. వెంకటరెడ్డి, (L. C. E; S. O. (I & P. D.) బిల్లలాపురం.
,, జి. సుబ్రమణ్యం, పోరుమామిళ్ళ
,, ఐ. నాగభూషణం, ఖరగ్‌పూర్
,, జె. వెంకటేశ్వరరావు, కొప్పివ్విడి
,, జాస్తి సూర్యనారాయణ, జాలిపూడి.
,, కె. నరసింహులు అటెండరు లైబ్రి పుత్తూరు.
,, కోడూరి వెంకటసుబ్రహ్మశర్మ, కబ్బళ.
,, ఖగ్గారామయ్య, వి. యం. జిల్లెళ్ళమూడి,
,, మానేపల్లి నరసింహరావు, భట్టిప్రోలు.

శ్రీ యం. సీతారామిరెడ్డి (I. & P. D.) కడప

,, పి. ఆర్. జోగారావు, ఖరగ్‌పూర్

,, పెనుబర్తి వెంకటశేషయ్యగారు కె. యం. కొండమీది కొండూరు

,, పి. యం. యం. మదనకుమార్ (I & P. D). కడప

,, పేర్ల పిచ్చయ్య శ్రేష్ఠి ఒంగోలు

,, యస్. మస్తాన్‌వలి (I & P. D) కడప

,, యస్. వెంకటస్వామి కమలాపురం

,, సావడి సుబ్బారావు నందితవారె

,, వి. యస్. నారాయణ యస్. యం. రాజగంగపూర్

,, వి. నారాయణశర్మ హైదరాబాద్

,, యార్లగడ్డ వెంకటప్పయ్య కారంచేడు

,, పి. రామకృష్ణయ్య ఖరగ్‌పూర్

,, ముద్దా వేణుగోపాలరావు సోదరులు ఆలూరు

,, ఆకెళ్ళ సుబ్బారాయుడు కణినేబెళచి

శ్రీమతి బాపట్ల అలివేలుమంగ ద్వారకామాయి విజయవాడ

,, బచ్చు సుజాతమ్మ నంద్యాల

,, కందుకూరి సావిత్రమ్మ గుంటూరు

,, యం. పద్మజ కె. యం. కొండూరు

,, సాలాపు పైడమ్మ - సాలాపువానిపాలెం

కుమారి పి. ప్రభావతి కె. యం. కొండూరు

,, సావిత్రి అనంతపురం

,, జి. అరుణకుమారి, నంద్యాల

,, టి. విజయలక్ష్మి తిరుపతి

శ్రీ కసిరెడ్డి ఓబులరెడ్డి భూస్వామి కొత్తపల్లి రు. 9-00

,, టి. యస్. నారాయణ రెమ్మనపూడి రు. 8-50

## రు. 5/- లు యిచ్చినవారు

శ్రీ ఎ. నారాయణరావు, ఖరగ్‌పూర్
,, బొడ్డపాటి నరసింగరావు, ఖరగ్‌పూర్
,, యన్. సూర్యారావు, ఖరగ్‌పూర్
,, టి. ఆర్. నాయుడు, ఖరగ్‌పూర్
,, తోట వెంకటావ్రు, ఖరగ్‌పూర్
శ్రీమతి తోట విమల వైఫ్ ఆఫ్ వెంకటావ్రు ఖరగ్‌పూర్
శ్రీ అలకుండ వరాలమ్మ, సాలాపువానిపాలెం
,, అలకుండ సత్యనారాయణ, సాలాపువానిపాలెం
,, అప్పికొండ చిన్న, సాలాపువానిపాలెం
శ్రీమతి గెడసాల అప్పలనరసమ్మ, సాలాపువానిపాలెం
,, సాలపు పెంటమ్మ, సాలాపువానిపాలెం
,, సిరసపల్లి అమ్మాజీ, సాలాపువానిపాలెం
,, ఎ. రామలక్ష్మమ్మ, చాగలమర్రి
,, కొప్పోలు లక్ష్మమ్మ, ప్రొద్దుటూరు
,, యల్. ధాకూర్‌బాయి, మచిలీపట్టణం
,, పట్నాయక్ అమ్మాజీ, సాలాపువానిపాలెం
శ్రీ యస్. చంద్రశేఖర్, విజయవాడ
,, నాయక్ మహబూబ్ నాయక్ H. M. పురుదూస్కూలు, నంద్యాల
,, ఎ. కొండారెడ్డి, ల్యాండ్‌లార్డు, తెళ్ళపురి రు. 2-00

—o—

శ్రీసాయీ నాథాయనమః

# విజ్ఞప్తి

సోదరీ సోదర సాయీబాబా భక్తులారా !

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుడగు శ్రీ సాయీ ప్రభుని సంపూర్ణ కరుణాకటాక్ష ప్రభావమువలన మీ అందరి సహాయ సంపత్తి ప్రసాదము వలన ఉభయభాషా ప్రవీణులు, శ్రీ సాయీ ప్రసన్న బిరుదాంకితులు, పూజ్యులు, కీర్తి శేషులునగు మా తండ్రి శ్రీ బాపట్ల హనుమంత రావు పంతులుగారు రచించిన "శ్రీసాయీనాథ బోధామృతము" ను పునర్ముద్రణ చేయించి మీ కందరికు అందించు భాగ్యము నాకు సంప్రాప్తమైనది.

సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు; సర్వ వ్యాపకుడునగు శ్రీమన్నారాయణుడు యీ విశ్వమును సృష్టించి, సమస్తము చక్కగ కొనసాగుటకు వేదములందు సనాతన ధర్మమును ప్రసాదించి, కలియుగములో ఈ ధర్మం క్షీణగతి పట్టిన కారణంగ "యదాయదాహి ధర్మస్య.... ..." అని శ్రీకృష్ణ భగవానుడు గీతలందు పలికినట్లు శ్రీ సాయీ ప్రభువు రూపంలో మహారాష్ట్రంలో అవతరించెను.

శ్రీ సాయీబాబా ఆచరణలు, ప్రబోధములు, విశ్వజనీనములు. జాతి, మత, కుల, శాఖాదుల కతీతములు. వివిధజాతి, కుల, మతానుయాయులైన తన భక్తుల నందరిను సమాన దృష్టితో సమాదరించి లౌకిక విషయములందు తన ప్రత్యేక మహాద్భుత శక్తి మహిమములంజూపుచు ననుగ్రహించినాడు. గాఢ విశ్వాసము - ధైర్యముతోఁగూడిన ఓర్పు (నిష్ఠ - సబూరి) కలిగి ఆశ్రయించి, సేవించు జీవులను బాబా అనుగ్రహించి తీరును ఈ విశ్వమున గల సకలశాస్త్రములలో ప్రతిపాదింపబడిన వివిధ మతాధ్యాత్మిక విజ్ఞానాంశములను వ్యాఖ్యానముల ప్రవచనములతోకాక ఆయాభక్తుల నిత్యానుభవములలో దృష్టాంత పూర్వకముగ పరమ సత్యమును ఎఱుకపఱచిన వాక్కులు. "శ్రీసాయీనాథ బోధామృతము"

రూపము దాల్చినది. ఎల్లరకు నెల్లెడల ఈ పరమార్థమును ప్రత్యేకాను భవములద్వారా బాబా బోధలందు విశద పఱచినాడు. ఇతరులద్వారా బాబా మహాత్మ్యములను తెలిసికొనుట సహింపక ఎవరికివారు స్వయముగనే యెఱుంగ వలెనని బాబా బోధించెను. (405 చూడుడు.) జీవకోటిని సత్య మార్గమున నడపించుటకే బాబా మూర్తీభవించెను. (చూడుడు 581-61 -62) "బ్రహ్మము నా తండ్రి - మాయ నాతల్లి - షిరిడి నా నెలవు - విశ్వమంతట నుందును. వయస్సు లక్షల కొలది సంవత్సరములు-"

శ్రీసాయీ ప్రభువు అత్యద్భుతమైన భగవదవతారము. దుష్ట హృదయ పరివర్తన - ధర్మ సంస్థాపనము, భగవదవతార కర్తవ్యములు- భక్త హృదయములను సంతుష్టి సంతృప్తులం బఱపుట కొరకు ఆ భగ వానుఁడు వివిధరూపముల తన అద్భుత లీలలను బఱపును. భక్తులకు సేవలుచేయును. "మైంఅల్లాహూం" అని బాబా చెప్ప కలిగెను. ఆయా భక్తులు వారి వారి దృక్పథముల - ఆశయముల ననుసరించి - వారి వారి యిష్టదైవముగ సద్గురువుగ - భగవానునిగ - రక్షకునిగ - శ్రీరామ - శ్రీకృష్ణ - శంకర- గణపతి - విఠోబ - దత్త - మారుతి - అకల్‌కోట మహారాజు - ధోలప్ మహారాజు - ఇత్యాదులుగ బాబాను వీక్షించి, సేవించి, ఆ తండ్రి రక్షణకు, కృపకు పాత్రులైరి.

ఆ విశ్వమునగల ప్రతి జీవియు - ఆత్మ స్వరూపమని బాబా ప్రకటించినాడు. ఏ జీవిని సంతృప్తి పఱచినను తనను సంతృప్తి పరచి నట్లే - ఏజీవిని బాధించినను తనను బాధించినట్లే అనుభవ పూర్వకముగ బాబా తన బిడ్డల కెఱుక పఱచినాడు. ప్రతి మతమునగల ప్రాధాన్యముల నాదరించి అప్రాధాన్యముల విసర్జించుటయే బాబా ఆచరణ బోధలలోని సారాంశము (చూ. 65.) శ్రేయస్కాముడగు సాధకుడు తన మతము గాని, యిష్టదైవమునుగాని, గురువునుగాని విడనాడఁదగదని తెలిపినాడు.

అవతార పురుషులగు సద్గురువుల బోధలనుగూర్చి తలంచుట, పలుకుట, కీర్తించుట, రచించుట, ఆలకించుట, వ్యాప్తిపఱపుట మహదా నంద కరములు - సౌభాగ్య వర్ధనములు - ఆయావ్యక్తులకు ఆధ్యాత్మిక

ప్రబోధ కల్పించి, పవిత్రులగావించి, ఉత్తేజపఱచి, సముద్ధరించి, దైవ సాక్షాత్కృతిఁబ్రసాదింప సమర్థము లైనవి.

బాబా జీవిత చరిత్రమంతయు "త్యాగ-సేవలతోఁగూడినది - బాబా కావించిన ప్రతికార్యము నిస్వార్థ పూరితము - లోకోద్ధరణ దక్షమై యున్నది. ఆశ్రిత కోటికి లౌకిక కామితములఁ బ్రసాదించుచున్న వాఁడయ్యును, శ్రీసాయీనాథుడు తన బిడ్డలకు జీవితాశయము-లక్ష్యము నెఱుకపరచి, ప్రియవస్తువునుండి, పరమశ్రేయోవస్తువు దఱికి - పరమాత్మదఱికి వారా జీవితమునఁ బురోగమించగల యంతదనుక గొనిపోయి తన సర్వవ్యాపకత్వ సర్వజ్ఞత్వసర్వసమర్థతలను నిలుపుకొన గలడు.

"ఆసలీసులు - లోభము - అన్యచింత
కపటము, నసత్యమును కాముక ప్రవృత్తి
అగ్రహంబను యెనిమిది యవగుణములు
అవల ద్రోయునో సాయి పదాంకితుండు."

మాయావరణ బద్ధుడగుజీవి యీ అవగుణములు దనకుదా వదలజాలడు. శ్రీసాయీ ప్రభుని కరుణా ప్రభావముచే దొలగవలసినదే ! దానికై నిష్ఠ - సబూరి - రెండు కానుకలు సమర్పించి, "ఊరకయెకూర్చుండు విచారంబులఁ దక్కి" అనినాడు. "నా ఆశ్రితుని సకల భారంబులు నేనే వహించి, వానిని సక్రమ మార్గమున నడపించి గమ్యమును చేర్చ గలను." అని అభయము ప్రదానము గావించెను.

దురహంకారము కలిగి, దుర్వ్యసనములకు లోనై "బాబాదేవుడా?" అని సందేహించు భక్తులను సైతము బాబా తనను చేరరమ్మని పిలుచు చునే యుండెను.

"బాబా-తన రక్షకుడు" అను గాఢ విశ్వాసముఁగలిగి, ఆస్థానము నుండి తొలగని వానికి భయముగాని, వ్యసనముగానిలేదు. "స్వామీ! సాయీ! నా సర్వస్వము నీకు సమర్పణ గావించు కొంటిని. నా సకల

సంకల్పములు నీకు విడచితిని. నిన్నుఁగాక అన్యము శరణుగోరను." అని సంపూర్ణ శరణాగతి నొందు భక్తునికి సర్వకార్యములు సానుకూలమై శాంతి, సుఖ సంతృప్తులు కరతలామలకములగును. వానికి విశ్వమున భయ బాధావ్యసన కారణములుండవు. వానికి దృశ్యప్రపంచము దైవ స్వరూపముగనే గోచరించును. అట్టివాడు "బాబా! నీయాజ్ఞ పరిపాలింతును" అని త్రికరణశుద్ధిగ వచింప జాలును.

మనకు గలుగు సుఖలేశములు బాబా అనుగ్రహలబ్ధము లనియు, ప్రాప్తించు కష్ట నష్టములు, వ్యసనములు. మన ప్రవర్తనమునగల లోపములను జక్క బెట్టుటకై దైవసంఘటితలగు శిక్షలనియు దృఢ విశ్వాసము గలిగి యుండవలెను. 'నాది' అనుటయే బంధహేతువు. 'నాదికాదు' అనుటయే ఆనందహేతువు.

"శ్రీసాయీనాథ బోధామృతము" ఏక కాలమున ఒకే ప్రదేశమున - ఒక వ్యక్తినిగూర్చి పలుక బడకున్నను యీ సార్వకాలికి సత్య ప్రబోధములు మన కందరకు వినబడచునే యున్నవి. అందఱనుద్దేశించినవి. ఇవి శ్రీసాయీబాబా శ్రీ ముఖోద్గతము లగుటచే త్రికాలసత్యములు. విశ్వాస కృతజ్ఞతా పూర్వకముగ స్వీకరింపదగును. ఇవి మన బంధ విముక్తి కొరకు మనశ్రేయస్సు కొఱకు నుద్దేశింపబడి పలుకబడినవి. కావున సాయీభక్తులెల్లరు హృదయు ఫలకమున భద్రపర్చు కొనదగును.

ప్రేమామృత పూరితములు దయా కలితములునగు యీ మధుర సూక్తులు మనల మేలుకొలిపి మనకల్మష పూరిత హృదయముల పరివర్తన చేసి బాబా దఱికి చేర్చుచున్నవి. "మీరు నాబిడ్డలు - మీ సకలాభీష్టములను నావలన మీరు పొందవలయును." అని బాబా బోధించినాడు. (చూడుడు-31-301-331-171-383)

శ్రీసాయి పదాశ్రితులమగు మనము ఆ తండ్రి బహూకృతులను స్వీకరించి, ప్రశాంతి బడయుటకు బాబాను జేరవలయును. మనకొఱకు సిద్ధ పఱచిన ప్రేమామృతమును తనివిదీఱ నాస్వాదింపవలయును. మన ఆలోచనలకు, ఆచరణములకు, సంశయములకు సంకటములకు,

సంబంధమగు సమాధానము లన్నియు "శ్రీసాయినాధ బోధామృతము" నుండి ఎఱుకపఱ్చుకొని, సందేహనివృత్తి బడయుట సుసాధ్యము. కావున మీరెల్లరు యీ సత్యమును గుర్తించి స్వానుభవమును సంపాదించి యీ అమృతమును గ్రోలి సంతృప్తి, శాంతిని బడయగలరని నా ఆకాంక్ష. ఇట్టి పరమ మధురామృతమును విశ్వమానవులకు ఆంగ్లమున అందించిన మహర్షి పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగార్కి, ఆంధ్రదేశమున మన కెల్లఱకు తేట తెనుగున అనువదించిన గురువర్యులు శ్రీ షిర్డీసాయి సంస్థాన పండితులు, మార్గ దర్శకులు, నగు పూజ్యశ్రీ బాపట్ల హనుమంత రావు పంతులుగారికి మనము నిత్యము ప్రణమిల్లి కృతజ్ఞతలు చెప్పుకొన వలెను.

## సాయి సుప్రభాతము

"శ్రీసాయి ప్రసన్న" పితృపాదులువారు శ్రీసాయి సుప్రభాతము" పలుక ప్రారంభించి 15 గీతములు రచించి ముగించక నొకచో యుంచిరి. అదృష్టవశమున యవి లభ్యమగుటచేత, కనీసము 'తారావళి' గనైన వెలువరించు భాగ్యము ప్రసాదించుమని మన ప్రభుని ప్రార్థించి, నిత్యము నా మనోవీధిని మసలు మత్పితను, వారి ప్రేమం జూరగొనిన కొందఱు భక్తవర్యుల నాధారముగంగొని 12 గీతములు రచించి యిందు తొలుత చేర్చితిని. ఇందలి దోషములను పాఠకులు మన్నింతురని నా ఆశ.

## "ఏమి! నిన్నుపేక్షింతువా?"

పుణ్య జనకులు "ఏమీ! నిన్నుపేక్షింతునా" జీవితచరిత్ర గ్రంధమునందు ప్రతి ప్రకరణము చివర బాబా శపధమును ప్రకటించుచు నొక్కొక్క భక్తుని చరిత్ర కొక్కొక పద్యమును రచించిరి. ఆయాభక్తుల చరిత్ర మనోఫలకమున చిత్రీకరించుకొని ఆనందించుట కవకాశముగ నొక్కచో జేర్పుడని సోదర భక్తులు శ్రీ వి. వెంకయ్యశర్మగారు - టీచరు- మచిలీపట్టణమునుండి వ్రాసిరి. ఇది బాబా అనుజ్ఞగ భావించి, 48 పద్యములు తుదిని చేర్చుట జరిగినది. వారికి నాకృతజ్ఞతా పూర్వక నమస్కృతుల నందించు కొనుచున్నాను.

# గ్రంథముద్రణ విషయము:

"శ్రీసాయినాథ బోధామృతము" పునర్ముద్రణ గావింపుడని సోదర భక్తుడు, ప్రస్తుతము సాలూరులో అసిస్టెంటు ఇంజనీయరుగ పని చేయుచున్న చి॥ శ్రీ॥ శేషగిరి సత్యనారాయణగారి ద్వారా శ్రీసాయి ప్రభువు ప్రేరణగావించిరి; 1979 లో "శ్రీసాయీ సుభాషితములందు. ప్రకటించినరీతి

"ముందు ముద్రణకై నీవు కుందనేల?
సాగిపొమ్ము నాయందు విశ్వాసముంచి!"

అని బాబా అభయప్రదానమును సైతము, మానవత్వపు మాయయందు చిక్కి, గమనింపక, గమనించియు, ప్రభుని బోధావిధానము ననుసరింపక, గ్రంథముద్రణకు వలయుమొత్తము నెట్లు సేకరింప కలుగుదునా యను సందియమునొంది, ముందుగ ముద్రణకు యివ్వక, ఆలసించుట నాస్వయం కృతాపరాధమే యగును. బాబా వలయు ధనము మీ అందఱి నుండి సేకరించి, స్వీకరించి అందింపినను అనుకున్న రీతిని 1980లో విడుదల చేయుటనాకసాధ్యమైనది. శ్రీసాయీ ప్రభుని యందు సంపూర్ణ విశ్వాసముంచి, శరణొంది, క్రమశిక్షణకు కట్టుబడని భక్తుడు ఎప్పుడు నేదొక అనిష్ట సంఘటనను నెదుర్కొనుచుండుననుట కిదియొక తార్కాణము. ఆలీలా నాటక సూత్రధారి యీ జీవికి యింకను స్వానుభవము నెఱుకపర్చుటకే యీ అవరోధములు కల్పించి, మనస్సును కలతం జెందించి, తుదకు అమృతమును చిందించి, యీ గ్రంథమును మీకు అందించి యుండెను.

ఈ గ్రంథముద్రణకు మీరెల్లరు బాబా యందుగల భక్తితోను, పితృపాదుల యందుగల పవిత్ర గురుభావమునను ప్రేమతత్వమునాకు ప్రబోధించుటకు విరివిగ విరాళములు పంపి పోషకులనుం జేర్చి బాబాకు ప్రీతి పాత్రులైరి. 15-3-1981 వరకు భక్తులు పంపిన మొత్తములను పొందుపరచి పోషకుల జాబితా యందు ముద్రించబడియుండెను.

నా యందుగల సహజ వాత్సల్యమున గ్రంథముద్రణకు చేయూత నొసంగిన సోదర భక్తులు 1. పూజ్యశ్రీ చోడవరపు సాంబమూర్తి గారు - హైదరాబాదు. 2. చిరంజీవి శ్రీ శేషగిరిసత్యనారాయణగారు - సాలూరు. 3. చిరంజీవి శ్రీ చదలపాక సింహాచలంగారు - కడప. 4. చిరంజీవి శ్రీ రావర్ల సీతారామయ్యగారు - ఖరగ్‌పూరు 5. చిరంజీవి శ్రీ శ్యామచరణ్ - నంద్యాల 6. మహాశివరాత్రినాడు పట్టి సింహాచల క్షేత్రమున గోదావరి పుణ్యనది యందసువులు బాసిన పసివాడు, చీమల కొండ సుబ్రహ్మణ్యశాస్త్రి తల్లి తండ్రులు. బాబా వీరియెడ పలికించిన కృతజ్ఞతా పూర్వక భావములు వారి వారి చిత్తరువుల యెదుట ప్రకటించి సంతృప్తిఁబడసితిని.

నాయందుగల ప్రత్యేకాభిమానమున కోరినంతనే "తొలిపలుకు" వ్రాసి పంపిన "మధురకవి" పూజ్యశ్రీ, మూలా పేరన్నశాస్త్రి, ఆశీస్సులు అందించిన పూజ్యశ్రీ నూతులపాటి సత్యనారాయణశర్మ; పూజ్యశ్రీ మంచి రాజు సూర్యనారాయణమూర్తి; పూజ్యశ్రీ పొదిల్ల విశ్వనాధశర్మగారల పాదపద్మములకు నా హృదయపూర్వక నమస్కార సహస్రంబులు సమ ర్పించు కొనుచున్నాను.

ప్రశంసలు వ్రాసిన యస్. వేణుగోపాల్ - హైదరాబాదు; చి॥ శ్రీ॥ ఆర్. రామచంద్రరావు,యం.ఎ., మార్కాపురం గారలకు నా కృతజ్ఞతాభినందనలను ప్రకటించుకొను చున్నాను.

శ్రీసాయి ప్రభువు పోషకమహాశయుల నెల్లరను సంపూర్ణ కటాక్ష వీక్షణములతో తన అంకిత బిడ్డలుగ తీర్చి దిద్ది, ఆయురారోగ్య ఐశ్వర్య సుఖశాంతులు ప్రసాదించి సర్వదా సంరక్షించ నా ప్రార్థన.

## శ్రీ షిర్డి చిరునామా:

భక్తులెందరో శ్రీ షిర్డి చిరునామా కొరకు వ్రాయుచుండిరి. బాబా - అనుగ్రహించి, అనుమతించినప్పుడు షిర్డికివెళ్ళి ద్వారకామాయి"

మాహాసమాధి మందిరము సందర్శించి శ్రీసాయీ ప్రభుని స్పర్శించి, సేవించి, యెల్లరు తమ జీవితములను, సార్ధకత బడయువలెను. వారి వారి గోత్రనామములను, చిరునామాలను స్పష్టముగ మనియార్డరు కూపనుమీద అంగ్లమున తెలుపుచు, పై కము దిగువ అడ్రసునకు పంపిన, శ్రీషిర్డి సంస్థాన నియమితాధికారులు వారిపేర పూజజరిపి, శ్రీసాయీ ప్రభుని అఖండ ధుని యందలి "ఊధి" మరియు నివేదిత ప్రసాదము కవరులో పంపుచుందురు. యీ అవకాశము ప్రతి వొక్కరు వినియోగించు కొని బాబా అనుగ్రహమునకు పాత్రులు కాగోరుచున్నాను.

అడ్రసు:-

Executive Officer
Sri Sai Sansthan
(P.O.) SHIRDI
Pin 423 109

## శ్రీసాయీనిలయమున నిత్యపూజా విధానము

శ్రీసాయీ ప్రభువు నన్నొక 'వ్యక్తి'గ తన అంకిత భక్తునిగ జేయు కోరిక కలిగి కాబోలు, చెరువు గ్రామమున శ్రీసాయీ నిలయము (చిన్న పెంకుటిల్లు) న గల చిన్నగదియందు 31-1-1980 న ప్రవేశించి, నిత్యపూజాదులను చేయించు కొనుచు నన్ను భక్తి పథమున పయనింపుట కనుగ్రహించు చుండెను. బాబా భక్తులు వారి కుటుంబ సభ్యులు వారి వారి గోత్ర నామములు, జన్మతిథి, నక్షత్రరాశి, గ్రహాదులను, సంకల్పములు తెలుపుచు, వారి జన్మతిథులందు, గురువారములందు, ఇతర పర్వదినము లందు శ్రీసాయీ ప్రభునికి అభిషేక, సహస్రనామార్చనలను సలుప గోరుచు వారము ముందుగ తెలిపిన, ఆ ప్రకారం వేదపండితుల సహకారముతో పూజాదులను జరిపి, ఊధి, కుంకుమ, ప్రసాదము పోస్టుద్వారా పంపుటకు శ్రీసాయీనాథు డనుమతించుచుండెను.

## "సాయిభక్త" చిరంజీవి శ్యామచరణ్ పరిచయము:

శ్రీసాయిప్రభువు ప్రేమ స్వరూపుడు. అట్టి ప్రేమ స్వరూపుని అనుదినము, అనుక్షణము, ఆరాధించి, అనుసరించి, ఆకర్షించి, ఆవేసించి, ఆనందించి, ఆత్మానందము నొంది ప్రేమామృతము స్వాదించు భక్తులు ప్రేమ స్వరూపులగుననని మనమందఱకు అనుభవ యోగ్యమగుటకే శ్రీసాయి నాథుడు భక్తజన కోటికి అమూల్య భక్త రత్నమును ప్రసాదించినాడు. "శ్రీసాయి సుభాషితముల"కు తొలిపలుకు వ్రాయించుకొని తన అంకిత తనూజుడైన "శ్యామచరణ్"ను శ్రీసాయి ప్రభువు మన కందరకు యిదివరకే పరిచయముచేసి యున్నాడు. శ్రీ పోతనామాత్యుని పోలిక; శ్రీ త్యాగరాజునకు తగురీతి; భక్తరామదాసు ప్రకారము; శ్రీ హనుమకవివలె బాబాయందు స్వాతంత్ర్యాధికారము సంపాదించుకొని సాయి ప్రభుని తన మనోఫలకమున వివిధరీతుల చిత్రించుకొని, పూర్వ జన్మ పుణ్యార్జితము, సద్గురు బోధానుసరణ ఫలప్రాప్తము, సజ్జన సాంగత్య సేవా సంప్రాపిత సహజ భక్తి సంజనిత పాండిత్యమును ప్రకటించి, పెక్కు రీతుల స్వామిని కమ్మని గాత్రముతో కీర్తించుచు, పవలనక, రేయనక నిజనివాసమనక, పరప్రదేశమనక, సర్వత్ర శ్రీసాయియే కనుదోయిని కనిపించుగతిని మెలంగుచు, 'శ్యామచరణ్'పలుకు భజనగీతములు, కీర్తనలు రాగయుక్తమై మాధుర్యము చిలుకుచు సహజస్థితి నెల్లరను మైమఱపించు గతి ఆనందాబ్ధి నోలలాడజేయుననుట అతిశయోక్తి కానేరదు. ఈ తన్మయ స్థితిని వివరింప వర్ణింపనేనశక్యుడను. వారి వారి స్వానుభవమున నెఱుంగ వలసినదే. ఈతఁడు రచించు ఒక్కొక్క పాట వజ్రాలమూట. వీరు అనుసరించు బాట సాయి ఆశ్రిత భక్తకోటికి రక్షకకోట. శ్రీసాయి ప్రభుని పై భక్త్యావేశమున యెలుగెత్తి పాడఁదొడంగెనా! షిర్డియందలి శ్రీ ద్వారకామాయి మందిర మహాస్తంభములే కదలి మహాసమాధి యందున్న మన తండ్రిని మేల్కొలిపి, ఆర్తానాదము వినిపించి, కరుణామృతమును ప్రవహింపఁజేయు శక్తి సామర్థ్యము కలిగి యుండెనని నా అనుభవము. ఇట్టి సద్భక్తుని సందేశమును, భక్తకోటికి అందించు ఒకే బాబా ప్రేరేపించి యుందు చేర్పించుకొనెను. సోదరీ సోదర భక్తు

లెల్లరు అవకాశము దొరుకు నప్పుడెల్ల యీ భక్తరత్నముతో పరిచయము నేర్పరచుకొని, వారి భక్తి ప్రభావ సంజనిత మృదు మధురోక్తులు వుత్తర ప్రత్యుత్తరముల ద్వారానైన పొంది, ఆనందించుటకు అవకాశము కల్పించుటకు వీరి చిరునామా యిందు ప్రకటించు చున్నాను.

చి॥ శ్రీ॥ తుర్లపాటి బాలగురునాథ్ (శ్యామచరణ్)
17-51 బి.
నంద్యాల - 518501

వీరు రచించిన కీర్తనలు ముద్రింపించి 'శ్రీ సాయిభక్తుల కందించవలెనను ఆకాంక్షతో శ్రీసాయినాథుని అనుగ్రహము కొఱకు నిరీక్షించు చుంటిని. ఇందుకు అందరి సహాయము సర్వదా అపేక్షణీయమే! మన అందరికి ఆనందము నందించు యీ కృతులను ముద్రింపించుటకు సోదరుడు "శ్యామచరణ్" ఆమోదించ గలడనే ఆశించుదము. ఈ కారణ జన్ముని శ్రీసాయి ప్రభువు సర్వదా సర్వథా రక్షించి శ్రీసాయి భక్తి ప్రచార సాధకునిగ, బోధకునిగ మహోన్నత శిఖరములనందు కొనునట్లు ఆశీస్సులు అందించుటకు మన మెల్లరము ప్రభుని ప్రార్థించుదము.

ముందు కార్యక్రమము:- శ్రీసాయి నాథుడు యీ జీవిని కడఁదేర్చు మార్గ మెద్దియా అని ఆలోచించి, ప్రయత్న పూర్వకముగ భక్తి ప్రబోధక గ్రంథముల ముద్రణ ధారా వాహినిగ సాగించదలచి ప్రచురణ, ప్రచార శాఖలందు నన్ను నియమించుకొని యుండెననియే నాతలంపు. నాతండ్రిగారి రచనలతో పాటు శ్రీసాయిభక్తులు రచించిన గ్రంథములను సైతము వెలువడజేయ బాబా ఆజ్ఞగా భావించి "మధురకవి" బిరుదాంకితులు, ఉభయభాషా ప్రవీణులు; ద్విదశానేక గ్రంథ రచయితలు నగు పూజ్యశ్రీ. మూలాపేరన్న శాస్త్రిగారు రచించిన 1. శ్రీషిరిడిసాయి శతకము, 2. శ్రీ కరావలంబన స్తోత్ర కదంబములు, 1981 లోనె ముద్రణ చేయ సంకల్పము శ్రీ సాయినాథుడు కలిగించెను. మరియు పూజ్యులు, పితృపాదులు రచించిన 3. "గోమాతృస్మృతి" అను కృతియు త్వరలో

ప్రచురించ బాబా అనుగ్రహించెను. 4, శ్రీసాయీపూజా స్తవములు 5. శ్రీసాయీ దేవశతకము పెక్కురు భక్తులు కోరుచుండిరి. శ్రీసాయీ ప్రభువునకు త్రికాలసేవలు, అష్టోత్తర, సహస్రనామావళితో కూడిన శ్రీసాయీ బాబా పూజా స్తవములు పునర్ముద్రణ గావించి భక్తులకుచితముగ అందించుట మన విద్యుక్త ధర్మమని నాభావన.

ఈ 5 పుస్తకములు సకాలమున వెలువడ జేయుటకు శక్తి సామర్థ్యములను శ్రీసాయి మనకు ప్రసాదించగలడని, యీ కృషిని మీరెల్లరు సహృదయముతో గుర్తించి, పూర్వమువలె పూర్తి సహకారమును అందించి, పోషకులనుచేర్చి, విరాళములు పంపి, నన్ను కృతకృత్యుని గావింపగలరని నాదృఢ విశ్వాసము. ప్రతి బాబాభక్తుడు గ్రంథ పోషకుడే! ప్రతిపోషకుడు శ్రీసాయీనిలయ ప్రచురణములందు భాగస్వామియే! కనుక నావద్ద లభ్యమగు గ్రంథములను సోదర భక్తులకు అందించుడు. ముందు జరుగు ముద్రణములకు ఆదుకొనుడు. ఇదియే నా ఆశయము. ఇదియే నా ఆలోచన. ఇదే నాకు బాబా అందించిన ఆదేశము.

ఈ గ్రంథమును బహుశ్రద్ధతో దోషములు లేకుండ ముద్రణము గావించిన శ్రీ మాతృశ్రీ ముద్రణాలయము, బాపట్ల వారికెల్లరకు నా కృతజ్ఞతాభివందనములు తెలుపుకొనుచున్నాను. శ్రీసాయీప్రభువు వీరి నెల్లర సంరక్షించ నా ప్రార్థన.

"కృషి కృతార్థమగును సాయి కృపనుబడయ"

ఈ అవని అందరూ మహనుభావులే! అందరికి వందనములు!
భక్తకోటిని సర్వదా సర్వథా శ్రీసాయీ నాథుడు సంరక్షించ
నా సంకల్పయుత ప్రార్థన.

ఇట్లు
శ్రీసాయీ భక్త పాదరేణువు,
బాపట్ల వేంకట పార్థసారథి.

చెరువు
8-7-81

శ్రీ సాయీ నాథాయనమః

# శ్రీ సాయీ సుప్రభాతము

శ్రీ సమర్థ సద్గురునాథ ! వాసుదేవ !
పూర్ణ విభవావతార ! తమోవిదూర !
వేగు జామయ్యెఁ దూరుపువెల్లఁబాఱె
నుదయ విధులఁ దీరుపలెమ్ము ! సదయ ! సాయి ! ౧

లేవగదవయ్య ! అప్ప ! లీలా వినోద
విగ్రహా ! సదానుగ్రహా ! విశ్వవంద్య !
సకలభువన భద్రప్రద ! సాయిభద్ర !
మేలుకొనవె ! ఆశ్రితుల మమ్మేలుకొనవె ! ౨

పూర్ణ కరుణారసస్తన్యములను జగతిఁ
బ్రాణికోటిదన్ప వివృతద్వార వతివి,
ఆశ్రితావన సాయి నాథాను యాయి !
ద్వారకామాయి ! సుప్రభాతంబు నీకు ! ౩

స్వాశ్రితప్రజాదుష్కర్మ సమిధ లొగిని
నా స్వదించి కూర్తువు విహితార్థతతిని
హ్లాదినీ ! శ్రీధునీ ! భువనైకజనని !
సుప్రభాతంబు, సాయీప్రభుప్రణయిని ! ౪

శరణుఁజొచ్చినవారల జాడగనక
నిద్రనొందెదవేమి? నిర్నిద్రమతివి !
ఈవు నిదురింప శ్రితుల కింకెవరుదిక్కు ?
మేలుకొనుసాయి ! కరుణ మమ్మేలుకొనవె ! ౫

దవులనుండి నీబిడ్డలెంతయును శ్రమల
సైచి యరుదెంచి వెలుపల వేచినారు,
నీదు దర్శనకాంక్ష, తండ్రి ! సమర్థ !
సుప్రభాతంబు దేవ ! సాయీ ప్రసన్న ! ౬

ఇరుకెలంకులఁ జేరినిద్రించు మేన
యల్లుడగుతాత్యయు భగత్ మహల్సపతియు
లేచి నీయానలొగి దీర్ప వేచినారు
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౭

తలగడగఁ జేర్చు దివ్యోపధానమైన
గురుపదాంకిత మిటుకను చిఱువసనము
భద్రపఱపంగదవె ! వెలిప్రాణములవి;
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౮

బాబ ! లక్ష్మణబాపుసాహేబు జోగు
లెలమి నీప్రభాతార్చనల్ సలుపగోరి
వచ్చినారు పూజాద్రవ్యపటలితోడ
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౯

చావడిని మొదల్కొని వరుసలను దీర్చి
ద్వారకామాయి భవనంబు వరకు - వీరె -
నీదుబిడ్డలు నిల్చినా రాదరింపు;
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౧౦

అప్ప ! చాపధ్వజాంకితమైన నీ ప
దాంబుజ స్పర్శఁగోరి పుణ్యావనీమ
తల్లి యుత్కంఠఁగను; గృపఁ దనుపఁగదవె !
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౧౧

చఱచి చిఱుతల్ నటించుచు శ్రావ్యఫణితి
లావణీఛందమున నీవిలాసగీతి
కలను గీర్తించు చున్నాడు "గాణుదాసు"
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౧౨

ప్రభు! భవత్సచ్చరిత్ర మరాటి కావ్య
మునఁ బురాణించుచున్ శ్రోతలను మహాము
దాబ్ధిఁ దేల్చుచున్నాఁడు 'హేమాద్రిపంతు'
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౧౩

ద్వారకామాయి మందిరావరణమెల్ల
పొసగనూడ్చినీరముజల్లి ముగ్గులునిచి
'రాధికాకృష్ణఆయి' ద్వారమున నిలిచె
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౧౪

ఫలకుసుమ భూజములను బొంబాయి నుండి
యిదె పురందరు తెచ్చె నాటించ (బనుపు-
'లేండి' వనవిహారము సేయ లేవగదవె!
సుప్రభాతంబు దేవ! సాయీ ప్రసన్న! ౧౫

(గ్రంథకర్త)

నీదు లీలలు, సూక్తులు మోదమంది
వ్రాసి, వినిపింప వచ్చె 'బాపట్ల హనుమ'
షిరిడి సంస్థాన పండితశ్రేష్ఠు డదిగో!
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౧౬

సర్వమీవ యనుచు మనసార నమ్మి
నిత్యపూజ లర్పింపగ నిలచి యుండె
కొప్పరపు రామయ్యాగ్రణి కొలువు నందు
సుప్రభాతంబు, దేవ! సాయీప్రసన్న! ౧౭

గురునిపాదములొత్తి నిద్దురను బుచ్చి,
భక్తిబోధలు పాటింప వచ్చె, మంచి
రాజు సూర్యనారాయణ ప్రవరు డితఁడె!
సుప్రభాతంబు! దేవ! సాయీప్రసన్న! ౧౮

సకల భూతహృదంతరస్థాయి నిన్ను
'సత్యసాయి'గ కొలుచు నాసక్తి కలిగి
పొదిలవిశ్వనాథుండు నీయెదుట నిలచె,
సుప్రభాతంబు, దేవ! సాయీప్రసన్న! ౧౯

ప్రేమరూప మీవని, నీవ ప్రేమ యనుచు
తోడివారికి పలుకుచు చోడవరపు
సాంబమూర్తి చూడుమిట సాష్టాంగపడియె!
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౨౦

"ద్వారకామాయి" పేర "విద్యానగరి" ని
మందిరముఁ గట్టి దీవన లందఁగోరి
ఎక్కిరాల భరద్వాజు డిచటఁ జేరె!
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౨౧

ఏమినోముల ఫలితమో యేమొ గాని,
తన్మయతఁ జెంద భక్తిగీతముల వ్రాసి,
శ్యామచరణుండు వినిపించు శ్రావ్యముగను
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౨౨

'షిరిడిస్తోత్రలహరి' యావి స్వీయకవిత
తేటతెనుగున రచియించి తెచ్చినాడు
మూలపేరన్నశాస్త్రి నీవాలకింపు
సుప్రభాతంబు దేవ! సాయీప్రసన్న! ౨౩

ప్రజలపనులందు తీరిక బడయలేక
వరుగులిడి వచ్చిరి 'చదలపాక' వారు
'శేషగిరి' వారు బడలిక చెందినారు,
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౨౪

కష్టదశలను దలచి సౌఖ్యముల విడక
భక్తి నిష్ఠల నెగడు రాపర్ల సీత
రామయాఖ్యుఁడు సలుపు ప్రార్థనలువినగ
మేలుకొనవయ్య సాయి ! మమ్మేలుకొనుమ ! ౨౫

దీనజనుల పాలిటి కామధేను వీవ !
శరణుఁగోరి యేతెంచి 'విస్సావధాన్లు'
నీదు చరణాబ్జముల మ్రోల నిలచి యుండె !
మేలుకొను సాయి ! కరుణమమ్మేలుకొనుమ ! ౨౬

శరణు జొచ్చిన వారి కాశ్రయము నిచ్చి
మనుచు నీకు సహస్ర నామార్చనలను
సలుపవచ్చె వేంకట పార్థసారథితఁడు!
సుప్రభాతంబు దేవ ! సాయీప్రసన్న ! ౨౭

(ప్రచురణకర్త)

--□--

శ్రీ సాయినాథాయ నమః

# శ్రీ సాయీ ప్రభువునకు వినతి

శ్రీపరాత్పర! సాయీ! కృపాపయోధి!
నావలుకు సాహసంబును సైఁపఁగదవె!
స్వల్పమతి యెఱుంగునె? నీ యపారకరుణ
నిన్ను నీనామమును నమ్మి నెమ్మినుందు
నరునివలె తోఁచుదీవ, యీశ్వరుడవీవ
కర్త వీవ, క్రియయు నీవ, కర్మ మీవ
పావనుఁడ వీవ, యుత్తమవ్యక్తి వీవ
సర్వజగముల ప్రభు వీవ; సాయిదేవ!
జయము - శిర్డినివాస! శ్రీసాయి! నీకు,
జయము - శ్రీద్వారకామాయి సాయి! నీకు,
జయము - సర్వదేవాత్మక! సాయి! నీకు,
జయము - భక్త కల్పద్రుమ! సాయి! నీకు.

## అపాంతరాత్మ

వీరలేయెడ మరణించువారు కారు
వీరెపు "డపాంతరాత్మ"యై వెలయుచుండ్రు,
వారికరుణా ప్రవాహముల్ పఱవుచుండ్రు,
సిద్ధకరముల శ్రితుల స్పృశించుచుండ్రు.
దిక్కులేనివారలకెల్ల దిక్కునగుచు
నొసఁగుదురు దీనులకును జేయూఁత సతము;
తమ్ము సేవించు వారిఁ గష్టమ్ములందు
విడఁగనాడరు; రక్షణంబిడుచునుండ్రు.
పేరునకుమాత్ర మనుజులు వీరు, కాని
దైవమే యిట్టివారు యథార్థ మింత;
దర్శనము మాత్ర శ్రితులను దనుపుచుండ్రు;
కనఁగ - 'లీలావినోద విగ్రహులు' - వీరు.

—o—

# తొలిపలుకు (మొదటి కూర్పు)

[గౌ. జస్టిస్. యం. బి. రేగే, బి. ఏ., యల్. యల్.బి.,
హైకోర్టు జడ్జి, ఇండూరు. (రిటైర్డు)]

శ్రీ సాయీనాథబోధామృతము (శ్రీ సాయీ బాబా అభయ ప్రదానములు - సూక్తులు)నకు తొలిపలుకుఁ బలుకు ప్రయత్నము సూర్యుని నొక చిన్న మైనపువత్తి దీపముతోఁజూప నుద్యమించుటే యగును. ఈ విషయము నాకంటె నితరు లెఱుఁగ జాలరు. కాని శ్రీ సాయిబాబా అభయ ప్రదానములను సూక్తుల నేర్చికూర్చు భాగ్యము గడించిన నా ప్రియసోదరుఁడు పూజ్యశ్రీ బి. వి. నరసింహ స్వామి యీ కృతికిఁ దొలిపలుకు రచించు గౌరవమునకు నేను తగనని తెలిపిన సహింపఁడు. బాబా దివ్యానుగ్రహమున ఈ చిన్న మైనపువత్తి దీపము సంసార కుహరమునుండి జీవిని వెలుపల దివ్యజ్యోతి స్వరూపుఁడైన సూర్యుని దగ్గఱకుఁ గొనిపోవ మసక మసక వెలుఁగు ప్రసరించిన ప్రసరింప వచ్చునేమో! అటులఁ బ్రసరింపఁజాలిన 'అభయప్రదానముల' కింకొక దానినిఁ జేర్చుట యగును.

మతముయొక్క నిగూఢలక్ష్యము ఆత్మజ్ఞానము. గమ్యమునకుఁజేర్చు మార్గ మాయా వ్యక్తికిఁ దగినదిగ నుండవలయును. భౌతిక దేహమునందున్న బాబా సాధకులగు భక్తులకు పలుకులచేత పనిచేత వెలుగు ప్రసరించుచు మూర్తీభవించిన పరమాత్మయైనాఁడు. భౌతిక తనువు మాత్రమిపుడు తొలఁగినది. కాని, యందధివసించిన బాబా అచ్యుతాత్మయై, తన శరణొంది సుఖశాంతులఁ బడయఁగోరు లక్షోపలక్షల భక్తులకు పూర్వమువలె వెలికిఁగానరాకయే మౌనముగఁ దోడ్పడుచున్నాఁడు, కాని, సాధకునకు తన విశ్వాసమును పాదుకొలుపుకొనుటకు ఇంద్రియగోచరమై మూర్తీభవించిన సత్యవస్తువు కావలయును.

స్వామి (పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామి)చే ఏర్పికూర్చఁబడిన "శ్రీసాయిబాబా అభయప్రదానములు - సూక్తులు" గ్రంథరూపమున మూర్తీభవించిన ఆ పరతత్త్వ మగుచున్నది. శ్రీ కృష్ణమహాప్రభువు భగవద్గీతలందు మూర్తీభవించినట్లు శ్రీసాయిబాబా - యీ "అభయ ప్రదానములు - సూక్తు "లందు మూర్తీభవించియున్నవాఁడు.

ఈకృతి సాధకులగు భక్తుల మార్గమునకు వెలుగు ప్రసరించు దీపజ్యోతి యగుటయేకాక, బాబా భౌతిక తనువు నందుండఁగ ఆ తండ్రి పాదములఁ జేరుభాగ్యముఁ గనిన నా యట్టి స్వల్పులకు ఆ తొంటిదేశ కాలానుభూతులకు మఱియొకమాఱు గొనిపోయి ఆ ప్రేమస్వరూపుఁడగు స్వామితోఁ గడిపిన ఆనందప్రద మధురస్మృతులఁ దిరిగి ప్రసాదింప దక్షమైనది.

ఈ "అభయప్రదానములు - సూక్తులు" భౌతిక - ఆధ్యాత్మిక ప్రపంచముల రెంట ధర్మనియమ బోధకములగును. బాబాను దేహిగా - జీవిఁగ - పరమేశ్వరునిఁగ భావించి సేవించు భక్తునకు సాయిప్రభువు నందు సహజప్రేమను పెంపొందింప సమర్థములై యున్నవి. బాబా - ఒక స్థితియందు "మీ సేవకుని సేవకుడను" - అని పలుకును. ఒకట - "నేను 'అల్లా' సేవకుడను" - అనును - అటులనియు మరల "నేనే అతఁడ (అల్లా)ను - అని యనును. బుద్ధికిట నగమ్యముగ తోఁచును. కాని, మనో బుద్ధుల కతీతమైన "ఆత్మ" యిట వ్యక్తమగుచున్నది. దేహిగ గోచరించు బాబా ఒక అనామకుడైన, సామాన్య మానవవ్యక్తి. అస్థితికీ - పరమేశ్వరు నకు మధ్య అతఁడు జీవి - ఆ మహాయంత్రమున నొక చక్రము. ఈ రెండు స్థితుల నధిగమించి తానే పరమేశ్వరుడుగ నిలిచియున్నాఁడు. శాస్త్ర పరిజ్ఞానము పురోవృద్ధినొందు కొలఁది యీ త్రివిధావస్థలకే దొక నాఁడు బుద్ధిసీమయందు సమన్వయము కుదిరితీరును. ఈగ్రంథమున సూచింపఁబడిన అద్భుతానేకములు సంశయగ్రస్తుని ఆశ్చర్యచకితునిఁ జేయువచ్చును. అవ్యయాత్మయైన బాబా అనుయాయులకు భక్తులకు - పరిణామ విధానమున నవి కేవల మానవుల కద్భుతలీలలయ్యు. విశ్వాస ప్రేమల వెలుగున సమర్థనీయములే యగుచుండును.

బాబాయొక్క దివ్యవ్యక్తిత్వము ఈకృతి రూపమున మూర్తీభవింపఁజేయఁజాలిన శ్రీ నరసింహస్వామిగారి ప్రేమ ప్రపూర్ణకృషి కెవ్వరును తగినరీతిఁ గృతజ్ఞతఁ దెలుపుకొనఁ జాలరు. గురుదేవుఁడగు శ్రీసాయీ మహాప్రభువునకు - బాబా యొక్క వ్యాసుడైన శ్రీనరసింహస్వామిగారికి జయనమోవాకము అర్పించు చున్నాఁడను. ఈ గ్రంథము ప్రపంచమునందంతట భక్తి విశ్వాసముల పాదుకొలిపి, పెంపొందింపఁ జేయుఁగాతమని ప్రార్థించుచున్నాఁడను.

యం. బి. రేగే.

(ఆంగ్లమూలమునకుఁదెనుగు తర్జుమా) -రచయిత)

## ప రి చ య ము.

" శ్రీ సాయీనాథ బోధామృతము " (శ్రీసాయీబాబా అభయప్రదానములు - సూక్తులు) అను ఈ గ్రంథము అఖిల భారత సాయీసమాజ సంస్థాపకులు పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారు ఆంగ్లమున రచించి ప్రచురించిన Gospel of Sai Baba (Sri Sai Baba's Charters and Sayings) అను కృతికి ఆంధ్రీకృతి. దీనినిఁదెనిగించిన వారు శ్రీ బాపట్ల హనుమంతరావుగారు.

శ్రీ హనుమంతరావుగారు ఈగ్రంథమునే 1960 లో "శ్రీసాయీ కరుణ" అను పేర రచించి ప్రచురించిరి. అది సంపూర్ణముగ లేక గద్య పద్యాత్మికముగనున్న కారణమున ఆంధ్రసోదరీ సోదర భక్తులకు సులభ గ్రాహ్యముగాక యున్నది. ఇపుడు శ్రీ సాయీబాబా 50వ మహాసమాధి స్వర్ణోత్సవ స్మృతి చిహ్నముగ అఖిల భారత సాయీసమాజము మైలాపూరు - మద్రాసువారి ప్రేరణమున వీరు సంపూర్ణముగఁ దెనిగించి,

దక్షిణ భారతముననేగాక భారతదేశమున, ప్రపంచముననంతట శ్రీసాయీ భక్తి ప్రచారము గావించిన పూజ్యశ్రీ. బి. వి. నరసింహస్వామిగారికి దీని సంకితము గావించిరి. ఇది గ్రంథరూపముననున్న 'శ్రీసాయీబాబా' యని పాఠక శ్రోతలు గుర్తింపనగును.

ఈ గ్రంథము సరళమైన తెనుఁగు వచనమున రచింపఁబడుటచే ఆంధ్రసోదరీ సోదర భక్తులు శ్రీ సాయీబాబా అభయ ప్రదానములను సూక్తులను బాబా తన అంకిత సంతతిని చక్కదిద్దిన విధానములను గుర్తించి, యనుసరించి, తమతమ జీవితములను సార్థకము చేసికొందురని ఆసించు చున్నాఁడను.

ఈ కృతిని రచించిన శ్రీహనుమంతరావుగారినిఁగూర్చి నేనిచట ప్రత్యేకించి తెలుపఁదగిన పనిలేదు. 1957 నుండి వీరు రచించి ప్రచురించిన బాబా భక్తి ప్రచార రూపములగు గ్రంథములు – (శ్రీసాయీలీలా ప్రచురణములు) 'సాయీసుధ' యందు ప్రచురింపబడుచున్న వ్యాసములే నిదర్శనములు.

ఆంధ్ర సోదరీ సోదర భక్తులెల్లరీ గ్రంథము నాదరించి, పఠించి, తమ తమ జీవితములను ధన్యము చేసికొందురుగాతమని, యీ గ్రంథ రచయితను పాఠక శ్రోతలను శ్రీ సాయీబాబా సర్వవిధముల అనుగ్రహించి రక్షించుగాతమని ప్రార్థించు చున్నాఁడను.

డి. భీమారావు.

*President :*

**All India Sai Samaj,**

Mylapore, MADRAS.

ఓమ్
నమః శ్రీకృష్ణాయ భగవతే
శ్రీ సాయీ సద్గురవేనమః

# విజ్ఞప్తి

సోదరీసోదర భక్తులార !

శ్రీ సాయీ మహాప్రభువు 27—12—1944, వేకువజామున స్వప్నమున గోచరించి, తన ఆస్థానమునకుఁ జేరఁబిలిచి ఏవియో రచింపుమని ఆజ్ఞాపించుటయు, మఱునాఁడు 28-12-'44న పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారిని చీరాలలో సందర్శించి వారి యాశీస్సులఁబడసి వారి ఆనతి ప్రకారము బాబానుగూర్చిన కృతుల రచించుట మొదలగు విషయములు "శ్రీ సాయీ మననము" "శ్రీ సాయీ కరుణ" గ్రంథములలోఁ దెలుపుకొని యుంటిని. శ్రీ సాయీనాథుఁడు పూజ్యశ్రీ నరసింహస్వామిగారిద్వారా వీనినొక ఉపకరణముగ వినియోగించుకొనుచున్నాఁడు.

గురువర్యుఁడైన నరసింహస్వామిగారు ఆంగ్లమున రచించిన Sri Sai Baba's Charters and Sayings. అను గ్రంథమును "శ్రీ సాయీకరుణ" అనుపేర రచించి 1960 లో ప్రచురించితిని. బాబా అభయప్రదానములు - సూక్తులు సత్యస్మరణీయములను తలంపున కొంతభాగము పద్యరూపమున కొంత వచన రూపమున రచించుట జరిగినది. పలువురు సోదరభక్తులు గ్రంథమంతయు వచన రూపమునున్న బాగుండెడిదని వారి అభిప్రాయముఁదెలిపిరి. వారి ఆశయముఁ దీర్చుపని బాబాకే విడిచిపెట్టితిని.

3-5-1963న శ్రీ యస్. శేషాద్రిగారు ( Hon' Secretary A. I. S. S. Mylapore, Madras.) "శ్రీ సాయీబాబా 50వ మహాసమాధి స్వర్ణోత్సవ స్మృతి చిహ్నముగ Sri Sai Baba's Charters and Sayings వీలైనన్ని భాషలలో అనుభవదింపించి ప్రచురించ వలయు

నని మన సమాజమువారు సంకల్పించినారు. మీరీ గ్రంథమును తెనుఁగు వచనమున రచించి ప్రచురించు పని పూనఁగలరా? యని (వయస్సు కారణముగ) సందేహించు చున్నాఁడను" - అని ఉత్తరము వ్రాసినారు. సమాధానముగ "నాయనా! ఇదినీ - నా సంకల్పముకాదు, బాబా సంకల్పమే. "శ్రీ సాయి కరుణ"ను పఠించిన సోదరభక్తులు పలువురీ గ్రంథము పూర్ణముగ తెనుఁగువచనమున నుండిన తేలికగ అర్థ మగునని తెలిపినారు. తన బిడ్డలకోరికను బాబా అనుగ్రహించినాఁడు. ఇది బాబా ఆజ్ఞగా శిరసావహింతును" అని, తెలిపి ఈ పనికిఁ బూను కొంటిని. బాబా కరుణలేక ఆకేని అల్లాడదుగదా! ఈ 5 నెలలలో బాబా యీ పని పూర్తి కావించినాఁడు.

ఈ కృతికి "శ్రీ సాయినాథ బోధామృతము" అను పేరెం తయుఁ దగునని, బాబా అభయ ప్రదానములు - సూక్తులు ఎల్ల దేశముల - ఎల్లకాలముల - ఎల్లరు చక్కగ గ్రహించి అనుసరింపఁ దగినవి. కావున ఇది అమృతస్వరూపమగు బోధ - బాబా ఎటుల అమృత స్వరూపుఁడో ఆ స్వామి బోధయు అమృతమే. ఇందు బాబా తన ఆశ్రితులను పురస్కరించుకొని కావించిన బోధలు - పలికిన పలుకులు వారి మాత్రమే నిర్దేశింపఁబడినవిగ తలపరాదు. ప్రతిభక్తుఁడు తనకుఁదెలుపఁబడినవిగ పాటింపదగును. శ్రీమద్భగవద్గీతలవలె ఈ గ్రంథము నిత్యము పఠించి స్మరింపఁదగినది. ఇందు బాబా నిర్దేశించిన మార్గమనుసరింపఁదగినది.

పూజ్యశ్రీ నరసింహస్వామిగారు మహర్షుల సాంప్రదాయము నకుఁ జెందినవారు. పెక్కువ్యయ ప్రయాసలకోర్చి భౌతికముగ సాయి బాబాతో అత్యంత సన్నిహిత సంబంధముగల భక్తులను గలిసి, వారివారి యనుభవముల నేర్చి కూర్చుటయేగాక "సాయిలీలామాసిక్" (మరాటీ) పత్రికలలో ప్రచురింపఁబడిన వివిధాంశములను సమగ్రముగ సేకరించి వీని నన్నిటిని ఏర్చి కూర్చి ఆంగ్లభాషలో Life ot Sai Baba, Sri Sai Baba's Charters and Saying మొదలగు గ్రంథముల రచించినారు. ఇట్టి మహనీయు నిస్స్వార్థ సేవకావించి బాబా భక్తులందఱకు మహోపకారము

బాబాయొక్క దివ్యవ్యక్తిత్వము ఈకృతి రూపమున మూర్తీభవింపఁజేయఁజాలిన శ్రీ నరసింహస్వామిగారి ప్రేమ ప్రపూర్ణకృషి కెవ్వరును తగినరీతిఁ గృతజ్ఞతఁ దెలుపుకొనఁ జాలరు. గురుదేవుఁడగు శ్రీసాయీ మహాప్రభువునకు - బాబా యొక్క వ్యాసుడైఁన శ్రీనరసింహస్వామిగారికి జయనమోవాకము లర్పించు చున్నాఁడను. ఈ గ్రంథము ప్రపంచమునందంతట భక్తి విశ్వాసముల పాదుకొలిపి, పెంపొందింపఁ జేయుఁగాతమని ప్రార్థించుచున్నాఁడను.

యం. బి. రేగే.

(ఆంగ్లమూలమునకుఁదెనుగు తర్జుమా) -రచయిత)

## ప రి చ య ము.

" శ్రీ సాయీనాథ బోధామృతము " (శ్రీసాయీబాబా అభయప్రదానములు - సూక్తులు) అను ఈ గ్రంథము అఖిల భారత సాయీసమాజ సంస్థాపకులు పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారు ఆంగ్లమున రచించి ప్రచురించిన Gospel of Sai Baba (Sri Sai Baba's Charters and Sayings) అను కృతికి ఆంధ్రీకృతి. దీనినిఁదెనిగించినవారు శ్రీ బాపట్ల హనుమంతరావుగారు.

శ్రీ హనుమంతరావుగారు ఈగ్రంథమునే 1960 లో "శ్రీసాయీ కరుణ" అను పేర రచించి ప్రచురించిరి. అది సంపూర్ణముగ లేక గద్య పద్యాత్మికముగనున్న కారణమున ఆంధ్రసోదరీ సోదర భక్తులకు సులభ గ్రాహ్యముగాక యున్నది. ఇపుడు శ్రీ సాయీబాబా 50వ మహాసమాధి స్వర్ణోత్సవ స్మృతి చిహ్నముగ అఖిల భారత సాయీసమాజము మైలాపూరు – మద్రాసువారి ప్రేరణమున వీరు సంపూర్ణముగఁ దెనిగించి,

# విషయ సూచిక

| విషయము. | పరిచ్ఛేదము - సంఖ్య |
|---|---|
| ద్వారకామాయి (మసూది ఆయి) రూపమున | |
| బాబా అభయప్రదానములు- | 1-8 |
| శ్రీసాయిబాబా అభయప్రదానములు. | 9-52 |
| బాబా నియమములు. | 53-57 |
| బాబా సూక్తులు. | 58-65 |
| బాబా సర్వవ్యాపకత్వము. | 66-73 |
| బాబా - ఇతర సాధువులు. | 74-89 |
| బాబా - కార్యములు. | 90-107 |
| ఆత్మవిచారము. | 108-109 |
| భేదము అసత్యము. | 110-112 |

## మోక్ష మార్గము.

| | |
|---|---|
| సంసారము | 113 |
| సత్యసుఖము (లేక) ఆనందము. | 114-115 |
| సంసారమున వర్తింపఁదగు విధము | 116 |
| భక్తి - నవవిధభక్తి - | 117 |
| జ్ఞానము - భక్తి | 118 |
| I నీ వెవఁడవు? ఎందున్నాఁడవు? | 119 |
| II నేనెవఁడను? మన మెవరము? | 120 |
| III మనమెఱుఁగవలసినది ఆత్మ మాత్రమే. | ,, |
| IV నీవెవఁడవో ఆలోచించుకొనుము. | 121 |
| V. దైవ మెవరు? అతఁడెట్లుండును? | 122 |
| అతఁడెక్కడనున్నాఁడు? దైవమునెట్లు చూడఁగలము? | 123 |
| మోక్షమును పడయుట ఎట్లు? | ,, |

## నైతిక బోధలు - చక్క దిద్దుట.

## సంపదలయెడ బాబా నిర్లక్ష్యము.



## నైతిక బోధలు

శక్తులు — సమర్థతలు



అగ్నిని ఆధీనమందుంచుట.

అద్భుతములు—భవిష్యత్ జ్ఞానము—భేదము

## అంతర్జ్ఞానము - (ఋతంభరప్రజ్ఞ)

(a) హన్సిరాజ్ (b) టిప్నీస్‌సతి

భవిష్యత్తు నెఱుఁగుటవలన లాభములు



బాబా పూర్వవృత్తాంతములు



జన్మ జన్మముల గురువు భక్తులు ననుసరించుట



ఋణానుబంధము

ఋణ బంధమునఁజేసి జనులను
బాబా తనదరికాకర్షించువాఁడు-

IV బాబా - బిడ్డలను ప్రేమతో కనిపెట్టి రక్షించుట



V బాబా - భక్తులవిషయమై ఆలోచన



VI సహాయములు-సంతతిననుగ్రహించుట



VII భక్తుల సంసార విషయముల బాబా సహాయము.



VIII వ్యాపారమున సహాయము.



IX భక్తుల ప్రేమకు లొంగి బాబా తనపూజకు

X భక్తులయెడ బాబా జాగరూకత



XI బాబా జాగృతి - భవిష్యత్ జ్ఞానము



XII బాబా తనభక్తుల అధిపతి - యజమాని



బాబా సర్వతంత్ర స్వతంత్రత

## బాబా నిర్ణయము



## వి వి ధ ని య మ ము లు

ఓమ్

నమః శ్రీ కృష్ణాయ భగవతే

శ్రీ సాయీ సద్గురవేనమః

# శ్రీ సాయీనాథ బోధామృతము

## ( శ్రీ సాయిబాబా అభయ ప్రదానములు – సూక్తులు )

★ ద్వారకామాయీ రూపమున బాబా అభయ ప్రదానములు

1. నీవుచేరి కూర్చున్న యిది-మన "ద్వారకామాయి" తన బిడ్డల అపాయములను, కష్టములను తొలగింప సమర్థమైనది. ఈ మసీదు ఆయి మిక్కిలి దయామయి, తన్ను నెఱనమ్ము బిడ్డలికీమె అనుఁగుతల్లి. వారు ఆపదలలోనున్న ఈమె రక్షించును. ఒకపరి నీమె అంకమునఁ జేరిన వాని కష్టములన్నియుఁ దొలఁగిపోవును. ఈమె నీడయందు విశ్రమించువాఁడు అవ్యయానందము పడయును.

2. ద్వారకామాయి బిడ్డలగు వారిని సర్పమేమి చేయఁగలదు? సర్పము కనఁబడెనేని వారు దానిని వినోదముగఁ జూతురు. ద్వారకామాయి రక్షణమున నున్న వానిని సర్పము తాకఁగలదా ?

3. మనము భయపడవలసిన పనిలేదు. తాకుము! నీవెటుల తాకి చంపగలవో చూచెదఁగాక! (అని ద్వారకామాయి కేకపెట్టును.)

(చూ 26, 473)

4. ఇది మసీదుకాదు. ఇది ద్వారక. ఈమెశరణు పొందిన వారెన్నడు ఆపదల పొల్పడరు.

5. ఈ మసీదునందలి మెట్లెక్కినవాని పూర్వ కర్మజనితములైన బాధలన్నియు తుదిముట్టి సుఖ సంతోషములు ప్రాప్తించును. ఆ ఫకీరు - భగవానుడు మిక్కిలి దయామయుడు. మీ కష్టములను తొలగించును.

6. ఈ ద్వారకామాయిని ప్రవేశించెనేని వాని గమ్యము (సంకల్పము) సిద్ధించును.

7. ఈ ప్రదేశము (ద్వారక) తారణము-జనులను రక్షించునది. కాని, మారణము-చంపునదికాదు.

## ద్వారకామాయి - మసూది అయి - ద్వారకామాయియే - సాయి

8. నేనేమియు చేయను-నేను దేనిని స్వీకరింపను. దత్తస్వామియే తన సొమ్మును తా నడుగుచున్నాడు. తనకు చెందవలసిన 15 రూపాయలు రాబట్టుకొని మసూది ఆయికి ఇచ్చినాడు. కావున ఆ ధనము (నాచే) స్వీకరింపబడెను.

## బాబా అభయ ప్రదానములు.

9. నా (జాగరూకత గల) దృష్టి యెల్లప్పుడు నన్ను ప్రేమించువారిమీందే ప్రసరించును. నీవేమి చేయుచున్నను, నీవెక్కడనున్నను నీవు చేయు ప్రతికార్యము నేనెఱుంగ జాలుదును అను విషయము నీవు గుర్తించుకొనుము.

10. నన్ను ధ్యానించుచు, నా నామము స్మరించుచు నా లీలల కీర్తించుచుండువాడు నా యనుభవము పొందగలడు. వాని సకల కర్మములు విడిపోవును. నేనెల్లవేళల వానివెంటనే యుందును.

11. ఎల్లప్పుడు నీవు సత్యమార్గముగ సంచరింపుము. నీవెక్కడనున్న నెల్లవేళల నిన్ను విడనాడక నీ వెంటనుందును.

12. నీ వెప్పు డెక్కడ నన్ను తలచిన పైశమ నీదరిఁ జేరుదును. నీవు భయపడవలసిన పనిలేదు.

13. అనన్య భక్తితో నన్ను చింతించుచు నన్ను శరణొందిన వానికి నేను ఋణపడిన వాఁడను. నాతలనైన వెచ్చించి వానిని రక్షించి తీరుదును.

14. నాయం దెల్లపుడు మనస్సు నిలిపి, నాకు ముందుగ సమర్పింపక యే లవమేనియుఁ జవి చూడని వానికి, నాయందు ప్రేమ విశ్వాసములఁ బలుపుచు నాకొఱకై క్షుత్పిపాసలుగని, యితర మేదియు లెక్కిడకుండు వానికిని నేను బానిసీడ నగుదును.

15. నేను భక్తపరాధీనుఁడను. నాభక్తుని చేఁజిక్కిన సేవకుఁడను నేను భక్తిని ప్రేమింతును.

16. కాంతా పుత్ర జననీ జనకాప్త బంధు మిత్రాదుల నుండి హృదయమును మరల్చి నన్ను ప్రేమించువాఁడే నా యథార్థ భక్తుఁడు. సముద్రమును జొచ్చు నదివలె అట్టివాఁడు నాయందు లయమగుచున్నాఁడు.

17. సా. బా.:- నా ధనాగార బీగమిపుడు నీ చేతులం దుంచితిని. నీకు కావలసినది కోరుకొనుము. నెలకు రు. 5 లేక రు. 100 లేక యేమి కావలయునో కోరుకొనుము. నేను నీకిచ్చెదను.

భక్తుఁడు:- (యం. బి. రేగే) నాకేమియు వలదు.

సా. బా:- ఏదైన కోరుకొనుము. నీకీయ నభిలషించుచున్నాఁడను.

భక్తుఁడు:- నేను కోరినదేమైన నిచ్చుటకు సమ్మతించినట్లేనా?

సా. బా:- సందేహమేమి? తప్పక యిత్తును.

భక్తుఁడు:- అట్లయిన, బాబా! నా కోరికయిది. ఈ పుట్టువున, ఇంక ముందు నాకుఁగలుగనున్న మఱియే పుట్టువు నందైన నీవు నన్ను విడిచి పోవలదు. నీవు నా తోడనే యుండవలయును.

స్వా. బా:- తప్పక-నీవెటుల నన్నను-ఏమి చేయుచున్నను నీలోన-నీ వెలుపల-నీతోడనుందును.

18. నా భక్తుఁడు నీయందు-తనయందు-సకల భూతము లందు నన్నే గుర్తించును. సకలమును తన గురువుగఁ జూచును. వాఁడు నా అనుభావమును (సాదృశ్యమును) పొందును.

19. నీసకల సంకల్పములకు నన్నే కైక లక్ష్యముగఁ జేసి కొంటివేని నీవు పరమార్థముఁ బడయఁ గలవు. నన్నుచూడుము! నేను నిన్ను చూతును. నీ గురువును గాఢముగ విశ్వసింపుము. అదియే సాధనము. సకలదైవములు గురువే.

20. నిండు మనస్సు నాకర్పించి, నాయందు విశ్రమించు వాఁడు, తన దేహమును గూర్చియేని, తన ఆత్మనుగూర్చికాని భయపడ వలసిన పనిలేదు. నన్నొక్కనినే చూచుచు, నన్ను గూర్చియే వినుచు, పలుకుచు నాయందే భక్తి సలుపువాఁడు (చైతన్యమును) దైవమును పొందును. నిత్య శుద్ధబుద్ధునిగ నన్ను సేవించువాఁడు నన్ను జేరును.

21. నిరంతరము నా నామము స్మరించువారు వారిగమ్య మును జేరుదురు.

22. ఉప్పొంగు హృదయముతో 'సాయీ'-'సాయీ' అని యీ రెండక్షరముల మాత్రమే స్మరింపుము. నీ బాహ్యాడంబరములతో నాకు పనిలేదు. అట్టి భక్తులయందే నేనధి వసింతును.

23. నానామము జపింపుము. నన్ను శరణు పొందుము 'నేనెవఁడను?'-అని తెలిసికొనుటకు శ్రవణ మనసములఁ గావింపుము.

24. నేను నిరాకారుఁడను. సర్వ వ్యాపిని.

25. తన భారముల నాపై నిలిపి, నన్ను చింతించు వానిని సర్వవిధముల ఆదుకొని రక్షింతును.

## "యోగక్షేమం వహామ్యహమ్"

26. సత్యము! నీ సకల భారముల నాపై నిలుపుము.

27. నాభక్తునియింట తిండి గుడ్డలకు కఱవు కలుగదు.

28. భక్తులు మీరు నాబిడ్డలు. నేను మీ తండ్రిని. ప్రతి వస్తువు నావలన మీరు పొందవలయును. (సాయి దేవుఁడు కాఁడు అని)- అటుల మీరు పలుకరాదు.

29. నీవాందోళనఁ జెందనేల? నీ సకల బాధ్యతల నేనే వహింతును.

30. ఊరక కూర్చుండుము! (ఊగేమూగే) అవసరముల నేను తీర్చెదను. నిన్ను గమ్యమునకుఁ జేర్చెదను.

31. బాబుగిర్! పొమ్ము సకలము సమకూర్పఁబడును. గాణా! నేను నీకు సమకూర్తును.

మాన్కర్ పుత్రులకెట్టి లోటును కలుగనీయను.

## అభయం—మా భై:

32. నీవు భయపడనేల? (నీవు విశ్రమింపఁబోవు చోట) నే నచట లేనా?

33. ఇక్కడనుండుము. దీనిని నీ గృహముగ భావింపుము గవర్నరు బల్లెము చేబూని దాదాను (జి. యస్. కపర్దే) పొడువ వచ్చెను. నేనాతని ప్రతిఘటించి తరిమి వైచితిని. తుదకతని సమాధాన పఱచితిని. నేనిక్కడనుండ నెవరేని ఏల భయపడవలె?

34. ఈబిడ్డ నిదురించు నపుడు మనము ప్రక్కన నిలిచి జాగ్రత వహించి, కాపుండి శ్రమపడవలయును. "ఏషసుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః"

35. నా భక్తులను ఆపదల పాల్పడనీయను. నా భక్తులం గూర్చి యోజించు చుండవలెను. నావాడు కూలనున్న తజి నాచేతుల- నా నాలుగు చేతుల (అనంత కరముల) ఒక్క మాఱుగం జాచి ఆదు కొందును. నా భక్తుండగు వానినే తరుణమందునంబడనీయను.

"ఏ సమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ
కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి నిశ్చితమ్"

36. నేను దాని (కప్ప) తండ్రిని, ఇక్కడ నుంటిని, దానిని ఆ సర్పమునోటం బడనీయుదునా? దాని నెట్లు విడిపింతునో చూడుము! ఓయీ! వీరభద్రప్పా! నీ ద్వేష బుద్ధికి సిగ్గుపడుము. ద్వేషము విడువుము.

(సర్పము కప్పను విడిచెను) నేనిచ్చిన మాటను నిలుపుకొని కప్పయైన బసప్పను సర్పమైన వీరభద్రప్పనుండి రక్షించితిని. నన్నిట కుంబంపి దైవమాతని రక్షించినాడు.

37. నీ బాధలను తొలగించుటకై నీకొఱకు నేను బాధపడ వలసి వచ్చినది – చూడుము!

నిన్ను మృతి నొందనీయను, నిన్ను (నందరాము) మృతి నొందనీయుటకు ముందుగ, నేనే మరణింతును. (నందరామ్ 1918 తరువాత చాలకాలము జీవించినాండు.)

'నానా' ప్రాణాపాయ స్థితియందున్న వాండు. కాని నేను మరణింప నీయుదునా? (535 A)

ఫకీరు (భగవానుండు) బాబా సాహెబును (జి. యస్. కపర్దే) చంపందలచినాడు. కాని, నేనది సాధ్యపడ నీయను.

ఓ అన్నా! నేనొక్క నిముసమాలసించితినేని ఈతండు (యస్. బి. నాచ్నే) మరణించెడివాండు, ఆ పిచ్చివాండతని కంఠమును గూడ పట్టుకొనినాండు. కాని, నేనాతని దూరముగ గెంటి వైచితిని.

ఏమి చేయవలె? నావాని నేను రక్షింపఁ నేని ఇంక రక్షింపఁ జాలు వారెవరు?

38. అతడు నావాఁడు, నాకే చెందిన వాఁడు. వానిని తరింపజేయుటకు నేనే బాధ్యత వహించి తీరవలె. నాకంటె వానికిం కెవరు గలరు?

39. (కలరా పిశాచి తరిమి వేఁయబడిన తరువాత) నీ విప్పుడు భద్రతఁగంటివి - పొమ్ము!

40. రేయింబవళ్ళు నా బిడ్డలఁగూర్చి మఱీ మఱీ యోజించు చుందును. వారిని పేర్వేర పలుమాఱులు గణింతును.

(యస్. బి. ధుమాల్ తో) భావూ! రాత్రియంతయు నిద్ర యెట్టిదో నేనెఱుగను. నిన్ను గూర్చియే తలంచుచు తలంచుచు పరుంటిని.

ప్రతి పదమున నిన్నుగూర్చి జాగ్రత పడవలసి వచ్చినది. లేకున్న ఏమైయుండెడిదియో! ఆ దైవమునకే యెఱుక!

41. ఏ వేళయందును నేను నావానిని మఱువను. అతఁడు రెండువేల మైళ్ళ దూరమునందున్నను అతనిని జ్ఞప్తియందుంచు కొందురు. అతనిని విడిచి నేనేమియు నారగింపను.

42. నాకెవరి యెడను కోపము లేదు. తల్లి బిడ్డలపై కోపము వహించునా? సముద్రము నదుల జలముల నా యా నదుల లోనికి త్రోసి వేయునా? నేను భక్తునిఁ బ్రేమింతును. నా భక్తులకు నేను సేవకుఁడను. భక్త పరాధీనుఁడను.

43. నా బిడ్డల నాకటి చిచ్చుచే నేనెట్లు బాధపడనీయుదును?

44. అయ్యలారా! రండి! సంచుల నిండుగ "ఊధి" గొని పొండు. మీ తల్లి ధనరాసులను బండ్లకెక్కించుకొని పొండు! ఇటు చూడుడు! జనులువచ్చి, బాబా! "మాకీయుము! మాకీయుము!" - అని కోరుదురు. తీసికొనుఁడని నేను చెప్పుదును. ఎవడు తీసికొనఁడు.

45. "అడిగినవారలకు లేదనక సమృద్ధిగ నీయుము" అని, నా గురుడానతినిచ్చెను. సద్బుద్ధితో నా మాటలు వినువారు లేరు. నా ధనాగారము తెరువఁబడియే యున్నది. ఎవ్వరు నా ధనమును బండ్ల కెక్కింపఁజూడరు. 'త్రవ్వుఁడీ! యని యందును. ఎవ్వరేమాత్రము శ్రమపడరు. "త్రవ్వి, వెలికిఁదీసి బండ్ల కెక్కించుకొని పొండు! మాతృ గౌరవమును నిలుపఁదగిన బిడ్డలు కండు! మీ కొట్లు నిండించుకొనుఁడు! మనమేమి కానుంటిమో! యిఁక?-ఈ జీవితమేమగునో? పృథివి పృథివిని, జలము-జలమును, అగ్ని-అగ్నిని, వాయువు-వాయువును, ఆకాశము-ఆకాశమును, జేరును. ఇట్టి మంచి అవకాశము మీకుఁగలుగఁబోదు" - అని చెప్పితిని.

"యాత్యేవ యమునా పూర్ణం సముద్రముదకార్ణవమ్
ఆత్యేతి రజనీ యాతు సా న ప్రతి నివర్తతే"

46. నా పలుకులందు గాఢ విశ్వాసముంచుడు! మీ ఆశయము సిద్ధించును.

ఈ సమాధియే శ్రీసాయి యెలుగు వినుచు

"చిరము పొంతరాత్మగ సాయి పఱఁగు ననుచు.

47. 15-10-1918 నాఁడు లక్ష్మణ్‌తో బాబా స్వప్నమున-"నేను మరణించితినని "జోగ్" తలంచుచున్నాఁడు. నేను జీవించియే యున్నాఁడను. రమ్ము! ప్రభాత హారతిఁ గావింపుము!"

48. నా రు. 1-4-0 లు నా కిమ్ము! (మజ్యా సవ్వా రూప్యా దేవో!)

49. నన్ను అనన్యగతి శరణొందిన వారిని - విడనాడక నా సమాధియే వారితో పలుకాడును.

50. ఈ సమాధినుండియే నేనెక్కుడు చురుకుగ బలముగ నా విధులను దీర్తును.

51. నా మహా సమాధి తరువాతనేని నీ వెక్కడ ఏ క్షణ మున నన్ను దలంతువో అక్కడ కాక్షణమున నిన్ను జేరుదును.

5 A. 23—8—1954న అహమ్మదాబాదునందు 'సి. సి. మానిక్వాలా' ఎదుటబాబా పొడమి యిట్లనెను.

"బాబా ఎల్లవేళల తనభక్తుల సమక్షముననేయున్న వాఁడు; సర్వవ్యాపియై తన భక్తులను ఈ విశ్వమును - శుభ్రమార్గమున నడిపించుచు, గమ్యమును జేరుటకు చక్కదిద్దుచు నున్నవాఁడు - అని బి. వి. నరసింహస్వామికి లేఖ వ్రాసి, తెలియఁజెప్పుము."

52. ప్రేమతో నా భక్తుఁడు నన్ను పిలిచిన మాత్రమున ప్రత్యక్ష మగుదును. నా ప్రయాణమునకెట్టి వాహనములు అవసరము లేదు.

## బాబా నియమములు

53. ఆశ్రితులగు భక్తుల లౌకిక పార లౌకిక ప్రయోజనము లను ప్రసాదించుటకు సాధు సత్పురుషులు పొలుతురు. దీనికై "డాక్టరు పిళ్ళై" యింక పది జన్మలు పొందవలసిన పని లేదు. ఆ బాధ యంతయు పది దినములలో సహింపబడును.

54. భక్తులకట్టి హితాభీష్టములను ప్రసాదించుటకే నేను వచ్చితిని.

55. ఆశీస్సులను ప్రసాదించుటే నా పని.

56. ఐహిక లాభములను - ఉద్యోగములను, ధనమును, సంతానమును, వ్యాధినివారణములను గోరి బాబాను ఆశ్రయించు జనుల నొక భక్తుడు నివారించెను.

సా. బా:- ఆ పని చేయకుము! నావారు మొదట ఆ తలంపు తోడనే నన్ను జేరుదురు. వారి హృదయ కామితములను పొందుదురు. జీవితముల సుఖ సంతోషములఁ బడయుదురు. అపుడు వారు నన్ననుసరించి పురోగమింతురు. పలు విధములగు కారణముల నావారిని దూరదూరముల నుండి నా దటికి నేనే ఆకర్షింతును. నేనే యేరికోరి వారిని నా దాపునకుఁ జేర్చుకొందును. వారంతట వారురారు. నేనే నా దటికి వారినిఁ జేర్చుకొందును. ఎంతెంత దవ్వుల-వేలకొలఁది మైళ్ళ దూరమున నేని వారున్నను, పిట్టల కాళ్ళకు త్రాళ్ళు గట్టి తమ దటికి లాగుకొను విధమున - నేనే వారిని నా చెంతకుఁ జేరదీయుదును.

57. ఈతఁడు బ్రాహ్మణుఁడు, స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడు, పరమ పవిత్రుఁడైన బ్రాహ్మణుఁడు. ఈ బ్రాహ్మణుఁడు. లక్షల కొలఁది జనులను శుభ్రమార్గమున నడిపించి, గమ్యమునకు - సచ్చిదానందధామమునకుఁ జేర్చగలఁడు. ఇది బ్రాహ్మణ మసీదు.

## బాబా సూక్తులు

(సహజ స్వభావ - శక్తి - సామర్థ్య సూచకములు) బాబా సహజస్థితి.

58. నేను దైవమును. (అల్లా) నేను మహాలక్ష్మిని ఈ మసీదునఁ గూర్చున్న నేను సత్యమును పలుకుదును.

[పండరియందు విఠొబాను - నేను] హొమ్మ! నేను పండరియందున్నాఁడను. (నా. గో. చం.)

[నేను గణపతిని] అమ్మా! గణపతికి నీవు సమర్పించినవన్నియు నాకుఁజేరినవి.

[నేను దత్తాత్రేయుడను] నీవు గర్వించుచున్నావా? పురుష సంతతిఁబడయు అదృష్టము నీకెక్కడ కలదు? (గంగాపురమున దత్త స్వామి సన్నిధి నీవు కావించిన ప్రార్థనల ఆదరించి) ఈ తనువునుచీల్చి, నీకు పుత్రుని ప్రసాదించితిని.

[నేను లక్ష్మీనారాయణుఁడను] గంగ కొఱకు నీవెక్కడకో పోనేల? నా పాదముల దటి దోసిలిని పట్టుము. ఇక్కడే గంగ ప్రవహించును.

నీ ధ్యాన నిష్ఠయందు ఈ (సాయీ) మూర్తినిఁ జూచిన నేమిః? లేక, లక్ష్మీనారాయణ రూపము జూచిన నేమి?

[నేను మారుతిని] నాతండ్రినన్ను మారుతికి అంకితముఁ గావించెను. నేను మారుతి దేవాలయమునకు ముందు నిలిచి, నేనాతని సోదరుఁడనని సైగలు చేయుచుందును.

59. (నేను శ్రీకృష్ణుఁడను) (ద్వారకామాయి యందుండి)

సా. బా:- (ఉద్ధవేశ భావ్‌తో) రు 11-0-0 లు దక్షిణ నాకిమ్ము!

ఉ. భా:- నా పది యింద్రియములు - మనస్సు నర్పించితిని.

సా. బా:- కాదు. వానినిచ్చుటకు నీవెవఁడవు? ఇంతకుమున్నే అవి నాకుఁ జెందినవి. పారాయణము చేయుము.

ఉ. భా:- ఏ పురాణమును?

సా. బా:- నేను పూర్వము బోధించినది - నేటికిని నేను బోధించు చున్నది యేదో - ఆపురాణమును.

ఉ. భా:- అది గీతా? - జ్ఞానేశ్వరియా?

సా. బా:- పొమ్ము! బాపూసాహెబ్‌జోగ్ చదువుచున్న దానిని తెమ్ము! జోగ్ దగ్గఱనుండి భాగవతము - ఏకాదశ స్కంధమును ఉద్ధవేశభావ్ తీసికొని వచ్చెను.

సా. బా:- (అదాటున తన ప్రేలా గ్రంథముం జొనిపి, తెఱచి,) దీనిని చదువుము! (అది కృష్ణోద్ధవ సంవాద ఘట్టము) నిత్యము దీనిని పఠింపుము. నా పదసన్నిధిం జేరి, చదివినది మననము చేయుము!

(గమనిక - ఆ ఏకాదశ స్కంధ మననమే హృదయ స్థాయి యైన శ్రీ కృష్ణసాయికి - బాబాకు 11 రూపాయల దక్షిణ సమర్పణము)

60. (రోహిల్లాతో) అదంతయు (వివిధ దైవములు) "అల్లా" అగును.

61. ప్రశ్న:- బాబా! నీ వెవండవు? ఎందుందువు?

సా.బా:- (అద్వైతస్థితిలో) నేను నిరాకారుండను. సంపూర్ణుండను. నిర్గుణుండను. నాకొక పేరులేదు - నివాసము లేదు. (మరల ద్వైత భావమున) కర్మచే బద్ధుండనై ఒక దేహమునం జేరితిని. (కావున) ఒకపేరు-నివాసము పొందితిని. నా పేరు - 'దేహి' ఈ ప్రపంచము నా నివాసము. బ్రహ్మము నా తండ్రి. మాయ నా తల్లి. వారి కలయిక వలన ఈ దేహముం బొందితిని. ఈ విశ్వము అశాశ్వతము పరిణామము - మార్పు - పొందునది.

62. నేను పర్వర్దిగర్ (దైవము) అగుదును. నేను శిరిడి యందును. ఎల్లయెడల నుందును.

నా వయస్సు లక్షల సంవత్సరములు, నా పని ఆశీస్సులు పలుకుట, సమస్త వస్తువులు నాకుం జెందినవే, ప్రతి వస్తువు - ప్రతి జీవికిని నేనే యిత్తును.

63. నేను గంగాపురమున, పండరిపురమున, ఎల్ల ప్రదేశములం దున్నాను. ఈ విశ్వమునంగల ప్రత్యణువునందు నేనున్నవాండను.

64. ఈ విశ్వము సర్వము నా యందున్నది.

65. నీవు గాఢముగ ప్రేమించి సేవించు వానియందే హత్తుకొని యుండుము, దైవము నిన్ను వేగము రక్షించును.

65A. సా. బా:- (శంకరరావ్ గొహంకర్‌తో) వారికి బాధాకరములైనవి అనేకములు గలవు. నా దగ్గఱ నున్నంతవరకు ఆ కష్టములచే వారు బాధపడరు. బాధ కలిగించు వారిని దైవము శిక్షించెను. దైవము మంచి చేయువారిని రక్షించి తోడ్పడును. చెడు చేయువారిని శిక్షించును.

## సర్వ వ్యాపకత్వము

66. నేను నిరాకారుండను ఎల్లెడల నున్న వాండను. నేను ప్రతి వస్తువు నందు నున్నవాండను. నేను ప్రతి పదార్థమున దాని కావలనున్నవాండను. నేనాకాశమున తట నిండియున్న వాండను.

నీ దృష్టి గోచరమగునది సకలము నేనే. నేను చలింపను - కదలను.

67. ఈ దృశ్యము సమస్తము నా ఆకారమే; చీమ, ఈగ, రాజు, పేద.

68. నేను జలముల, స్థలముల, అడవుల, జనసమూహముల, అరణ్యముల, ఎడారుల నున్నాండను. అగ్నియందుంగలను. ఆకాశమునంగలను. ఏ ఒక్కతావుననకే నేనంటికొని యుండలేదు.

69. ఆకలినొందు కుక్కకు అన్నము పెట్టుట నన్ను భుజింపంబెట్టుటయే. దాని ఆకలితీరిన నా ఆకలి శమించును.

సా. బా:- (లక్ష్మీబాయ్ సిందేతో) అమ్మా! నాకు ఆకలిగనున్నది.

ల. సిం:- బాబా! నేను వెళ్ళి ఆహారము తీసికొనివత్తునా?

సా. బా:- తీసికొనిరమ్ము !

లక్ష్మీబాయి సింధి పళ్ళెరములో ఆహారముఁ గొనివచ్చెను. బాబా అందేమియుతినక దాపుచేరిన కుక్కముందా పళ్ళెరముంచెను.

ల. సిం;- బాబా! నీకొఱకు తెచ్చిన దాకుక్కకు పెట్టితివేమి?

సా. బా:- అమ్మా! ఆ కుక్కయు నొక జీవికాదా? మనము చెప్పుకొందుము. అది చెప్పుకొనలేదు. అదియుఆకలి నొందినది. అదియు నేను ఒకరమ - అభేదము. నేను తినిన అదితినిన ఒక్కటే.

70. ఈ ఉదయము నీవు కుక్కకిడిన ఆహారమున నేనింకను త్రేన్చుచున్నాను. ఆ బురద గుంటలో పడియున్న పందిని నేనే. (నీదగ్గఱకు వచ్చినను దానికేమియుఁదిన నిడవైతివి! - (బొంబాయి కాంతతో) నన్ను సేవింపఁ దలతువా - భేదబుద్ధిని విడువుము!

71. ఒక్కొక్క వేళ కుక్కగ - ఒక్కొకతఱి పందిగ - నేను వత్తును. ఏ భక్తుఁడు ప్రతి జీవియందు నన్ను గుర్తించి, తగిన రీతిని ఆదరించునో ఆతఁడనుగ్రహింపఁబడును.

72. సా. బా:- నానా! నాతో 18 సంవత్సరములనుండి యున్నాఁడవు. ఈ 3½ మూరల దేహమునందున్నవాఁడే 'సాయి' అనియేనా నీవు గ్రహించినది? నేను చీమయందు, ఈగయందు నున్న వాఁడను. (బాబా ఏదోసైగచేసి) ఈగుర్తు నీవు గమనించినపుడెల్ల నే నందుంటినని జ్ఞప్తియుందుంచుకొనుము! చీమలుగ, ఈగలుగ నీవిడు ఆహారము స్వీకరించఁగలననియు తెలిసికొనుము. (చూ. 199)

72A. ఈ శరీరము నా గృహము మాత్రమే. ఈ యింటి నుంచి నన్ను నా గురు దేవుఁడేనాఁడో యెత్తుకొని పోయెను.

73. ఈతని (హన్సిరాజ్) రక్షించుటకై, ఆతఁడెంత ద్వేషించు కొనుచున్నను ఒక పిల్లిగ వెళ్ళి అతఁడు దాచిపెట్టుకొనిన పెరుగును త్రాగుచుంటిని. ఈ నాఁడీతఁడు నన్ను కఱ్ఱతో కొట్టినాఁడు.

ఆ నల్లకుక్క నేనే యగుదును. ఆ రోగియైన శూద్రుడను నేనే. ప్రతి వస్తువునందు దాని కావల, నంతట నేనున్నాఁడను. బొంబాయిలో నిన్ను యాచించిన ఫకీరును నేనే.

అర్ధరాత్రిమున ఆ చెట్టుక్రింద నీవుచూచిన భూతము నేనే. [నేను అకల్‌కోట మహారాజును] నేను నీకు 2 రూపాయలు ఇచ్చితిని.

## పిల్లిరూపమున నున్న బాబా కొట్టఁబడెను.

73A. బాబా - ఉబ్బసపు రోగియైన హన్సిరాజును పెరుగు త్రాగవలదు, పులుపు పదార్థములు తినకుము అని చెప్పెను. కాని, హన్సి రాజు ప్రతిదినము రాత్రులందు పాలు తోడు పెట్టించుకొనుచు మరునాడు మధ్యాహ్న భోజనమున ఉపయోగింపఁ దలచెను. ప్రతిదిన మొక పిల్లి ఆ పెరుగు త్రాగి పోవుచుండెను. ఒక దినమున నతఁడు దానిని కర్రతో కొట్టెను.

సా. బా:- (హన్సిరాజు ఎదుట ఇతరులతో) ఒక గ్రామమున నొక మూర్ఖుఁడు గలఁడు. అతనిని పెరుగు త్రాగవలదంటిని. కాని, అతడు ప్రతిదినము పెరుగు సిద్ధపఱచుకొను చుండెను. వానిని రక్షింప నేను పిల్లిగా వెళ్లి ఆ పెరుగు త్రాగుచుంటిని. ఈ దినము మరల వెళ్లితిని. వాఁడేమి చేసెనో మీకు తెలియునా? నా భుజముపై కొట్టినాఁడు. ఇటు చూడుడు! (హన్సిరాజు తాను కొట్టినది పిల్లియైనను బాబా భుజమునగల కర్రపోటు క్రొత్తవాతను చూచి చకితుడయ్యెను.) (చూ. 359)

73 B. (బాబా కుక్కగ - రోగియైన శూద్రుడుగ) 1911 - 1914 కాశీనాథ గోవింద ఉపాసనీ మహరాజు శిర్డీ యందుండెను. క్రొత్తలో నొకనాడు వంటఁజేసికొనుచుండ నొక నల్లకుక్క దూరము నందుండి చూచుచుండెను. దానికేమియు పెట్టక కా. గో. ఉ. ఆ. పదార్థముల మసీదునకుఁ గొనిపోయి బాబా ముందుంచెను.

సా. బా:- "నీ విక్కడకేల తెచ్చితివి? నేనక్కడనే యుంటిని.

కా. గో. ఉ:- బాబా! అక్కడ ఒక నల్లకుక్క తప్ప మఱెవ్వరు లేరు.

సా. బా:- ఆ నల్లకుక్కను నేనే.

బాబా ఆ దినమున ఆ పదార్థములంగొనక నిరాకరించెను. మరునాడు. కా. గో. ఉ. తన విడిదియందు వంటఁ జేసికొనెను. అచట కుక్క కానరాలేదు. కాని, రోగియైన శూద్రుఁడొకఁడు గోడనాను కొని ఆ ఆహారములను చూచుచుండెను, కర్మఠుఁడైన కా. గో. ఉ. ఆ శూద్రునచటనుండి తరిమివైచి ఆ పదార్థములను బాబా దగ్గఱకు తీసికొని వెళ్లెను.

సా. బా:- క్రిందటి దినము నా కేమియుఁ బెట్టవైతివి. ఈ రోజు నన్ను తరిమివైచితివి! ఆ పదార్థము లిటకుఁగొనిరానేల?

కా. గో ఉ:- బాబా! నీవచట నెక్కడనుంటివి?

సా. బా:- ఆ గోడనానుకొని యున్నవాఁడను నేనుగానా?

కా. గో. ఉ:- ఏమీ! నీవట్టి మనుష్యునందుందువా?

సా. బా:- అవును! నేను ప్రతి వస్తువునందు - సర్వత్ర నుందును. "సభూమిం విశ్వతోఽఽవృత్వా అత్యతిష్ఠత్ దశాంగులమ్" (పురుష సూక్తము) ఆతఁడీ భూతలమున మఱి విశ్వమందంతట వ్యాపించియున్నాడు.

## బాబా — ఇతర సాధువులు

74. 1870 యందు అకల్‌కోట మహరాజు నిర్యాణ సమయమున 'తార్దేవ్' నివాసి కేశవనాయక్ అనునతఁడు ఆ స్వామితో నిట్లనెను.

మహరాజ్! మీరు మమ్ము వీడిపోయినతర్వాత మా కాధారమింకేమిగలదు?

అ. మ:- (తన పాదుకలను పూజింపుమని ప్రసాదించుచు) నా అవతారము - (ఆత్మ) అహమ్మద్ నగర్ జిల్లాలోని శీరిడీ యందుండును. నిరతము అక్కడకు పొమ్ము. అచట భక్తిసలుపుము. నీవటులం గావించితివా నేను లేనికొఱత నీకుంగలుగదు. నీవానందము పొందుదువు.

అకల్‌కోట మహారాజు నిర్యాణాంతరము కేశవనాయక్ అతని కుమారుండు రామచంద్ర నాయక్ మఱి యిరువురు నైష్ఠిక బ్రాహ్మణులం గూడి శీరిడియందున్న సాయిబాబా దగ్గఱకు వెళ్ళిరి. మార్గమధ్యమున ఆ విప్రులు బాబానుగూర్చి యాతండొక పిచ్చి ముస్లిం ఫకీరనియు బ్రాహ్మణు లెవ్వరాతనికి మ్రొక్కరనియు నేమేమో పలికిరి. ఆ నలుగురు బాబాను చేరినపిదప-

సా. బా:- (కేశవనాయక్‌తో) నీవు నీ కుమారుండు రాందలచిన నాదగ్గఱకు రండు! (తక్కిన ఇరువురం జూపుచు) వారు కర్మరులైన బ్రాహ్మణులు (రామచంద్ర నాయక్‌తో) వేపాకులను గొన్ని తీసుకురమ్ము!

రా. చం. నా. కొన్ని వేపాకులం దెచ్చెను. బాబా ఆ వేపాకుల నలుగురకు పంచిపెట్టెను.

సా. బా:- ఆ ఆకులను తినుడు; అవి ఎట్లు రుచించుచున్నవి?

బ్రాహ్మణులు:- (ముఖము చిట్లించుచు) మిక్కిలి చేదుగనున్నవి.

తండ్రికొడుకులు:- ఈ ఆకులు మధురములుగ నున్నవి మిక్కుటముగ తింటిమి.

బాబా యీ విధముగ తన భక్తులెవరో నిరూపించి. అకల్‌కోట మహారాజు పలుకులను ధ్రువపఱచెను.

o o o

నేను మీర్జగోన్ (ఫకీర్ బాప్)లో నుంటిని. (కుశభావ్‌తో) నీవిక్కడకు రానేల? నేను బాంద్రాలోని మౌలాను, (నేను నాందేడు మౌలాను) రు. 3-14-0 లు నాకు ఇదివరకే యిచ్చితివి.

75. నీ వెక్కడనున్నను నేను నీ వెంట నున్నాఁడను. నన్ను తీసికొని పోవుటకు వాహనము అవసరములేదు.

76. 1914 మె నెల, బాంద్రా నివాసిని తార్ఖాడ్ సతి. ఆమె కుమారుఁడు తార్ఖాడ్ శిరిడికివచ్చినవారితో

సా. బా:- అమ్మా! దినమునకు మూఁడు పర్యాయములు మీ యింటికి వచ్చుచుంటిని.

తా. సతి:- సత్యము - బాబా!

శిరిడియందున్న ఒక కాంత బాబాను నిత్యము శిరిడియందుఁ జూచు చున్న దగుటచే ఆశ్చర్యపడి

శి. కాంత:- బాబా! ఏమి? ఈ వింతపలుకులు పలుకుచున్నావు?

సా. బా:- నేను కల్ల లెప్పుడేనియుఁ బలుకను. నేను మహాలక్ష్మిని. (బాం. కాంతతో) అమ్మా! నేను నీగృహమునకుఁ జేరుచుందును. నీవు తినఁబెట్టుదువు. సత్యము కాదా?

బాం. సతి:- బాబా! సత్యము.

శి. కాంత:- సత్యముగ బాబా నీదగ్గఱకు వచ్చునా? నీవు తినఁబెట్టుదువా?

బాం. సతి:- సత్యము.

సా. బా:- (కుమార్ తార్ఖాడ్‌తో) మీ యింటికి వచ్చుచుండునా?

కు. తా:- సత్యము, బాబా!

సా బా: (శిర్డి కాంతతో) సత్యము - తల్లీ! బాంద్రాలోని భావ్ గృహమునకు నేను తేలికగ వెళ్లుదును. మధ్య నొక గోడగలదు. దానిని దాటిన తరువాత అధోమార్గము - దాని కావల భావ్‌గృహము.

(ఇచట బాబా శిరిడినుండి బాంద్రాలోని తార్కాడ్ సతి గృహమునకు కాకిరూపమున జేరుచున్న విధము తెలుపంబడినది.)

నేను గోడలు, అగడ్తలు దాటుచు నెగురవలయును.

77. బాంద్రాలోని టెండల్కార్‌సతి తన గృహమున బాబా పటమును వకుళ పుష్పమాలలతో రెండు నెలలు నిత్యము నిండించెను. తరువాత శిర్డికి వెళ్లెను.

సా. బా:- ఓయీ! కాకా! (హ. సీ. దీక్షిత్) ఈ రెండు మూండు నెలలు నేను శీరిడిలో లేనేలేను. ఈ తల్లి నన్ను వకుళ పుష్పములతో నునుపినది - దిమ్మదిరిగి స్మృతి తప్పియున్నాను. ఇప్పుడు మెల్లగా కోలుకొనుచుంటిని.

78. నేను బాంద్రాలోని భావ్ గృహమునకు వెళ్లితిని. భావ్ తినుటకు నాకేమియు నొసగలేదు - అందుచే ఆకలితో తిరిగివచ్చితిని.

79. నీవు భోజన సమయమున నన్ను దలంతువా? నేను నీ చెంగటలేనా? నీ వొక మెతుకైనా నాకర్పింతువా?

80. నేను శీరిడిలోనే ఉన్నవాండను కాను. అంతటంగలను

81. శీరిడియందే 'సాయిబాబా ఉన్నవాండు' - అని తలంచు వాండు బాబాను యథార్థముగ నెఱుంగంజాలని వాండేసుమా!

82. ఏల నీవు (దుఃఖించుచు) పిచ్చివానివలె ప్రవర్తించెదవు? (బొంబాయిలో) నీచెంత నేను లేనా?

83. ఎవరు (సాయి) శీరిడి యందున్నాండో అతండిక్కడ 'మాచంద్రఘడ్' లో కూడ నున్నాండు - ఈ విషయము నీకు (మాన్కర్) బోధపఱచుటకే నిన్నిక్కడికి పంపితిని.

84. నేనిప్పుడే కాశీకి వెళ్ళి స్నాన మాచరించితిని.

(ఉపాసనీ కుమారునితో) నేను ధూలియా యందుంటిని. నీవు నన్ను చూడలేదా?

(మేఘునితో) నా కంఠధ్వని వినినపుడు సందేహమేల? గడియ వేయఁబడిన తలుపులు నారాక నడ్డగింపఁజాలవు.

85. నేను నీ వెంట (అదృశ్యముగ) వత్తును. అమ్మా! విచారము వలదు. నీ కుటుంబమును కనిపెట్టి యుందును. మంచిది-పొమ్ము! నేను నీచెంతనే యున్నాఁడను.

86. (పురందరుతో) నేనే అక్కడ (అదృశ్యముగ) కూర్చుండి నిన్ను నీభార్యను కాపాడు చున్నాఁడను.

87. నీవెక్కడ నుండినను నన్ను తలంచు మాత్రమున నీ చెంతకుఁ జేరుదును.

88. మీరెక్కడ నున్నను నా భక్తులలో నెవరేమి తలచినను, పలికినను, చేసినను అ క్షణముననే దానినంతయు నే నెఱుగఁ జాలుదును.

'కొరాన్' నా సేవకులు నన్నుగూర్చి నిన్ను కోరినపుడు ఆ క్షణమున వారిని సమీపింతును. నా కొఱకు ప్రార్థించువారి ప్రార్థనము నను గ్రహింతును.

89. ఎల్లరయెడ సమదృష్టి పలుపుము. నా కరుణలేక ఆకైనను కదలఁ జాలదు. అందఱను సమదృష్టితో చూచుదును.

## బాబా కార్యములు

90. నేను ఈశ్వరుని సేవకుడను. భగవానుఁడు మహాప్రభువు-యజమాని.

91. ఎల్లెడల భగవానుని ప్రతినిధులు కలరు. వారు అపారమగు శక్తులు కలిగి యున్నారు.

నేను మిక్కిలి గొప్ప శక్తులు గలిగియున్నవాఁడను.

92. (బాబా ఆజ్ఞప్రకారము 'అప్పాకుల కర్ణి' నివాస్ పురము లోని మోహినీరాజు (శంకరుఁడు)ను సందర్శించి, (చూ. 145) అచటి డిప్యూటి కలెక్టరుచే జరుపఁబడిన విచారణయందు - కులకర్ణిపై మోపఁ బడిన నేరము లాధార శూన్యములనియు అతఁడు నిర్దోషియనియు తీర్పు చెప్పబడినతరువాత శీర్డికి తిరిగివచ్చి బాబాతో)

అ. కు:- బాబా! నీవు నన్ను రక్షించినావు.

సా. బా:- అప్పా! భగవానుఁడు నిన్ను రక్షించినాఁడు. అతడు తన భక్తులకు దుర్ఘటములనేని సంఘటింపఁగలఁడు.

92 B. జి. డి. పెన్సారే - అనునతఁడు బాబానుఁ బ్రార్థించి పరీక్షయుం దుత్తీర్ణుఁడై ఉద్యోగమును సంపాదించుకొనెను. పిదప బాబాను జేరి మ్రొక్కెను.

సా. బా:- నీ ఉద్యోగమేమి?

జి. డి. పె:- నేను ఉపాధ్యాయుడను - బాబా! నీవను గ్రహించిన ఉద్యోగము.

సా. బా:- నేను నీకు ఉద్యోగ మీయలేదు - అల్లా (దైవము) ఇచ్చినాఁడు.

93. మృతినొందిన ఆ బాలుని ఆత్మను ఆ ప్రవేశించిన నూతన తనువును పరిమార్చి, అందుండి కొనివచ్చి, యీ మృత కళేబరమునఁ జేర్చి, పునర్జీవితునిఁ జేయగలను. కాని, ఆ నూతన తనువున చేయఁగల మంచిపనులను చెఱచినవాడఁ నగుదును.

94. ఆ మృతినొందిన ఆమె (ఆత్మ) నన్ను జేరినది.

95. (ఈ శిర్డినుండి) వేల మైళ్ల దూరమున మృతినొందినను నా భక్తుని నాదఱి కాకర్షించుకొందును.

96. నా భక్తుండగు వానిని నేను చేడ్పడనీయను. నాకు సమర్పితములైన వాని నన్నిటినిఁ గూర్చి భగవానునకు నేను లెక్క చెప్పుకొందును.

97. 1918 లో తార్కాడ్ సతి, ఆమె కుమారుండు - కుమార్ తార్కాడ్ - బాబాను సందర్శించిరి.

సా. బా:- అమ్మా! ఈ రోజులలో నేను మిక్కిలి బాధింపఁబడు చున్నాఁడను. కొందఱు ధనమును, కొందఱు భార్యలను, మఱికొందఱు బిడ్డలను మొదలగువానిని కోరుదురు. అహా! నాదగ్గఱఁగలదానిని కోరు వారెవ్వరు లేరు. నేనిట్లు వేచి, వేచి, యెప్పుడో యొకనాఁడు అదృశ్యుఁడ నగుదును. నేను మిక్కిలి విసుగు జెందితిని.

తా. సతి:- బాబా! నీ వటులేల పలికెదవు? అపుడు మా గతి యేమి?

సా. బా:- నీకు విచారమేల? దైవము నీ యోగక్షేమము లరయుటలేదా? నా బిడ్డలు నన్ను జేరినపుడు మిక్కిలి సంతోషింతును. ఏదో రెండు మెతుకులు అదాటున భుజించి దేహపుష్టి పొందుదును.

కుమార్ తా:- బాబా! నీదగ్గఱ గల దానిని కోరుటకే మేము వచ్చినది. ఆ సంగతి నీ వెఱుగవా?

సా. బా:- ఎఱుఁగుదును. నీవు పొందుదువు.

కుమార్ తా:- సరే! మేమది విశ్వసించియే యున్నారము. కాని, ఎప్పుడు?

సా. బా:- మిక్కిలి త్వరలోనే.

కుమార్ తా:- బాబా! దానిని పొందుటకు ఇంక ఎన్ని పుట్టువులు నేను పొందవలయునో నీనుండి నాకభయము కావలయును. (మా. 113)

సా. బా:- ఇంక, మూఁడు పుట్టువులు చాలును.

కుమార్ తా:- కాని, బాబా, ఎప్పుడు నీవు మా వెంటనుండవా!

సా. బా:- ఆహా! ఇప్పటి కెన్ని జన్మలనుండి మీ వెంట నుంటిని? మనము మరల, మరల కలియుచుందుము. రేయింబవళ్ళు నా బిడ్డలనుగూర్చి జాగ్రత్త పడవలయును. ప్రతి పైసాకు నేను భగవానునకు లెక్క చెప్పుకొనవలయును.

98. రోహిల్లాను, పిష్యాను, రావ్ సాహెబ్ గాల్వంకర్‌ను వీరల వేర్వేఱుగ మాతృ గర్భములం జేర్చితిని.

99. (అకల్‌కోట సపత్నికర్‌తో)మృతి నొందిన నీ కుమారుని ఆత్మనే మరల నీ భార్య గర్భమునం జేర్చితీరుదును. (సంవత్సరము లోపల అ. సపత్నికర్‌నకు పుత్రుండు పుట్టెను.)

100. నా 'కాకా'ను (హ. సీ. దీక్షిత్తును) విమానమున గాని పోవుదును. (హ. సీ. దీక్షిత్తు - ఆనందముగ అనాయాసముగ తనువు విడిచెను.)

## బాబా - భగవానుని చేతిలోని ఉపకరణము

101. భగవంతుని అనుమతిలేనిదే నే నేమియు చేయం జాలను.

102. (జి. జి. నార్కేతో) నీకు 'కుఫినీ' యీయలేదని నన్ను నిందింపకుము. ఆ ఫకీరు (దైవము) నా కనుమతి నీయలేదు.

103. అహో! నేను దక్షిణను అందఱ నడుగుదునా? ఆ ఫకీరు (దైవము) నిర్దేశించువారినే అడుగుదును. వారి వద్దనుండియే స్వీకరింతును

నే నేమియు చేయను. దేనిని స్వీకరింపను. దత్తస్వామి తనకు చెందవలసినదే అడిగినాఁడు తనకు చెందవలసిన 15 రూపాయలు రాబట్టికొనినాడు. మసూది ఆయికి ఇచ్చినాఁడు. కావున ఆ ధనము (నాచే) స్వీకరింపఁబడినది [చూ. 255]

104. మార్గమధ్యమున సులభముగ లభ్యపడునపుడు దత్త స్వామి మొదలగు దైవమూర్తులను సందర్శింపక వచ్చిన వారికి నే నెటుల తోడ్పడఁగలను?

104 A. బాబా ఒక ఫలదాత మాత్రమే. నీవు మంచి చేయ వలయును.

సా. బా:- నీవు మంచిపని కావించి భగవదర్పణముఁ జేసిన నీకు మేలుకలుగును. మంచి కావించువారికి దైవము రక్షకుఁడు. మంచి వారు చెడ్డవారు నావలన శుభములు కోరుదురా? ఎట్లు? (ఎచటనుండి) నేనీయఁగలను?- (అనగా - శుభ ఫలముల ప్రసాదింపఁగల మంచి కర్మములు చేయని యెడల) (చూ. 371)

"పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవా:
నపాప ఫలమిచ్ఛంతి పాపమే వా చరంతిహి."

పుణ్యఫలముఁ గోరఁ బూనుదురే కాని,
పుణ్య మాచరింపఁబోరు జనులు!
పాపఫలముఁ బడయ నోపరెవ్వారలు
పాపముల నొనర్ప వలతు రెల్ల!

## బాబా – సహజస్థితి

(నిరాకారుఁడు మఱియు సాకారుఁడు)

105. నేను దైవమును - కేవల ఆనంద నిరాకారునిగ నన్ను ధ్యానింపుడు! అట్లుచేయ సాధ్యము కానియెడల ఈ మీరుచూచు సాయీ రూపమును ఉన్నది ఉన్నటుల ధ్యానింపుడు!

106 ఈ దేహము కాని, ఇంద్రియములు కాని, నేనుకాను వీని నన్నిటిని గమనించు సాక్షిమాత్రము నేనగుదును. నేనేమియుఁ జేయను. నేను దేనిని స్వీకరింపను.

107. భక్తుఁడు:- బాబా! నీచేతిపై కాలిన బొబ్బ పుండును చికిత్స చేయనిమ్ము. అది నిన్ను మిక్కిలిగ బాధించు చుండును గదా!

సా. బా:- ఈ (సాయీబాబా) దేహము నంతయు అవుపిడకల చితిపైఁజేర్చి కాల్చునపుడు దగ్గఱఁజేరి చూచుట (నాకు) ఎంత వేడుకగా నుండునో!

## ఆత్మ విచారము

108. నన్నెఱుఁగుటకు శ్రవణ మననములద్వారా "నేనెవఁడను?" - అని నిరంతరము తలంపుము: మన మెవరము? - మన మేమియై యున్నారము? నేనెక్కడ నున్నాఁడను? నీ వెక్కడ నున్నాఁడవు? ఈ విశ్వమంతయు నెక్కడనున్నది?

నీభర్త తెలిపినదంతయు యోజింపుము! యోజింపుము! (అనగా - పారమార్థికముగ నీవు దైవమునకు భిన్నముకావు)

109. మన ఆత్మను మనమెఱుఁగ వలయును.

## భేదము అసత్యము

110. అతఁడు నాకు విరోధి-యని ఎవరినిఁగూర్చియు పలుకకుము. ఎవఁడు ఎవని శత్రువు? ఎవని యెడలను ద్వేషభావమును నీ హృదయమునఁ జేరనీయకుము. ఈ సకలము ఏకము - అభిన్నము.

111. జనములు - తమది యని, ఇతరులది యని, పరస్పర భేదము వహింతురు - (అనగా - ఇవి తమ సంపదలని - అవి యితరుల సంపదలని) ఇది పొరపాటు. (పురందర్‌తో) నేను నీ యందున్నాడను. నీవు నాయందున్నాఁడవు. నిన్ను నన్ను ఎడముచేయునది యీ (తెర) గోడ. ఈ గోడను కూల్చుము. అపుడు మనమొండొరుల ముఖములను స్పష్టముగఁ జూడఁగలము.

సాధువు లిట్టి భేదబుద్ధిని పాటింపరు. నన్ను సేవింపఁదలచిన ఈ భేదబుద్ధిని విడనాడుము. నిరంతర మీవిధమున యోజనచేయు చుండుము. అపుడు నీకు 'ఎఱుక' గలుగును. శ్రుతి స్మృతి శాస్త్రాదుల పరిశోధించుము-ఆత్మ - ఏకమో - లేక అనేకమో చూడుము!

112. ఉపాసనీ మహరాజ్ :- నేనెవఁడను?

సా. బా:- నేనే నీవు - నీవే నేను. నీకు నాకు భేదములేదు. నేను దేనిచే కూర్పబడితినో నీవును దానిచే కూర్పబడితివి.

"అహంభవా న్నచాన్యస్త్వం - త్వమే వాహం విచక్ష్వ భో!
ననౌ పశ్యంతి కవయః ఛిద్రంజాతు మనాగపి"

(శ్రీమద్భాగవతము)

సతారాలోని 'వాయి' గ్రామమున నారాయణ ఆశ్రమయతికి (అప్పటిపేరు-టోసర్) 1914లో బాబా అభేద బుద్ధిని ప్రసాదించినాఁడు. (నా. ఆ.) అతఁడు శిర్డియందున్న కాలమున అభేద రూపమగు ఎఱుక - ఆనందము పొందఁగలిగినాఁడు. సూర్యోదయ కాలమున పడమట దిక్కున దృష్టి నిలిపి తనఛాయను వీక్షించు 'భీష్మ' అనువానికి విశ్వాత్మానుభూతిని బాబా ప్రసాదించినాఁడు.

## మోక్ష మార్గము (సంసారము)

113. నానాసాహెబ్ గోవింద చందోర్కర్ బాబాను మ్రొక్కి-

నా. గో. చం:- బాబా! ఈ సంసారము నాకువలదు. సకల శాస్త్రములు తెలుపునటుల సంసారము యథార్థముగ నిస్సారము. నిష్ప్రయోజనము. నా యీ సంసృతి బంధములను విచ్ఛేదము చేయుము. ఏది తొలుదొలుత సంతోషముగ గోచరించునో తుదకది దుఃఖకారణమే యగుచున్నది. విధి వనల నిక్కడ అక్కడ మిక్కిలి చమత్కారముగ నాడించుచుండును. ఈ సంసార మందే లవమేని సుఖము నాకుఁగాన

రాదు. నేను మిక్కిలి విసుగు నొందితిని. బాబా! ఇంక నేమాత్రము దీనిని తాకుటకు కాంక్షింపను.

సా. బా:- నానా! ఈ పలుకులెంత భ్రమజనితములు! వెఱ్ఱివి! దోషమిశ్రితమైన సత్యమందించుక కలదు. ఈ దేహమున్నంతవరకు సంసారముకూడ నుండును. ఎవరును దీనిని తప్పుకొనలేరు. నీవెటుల తప్పుకొనఁగలవు? నేనుకూడ దీనిలో చిక్కుకొని యున్నాఁడను. (చూ. 17, 79, 119) సంసృతి పలువిధములు అవి దేహముయొక్క పైభాగము వలె నున్నవి. కామక్రోధాదులం దొండొంటి కలయికయే సంసారము- మానసిక దైహిక కార్యకలాపమే సంసారము - ఏ రెండు వస్తువులు చేరిన సంసారము - అడవులకు పాఱిపోయిన మాత్రమున సంసారమును తప్పు కొనలేవు. ఇప్పటి నీ యీ స్థితి నీవు తెచ్చిపెట్టుకొనినదే. దీనిని నీవు కోపించిన నేమి ప్రయోజనము?

ఈదేహ ప్రారబ్ధము నీ పురాకృత కర్మఫలము. కావున ఈ దేహము కలిగినది. జీవి పూర్వకర్మఫలమనుభవించుటకే దేహమునఁ జేరి నాఁడు. నీ ప్రారబ్ధకర్మ ఫలమనుభవింపనిదే నీవు దీనినుండి విడివడఁ జాలవు. ఎల్లరు జనులు - సకల జీవములు వేర్వేఱు రూపముల నుండును- ఏల? ఆయా జీవుల పూర్వకర్మమే కారణము. వివిధ జీవ జాతులందు వ్యక్తులందు పరస్పర భేదము కలుగుట కదియే కారణము. ధనికుని కుక్క దూదిపరుపులపై పొరలుచుండుట, పేదవాని కుక్క వీధిలో పాఱ వైచిన రొట్టెముక్కల కొఱకు పఱువులెత్తుట - గమనింపుము దాని కారణము దేహ ప్రారబ్ధము.

## సత్య సుఖము

114. నా. గో. చం:- (ప్రశ్న) సంసారమునఁ గలుగు సుఖ దుఃఖములు మనుజుని మిక్కిలిగ కలతపెట్టు చుండును. కావున మనము సంసారమును పరిత్యజించవలదా?

సా. బా:- (సమాధానము) సుఖ దుఃఖములు కేవలము భ్రమ జనితములు. మనకుతోచు ప్రాపంచక సుఖము సత్యసుఖముకాదు. అది

సత్య సుఖముగ తోచుటచే ప్రాకృత పురుషుఁడు దానివైపునకు బలవంతముగ ఆకర్షింపబడుచున్నాఁడు. ఆయాజీవుల ప్రారబ్ధము ననుసరించి ఒకఁడు షడ్రసోపేత భోజనము చేయును. ఒకడు చప్పని రొట్టెముక్కలను మఱియొకడు గంజినీరము నారగించును. మొదటివాఁడు సకలము లభించెననుకొనును. తక్కినవారు దారిద్ర్యమనుకొని ఖేదపడుదురు. ఇందఱకు ఫలము ఆకలి తీర్చుకొనుటయే. కొందఱు జలతారు పట్టుసాలువలు తాల్తురు. మఱి కొందరు నారవస్త్రముల ధరింతురు. ఈ యిరుతెగలవారు కావించునది దేహమును కప్పుకొనుటయే. ఈ సుఖము-దుఃఖము - అభిప్రాయ భేదముననుసరించి కలుగును. ఇది భ్రమ-అనర్థమూలము. ఈ సుఖము దుఃఖమునుగూర్చిన తలంపు నీ మనస్సున పొడమెనేని దానిని నిరోధించుము. దాని కవకాశమీయరాదు. అది కేవలము భ్రమ.

కామక్రోధ లోభ మోహ మదమత్సరములు - షడ్రిపులు - భ్రమ కారణములు. అవి అసత్యమును సత్యముగ తోఁపఁజేయును. ధనికుడు సువర్ణాభరణములఁ దాల్చిన, పేదవాఁడు ఈర్ష్య వహించును. తనకును కలిగిన బాగుండునని తలంచును. ఇది లోభము.

సకలము ఈ విధముగ నుండును. కావున శ్రేయస్కాముడు ఈ ఆర్గురు శత్రువులను జయింపవలయును - అవి జయింపఁబడిన ఇంక ఆశాతరంగములు పొడమవు. లేకున్న నవి నిన్ను బానిసీనిగఁ జేసికొనును. వానిని నిర్జించి నీ బుద్ధి యధీనమున వానినుంచుకొనిన ఈ భ్రమజనితములగు సుఖము దుఃఖము మొదలగునవి నిన్నధీనునిఁ జేసికొనఁజాలవు. సుఖ దుఃఖాదులచే నీవు కలచఁబడవు.

## సత్య సుఖము (లేక) ఆనందము

115. ముక్తి (మోక్షము) - ఒక్కటే సత్యమగు సుఖము-ఆనందము. జనన మరణ చక్రమున భ్రమించుటే - పుట్టుట - చచ్చుటలే దుఃఖము. ఈ సంసార సంబంధములగు సుఖ దుఃఖములు అసత్యములు.

## సంసారమున ప్రవర్తింపఁదగు విధము

116. సంసారమున ప్రవర్తింపఁదగు విధము నీకెఱింగింతును. వివేకియగువాఁడు సకలము తన దేహప్రారబ్ధము ననుసరించి ప్రాప్తించునవి యగుటచే తనకుఁగలవానితో సంతోషసంతృప్తులఁబడయఁదగును. కంటకములను (ముండ్లను) కాళ్ళతో తన్ని చూడకుము.

ధనము గలిగిన అడకువ గలిగియుండుము. ఫలభరితములైన తరువులు వంగి యుండును. ఎల్లరయెడ అడకువతగదు. క్రూరులు దుర్మార్గులగు వారియెడ కఠినత వహింపవలసినదే. కాని, సాధులయెడ నమ్రతకలిగి యుండుము. గౌరవించుము.

దానధర్మములకు ధనము వెచ్చింపుము. మితిమీఱి వెచ్చింపఁదగదు. ఈ విశ్వమశ్వరమే - సందేహములేదు. కాని, ప్రపంచ ముండునంతవరకు దేహమునకు పైత్యరసమువలె మనుష్యులకు ధన మవసరమే. ధనగర్వమున తొందరపాటుతగదు. ధనమునకు లోఁగకుము. లుబ్ధత్వము తగదు. ఉదారబుద్ధి కలిగియుండుము. కాని, అతివ్యయము, దుర్వ్యయము కూడదు.

నీ విధ్యుక్తములగు లౌకిక కార్యములందు ఉత్సాహముతో పాల్గొనుము; కాని, దైవమును మాత్రమేసమయమున మఱువరాదు. దైవమును ఎల్లవేళల జ్ఞప్తియందుంచుకొనుము. నీవు మేల్కొని యుండునంతవరకు "ఈ సంసారము భగవానునిది కాని, నాది కాదు-" అనియే తలంచుచుండుము. పేదల దీనులయందు దయగలిగి యుండుము. వారలను చీదరించి నిరాదరింపకుము. "నేనెవఁడను?"- అని యెల్లవేళల విచారము చేసికొనుము.

## భక్తి (నవవిధభక్తి)

117. అనంతరావు పటంకర్:- బాబా! నేను పెక్కుశాస్త్రములను చదివితిని. కాని నాకు మనశ్శాంతిలేదు. నన్ను ఆశీర్వదించి అనుగ్రహింప నిన్ను వేడుచున్నాఁడను.

సా. బా:- ఒకసమయమున నొక వర్తకుడిక్కడకు వచ్చెను. వాని యెదుట నొకపశువు తొమ్మిది పేడపెంటికలను వేసెను. అతఁడు తన అన్వేషణ సిద్ధికొఱకు దానితోఁక దగ్గఱ వస్త్రము నఱచి ఆ తొమ్మిది పెంటికలను తీసికొని వెళ్ళెను. వానికే కాగ్రత - మనశ్శాంతి లభించెను.

అ. రా. ప:- (ఈ నీతి కథ యందలి భావమును గ్రహింపలేక తరువాత దాదాకేల్కారుతో) బాబా అభిప్రాయమేమి?

దా. కే:- దైవ కరుణ - ఆ పశువు. అదివిసర్జించిన తొమ్మిది పేడ పెంటికలు - నవవిధ భక్తులు. నీవా వర్తకుని స్థానము నందుండ వలయును. నీవా నవవిధ భక్తులను అనుసరించితివా మనశ్శాంతిని పడయఁగలవు.

(మరల అనంతరావు బాబాను సమీపించెను:)

సా. బా:- నీవా తొమ్మిది పేడ పెంటికలను ప్రోగుచేసికొంటివా?

అ. రా. ప:- బాబా! దానికిని నీ కరుణ ప్రసాదింపఁబడ వలయును.

సా. బా:- దైవము నిన్ననుగ్రహించును.

## జ్ఞానము — భక్తి

118. సా. బా:- జ్ఞాన మార్గము-రామ ఫలము వంటిది; భక్తి సీతాఫలము వంటిది. ఇది సులువుగ లభ్యమగును. మిక్కిలి మధురముఁగ నుండును. రామఫలము గుజ్జు లోపలనుండును. దానిని పొందుట కష్టము. రామ ఫలము చెట్టున పండవలయును. దానిని కోసికొనవలె. అది క్రిందపడెనా చెడిపోవును. కావున జ్ఞానమార్గగామి పతన మొందెనా వాఁడు చెడును. ఏస్వల్పమగు అజాగ్రత - అశ్రద్ధ వలన వానికి పతన ప్రమాదముకలదు.

## ఆత్మ విచారము (జ్ఞానము) (i)

119. (ప్రశ్న) బాబా! నీవెవరవు? ఎందున్నావు?

(సమాధానము) సా. బా:- (నిర్గుణతత్త్వమున) నాకు సెలవు లేదు. నేను నిరాకారుండను. కేవలుండను. నిర్గుణుండను. (సగుణ తత్త్వ మున) కర్మకారణమున బద్ధుండనై ఒక దేహమునం జేరితిని. నాపేరు 'దేహి.' ఈ ప్రపంచము నా నివాసము. బ్రహ్మము నాతండ్రి. మాయ నాతల్లి. వారి సంయోగమున నేనీ దేహమును పొందితిని. ఈ విశ్వ మశాశ్వతము. పరిణామము (మార్పు) పొందునది.

(అప్పాకులకర్ణితో) అల్లా - ఆ నిర్గుణ పరబ్రహ్మము 'నివాస్' అను పురమున సగుణ పరబ్రహ్మమై, 'మోహినీరాజు' అని పిలువంబడు చున్నాండు. అచటకుపెళ్ళి, ఆస్వామికి మ్రొక్కుము. భగవానుండు తన భక్తుల ననుగ్రహించుట మన సకల శక్తులను ప్రకటించును. (చూ. 145)

## నేనెవండను? మనమెవరము? (ii)

120. బాబా తఱచుగ పలుకువాండు - 'మన మెవరము? - అని, దీనినింగూర్చి రేయింబవళ్ళు తలంచుచుండుము!

ఆర్. ఎ. తార్కాడ్ - 1915 ప్రాంతమున బొంబాయిలోని ఒక యంత్రము (మిల్లు)యొక్క కార్యనిర్వాహక భాగస్వామి శిరిడికి వచ్చుచు 'మన్మాడ్' స్టేషన్‌దగ్గఱ చీకటిలోనొక రైలుపెట్టెలోని కెక్కు స్థలముకొఱకు ఒక పోలీసు ఉద్యోగితో తగవులాడెను. తార్కాడ్ శిర్డికిం జేరి బాబాకు మ్రొక్కెను.

సా. బా:- ఈ ఉదయము ఎవరితో వాదించుచు తగవులాడు చుంటివి? భావ్ (సోదరా!) అట్టి జనులతో మనమెప్పుడు తగవులాడ రాదు. మనమెవరము? - అని విచారణచేసి కొనవలయును.

తార్కాడ్ తొలుత బాబా తెలిపిన అంశము సాంఘిక సమరస సమత్వభావము పెంపొందించుకొనం దగునని తలంచెను. ఆ తరువాత (వాదోపవాదములు చేయువారు) 'ఈ ఉభయులు ఆధ్యాత్మికముగ ఏకమెకాని భిన్నులుకారు' అనిగ్రహించినాండు. "త్వయిమయి సర్వత్రైకో విష్ణుః వ్యర్థంకుప్యసిమయ్యసహిష్ణుః" (శంకరభగవత్పాదులు)

**(iii)** సా. బా:- బాలభాప్‌తో - (సీతారాందేవ్) మనమెఱుఁగ వలసినది మన 'ఆత్మ' మాత్రమే.

**(iv)** 121. (1917 అక్టోబరులో ఒక బొంబాయి కాంతతో)

సా. బా:- **అమ్మా!** నీకేమీ కావలయును? దానినికోరుకొనుము.

బొం-కాంత:- బాబా ఈ జనన మరణముల సుడినుండి నన్ను విడిపింపుము.

సా. బా:- (నవ్వుచు) నీకు కావలసినదంతయు ఇదియేనా? ఏమి? మరణించుటకు వచ్చితివా!

బొం కాంత:- (చకితయై) బాబా! నీ పలుకులు నాకేమాత్రము బోధపడలేదు.

సా. బా:- నీ వెవరవో ఆలోచించుకొనుము!

బొం. కాంత:- నేను గ్రహింపఁజాలకున్నాను.

సా. బా:- (ఆమె భర్తవైపు చూపుచు) ఈతఁడు నీకుఁ దెలుపును.

(ఆ తరువాత ఆమె భర్తతోడ విడిదికి చేరి బాబా అభిప్రాయ మేమి? అని ప్రశ్నించెను.)

భర్త:- బాబా పలుకు నిగూఢములు. ఆశ్చర్యకరములు. బాబా అభిప్రాయము నేను గ్రహించితినని నమ్మకములేదు. బహుశః బాబా అభిప్రాయమిదియై యుండవచ్చును.

దైవ (ఆత్మ) సాక్షాత్కార ప్రాప్తికలుగు వరకే జీవి పెక్కు మాఱులు జనన మరణములు పొందుచునే యుండును. బాబా - భగవానుఁడు. కాని, జనులు బాబాను చూచియు గాఢవిశ్వాసము వహించి "బాబా దైవము" అని గ్రహింపఁ జాలరు. కావున వారికి ముక్తిలేదు.

శాస్త్రిను సారముగ - పారమార్థికముగ జీవుడు - శివుఁడు ఏకము. నీవు 'నేను జీవిని' - అని తలంచు చున్నావు - కాదా ?

బొం. కాంత:- అవును.

భర్త:- శాస్త్రములు - నీవు శివుఁడవు (దైవమవు) అని తలంపు మని పలుకుచున్నవి.

బొం. కాంత:- కాదు - కాదు. నేనొక పాపిని. ఒకజీవిని. కాని, ఆ మహాశివుఁడను కాను.

భర్త:- నిజమే! అది నీ తలంపు. కాని బాబా అభిప్రాయము- నీవు నిరంతరము "నేను ఆత్మను - దైవమును." అని భావించు కొలఁది నీ యందు గాఢముగ పాదుకొనిన 'నేనొక అల్పజీవిని' అను బుద్ధి తొలఁగును. ఇట్టి భావన పెంపొందిన కొలఁది పెక్కు జన్మలు కడచిన పిదప, సాధు సత్పురుషుల సాంగత్యమున వారి అనుగ్రహమున నీవు బ్రహ్మమవు - అను ఎఱుక ప్రాప్తించును. అని బాబా అభిప్రాయమై యుండును. (ఆ దంపతులు తరువాత ద్వారకామాయిఁజేరిరి.)

సా. బా:- అమ్మా! నేనిక్కడనుండియే నీ భర్త నీకుఁదెలిపిన దంతయు వింటిని. దానిని నీ మనస్సున భద్రపఱచుకొనుము!

## దైవ మెవరు? (v)

122. (నానాసాహెబ్ గోవిందచందోర్కర్ - బాబాతో)

౧. దైవమెవరు? ౨. అతఁడెట్లుండును? ౩. అతఁడెక్క నున్నాఁడు? ౪. మనమా దైవము నెట్లు చూడగలము?

సా.బా:- నేను నీకు తరువాత చెప్పెదను. (ఒక సమయమున)

సా. బా:- బద్ధులు:- (లౌకిక విషయలంపటులు) మంచి- చెడు ఎఱుఁగరు. ఎఱుఁగుటకు ప్రయత్నింపరు. దైవమెవరో ఎఱుఁగరు. నైతిక ప్రవర్తనమైనను పాటింపరు.

నిరంతరము లౌకిక విషయముల మునిఁగి (హృదయ మాలిన్యము కలిగి) శాస్త్రములందు - సాధు సత్పురుషులందు విశ్వాసములేక వారు దైవమును జేర నేరక దుర్గతిగాంతురు. (నరకమును పొందుదురు.)

ముముక్షువులు:- (పైనఁదెలిపిన) బద్ధస్థితికి విసుగునొంది విచారము - వివేకము వైపునకు దృష్టిమరల్చి, భగవంతుని దర్శింప వలయునను 'పిపాస' గలిగియుందురు. వారు దైవభక్తి సలుపుచు నైతికపరివర్తనము గలిగియుందురు.

వారు 'సాధకులు' సాధనలభ్యసింతురు. ధ్యానము సలుపుచు, విషయములనుండి యింద్రియములను మరల్చి, జనుల కూటములందాసక్తిఁగనక ఏకాంతవాసము సలుపుదురు. వారు సాధు సత్పురుషుల సాంగత్యమును ప్రేమింతురు.

వీరు సాధనలందు పరిపూర్ణులైన పిదప 'సిద్ధులు' - అనఁబడుదురు. అట్టి స్థితియందు దైవమే మానవుఁడుగ పరిణమించును. అట్టివానికి నిందా -స్తుతులు సమానములు. వారికి కోరికలుండవు. వారికి దేహాత్మబుద్ధి-దేహమే తానను బుద్ధి-యుండదు. వారి ఆత్మ-పరమాత్మలో నైక్యము పొందును, "బ్రహ్మాఽస్మి" భావము పొందుదురు.

దైవము నెఱుంగుటకు, ఈ మూఁడుస్థితులందు దైవమెట్లుగ పరిగణింపఁబడుచున్నాఁడో గమనింపుము! పర్యవసానమున చేతనాఽచేతనములందన్ని రూపముల దైవము చూడఁబడుచున్నాఁడు.

భగవానుఁడంతటఁ గలఁడు, దైవము లేనిస్థానము విశ్వమునందెందును లేదు, ఈ సకలమునందావరించియున్న ఈశ్వరుని, కనుగొని గుర్తింపనీయని 'మాయా' ప్రభావమును చూడుము! నేను-నీవు-ఈ విశ్వమున సకలము (ఈశ్వరుని) అంశయై యున్నారము - ఆ మహా ప్రభువులోని భాగములము. కావున నెవరు నితరులను ద్వేషింపరాదు, దైవమెల్లెడలఁగలఁడను విషయమును మఱువకుము. ఈ కారణమున 'ప్రేమ' (అద్వేషము) స్వయముగ నంతటఁగలదు. అది బహిర్గతమైన సకలము సిద్ధించును.

## మనము దైవము నెట్లు చూడఁగలము?

123. మనస్సు చంచలము. దానిని స్థిరముచేయుటకు ప్రయత్నమవసరము. ఈఁగ అటునిటు ఎగురుచు ఎల్ల వస్తువులపై వ్రాలి కూర్చుండును. నిప్పును డాసిన క్షణమున అది దూరదూరముగ తొలగిపోవును. ఆ విధముగ మనస్సు విషయములను కోరును. వానితో ఆనందించును. వానియందు లీన మొందును. అది బ్రహ్మమును చూచిన, చూడప్రయత్నించునపుడు పెడముఖము పెట్టి పాఱిపోవును. అధీనముకాని - లొంగని ఆ మనస్సు బ్రహ్మము (దైవము) నందు లయ మొందని యంతవరకు జనన మరణాత్మక సంసారము అనివార్యము. తప్పదు. మనస్సు నిగ్రహింపఁ బడనియంత దనుక జీవి పుట్ట వలసినదే. కాని, జన్మములలో మనుష్యజన్మము - అమూల్యమైనది. (గొప్ప విలువకలది) కావున మూర్తిపూజ కావింపుము. అనగా దైవము యొక్క సగుణ రూపములను-విగ్రహములను-పటములను (మనస్సును నిలిపి కేంద్రీకరించుటకు) పూజించి, సేవింపుము. ఆ విగ్రహము - పటము సైతము దైవమే - పరమేశ్వరుడే. విగ్రహములను త్రోసి వేయకుము. దైవ విగ్రహములను గాఢ భక్తితో పూజించుచున్న మనస్సు ఏకాగ్రత వహించును. అదికలుగదేని మనస్సు స్థిరముకాదు.

ఆ పిదప మననము - ధ్యానము నభ్యసింపుము. ఆధ్యాత్మిక గ్రంథములను పఠింపుము. అందుఁ దెలుపఁబడిన అంశములను పాటించి, అభ్యసింపుము. అన్ని విద్యలకంటె 'ఆత్మవిద్య' ఉత్తమోత్తమము. దానియందు నీవు పరిపూర్ణత గడించిన ముక్తి (మోక్షము) - సుగమము. అప్పుడు హరి-నీ యిష్టదైవము (వశవర్తి) నీ సేవకుఁడగును.

అట్టి బ్రహ్మవిద్యఁ బడసి తద్వారా మోక్షము పడయుటకు - బ్రహ్మజ్ఞుఁడ వగుటకు సులభోపాయములు.

## మోక్షము పడయుట యెట్లు?

సాధనచతుష్టయము- 4 విధములగు సాధనములగడింపవలెను.

1. నిత్యాఽనిత్య వస్తు వివేకము - ఈ విశ్వమున సత్యము (స్థిరము) ఏది? - అసత్యము (అస్థిరము) ఏది? అను ఎఱుక.

2. వైరాగ్యము - లౌకిక విషయములందు విరక్తి.

3. శమ దమాది గుణ సంపత్తి-మనోనిగ్రహము - ఇంద్రియ నిగ్రహము - ముముక్షుత్వము (మోక్షము పొందవలయునను ఇచ్ఛ.)

4. నవవిధ భక్తి అభ్యసింపవలయును. భగవానునకు ఆత్మ నివేదనము (ప్రపత్తి) కావింపవలయును.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"

ఇందు తొమ్మిది విధములగు భక్తులు తెలుపఁబడినవి.

౧. శ్రవణము:- పవిత్ర గ్రంథములు - భగవంతుని-సాధు సత్పురుషుల లీలలను దెలుపు గ్రంథములు చదువుట - వినుట.

౨. కీర్తనము:- భగవానుని నామ లీలాదులను కీర్తించుట.

౩. స్మరణము:- దైవమును స్మరించుట.

౪. పాదసేవనము:- భగవంతుని పాదముల మ్రొక్కుట - సేవించుట.

౫. అర్చనము:- భగవానుని రూపచిహ్నములను పూజించుట.

౬. వందనము:- దైవమునకు దైవసమమగు సాధు సత్పురుషులకు మ్రొక్కుట.

౭. దాస్యము:- దైవమునకు తత్సములగు సాధు సత్పురుషులకు సేవలు సలుపుట.

౮. సఖ్యము:- సాధు సత్పురుషులతో సాంగత్యము కలిగియుండుట.

౯. ఆత్మనివేదనము:- సంపూర్ణ శరణాగతి (ప్రపత్తి) చేయుట.

నిత్యము సిద్ధ సత్పురుషులను సందర్శింపుము. చక్కని నైతిక ప్రవర్తనము కలిగి యుండుము. అపుడు దేహావసాన సమయము నను పవిత్రుండవగుదువు. అవసాన కాలమున ఏవిధమైన కోరికలు కలిగి యుండకుము. ఇష్టదైవమునందు మనస్సు నిలుపుము. నీ మనస్సు నీ యిష్టదైవమునందు లయించి యున్నపుడు మృతి గలిగిన నీవు ముక్తుండ వగుదువు.

## దైవమును పొందుట - విధానము (vi)

124. నా. గో. చం:- బాబా! నిన్ను మరల మూండవ మాఱు ప్రశ్నించు చున్నాండను. దైవమెవరు? ఆతండెట్లుండును? ఆతం డెక్కడనుండును?

సా. బా:- నేనిదివరకే తెలిపితిని. నేను తెలిపిన విధమున ప్రవర్తింతువేని సాధన చతుష్టయము - నాలుగు విధములగు సాధనలు నీకు తోడ్పడును.

### 1. వివేకము (మొదటి సహాయము)

నా. గో. చం:- అవి యేవి?

సా. బా:- మొదటిది నిత్య - అనిత్య వస్తువివేకము - అనగా - సత్యము నిత్యమైన వస్తువేదో - అసత్యము - అనిత్యము ఐన వస్తువేదో - విభజించి తెలిసికొనుట. కొందఱు జనులు తాము వివేకులమని యితరుల నమ్మింపం జూతురు. యదార్థముగ 'హరి' యెవరో ఎక్కడ ఎట్లుండునో ఎఱుంగని వారయ్యు తాము 'వార్కారులు' - పండరి యాత్రికులమని లోకులను నమ్మింపం జూతురు. కాని యిట్టి తీర్థయాత్రిక విధానము నిజమైన భక్తి కాదు. ఇతరులవలన గౌరవము - మన్ననలు పడయుటకు ఒక ఎత్తుగడ మాత్రమే.

మనుష్యులు కొందఱు వారి హృదయములను నిర్మలములు గావించుకొనకయే పెక్కు గ్రంథములను పఠించి వల్లించి, సభలయందు తమ వాచాప్రాగల్భ్యములఁ బ్రకటించుకొనుచు, ఇతరులను తూలనాడుచు, స్వాత్మస్తుతులను గావించుకొనుచుందురు. వారు వివేకులుకారు. బ్రహ్మ జ్ఞానమును బడయఁజాలరు.

## 2. వైరాగ్యము (రెండవ సహాయము)

నిక్కమగు విరాగి యీ లోకమున పరలోకమునఁగల ఏవస్తువు నేనియు లెక్క చేయఁడు.

బాబా వైరాగ్యము. i. "దామియా రసానే" తాను చేయఁబోవు వ్యాపారమున వచ్చు లాభములో బాబాకు భాగమిత్తునని పలుకగా.

సా. బా:- నేను దేనిలోను సంబంధములేనివాఁడను.

ii. మద్రాసు స్వామికి బాబా కావించిన బోధ.

సా. బా:- (విజయానందస్వామితో) నీ తల్లిపై నీకంత ప్రేమయున్న నీవీ సన్యాసి వేషము (కాషాయ వస్త్రధారణము) ఏల వేసితివి? 'కాషాయము - మమత' రెండును కలియవు. వెళ్ళుము. నీ విడిది యందుండుము! అచట దొంగలున్నారు. నీ సర్వస్వము దోచుకొనిపోదురు. గడియువైచి నీ జాగ్రత యందుండుము. జరుగనున్నది జరిగితీరును.

ధనము - బంధుమిత్రులు సకలము అనిత్యములు. భయాస్పదములు. సంపూర్ణ పరిత్యాగమే ఆనందమును ప్రసాదించును. మనస్సునునిలిపి భాగవత సప్తాహము ముమ్మాఱు గావింపుము. సకల వాసనలు దానితో క్షయించును. భ్రాంతి అంతరించును - ఆ విజయానందస్వామి అటుల కావించి 22వ దినమున పరీక్షిత్తువలె పరమపద మొందెను.

## 3. శమదమాదులు (మూఁడవ సహాయము)

శమము:- మనస్సును విషయములనుండి మరలించుట.

దమము:- బాహ్యేంద్రియ నిగ్రహముద్వారా అంతర్ముఖమైన మనస్సును వెలికిఁబోనీయక నిలుపుట.

తితిక్ష:- ప్రారబ్ధ కర్మఫలముగ ప్రాప్తమగు అధివ్యాధి బాధలను సహించుట.

ఉపరతి:- సంపదలు - కాంతలు - సంతానము - మిత్రులు మొదలగునవి అనిత్యములుగ గుర్తించి మాయా బంధములనుండి తప్పుకొనుట.

శ్రద్ధ:- విశ్వాసము. (మనస్సునందు గాఢమగు నమ్మకము)

సమాధానము:- సుఖదుఃఖాది ద్వంద్వములను నిశ్చల మనస్సుతో సమదృష్టితో సహించుట.

## 4. ముముక్షుత్వము (నాల్గవ సహాయము)

(మోక్షము - అననేమి? దానిని పొందుట యెట్లు)

ముముక్షుత్వము- అన ఈ విశ్వమునఁదోచు సుఖదుఃఖములందనిష్టము వహించి ఉపరోక్ష జ్ఞానము - బ్రహ్మము నెఱుఁగుటయే కర్తవ్యమని మోక్షమునందు మిక్కిలి ఆసక్తి కలిగియుండుట. మోక్షము ఆకాశమున - కైలాసమున వైకుంఠమున లేదు. అది సూక్ష్మము. స్థూలముకాదు. అది అదృశ్యమగు విశ్వమూలకారణము. శుద్ధ చైతన్యము. శుద్ధచైతన్యము పొందుట - శుద్ధ చైతన్యమగుటయే మోక్షము. అది అమృతత్వము. అది మానవ జీవితమునకు గమ్యస్థానము. తక్కిన ఊహలు-ఆలోచనలు అన్నియు నిష్ప్రయోజనములు.

125. నా. గో. చం:- బాబా! శుద్ధ చైతన్యమననేమో వివరింపుము.

సా. బా:- అది అఖిలవిశ్వమునకు మూలకారణము. తదంతర్గతసారము - ఆధారమునగును. సృష్టి స్థితి లయములకది ఏకైకపదము. అదిమనకు తెలిసియు తెలియఁబడక యుండును. శుద్ధ చైతన్యము విధమిది - యని పలుక నలవి కాదు. కాని, ప్రతి క్షణమున నీ యునికి యందది ద్యోతక మగుచుండును. అదిలేని తావులేదు. దానికి రూపము లేదు. నామములేదు. అది ఆకారములేని వాయువును పోలియుండును. దాని యునికి విషయమున సందేహములేదు. శుద్ధ చైతన్యమే బ్రహ్మము - అనఁబడును. బుద్ధిమంతులు దానిని "బ్రహ్మము" అనుపేర నుపాసింతురు. అట్లగుటవారు "బ్రహ్మవిదులు" అనఁబడు చున్నారు. తరు జంతు మానవాది సకలజీవములు దానియందే యున్నవి. కనుటకు, తాకుటకు, ఎఱుగుటకు అదిమూలకారణము. అనేకములకిది ఏకైక మూలము. అదిసకలమున వ్యాపించి యున్నది. అది సత్ చిత్ ఆనందము (సచ్చిదానందము) సత్యము - జ్ఞానము - ఆనందము - ఏకము అగుచున్నది. మనమందఱము అదియే. దానినుండి మనము వేఱుగలేము.

నా. గో. చం:- బాబా! బ్రహ్మము - ఆనందమనినాఁడవు ఏవిధమైన బాధలు లేనిదని. ఏకమని (పెక్కులులేవని) పలికితివి - ఈ విశ్వమున సకలము ప్రతివస్తువు బ్రహ్మము - అనినాఁడవు. ఈ ప్రపంచమున అనేకత్వమే కాదు - బాధలు కానవచ్చు చున్నవికదా! అట్టియెడ ఆనందము - బాధలు, కష్టములు పొందుచున్నట్లు గోచరించుట యెట్లు పొసఁగును? సత్యమైనది అసత్యముగ నెట్లుపొలుచును? మనలో ప్రతి మానవుఁడు తాను బ్రహ్మము - చైతన్యము అని గుర్తించునేని అపుడు పలువురు బ్రహ్మము లుండువలెనా? అదియుఁగాక, మనమందఱమొకే బ్రహ్మమగుదుమేని ఒకడు పొందు బాధలు కష్టములు అందఱు పొందవలయు గదా! అటుల పొందుట లేదు. మన దేహములెట్లు భిన్నములో ఆత్మలుగూడ భిన్నములై యుండవలయునే కాని, ఏకముఁకాదు. అనుగ్రహించి యీ సందేహమును వారింపఁగోరెద.

సా. బా:- నీవు పొరపడుచున్నావు. ఎఱుపు, నలుపు, తెలుపు, నీలము, పసుపు మొదలగు పలువిధములైన రంగులు కలవు. వానిని వేఱువేఱు నీళ్ళలో కలుపుము. రంగులు చేరియున్నను నీరు పూర్వము నీరేకదా! నీటినుండి ఆ రంగులను దూరముచేసిన నీవది గుర్తింపఁగలవు అనగా ప్రతిపాత్రనుండి నీవు తీయునది నీరే. ఆవిధముగానే ఆత్మలేక బ్రహ్మము ఒకటే అది ఆక్రమించు హృదయములు వివిధములు సకల భూత హృదయములందు అధివసించియున్న ఆత్మ ఒక్కటే. సుఖ దుఃఖాదులనిననో అవి బ్రహ్మము లేక ఆత్మయొక్క కార్యములు కావు. అవి హృదయముల పనులు. హృదయ హృదిత్వము కలిగించుటే బ్రహ్మము లేక ఆత్మ యొక్కపని అనగ, ఆత్మ సన్నిధి మాత్రముననే హృది హృదయత్వమొందును.

ఈ విషయము విపులముగ వివరింతును. ఈ శుద్ధచైతన్యము త్రిగుణములద్వారా ముప్విధముల విభజింపఁ దగును. అవి 1. పారమార్థిక సత్యము. 2. వ్యావహారికసత్యము. 3. ప్రాతిభాసిక సత్యము. అని; దేహమునకు బాల్య, యౌవన, వార్ధక్యములను మూఁడు స్థితులున్నట్లు ఈ సత్యమునకు మూఁడు స్థితులు గలవు. పారమార్థిక స్థితియందున్నవాఁడు (సత్పురుషుఁడు) ఆ సత్యమును సత్యముగ భేద రహితముగ చూచును. శాస్త్రీను గుణముగ సకలము నాచరించును. "వ్యావహారిక స్థితి" యందున్నవాఁడు (మంచివాఁడు) శాస్త్ర బోధల ననుసరించును. కాని, ప్రతి పదమున భేదము పాటించుచు, మంచిని మాత్రము స్వీకరించుచు చెడును త్రోసివేయుచుండును. ఇఁక "ప్రాతిభాసిక స్థితి" యందున్నవాఁడు (మూఢుఁడు) సత్యమును యథార్థముగఁగాని ఉన్నది ఉన్నట్లు గాని చూడక భేదమును తారుమారుగ ఁగాంచును. (అనగ మంచిని చెడుగ, చెడ్డను మంచిగ చూచును.) వ్యావహారిక స్థితిలోని వానికి వ్యతిరేకముగ పాటించును. కాని, ఆత్మ - బ్రహ్మము - ఈ ముప్వుర స్థితి యందు సమానమే.

మఱియొక ఉదాహరణము తెలుపుదును. 1. రాజు, 2. రాజ ప్రతినిధి, 3 రాజదూత - కలరు. ఈ ముప్వుర సమానాంశ మొకటి వర్తించుట గమనింపుము - అది 'రాచఱికము' కానీ యీ ముప్వురు భిన్నులు. ఆవిధముగ బ్రహ్మము పై ముప్వుఱ స్థితియందు పఱగుచు భిన్నముగ గోచరించును.

నా. గో. చం:- రాచరికము. (సార్వభౌమత్వము) ఎట్లు విభజింపనగును? అది భేదింపరానిదిగదా?

సా. బా:- అవును. సార్వభౌమత్వ మేకము. అవిభాజ్యము. కాని, ఆ రాచఱికమును పై మూఁడు అంశములఁ గనుచున్నారము. ఆముప్వుర భేదము గమనించుచున్నారము. ఆవిధముగనే చైతన్యము (బ్రహ్మము) అనంతము-అపారము కాని, పరిమితమైన ప్రతి జీవాత్మ (అహమ్) దాని దాని శక్తికొలది పంచుకొని ఆ చైతన్యమును - ఆ రాచఱికమును ప్రకటించుచున్నది. మఱియొక దృష్టాంతము గమనింపుము 'ఆకాశము' ఇది అనంతము - అపారము. ఒక ఘటము (కుండ) నందు చేరి 'ఘటాకాశము' అనియు, కుంభము (బాన) నందుఁజేరి "కుంభాకాశ" మనియు నీ విధముగ వేర్వేఱు నామముల వ్యవహరింపఁబడుచున్నది. ఇవన్నియు పరిమాణము-తర తమ భేదముల ననుసరించి ఆకాశమును గలిగియున్నవి ఆ విధముగ బ్రహ్మము ఈ ప్రపంచమున వివిధ రూపముల గోచరించును. ఇది మాయా ప్రభావము - (క్రీడ) బ్రహ్మము - మాయయొక్క కలయికయే ఈ విశ్వము - బ్రహ్మాండము యొక్క కారణము.

126. నా. గో. చం:- ఈమాయ ఎవరు? ఆమె నెవరు సృష్టించిరి? ఆమె యెట్లుండును? నీ వింతకుముందు ఈ విశ్వసృష్టికి మూలకారణము బ్రహ్మము - (చైతన్యము) అని తెలిపితివి. అట్టియెడ ఈ మాయ యెందుండి చేరును?

సా. బా:- ఆమె యెక్కడ ఎట్లుచేరునో వివరింతును. చైతన్యమును వివిధ రూపముల గోచరింపఁజేయు ఆ చైతన్యముయొక్క

శక్తికి 'మాయ' అను పేరు నిర్దేశింపఁబడినది. చైతన్యమును దాని శక్తినుండి వేర్పఱుపఁ గలవా? నీకు సాధ్యముకాదు. గుడమును (బెల్లమును) దాని మధురత్వము (తీపి) నుండి, సూర్యుని కాంతినుండి వేర్పఱుపఁజాలవుకదా! బ్రహ్మమునందు లయ మొందినపుడే 'మాయ' విడివడును. (మాయ అంతమగుటయే బ్రహ్మమునుండి విడివడుట) చైతన్యమెఱుఁగఁబడిన మాయ అంతమగును. చైతన్యము అనంతము. చైతన్యము - మాయ. ఈ రెండును అనాదులు. మాయా చైతన్యములు - ప్రకృతి పురుషులు అను నామమున వ్యవహరింపఁ బడుచున్నవి. జ్ఞానేశ్వరియందు వీనినిఁగూర్చి విపులముగ వివరింపఁబడినది. దానిని అధ్యయనము చేయుదువేని ఆత్మజ్ఞానము పడయఁగలవు.

చైతన్య మొక గుహ. ఆ గుహను చొచ్చినవాఁడు తిరిగిరాఁడు. ఆ గుహయే అగుచున్నాఁడు.

మాయ కార్యయగును. చిత్రవిచిత్ర గుణములు కలది. నేనట్టివాఁడను - ఇట్టివాఁడను నీవట్టివాఁడవు - ఇట్టివాడవు అని తోపఁజేయుట మాయయొక్కపని ఇవన్నియు అసత్యములైన భేదములు. నీవు మాయా అధీనమున నున్నంత వరకు (అభేదము) సత్యము నీకు బోధపడదు. మాయ ద్వివిధ శక్తులు కలది. 1 'ఆవరణ శక్తి', దీనిచే ఆత్మ జ్ఞానమును-ఆత్మను కప్పిపుచ్చును. 2. "విక్షేపశక్తి' - అటుల కప్పిపుచ్చిన దానిపైన! (ఆకప్పుపైన) కల్పనా చాతుర్యమున ఆరోపితములను (భ్రమలను) కన్పింపఁజేయును. ఈ దృష్టాంతము గమనింపుము.

ఒక కష్టజీవి తాను రాజు అయినట్లు కలఁగనును. అపుడు వాఁడు తన కష్ట జీవనమును మఱచును. ఆ కష్టజీవన స్థితి మాయ యొక్క ఆవరణశక్తిచే కప్పఁబడినది. ఆ కప్పుపైన రాచఱికము - ఆ మాయయొక్క విక్షేపశక్తిచే తోపఁజేయఁబడినది. ఆ విధముగ మాయ బ్రహ్మమును (ఆత్మను) కప్పి, దానిపై ప్రాపంచక రూపములను కనఁబడఁజేయును. వాస్తవముగ ఈ ప్రపంచము లేనిదే - ఉన్నది ఒక సత్యవస్తువు - ఆత్మ (లేక) బ్రహ్మము - మాత్రమే. కాని, యీ దృశ్యములు సత్యములని భావింపఁబడు చున్నవి. అదియే మోసము, (లేక)

భ్రాంతి. కావున ఈ మాయను త్రోసి పుచ్చి, బ్రహ్మమును తిరిగి పడయుము. ఎట్లు? నిన్ను నీవు శుద్ధ చైతన్యముగ భావింపుము. జలమునందుగల కల్మషము తొలగింపఁబడెనేని అది స్వచ్ఛజలమే యగును. ఆ విధముగ ఈ దృశ్య ప్రపంచమునుండి మాయా కల్మషమును తొలగింపుము - అపుడా దృశ్యము సత్యమే యగును. ఇది సద్వస్తువుయొక్క ఉపాసనమగును. (సత్యోపాసన మగును). దీనినిఁ గూర్చి నిరంతరము తలంచుము. ఎల్లరకునేను చేయుబోధ యిదియే. ఈ సద్వస్తువును ఆత్మనుగూర్చి నిరంతర ధ్యానమే ఆధ్యాత్మము. నీవు ఆత్మగా నిన్ను తెలిసికొని యీ పుట్టువుననే ముక్తుఁడవు కావలయును.

## V. దైవము నెఱుఁగుట - సాక్షాత్కారము, దైవమెవరు ?

[ సాక్షాత్కారము :- భగవంతునిఁగూర్చిన అభిప్రాయములు భగవత్సాక్షాత్కారమును గూర్చిన తలంపులు వివిధములు. భగవానుఁడు నిరాకారుఁడు కాఁడని, సాకారుఁడైన వాఁడని విశ్వసించువారికి అట్టి రూపమును సందర్శించుటయే సాక్షాత్కారము. ఆధ్యాత్మిక నిశ్రేణి (నిచ్చెన) యందలి తుదిమెట్టు. దైవముగ భావింపఁబడు రూపములను విశ్వసింపక దైవము నిరాకారుఁడని తలంచువారికి తమ ప్రత్యగాత్మ-పరమాత్మ యందు లయముపొందుటయే సాక్షాత్కారముగ భావింపఁబడు చున్నది. (జీవాత్మ పరమాత్మయందు లయమగుట.)

(దాస్‌గాణూ మహరాజు రెండవ తరగతి వారికి చెందడు. మొదటి తరగతికి చెందినవాఁడే. అతఁడు పండరి వార్కారుల కోవకు చేరినవాడు. కటిన్యస్తహస్తుఁడైన పాండురంగఁడే ఆయన దృష్టియందు పరతత్త్వమైన దైవము ] (శ్రీ బి. వి. ఎన్. స్వామి.)

127 దాస్. గాణూ:- (బాబాతో) బాబా: నాకు సాక్షాత్కారము కావలయును. నీవు భాగవత సప్తాహము కావింపు మంటివి. దాని ఫలితముగ సాక్షాత్కారము ప్రసాదింతువా?

సా. బా:- విఠల్ సాక్షాత్కరించును. కాని స్టేషన్ మాస్టరు అవసరము.

(దా. గా భాగవత సప్తాహము కావించెను. కాని సాధముగ క్రిందుచేసి ప్రాప్తి కలుగలేదు)

దా. గా:- (బాబాతో) బాబా! నీవు సాక్షాత్కారము వాగ్దానము చేసితివి - కాని తత్ప్రాప్తి నాకుఁకలుగలేదు.

సా. బా:- నిదానింపుము - దానిని పొందుదువు.

(బాబా - దాస్‌గాణునందు తగిన విశ్వాసము పెంపొందుటకు- తీవ్రమగు ఆసక్తి కలుగుటకు వేచియున్నాఁడు)

128. 1916 భాద్రపదమందు దాస్‌గాణూ పండరికి వెళ్ల వలయునని తీవ్రాసక్తితో నుండెను. కాని నా. గో. చం. అతనిని శీర్డికిఁ గొనిపోయి సంకీర్తనల జరిపించి, బాబా అంగీకారముతో నతని ఆశ్వయుజ పూర్ణిమ వరకు నిలుపుచుండెను. పండరికివెళ్ళి దైవమును దర్శింపనీయక నన్నిట నిలుపు బాబా గురువెట్లగును?- అని దా. గా. తనలో తానను కొనెను. అతఁడు బాబా తన గురువని భావించకుండెను.

సా. బా. (గాణూతో) పండరికి పొమ్ము.

కావున దా. గా. పండరి నాథుఁడు విఠలే తన దైవమని, బాబా కాడని భావించిన వాఁడగుటచేత అతఁడు ఆశ్వయుజ పూర్ణిమకు పండరికి వెళ్లెను. తరువాత శీర్డికి తిరిగి వచ్చెను.

129. దా. గా:- బాబా! నా అభీష్టము ప్రసాదింపక చాల కాలము గడుపు చున్నాఁడవు. సాక్షాత్కార మెప్పుడు నా కనుగ్రహింతువు?

సా. బా:- నన్నుచూడుము! అదియే సాక్షాత్కారము. నేను దైవమను.

బాబాయందు విశ్వాసములేని కోపర్గాం స్టేషన్ మాష్టరు బాబాతో - ఇదంతయు ఏమి?

సా. బా:- నా దగ్గఱకువచ్చు ప్రతిపాత్రి మూతిని క్రిందుచేసి కొని వచ్చును. (అనగా (జలము) స్వీకరించుటకు వీలుపడని విధముగ)

ii. అర్హతను పొంది పిదప అడుగుము

132. చూడవచ్చినవాఁడు:- బాబా! భగవానుఁడెట్లుండును?

సా. బా:- (ఆ పరీక్షకునిఁగాక ఒక భక్తునిచూచి) మార్వాడీ బాగ్ చందు దగ్గఱకు వెళ్లి, బాబాకు నూరు రూపాయలు కావలెనని అడిగి తీసికొనిరమ్ము!

భక్తుఁడు:- (వెళ్లి వెంటనే తిరిగివచ్చి) ఆ మార్వాడీ తన దగ్గఱ ధనము లేదని, తనవందనము లర్పింపుమనినాఁడు.

సా. బా:- (వేరొక ఋణదాతపేరు చెప్పి) అతని దగ్గఱకువెళ్లి నూరు రూపాయలు అప్పు అడిగి తెమ్ము.

భక్తుఁడు:- (వెళ్లి తిరిగివచ్చి) తనదగ్గఱ పైకములేదనినాఁడు.

సా. బా:- నానాసాహెబ్ చందోర్కరును పిలువుము!
(చందోర్కర్ రాగానే)

సా. బా. నానా! నాకు నూరు రూపాయలు కావలెను.

నా. గో. చం. వెంటనే బాగ్‌చంద్ మార్వాడీకి రు. 100 లు పంపుమని చీటి వ్రాసి పంపెను. మార్వాడి పైకము పంపెను.

సా. బా:- ఈ ప్రపంచమున సకలము ఇట్లుండును.

పరీక్షకుఁడు:- (తరువాత దాస్ గణూతో) బాబా నా ప్రశ్న మునకేల సమాధానమీయలేదు?

దా. గ:- సమాధాన మిచ్చినాఁడు.

పరీక్షకుఁడు:- ఎట్లు?

దా. గా:- ఇతరులడిగిన ధనము దొరకలేదు. చందోర్కరు అడిగిన వెంటనే లభ్యమయ్యెను. ఆ విధమున బ్రహ్మమునుగూర్చి తెలిసి కొన గోరిన మాత్రమున నతఁడు తెలిసికొనలేఁడు. అర్హతపొంది ఆవల బ్రహ్మమునుగూర్చి తెలిసికొన గోరుమని బాబా సమాధాన మిచ్చినాఁడు.

iii. బ్రహ్మమును తెలిసికొనగోరిన అయిదు సమర్పింపుము.

133. ఒక దినమున నొక ధనికుఁడు జేబునిండుగ కరెన్సీ నోట్లు పెట్టుకొని బాబాను దర్శించుటకు శిర్డికిఁజేరెను. రానుపోను బాడుగకు టాఁగా మాట్లాడుకొనెను. శిర్డియందాలస్యముచేసిన బండి మనిషి ఎక్కువ బాడుగ అడుగునేమోయని జంకుచుండెను.

బాబానుజేరి మ్రొక్కి,

ధనికుఁడు:- బాబా! నాకు, సకలము కలదు ఏలోటు లేదు. నాకు దైవమును జూపుము. నే నింతదూరము దానికొఱకే వచ్చితిని. అందఱు 'శిర్డిబాబా' దైవమును శీఘ్రముగఁ జూపఁగలఁడని చెప్పుదురు.

సా. బా:- మంచిది! సందేహింపకుము, ఇప్పుడే స్పష్టముగఁ జూపుదును. ఇది జాగుచేయఁదగిన విషయముకాదు. దైవముకొఱకై కోరువారు దొరకుట చాల అరిది. ఇచటకు చేరువారు పలువురు ధనము- ఆరోగ్యము - సుఖము - కీర్తి - సంతానము - ఉద్యోగము మొదలగునవి కోరుదురేకాని, దైవము నెవ్వఁరు కోరరు. దైవము కోరు వారి కొఱకు నే నెదురు చూచుదును.

ఈ విశ్వమునకు బ్రహ్మము మూలకారణము. సూర్య చంద్రాది గ్రహములు - దివా రాత్రములు - ఋతువులు హాయనములు దైవము నాధారము చేసికొని పర్తించుచుండును. అట్టి బ్రహ్మమును జీవి తన దేహపతనమునకు పూర్వమే యెఱుఁగవలయును. లేనిచో జనన మరణ చక్రమునఁబడి తిరుగుచుండును. 'ఎఱుక' వలన కేవలాద్వైత సుఖము జీవికి ప్రాప్తించును. గురువు ఆ "ఎఱుక"ను ప్రసాదింపఁ గలఁడు. అది గురువునకే సాధ్యమగును.

( బాబా ప్రక్కకు తిరిగి ఒక పిల్లవానిని పిలిచి )

సా. బా:- మార్వాడి నందలాల్ దగ్గఱకువెళ్ళి నాకు 5 రూపాయలు అప్పు కావలయునని అడిగి తీసికొనిరమ్ము - ఆ బాలుఁడు తిరిగి వచ్చి నందలాల్ లేడని చెప్పెను. ఆ విధముగ బాబా ఇండ్లలో లేని వారిదగ్గఱ కొబాలుని పంపెను. ఆ బాలుఁడు రిక్తహస్తములతో తిరిగి వచ్చెను. ఆ వచ్చిన ధనికుఁడు మిక్కిలి చీకాకుపడుచుండెను. దైవము నెఱుఁగుటను గూర్చికాదు. శిరిడియందు ఆలస్యము చేసినకొలది, టాంగా వాఁడు పెచ్చుబాడుగ కోరునేమోయని ఆతని ఆందోళనము. బాబా దైవ సాక్షాత్కారము - (ఆత్మజ్ఞానము) వెంటనే ప్రసాదింపఁడేమి? - యని విసుగొందు చుండెను. బాబా 5 రూపాయల కొఱకు ఆ పిల్లవానిని పలు తావులకు త్రిప్పుచుండుట అతడు చూచుచునే యుండెను. అతని జేబులో ఏఁబది 5 రూపాయలు నోట్లుండెను. 5 రూపాయలు బాబాకు అప్పు యిచ్చిన, వానిని తిరిగి రాఁబట్టుకొనఁ జాలమేమోయని అతని జంకు, ఆ ధనికుడు ఆలస్యమును సహింపలేక

ధనికుడు:- బాబా! బ్రహ్మమును నేను పడయుటకు సాయ పడుదువా? లేదా?

సా. బా:- నీవు బ్రహ్మమును పడయుట కొఱకే నే నింతవరకు ప్రయత్నించు చున్నాఁడను. నీవు చూచు చుంటివిగదా! కూర్చున్న వాఁడవు కూర్చున్నట్లే నీవు బ్రహ్మమును గాంచునట్లుచేయ ప్రయత్నించు చుంటిని.

ధనికుడు: బాబా! నేను త్వరగా వెళ్ళవలె. దయయుంచి బ్రహ్మమును జూపుము.

సా. బా:- నీవేమియు గ్రహించలేదా? నాకు అయిదు కావల యును. బ్రహ్మమును జేరుటకు నరుఁడు అయిదు సమర్పింపవలయును.

అనగా:- 1 అయిదు ఇంద్రియములు, 2 ప్రాణములు, 3 మనస్సు, 4 బుద్ధి, 5 అహంకారము. (ఇట్టి సమర్పణము వైరాగ్యమనఁబడును) బ్రహ్మజ్ఞాన మార్గము చరింప మిక్కిలి కష్టమైనది. ఎల్లరా మార్గమున నడువఁజాలరు. (ఆ వైరాగ్యము) అది ఉదయమైన వెలుతురు పొసఁగును. లౌకిక పారలౌకిక విషయముల విరక్తిఁ గాంచువాఁడు మాత్రమే బ్రహ్మజ్ఞానము పడయఁదగినవాఁడు. (తనకు బ్రహ్మజ్ఞానోపదేశము పొందుటకంటె 5 రూపాయల మీదఁగల గాఢమగు ఆసక్తిని బాబా తెలిసికొనఁజాలెనని ఆ ధనికుడు గ్రహించి సిగ్గునవెడలెను.)

బాబాను జేరువారందఱు ఫలముఁ బడయుదురా?

134. దామోదర్. యస్. రసానే ఈ ప్రశ్నము తలంచుచు బాబాముందర కూర్చుండెను.

సా. బా:- (రసానేతో) ఆ పూచిన మామిడి చెట్టును చూడుము! ఆపూతఅంతయు కాయలుకాసి పండిన అది యెంత చక్కనిపంట అగును? కాని, కాయునా? పూతగనో పిందెలుగనో గాలికి చాలభాగము రాలి పోవుచు, ఏ కొలదియో శేషించును.

vii. బాబా కోరునది సంపూర్ణ శరణాగతి (సర్వ సమర్పణము)

135. సా. బా:- (గోపాలరావు బూటీతో) నాకు 16½ రూపాయలు దక్షిణ ఇమ్ము!

బూ. టీ:- ఇప్పుడిచట నా దగ్గఱ పైకములేదు.

సా. బా:- కాకా దగ్గఱకువెళ్ళి 16½ అడుగుము. అతఁడు పఠించుచున్న పారాయణ గ్రంథము వినుము.

బూ.టీ:- హ. సీ. దీక్షిత్తు దగ్గఱ కేగి 16½ రూపాయలడిగెను.

హ. సీ. దీ:- ఒక్క రూపాయి మాత్రమున్నది. రు 16½ ఈయజాలను.

బూ. టీ:- బాబా నీవు పఠించు గ్రంథము వినుమనినాఁడు అంతట హా. సీ. దీక్షిత్తు భాగవతము చదువదొడఁగెను. అపుడు చదివిన శ్లోకము.

"కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్వభావాత్
కరోమి యద్యత్సకలంపరస్మై నారాయణా యేతి సమర్పయామి."

ఇందు మనముచేయు సకల కర్మములు దైవమునకు సమర్పణ చేయుడని తెలుపఁబడినది. తాను దైవమగుట బాబా తనకు సర్వ సమర్పణ చేయుఁడని తెలిపినాఁడు. కాని, అందు 16½ రూపాయలు ఆ శ్లోకమున ఎచట కలవు? ఒక విధముగనందు 17 శబ్దములు కలవు. మఱియొక విధమున సమర్పణ చేయఁబడదగిన వస్తువులు 16. కాని మూలమున చిత్తము విడువబడినది. అపుడు 17 అగును. కాని 'చిత్తము' ½ అర్ధమే అగును. అట్లగుట అందుఁదెలుపఁబడిన 16½ వస్తువులు బాబాకు సమర్పణ చేయఁబడదగును — అపుడు 'సర్వ సమర్పణ' మగును.

అన్నాసాహెబ్ దభోల్కర్

136. అన్నాసాహెబ్ దభోల్కర్ — సాక్షాత్కారము పొందవలయునను ఆసక్తితో బాబాముందల కూర్చుండి "బాబా ఏదియో యొక దినమున నాకు ఉపదేశము చేయకుండునా?" అని, తనలో తలంచెను.

సా. బా:- తెమ్ము — శ్యామా దగ్గఱకు పొమ్ము! అతని దగ్గఱ నుండి 15 రూపాయలు దక్షిణ తెమ్ము. అచట కొంత తడవుండి సంభాషించుము. తరువాత దక్షిణ తెమ్ము అతఁడిచ్చును.

దభోల్కరు — శ్యామా దగ్గఱకు వెళ్ళి ఆ విషయము తెలిపెను.

శ్యామా:- రు. 5 లు దక్షిణ బదులు నా 15 నమస్కారములు సమర్పించి అదియే నా దక్షిణయని చెప్పుము.

దభోల్కర్:- కాని, బాబా నీదగ్గఱ కొంత తడవుండి సంభాషించి, తరువాత నీవిచ్చు దక్షిణ కొనిరమ్మనినాఁడు. ఇదంతయు నేను

బాబా మ్రోలకూర్చుండి బాబా నాకుపదేశము తప్పకచేయును అని తలంచుచున్న కారణము.

శ్యామా:- సర్వసాధారణముగ బాబా ఎన్నడు ఎవరికి ఉప దేశము చేయండనియే అందఱి అభిప్రాయము. ఏ భక్తుని చెవిలో మంత్రము ఊదియెఱుంగడు. అట్టి మంత్రోపదేశ నిరాకరణముంగూర్చి యొక వృత్తాంతము కలదు.

137. రాధాబాయి దేశముఖిక్ – అను ఆమె బాబావలన ఉపదేశము పొందంగోరి బాబాదగ్గఱకు వచ్చెను. బాబా ఉపదేశింపని కారణమున సత్యాగ్రహమునకు నిశ్చయించుకొనెను. బాబావలన ఉప దేశము పొందుటో లేక ప్రాణత్యాగము కావించుటో ఏదియో ఒకటి జరిగి తీరవలయునని ప్రాయోపవేశముచేసి ఉపవసించెను. అటుల మూఁడు దినములు వ్యర్థముగ ఉపవసించిన పిదప, ఆమెకొఱకు నేను జోక్యము కల్పించుకొని, ఏదొక దైవనామ మంత్ర మామెకు ఉపదేసింపుమని బాబాను కోరితిని. ఆమెను పిలువనంపి బాబా ఆమెతో నీ విధముగఁ బలికెను.

"అమ్మా! మరణింపవలయునని తలంచి నీవేల హింస కావించు కొనఁ జూచెదవు? నీబిడ్డనగు నాపై దయవహింపుము. నేనొక ఫకీరును. భిక్షుఁడను. ఇటు చూడుము! నా గురువు గొప్ప సాధు సత్పురుషుడు. అపార కరుణామయుఁడు. ఆయునను సేవించుటకు మిక్కిలి శ్రమించితిని. కాని, ఆయున నాచెవిలో ఏ మంత్రము పలికి యెఱుఁగఁడు. ఉపదేసించు టకు బదులు నాతల శుభ్రముగ గొరిగించి రెండు పైసాలు నన్నీయుమని కోరెను. ఆయనకు కావలసినవి నాపైసలు కావు. బంగారు రాశులనేని ఆయన లెక్కగొనడు. కాని, అవి 1. నిష్ఠ (గాఢ విశ్వాసము) 2. సబూరి. (ధైర్యముతో కూడిన ఓర్పు) నేను వెంటనే సమర్పించితిని. ఆయన సంతోషించెను.

తల్లీ! 'సబూరి' అనునది ధైర్యము. దానిని విడనాడకుము దవ్వులనున్న గమ్యమునకది నిన్ను మోసికొని పోవును. అది మానవు

లందు మానవత్వమును ప్రసాదించును. పాపముల నిర్మూలించును. నిరాశానిస్పృహలను బాపును. సకల భయములను ప్రతిఘటించును.

సాటిలేని కరుణా స్వరూపుఁడగు నా గురువును 12 సంవత్సరములు సేవించితిని. నాయెడ నా గురుస్వామి వఱపిన ప్రేమ యేమని ఎంతని వివరింపఁగలను? ఆయన ధ్యాన నిష్ఠయందున్న తఱి ఎదుటఁ గూర్చుండి నా దృష్టి నాగురువుమీదనే కేంద్రీకరించితిని. ఇరువురము ఆనంద ప్రపూర్ణులమైతిమి. ఇతరములమీద నాదృష్టి సారించి యెఱుగను. ఆకలిదప్పులను మఱచి రేయింబవళ్లు నా గురుదేవుని ముఖాబ్జమునే అవలోకించితిని. నా గురుస్వామి యెడబాటు క్షణమైనను నాకు అశాంతి కలిగించెడిది. నా గురువునుతప్ప నితరమును ధ్యానించి యెఱుఁగను. గురువునకంటె నితర ఆశయము-గమ్యము నాకులేదు. నిరంతరము నా మనస్సు (లక్ష్యము) ఆయనమీఁదనే నిలుపఁబడి యుండును. నా గురుదేవుని లీలలు అత్యద్భుతములు. నా గురువునుతప్ప నితరమును నేను కోరియెఱుఁగను. నా ప్రేమను తప్ప నితరమును నా వలన ఆయన కోరియెఱుఁగడు. ఏమియు చేయని యట్లు వెలికి ఆయన తోచినను నన్నెప్పుడు ఏమఱి యెఱుఁగఁడు. కరుణా కటాక్ష వీక్షణమున నన్ను రక్షించినాఁడు.

ఈ మసీదున కూర్చుండి నేను యథార్థము పలుకు చున్నాఁడను. నా గురుస్వామి నా చెవిలో నేమంత్రము ఊది యెఱుఁగడు. నేనును నీచెవిలో ఊదగలిగినది యేమియులేదు. వెళ్లుము — నీవును ఆ విధముగఁ జేయుము.

నీ తలంపులకు నన్నేకైక లక్ష్యము చేసికొంటివా నీవు పరమార్థము పడయఁగలవు. చలింపని శ్రద్ధతో నన్ను చూడుము. నేనును నిన్ను చూతును. నా గురుదేవుఁడు నాకు బోధించిన ఏకైకసత్యము ఇది యొక్కటె. చతుర్విధ సాధనములతో ఆరుశాస్త్రములతో నీకు అవసరములేదు. గాఢమైన విశ్వాసము (శ్రద్ధ)తో నీ గురువును విశ్వసింపుము. అది చాలును."

శ్యామా:- ఆ కాంత ప్రణమిల్లి బాబా బోధల స్వీకరించి సత్యాగ్రహము విరమించెను. అంత దభోల్కరు బాబానుజేరి జరిగిన విషయమంతయు బాబాకు తెలిపెను.

137-A. మంత్రోపదేశము బాబా కాని, బాబా గురువులు గాని ఆశ్రితులగు శిష్యుల కెవరికిని చెవిలో మంత్రోపదేశములుచేసి యెఱుఁగరు. (చూ. 623-4) కాని, రామమంత్రము జపింపుమని ప్రధాన్ మొదలగు వారికిఁదెలిపినాఁడు (చూ. 192 మొ॥లు 198 వరకు)

138. మా విధానము ప్రత్యేకము ఇది జ్ఞప్తియందుంచుకొనుము. ఆత్మజ్ఞానము పడయుటకు ధ్యానము అవసరము (అనగా) ఆత్మానుష్ఠానము మనస్సుకు ప్రశాంతిఁగూర్చి సమాధికిఁగొనిపోవును. కావున సకల కామితముల పరిత్యజించి, సకలమున అధివసించియున్న దైవమునందు నీ మనస్సును నిలుపుము. మనస్సు ఆ విధముగ కేంద్రీకరింపఁబడిన గమ్యము సిద్ధించును.

ధ్యానమునకు నా సగుణ రూపమునుగాని లేక నా నిర్గుణ (ఆనంద) స్వరూపమును గాని చింతింపుము. అట్టి నిరాకార ధ్యానము కష్టముగ తోచిన నీవిచట చూచునా రూపమును ధ్యానింపుము. రేయింబవళ్ళు దానిని తలంచుము. అట్టి నిరంతర ధ్యానమున మనస్సు (పరతత్త్వమున) లయించును. అపుడు ధ్యేయము - ధ్యాత - భేదము, తుదకు ధ్యానక్రియయు శమించును. ఇదియె చైతన్యఘనత - బ్రహ్మ సమరసతగ పరిణమించును. గురుదేవుని కరుణారసార్ద్ర దృష్టియె ఆశ్రితుఁడుగు శిష్యునకు షడ్రసోపేత భోజనము.

139. అపుడు కలకండ ప్రసాదము దభోల్కరునకు ఒసంగి, బాబా యిట్లనెను.

ఈ సుబోధ నీ మనస్సున పాదుకొలుపు కొందువేని నీ జీవితము ఈ కలకండవలె మిక్కిలి మధుర మగును." - సద్గ్రంథ పఠనము - శ్రవణము, మననము, నిధిధ్యాస, స్మరణము, ధ్యానము ఇవి యన్నియు ఆనందఘన ప్రాప్తికి సాధనములు - అని బాబా

తెలిపెను. ఈ దృశ్య ప్రపంచమంతయు మాయ ద్వారా ఆవిష్కరింపఁబడిన బ్రహ్మముయొక్క రూపము. ఇది తిరిగి బ్రహ్మమునందు లయమగును. ఆత్మ యొకఁడోలేక యీ జీవులవలె అనేకులో సకల శాస్త్రములను పరిశీలింపుము. ఎందుండి యీ సకలము ఆవిర్భవించెనో అట్టి కేవల ఆత్మ నెఱుఁగుటయె జ్ఞానముయొక్క పరమావధి, (మకుటము).

140. ఋణాను బంధమునఁజేసి నీవు నన్ను జేరితివి. ఇట్టి ఋణాను బంధము నాదరింపుము. ఏ ప్రాణియైన నిన్ను జేరెనేని నిరసించి, వెడల నడపకుము. సాధ్యమగు నట్లాదరింపుము. ఆకలిఁగొన్నవానికి అన్నము, దప్పి గొనిన వానికి నీరము, వస్త్రహీనునకు వస్త్రము యథా సాధ్యముగ నొసఁగుము. అట్లు కావించితివేని భగవానుఁడు సంతసించును. ఇతరులపై ఆగ్రహావేశములఁ బ్రకటించి, కటువులఁబలుకకుము. ఇతరులతో కలహింపకుము. ఇతరులు నిందించిన ఓర్పు వహింపుము. శాంత వచనములు పలుకుము. ఇది సుఖ ప్రాప్తికి మార్గము. ఇతరులు - ప్రపంచము తలక్రిందులు గానిమ్ము! - దానిని నీవు పాటింపకుము. చలింపక యుక్కునకు సూటిగ నీ మార్గమున పొమ్ము.

ఈ ప్రపంచమున నిన్ను - నన్ను, ఒక జీవినుండి మఱియొక జీవిని వేర్పఱచు గోడ - "భేదకుడ్యము" కలదు. ఈ గోడను పడఁగూల్చుము. భగవానుఁడే మహాప్రభువు. ఆ దైవకార్యములు (లీలలు) అద్భుతములు - అమూల్యములు - శాశ్వతములు. క్రమముగ నీ ఆశయములు ఫలించును. మనము పరస్పరము ప్రేమాభివృద్ధిఁబడసి, శాశ్వతానందము పొందఁగలము.

## సాధనములు 1. సాధనము - విశ్వాసము

141. తన గురువు తనవలన కోరిన విధమున - బాబా తనవారివలన గాఢవిశ్వాసము కోరువాఁడు.

నా గురుదేవుడు నాకుగల సకలమును తొలగించి, రెండు పైసాలు నీయుమని కోరెను. నేను సమర్పించితిని. ఆయన కోరినవి నాణెములుకావు.

ఆయన కోరినది 1. నిష్ఠ (విశ్వాసము) 2. సబూరి - (ఓర్పు) (ఉత్సాహ ధైర్యములతో గూడిన సహనము).

142. పురందర్! నాకు రెండు రూపాయలు దక్షిణ నిమ్ము! నేను కోరునది యీ నాణెములు కావు - నేను కోరునది

i. విశ్వాసము - ii. సహన సంతృప్తి.

143. బాబా పరీక్ష. విశ్వాసము పెంపు చేయుట. ఉదా -

1. నానా! (గో. చం.) భోజనముచేసి రైలునకు వెళ్ళుము. వ్యవధి కలదు.

2. నానా! ఈ దినమున కోపర్గాంనకు కలెక్టరును కలయుటకై వెళ్ళవలదు. (కలెక్టరు ఆ దినమున రాలేదు తంతినంపెను).

3. దాదా! (కేల్కారు) సాహెబును (హ. వి. సాఠే) అధికారులను కలయుటకు మన్మాడు వెళ్ళనీయకుము.

(అధికారులు వారి కార్యక్రమము రద్దుచేసికొనిరి)

4. కాకా! (దీక్షిత్) 'విల్లు' వ్యాజ్యముఁగూర్చి వాదించుటకు బొంబాయికి వెళ్ళవద్దు. (ఆవ్యాజ్య దినమున విచారణకు తీసికొనఁబడలేదు)

5. కాకా! నీ పిల్లవానిని పరీక్షలకిపుడు పంపవలదు. (ప్లేగు వలన పరీక్షలు కొన్ని దినముల తరువాతకు మార్చబడినవి.)

6. మౌలానా! నీమీద మోపఁబడిన నేరము విచారణకు మేజిస్ట్రేటు కోర్టునకు ఈ రోజు వెళ్ళవలదు.

( ఆ విచారణ వాయిదా వేయబడినది )

7. తాత్యా! నీవీరోజున బజారునకు వెళ్లవలదు.

8. తాత్యా! ఈ రోజున కోర్టునకు వెళ్లవలదు.

( విచారణ వాయిదా వేయఁబడినది )

9. రంగారి తాన్కర్! తిరిగి వెళ్ళకుము –

[ ఆతఁడు వెళ్ళెను – మార్గమున జట్కాబండి విఱిగెను ]

10. మేనేజర్! (సదాశివ్ తార్కాడ్) వెంటనే పూనాకు వెళ్లుము.

11. హన్సిరాజ్! నీ ఉబ్బసము వ్యాధికి మందు లేమియు తీసికొనవలదు.

12. బాబుగిర్! (గోసావి) జల్గోనునకు పొమ్ము! సకలము సమకూర్చఁబడును.

( నా. గో. చం. కుమార్తె మీనా తాయిప్రసూతి సందర్భమున జమ్నేరు ప్రయాణము )

13. ఖాప్! ( పురందర్ ) రైలువేళ దాటినను కోపర్గామునకు పొమ్ము! (రైలు ఆలస్యముగ వచ్చెను)

* 14. బేరే! కోపర్గామునకు వెంటనేపొమ్ము! దారిలో ఆగవద్దు. ఆలస్యము చేయవలదు.

( బేరే దొంగలదాడి తప్పుకొనెను )

---

* (గమనిక) [బాబా పలికిన పలుకులను గూర్చిన వివరములు "బాబా శక్తులు – తనబిడ్డలపై బాబాప్రేమ" అను శీర్షికక్రింద తరువాత తెలుపబడినవి ]

## బాబాకు హైందవ దైవములందుఁగల ఆదరణ

144. ఒక సమయమున బాబా కూర్చున్న చావడిలోనికి వర్షము జల్లు పడుచుండెను. అక్కడ భక్తులు మారుతి విగ్రహము నిలుపఁబడిన ఎత్తు అరుగుమీదఁ గూర్చుండుమని బాబాను కోరిరి.

సా. బా:- దైవమునకు సమానస్థానమున మనమెట్లు కూర్చుండఁ గలము?

144-A. 175 గోప్యవిషయమున బాబా ఆజ్ఞ-

తాయిబాయి జోగ్‌నకు నేత్రబాధ కలిగెను - నేత్రములు లోలోనికి కుంగుచుండెను. బాబా ఒక సాధారణమైన తేలిక చికిత్స తెలిపి, "దీనిని గోప్యముగ నుంచుము. ఇతరుల యెదుట ఆ ఔషధము వాడవలదు" అనెను. బాబా తెలిపిన విధమున నామెచేసెను. వ్యాధి నివారణమయ్యెను.

"ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం మంత్రౌషధ సమాగమాః
దానమానావ మానాశ్చ నవగోప్యా మనీషిభిః."

145. సా. బా:- (అప్పాకులకర్ణితో) నివాస్‌లోని మోహినీ రాజు (శివావతారము) సగుణబ్రహ్మము. వెళ్ళుము .. డిప్యూటి కలెక్టరు ఎదుట హాజరగు పూర్వము స్వామి దర్శనము చేసికొని పొమ్ము. [అ. కు. ఆవిధముగఁ జేసెను. అతఁడు నిర్దోషియని తీర్పు చెప్పఁబడెను.]

శ్యామా మఱియితరులు:- (బాబాతో) బాబా! పురాణములు సత్యము లేనా?

సా. బా:- అవును. సత్యములే.

శ్యామా:- శ్రీరాముఁడు - శ్రీకృష్ణుఁడు వీరినిఁగూర్చి నీ అభిప్రాయ మేమి?

సా. బా:- వారు మహాత్ములు - వారు దైవములు - అవతారములు.

## విఠల్ ఎడ బాబాకుగల ఆదరణము

146. బల్వంతరావు క్షీరసాగర్ - శిర్డీకి వచ్చినపుడు

సా. బా:- ఈ కుమారుఁడు తనతండ్రి కావించినటుల విఠోబాను పూజింపఁడు. నైవేద్యము సమర్పింపఁడు విఠోబాను నన్ను పస్తుపెట్టుచున్నాఁడు. ఈతని తండ్రి నామిత్రుఁడు. కావున నీతని నిక్కడకు ఆకర్షించితిని. ఈతని తండ్రి కావించిన పూజ తిరిగి ప్రారంభింపుమని జ్ఞప్తి పఱపు చున్నాను.

## బాబా - హైందవ దైవములు - అవతారములు

147. (బాబా అబ్దుల్ భాయి సమక్షమున నిట్లు పలికెను.)

ప్రథమమున - ఓంకారము.

| | | |
|---|---|---|
| ఓంకారము | నుండి | భావకారము |
| భావకారము | ,, | ఆధ్ |
| ఆధ్ | ,, | ఆలెక్ |
| ఆలెక్ | ,, | నిరంజనము |
| నిరంజనము | ,, | నిరాకారము |
| నిరాకారము | ,, | నిలము |
| నిలము | ,, | అనిలము |
| అనిలము | ,, | సున్నె |
| సున్నె | | |
| కేశవ | | |
| అమ్రు | | |
| ఉత్త్రర | | |
| పూర్వ | | |
| రక్ష | | |

| | | |
|---|---|---|
| మత్స్యావతారము | | |
| మానవత | | |
| అస్మిత్ర | | |
| జమ్రిడ్ | | |
| భగీరీథ్ | | ( భగీరథ ? ) |
| ఉచ్ఛయత | నుండి | దేఖయత |
| భలింతర | | ( బలి ? ) |
| తిర్మక్రి | | (త్రివిక్రమ?) |
| కచ్ఛావతారము | | |
| ఉచ్ఛాయట్ | ,, | దేఖాయట్ |
| ప్రజాపత్ | | |
| ఉగ్రసేన్ | | |
| కాదిన్ | | |
| దల్భరక్షర | | |
| వరాహావతారము | | |
| ఖాలేపత | | |
| గోత్రి | | (గౌతమ?) |
| విష్ణు | | |
| హరీతక | | |
| బబ్రిసేర | | |
| నరసింహావతారము | | |
| సేజ్బార్ | | |
| రేబక | | |
| బందోపస్త్ | | |
| బైల్‌చంద్ | | |
| కాశిప | | (కాశ్యప?) |
| వామనావతారము | | |
| సామ | | |
| జాన్న | | |

మైయాన
నూర్
తేజ
కమాల్
కద్రిమ
అద్బుద
గుస్తత్వ
కద్వాయ్ (కవి?)
అనర్థ
జయవ
అవి
అధస్త ధర్మ
మాంధాత
విష్రన
జమదగ్ని
పరశురామ (అవతారము)
రాజాజి జతి
కావడిక
రాజ దశరథ
రామచంద్రజీ (అవతారము)
అంకుశ
భద్మపురుష
హిర్బల
బాజల
పిర్తు (పృథు?)
ఇదురత్న (యదు?)
సూరసేన
వాసుదేవ
శ్రీకృష్ణ (అవతారము)

పిదప ప్రతిమదన (ప్రద్యుమ్న?) అనురుద్ధ - (అనిరుద్ధ?) ఈశితార్ - బద్ధ (బుద్ధ?) జాలి - అవతారము (కలిక్క్యవతారము)

బ్రాహ్మన - రాజపుట్ (క్షత్రియు) గౌలి (వైశ్య) తరువాత ముసల్మాన.

చతుర్యుగ - కృతయుగమున నాలుగు అవతారములు త్రిత (త్రేతాయుగమున) మూడు అవతారములు ద్వాపరమున రెండు అవతారములు.

అథర్వనలో (కలియుగమున) ఒక అవతారము దశావతారములు మత్స్య-కచ్ఛప, వరహ. నరసింహ, వామన, పరశురామ, (శ్రీరామ) శ్రీకృష్ణ, బుద్ధ. కలకి, ఇబ్రిహిం 4 వేదములను సిద్ధపఱచెను. దీని ప్రతి పాదించుటకు కలమ్ - షరిఫ్ వెలువరింపఁబడెను. దైవవిధాన మంతయు భగవానునికే ఎఱుక.

ఖుదరత్ ప్రతి వేదమునందు వేల అవతారములు వెలువడెను. కాని ప్రతిజమానా (జీవితము) యందు రూపములు (ఇవాదత్) వేర్వేరు నూతనము. 8 మంది యూబి చక్రవర్తులు హిందూస్థానమును పాలింతురు. ఇది 18వ పురాణము 'కురాను' నందు కలదు.

## హైందవ దైవములందు - పూజావిధానములందు బాబాకుగల ఆదరము

148. సా. బా:- (సగుణ్ మేరు నాయక్‌తో) అన్నమునందు నేతినిజేర్చి ధుని (అగ్ని)యందు అహుతి కావింపుము. అన్నాహుతి తరువాత నాకు సమర్పింపుము.

148-A. (రోహిల్లాతో) విఠల్ మొదలగు వారందఱు 'అల్లా' అయి యున్నారు.

148-B. (దా. గాణూ - ఉపాసనితో) ఖండోబా - శివావతారము విఠోబా - విష్ణు అవతారము. ఇరువురు నొకరే.

## భగవానునిఁగూర్చి ఎఱుఁగవలసినదే కాని పలుకరాదు.

149. సా. బా:- (దైవమును గూర్చి యేమేమో పలుకు చున్నవానితో) 'దేవుఁడు – దేవుఁడు' – అని యేమేమో పలుకు చుంటి వేల? దేవుఁడు నా జేబులో నున్నాఁడు.

150. "చంపువాఁడు రక్షించువాఁడు. రక్షించువాఁడు చంపు వాఁడు."

151. సా. బా:- (టి. ఏ. కార్తిక్‌తో దేవుఁడు అంతదూర మున నున్నాఁడా?

"నహీ ఆకాశకో ఊపర్ - నహిపాతాల్ కే అందర్
సదాతో పాస్‌హైతేరా - కహాఁడుండన్కు జాతాహై?"
(బ్రహ్మానందుని గేయము)

అతఁడు ఆకాశముపైనలేఁడు పాతాళము క్రిందలేఁడు ఎల్ల పుడు అతఁడు నీ దగ్గఱనే యున్నాఁడు. ఆయనను వెదకుటకు నీ వెక్క డకు పోవుచున్నావు?

(మానవ రూపమునగల దైవమును జూడుము)

ఈ దినములందు విశ్వాసము క్షీణించు చున్నది ॥మొ॥

152. సా. బా:- ఇది పిదప కాలముగ నేర్పడినది. జనము లితరులను ద్వేషించుచు నిందించుచుందురు. నాకు ప్రతీకార వాంఛ లేదు. అట్టిపలుకులను లవమేని వినఁగోరను.

జనులంత కంతకు మూర్ఖులగుచున్నారు. వారెల్ల వేళల నెల్లెడల మలినము చెడు పైపునకే దృష్టిమరల్చు చుందురు.

కోరికలులేని ఫకీరులును అరుదుగనున్నారు.

మంచి ఫకీరు కనుగొనుట కష్టము.

153. నేను పెద్దకాలము యోజించుచు రేయిబవళ్ళు తలంచుచునే యున్నాను. అందఱు దొంగలే. కాని, వారితో మనము మెలఁగవలయును. అట్టివారిని చక్కదిద్దుటయో లేక తొలగించుటో ఏదొకపని చేయుమని దైవము నహర్నిశలు ప్రార్థించు చున్నాను. కాని దైవము జాగుచేయు చున్నాఁడు. నా ప్రార్థనమును మన్నించి అనుగ్రహించుట లేదు. ఒకటి రెండు నెలలువేచి చూచెదను. బ్రతికిన చచ్చిన నేను ప్రార్థించునది తప్పక పొందుదును. నేను వారిని వీరినిఁజేరి చెప్పను, ప్రార్థింపను. జనులు సాధారణముగ సాధువర్తనులై దైవభక్తి సలుపరు. వారు స్థిరబుద్ధి లేనివారు. ఏ కొలఁదిమంది మిత్రులుచేరి, దైవమునుగూర్చి భాషించుచు కూర్చుండి యోజింతురు.

154. (1918) జనులు దుష్టులై కష్టములను కలిగించుచున్నారు. ధనమునకై నన్ను బాధింతురు. సిగ్గును సైతము విడనాడు చున్నారు. నేనిపుడు విసుగు నొందుచున్నాడను.

## సాధనము II. వస్తువులను పూజించుట

### (a) విగ్రహములు

155. మార్గమధ్యమున సుళువుగ అందుబాటైయున్న దత్తస్వామి మొదలగు దైవ మూర్తులను దర్శింపక వచ్చు వానికి నేనెటుల తోడ్పడఁగలను?

నివాస్ పురమున మోహినీ రాజు కలఁడు. అతఁడు సగుణుఁడైన అల్లా. అప్పాకులకర్ణి! నివు వెళ్లి, ముందుగ ఆ స్వామికి మ్రొక్కి తరువాత నీపై మోపఁబడిన నేరము విచారణకు డిప్యూటీ కలెక్టరు కచేరికి పొమ్ము. (అప్పా అటుల కావించెను. నిర్దోషియని తీర్పు చెప్పఁబడెను.) (చూ. 119, 145.)

156. భగవానుఁడు తనయాశ్రితులగు భక్తులను రక్షించుటకై సకల శక్తులఁ బ్రకటించును.

157. మేఘా! పూజ కొఱకీ లింగమును స్వీకరింపుము.

158. మేఘా! ఖండోబా దేవాలయమున పూజింపక నన్ను పూజించుటకై యిటకేలవచ్చితివి? పొమ్ము! ఖండోబాను ఇపుడు పూజింపుము. కోవెల తలుపులు తెరువఁబడి యున్నవి.

## (b) పాదుకలు

159. నాచ్నే! ఈ పాదుకలు ఉంచుకొని పూజింపుము.

160. ఆత్మారాం. ఎచ్. చాన్ ఖాయి–వెండిపాదుకలు బాబా దగ్గరకుఁ గొనిపోయెను. బాబా తన పాదముల దానిపై నిలిపి, "ఇవి చక్కగ నున్నవి. వీనిని పూజయందుంచుకొనుము." అని, ఆపాదుకల నతనికిఁ బ్రసాదించెను. ఒక పరి అవిపోయినవి. ఆశ్చర్యముగ నవి మరల లబ్ధములయ్యెను.

161. (M. W. ప్రధాన్ సతిని వెండిపాదుకల తన పాదముల క్రింద నిలిపి పూజించుటకు సమ్మతించి, బాబా ఆ పాదుకల నామెకు ప్రసాదించుచు.)

సా. బా:- చూడుము! నానా! ఈ తల్లి నా పాదములను ఛేదించి తీసికొని పోయినది. (అనగా - ఆ పాదుకలయందు బాబా ఉన్నాఁడని - భావము.)

## (c) నాణెములు

162. (1908 లో బాలకృష్ణ రామచంద్ర ఖైరీకర్ - ద్వారకామాయీ మసీదులోనికిఁ బోవుచు ఒకఅణా నాణెమును త్రొక్కెను. దాని నేరికొని శుభ్రపఱచి బాబాకు సమర్పించుచు)

బా.రా.ఖై:- బాబా! ఇది నీ నాణెము దీనిని దాచుకొనుము!

సా. బా:- (తిరిగి ప్రసాదించుచు) మంచిది. దీని నింటికి గొనిపొమ్ము. నీవు పూజించు విగ్రహములతోబాటు దీనిని పూజింపుము.

(ఖైరికర్ దానిని 3 సంవత్సరములు పూజించి సంపదలఁ గడించెను. పిదప ఆ నాణెమును పోగొట్టుకొనెను. సంపదలును నశించెను.)

163. సా. బా:- (యస్. బి. ధుమాలునకు ఒక నాణెమును ప్రసాదించుచు) దీనిని జాగ్రత్తగ భద్రపఱచుకొనుము. దానిని విడ నాడకుము - ఎవరికి నీయకుము వ్యయము పెట్టకుము!

(d) సమాధి పూజ

164. సా. బా:- ఈ మధురనింబ వృక్షము నీడనగల నా గురుదేవుని సమాధిని ప్రతి గురు శుక్రవారముల సాయంసమయమున గోమయముతో శుభ్రపఱచి అగరువత్తులు వెలిగించి సేవించువారు దైవానుగ్రహమును బడయుదురు.

(e) పటము

బాబా తన చిత్రపటమును పూజించుటకుఁగూడ సమ్మతించి తన భక్తులను ప్రోత్సహించినాఁడు.

165. యస్. బి. ధుమాల్ చట్టముతో బిగింపఁబడిన బాబా చిత్రపటము పెద్దది మసీదు ప్రక్కగఁ గొనిపోవ మండెను. బాబా అతనిని పిలిచెను.

సా. బా:- భావ్! ఇటురమ్ము. ఇది యేమిటి?

ధుమాల్:- బాబా మీ విందున్నాఁడవు

సా.బా:- దానిని నాకిమ్ము!

ధుమాల్ దగ్గఱనుండి బాబా ఆ పటమును తీసుకొని అటునిటు అన్నివైపుల త్రిప్పిచూచి దానినితిరిగి ప్రసాదించుచు.

సా. బా:- దీనిని భద్రపఱచు కొనుము!

ధుమాల్ ఆ చిత్రపటమును భద్రముచేసికొని జీవితపర్యంతము పూజించెను.

( f ) పటము పూజ.

పూజింపఁబడు పటములందు బాబా కలఁడు

166. బాలభావ్ సుతార్ భజంకర్ - బొంబాయి నివాసి ప్రప్రథమమున 1917లో శిరిడికిఁజేరి బాబాకు మ్రొక్కెను.

సా. బా:- (ఇతరులతో) ఈతని నేను 4 సంవత్సరముల నుండి యెఱుఁగుదును.

అంతకు పూర్వము బాబాను సందర్శింపని వాఁడగుటచే బాల భావ్ ఆశ్చర్యపడెను. కాని, 4 సంవత్సరముల పూర్వము బొంబాయిలో బాబా చిత్రపటమునకు మ్రొక్కిన విషయము జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను.

(చూ:- గయలో శ్యామా, బాబా చిత్రపటమును చూచుట.)

విశ్వాసము.

167. దైవమునందు విశ్వాసము బాబా పాదుకొలుపుట. మొ॥

సా. బా:- మేఘా! త్రిశూలము లిఖింపుము.

,, ,, ఈ లింగమును పూజింపుము.

168. నాచ్నే! దేవపూరునకు వెళ్ళుము. అందు మీ పూర్వీకులు పూజించిన రాతి విగ్రహములను పూజింపుము.

169. సా. బా:- శ్యామా! సప్తశృంగికి వెళ్ళుము. నీవు చేయించిన వెండి స్తనములను అచట వాణీదేవికి సమర్పింపుము.

170. సా. బా:- కుశభావ్! వెళ్ళుము. మూడు ముఖముల స్వామిని (దత్తస్వామిని) సందర్శించు కొనుము.

171. సా. బా:- (రావు బహద్దూర్ M. W. ప్రదాన్‌తో) పూజకొఱకు గణపతినిఁ దెచ్చుకొనుము.

## విగ్రహారాధనము

172. బాంద్రాలోని ఒక కాంత 7 సంవత్సరములనుండి తల నొప్పితో బాధపడుచున్నది. ఆమె శిరిడికిఁజేరి బాబాకు ప్రణమిల్లి ఎదుట కూర్చుండెను.

సా. బా:- (ఆమె తలను తాకి మెల్లగ తట్టుచు) నీ తల నొప్పిగనున్నది - కాదా?

బాం. కాంత:- బాబా! ఇంతకు పూర్వము. ఇప్పుడు తగ్గినది. (దీర్ఘకాల శిరోవ్యాధి సాంతము శమించెను.)

సా. బా:- అమ్మా నీ విన్ని సంవత్సరముల నుండి సమృద్ధిగ తినబెట్టు చున్నావు.

బాం. కాంత:- బాబా! మీ దర్శన భాగ్యము కలిగినదిపుడేకదా!

సా. బా:- కాని, నిన్ను నీ చిన్నతనమునుండి చూచుచునే యున్నాను.

బాం. కాంత:- (మిక్కిలి ఆశ్చర్యపడెను.)

సా. బా:- మీ గృహమున ఏ పూజ చేయుచుందువు?

బాం. కాంత:- గణపతి పూజ.

సా. బా:- మీ తల్లి గారి యింటనో?

బాం. కాంత:- గణపతి, పుష్పములు - ఫలములు, తిను పదార్ధములు సకలము గణపతికి సమర్పింతును.

సా. బా:- అవియన్నియు నాకు చెందినవి. కావున నీ బాల్య దశనుండి నిన్ను నేనెఱుగుదును.

173. బాం. కాంత:- బాబా! నా గణపతి కుడిచేతివాఁడని అందఱు అనుచున్నారు. అదియేకాక ఒక చేయి విరిగినది. అందుచే ఆ విగ్రహమును ఆవలపాఱ వేయుమను చున్నారు. ఆ మాటలు యధార్ధములేనా?

సా. బా:- నీ బిడ్డ ఒకచేతిని విఱుగ కొట్టుకొనిన ఆ బిడ్డను నీటిలో పాఱవైచెదవా?- నిత్యమును ఆ విగ్రహమునే పూజింపుము.

[సా. బా:- అమ్మా! మీ యింటికి నిత్యము ముమ్మారు వచ్చుచున్నాను. [లోగడ 76 లోని సంభాషణ కనుడు.]

పురాతనముల నిలుపఁదగును, విగ్రహముల మార్చరాదు.

174. ఒక సమయమున కాప్లేపటేల్, ఆయన మామ్లత్ దార్- బి. వి. దేవ్‌తో కలిసి శిర్డికిఁజేరి, తాను (కాప్లే) కట్టించిన నూతన దేవాలయమున పురాతన విగ్రహముల నుంచుటయా? లేక ఆయన గురువు నిర్దేశించినట్లు "వానీ" నుండి నూతన విగ్రహముల తెప్పించి ప్రతిష్ఠించుటయా? ఈ విషయము బాబావలన తెలిసికొనగోరి, శ్యామా ద్వారా బాబాను అడిగించెను.

శ్యామా:- బాబా! కాప్లే పటేల్ క్రొత్తగా కట్టించిన దేవాలయమున ఏ విగ్రహముల ప్రతిష్ఠింపవలయునో నీవలన తెలిసికొనగోరుచున్నాఁడు.

సా. బా:- వారివంశీయులు పూర్వమునుండి పూజించుచున్న పురాతన విగ్రహములనే ప్రతిష్ఠింపుమనుము. నూతనములు వలదు.

శ్యామా:- వానీ నుండి తెప్పించు నూతన విగ్రహములను ప్రతిష్ఠించుట వలన (హాని) లోపమేమి?

సా. బా:- శ్యామా! మీ యిష్ట ప్రకారముచేయండి! ప్రతిష్ఠించండి-లేక ఊరు కొనండి!

శ్యామా:- బాబా ! వానీ నుండి విగ్రహములు తెప్పించి ప్రతిష్ఠించ వచ్చునా?- ప్రతిష్ఠింపరాదా? దయతో విశదముగ తెలుపుము.

సా. బా:- ఆ విగ్రహమే ఆతడు కావలయుననిన దాని హస్తములు పాదములు ఛేదించి, ప్రతిష్ఠించి పూజింపు మనుము. నన్ను మరల మరల ప్రశ్నింపకుము! ఒకపరి నా మిత్రునితో నూరూర తిరిగితిని. అతఁడొక ఆవును కొనఁదలచెను. నేను వలదు - అంటిని. కాని, వాఁడొక ఆవును కొని ఒక గ్రామమునకు దానిని తోలుకొని వచ్చెను. అచట అంటు వ్యాధి ఏర్పడి పలువురు మరణించిరి.

శ్యామా:- (ఆ దినము సాయంత్రమున) బాబా! క్రొత్త విగ్రహములఁదెచ్చిన ఏమి హాని కలుగును?

సా. బా:- ఆతనిని పురాతన విగ్రహములనే పూజింపు మనుము. క్రొత్తవి యేవియు తీసికొని రావలదు.

శ్యామా:- క్రొత్త వానిని ప్రతిష్ఠించుటలో కలుగు హాని యేమి?

సా. బా:- (కోపముతో) నేను నోటితో మాటాడు చున్నాడను. మఱియే యితరముతో మాటాడుట లేదు.

కాప్లేపటేల్ బాబాయందు విశ్వాసము (నమ్మకము) లేక తన గురువునందే గొప్ప నమ్మకముకలిగి వానినుండి విగ్రహములను తన గురువు గ్రామమునకు తెప్పించెను. అచ్చట ప్లేగువ్యాధి ఏర్పడి పలువురు మరణించిరి. ఆ గురువు అంతకు పూర్వమే 3, 4, వందలు రూపాయలు స్వీకరించియు, ఆ పటేల్ తనభూమిని రిజిష్టరు ద్వారా దఖలు పరచిన తప్ప లేనియెడ అతడు (పటేల్) నాశనమగునట్లు శపింతు నని వర్తమాన మంపెను. అప్పటికా పటేల్ మేల్కొనెను. బాబాయొక్క నిస్వార్ధ ప్రజ్ఞావిశేషమును గ్రహించెను. తన గురువుయొక్క కౌర్యము స్వార్ధపరత తెలిసికొనెను. తనవంశపరంపరాగతములైన పురాతన విగ్రహములనే ఆ క్రొత్త దేవాలయమున ప్రతిష్ఠించెను.

సాధనము III గురువు.

## సాయీ పూర్వ గురుమహిమ

175. తన గురువును తానెట్లు కలిసినది బాబా స్వయముగ తెలిపెను. ఒకపరి నేను మఱి ముప్పురము శాస్త్ర గ్రంథములను చదువుచు జ్ఞానసిద్ధి పడయుమార్గములను చర్చించుచుంటిమి.

మాలోనొకడు "ఉద్ధరే వాత్మనాత్మానం" - (తన ఆత్మను ఆత్మచెతనే ఉద్ధరించుకొనందగును) అని గీతలు తెలుపుటచేత మనము మనమీదనే ఆధారపడి యుండవలయును గాని ఒక గురువుపై నాధార పడియుండరాదు - అని పలికెను.

రెండవవాడు "తలంపులను సందేహములను విడిచి, మనస్సును మనస్వాధీనములో నుంచుకొనవలయును, ఎల్లెడ ఎల్లవస్తువులందు ఉన్నది మనమే" అని పలికెను.

మూండవవాండు - " ఈ దృశ్యప్రపంచము రూపము నిరంతరము మార్పునొందునది నిరాకరమైనదే మార్పులేనిది. కావున మనము విచారముచేత నిత్యమైన, వస్తువునుండి - అనిత్యమైన దానిని వేర్పఱచుటచేత (నిత్యాఽనిత్యవివేకమున) ఎఱుక పొందవలయును. అని పలికెను.

నాల్గవవాండు (సా. బా.) గ్రంథ పఠనమున పడయు జ్ఞానము నేవగించి. "మనవిధ్యుక్త ధర్మముల నాచరించి, మన తనువును, వాక్కును, జీవితమును సర్వవ్యాపియైన గురువునకు అర్పించుదము. గురువునందు గాఢవిశ్వాసము మనకు కావలసినది" అనిపలికెను.

మేము అడవులంబడి సంచరించు చుండగా ఒక వనజారి,ని (ధాన్యము-ఉప్పు మొదలగునవి ఒక చోటనుండి మఱియొక చోటకు గొనిపోయి వర్తకము చేయువాండు) కలిసితిమి. "ఈ ఎండలో అడవులంబడి ఎచటకుం బోవుచున్నారు?"- అని, అతడు మమ్ము ప్రశ్నించెను.

మేము సరియగు సమాధానమీయలేదు. "అగమ్యమై దారికానరాని యీ యరణ్యముల వ్యర్థముగ సంచరింపవలదు" అని ప్రేమతో నతడు హెచ్చరించెను. తనతో భుజింపరండని ఆహ్వానించెను.

ఆతని హితబోధను నిరాకరించి ముందుకు సాగితిమి. ఆ మహారణ్యమున మేము దారితప్పితిమి. ఆతఁడు మరల మా కెదురుపడి. "మీ తెలివిపై మీరు ఆధారపడుటవలన పెడదారి పట్టితిరి. మార్గమెఱుక పఱచుటకు తోడు అవసరము, భుజింప రమ్మనిన నిరాకరింపఁదగదు. అట్టి పిలుపు శుభప్రదము . చేయుప్రయత్నమున అది విజయ సూచకము." అని పలికి. అతఁడు మరల తనతో భుజింపరండు! అని మమ్మాహ్వానించెను. మరల మేము నిరాకరించి వెళ్ళితిమి. వెంటనే నేను ఆకలినొంది, ఆతఁనిజేరి కొద్దిగా రొట్టెనుతిని కొంచెము నీరు త్రాగితిని.

అపుడాగురువు "మీవివాదమేమి?" యని ప్రశ్నించెను. మా సంభాషణమంతయు నాతనికిఁ దెలిపితిని. తక్కిన ముగ్వురాతనిని లెక్కింపక వెడలిరి. నేను మాత్రము సగౌరవముగ మ్రొక్కితిని. అంత నతఁడు నన్నొక నూతికడకుఁ గొనిపోయి, నా కాళ్ళను త్రాటితో బంధించి, ఒక చెట్టునుండి బావిలోనికి తలక్రిందుగ నన్ను వ్రేలాడఁ గట్టెను. నా తల నీటిని తాకక, మూఁడడుగుల ఎత్తున నుండెను. నన్నట్లు దిగవిడచి, నా గురువెచట కేగెనో దైవమునకెఱుక! నాలుగైదు గంటల తరువాత ఆతఁడు తిరిగివచ్చి, ఎట్లుగడపితివి? - అని. నన్ను ప్రశ్నించెను. 'బ్రహ్మానందముగ నాకాలము గడచెను-అని, సమాధాన మిచ్చితిని. ఆగురువు నా మాటలకు మిక్కి లి సంతోషించి, నన్నుదటికిఁ జేర్చుకొని, తన అరచేతితో నాతలను శరీరమును స్పృశించి, ప్రేమరసము లొలుకు పలుకులు పలికి తనఒడిలో నన్ను జేర్చుకొనెను. ఆ ఒడిలో నున్నపుడు నా తండ్రిని, తల్లిని, ఎల్లబంధములను ఎల్లకోరికలను పూర్ణముగ మఱచితిని.

ఆయనపై చూపు నిలుపుటకు మిక్కిలి ప్రేమింతును. చూచుటకాయన నా యెదుట లేనియెడ నా కన్నులు కలిమినే నే సేవగింతును. తిరిగి వెళ్ళవలయునని నేను కోరలేదు. గురువునుతప్ప ఇతరములను

సమస్తమును మఱచితిని. నా ప్రాణములు నా చూపునందు, నా చూపు ఆయునయందు కేంద్రీకరింపఁబడినది. అదియే నా ధ్యానము-లక్ష్యము. మౌనముగ ప్రణమిల్లితిని.

(అనగా) ఎట్టి ప్రయత్నములు - అధ్యయనములు మొదలగునవి లేకయే, నా గురువు అనుగ్రహముననే ఎఱుక తనకుఁదానే పొడమినది.

గురువు అనుగ్రహ మొకటియే మన సాధనము. దానివలన జ్ఞానము అనుభూతమగును.

## గురువు అవసరము

176. భక్తుఁడు:- బాబా! ప్రతివ్యక్తి ఎక్కడకు పోవలెను?

సా. బా:- దీనిపైకి

భక్తుఁడు:- మార్గమేది?

సా. బా:- ప్రతి ప్రదేశమునుండి కావలసినన్ని మార్గములు కలవు. నీవు ఇక్కడనుండి మార్గము కలదు. కాని, దారి ఒడుదుడుకులు కలది (మిట్టపల్లములు కలది) మార్గమున పులులు - ఎలుఁగులు కలవు.

హ. సీ. దీక్షిత్:- కాని, బాబా! అతనికితోడు వెంటనున్న - అపుడో

సా. బా:- అతనివెంట తోడున్న - అపుడు కష్టము లేదు. ఆ పులులు - ఎలుఁగులు ప్రక్కకు తొలఁగిపోవును. తోడులేనియెడ మార్గమున నొకపెద్ద అఘాతము (గుంట) కలదు. ఆ అగడ్తలోపడే ప్రమాదము - అపాయము కలదు. (తోడు-గురువు, అగడ్త-నరకము)

"గురుబినా కోనబనావే బాట్" (కబీరు)

177. సా. బా:- ఇతర గురువు లెంత మహిమలుగల గొప్పవారైనను నీ గురు వేమహిమలులేని వాఁడైనను చలింపని విశ్వాసముతో నీ గురువును హత్తుకొని యుండుము. పంత్! మన గురువుతోడి సంబంధము విడనాడరాదు. అతనియందే గాఢముగ హత్తుకొని యుండుము.

ఈ పుట్టువున గురువైన 'పెంకుశు'నిఁగూర్చిఁ - బాబా

178. సాటిలేని ప్రేమపరిపూర్ణుఁడైన నా గురువును 12 సంవత్సరములు సేవించితిని. ఆయన నాపైవఱపు ప్రేమ నేనేమని - ఎంతని వివరింపఁగలను! ఆయన ధ్యాననిష్ఠ యందున్న తటి ఎదుటఁగూర్చుండి ఆయనను వీక్షించు చుందును. ఇరువురము ఆనంద పరిపూర్ణులమైతిమి. నా దృష్టిని ఇతరములపై మరలించి యెఱుఁగను. రేయింబవళ్ళు ఆకలిదప్పులను మఱచి, ఆయన ముఖాబ్జమునందు మిక్కిలి ప్రేమతో దృష్టి నిలిపి యుంటిని. గురుదేవుని ఎడబాటు ఒకక్షణమైనను నాకు అశాంతి కలిగించెడిది. నా గురువును తప్ప నితరమును ధ్యానించి యెఱుఁగను. ఈ నా గాఢమైన ప్రేమతప్ప నా వలన ఇతరము నా గురువుకోరి యెఱుఁగడు. ఏమియు చేయని యటుల వెలికిఁగనఁ బడినను నన్నెప్పుడును మఱచి యెఱుఁగడు. దయార్ద్ర వీక్షణముల నన్నెల్లవేళల రక్షించువాఁడు నా గురువు నా చెవిలో నెట్టి మంత్రముల నూఁదియెఱుఁగడు ఆయన కరుణా పరిభావముననే నీ స్థితిని పొందఁగలిగితిని, గురువొక్కనినే తన తలంపులకు నిశ్చయములకు ఏకైక లక్ష్యము చేసికొనఁ జాలినవాఁడు పరమార్థము సత్యజ్ఞానము-గమ్యము పొందును. నా గురువు నాకు బోధించిన సత్యమిది యొక్కటియే. చతుర్విధసాధనములు, ఆరు శాస్త్రములు అవసరములేదు. గురువునందు సంపూర్ణ విశ్వాసముంచి కలిగియున్న చాలును, అదియే ఏకైక సాధనము. ఆఫకీరు భార్య నన్ను శేలునందు పెంకుశునివద్ద విడిచెను. 12 సంవత్సరములు నా గురువును సేవించి 'సెలు' విడిచితిని.

178 A. ఈ ఇటుకరాయి. (బాబా పగలు తనచేతి క్రింద రేలు తల క్రింద ఆధారముగ నిలుపుకొనును) నా గురుదేవుడు ప్రసాదించిన బహుమానము. నా ప్రాణమిత్రము. ఇప్పుడిది విఱిగినది (పగిలినది) ఇటుకరాయి కాదు. నా కర్మమే - (ప్రారబ్ధము) యిపుడు విచ్ఛిన్నమైనది - ఈ ఇటుక రాయి పగిలిన తరువాత నేనింక జీవింపఁజాలను.

[1918 అక్టోబరు మొదటివారమున బాబా పలికిన పలుకు లివి. 'మాధవ ఫానే' అనునతఁడు అజాగ్రత్తతో నా రాతిని జారవిడిచెను. అది రెండుగ పగిలెను, బాబా ఆ యిటుకరాతిముక్కలను చూచి విచారము ప్రకటించుచు పై విధమున పలికినాడు.]

179. సా. బా:- నానా! నీ పై నాకు కోపములేదు. మీరు నా బిడ్డలు. మీరునన్ను కోపించవచ్చును. వేంకుశుఁడే జీవించియున్న నే నాయనపై కోపింతును (చూ. 216)

180. తన గురువునుగాని సాధు సత్పురుషులను గూర్చికాని నిందకావింపఁబడు ఏ తావులనేని శ్రేయము కోరువాఁడు క్షణమేని నిలువరాదు.

## తొంటి గురువు — కబీరు

(ఉపాసనము)

మధుర నింబవృక్షముక్రింద నున్నది కబీరుసమాధి. కబీరు నిర్యాణ మొందిన పిదప ఆయన శరీరము పుష్పములుగ మాఱెను.

181. కబీరు నా గురుపై యుండెను. (చూ. 477)

ఆ కారణమున ఈ మధుర నింబ వృక్షముక్రింద నా నివాస మేర్పఱచు కొంటిని. గురు శుక్రవారముల నిచట అగరువత్తులను వెలిగించి సేవించువారిని దైవము అనుగ్రహించును (చూ. 164)

భక్తుడు తనకు దానే నిర్ణయించుకొని గురువును పొందవలెను.

182. ఒక ధనికురాలు ఒక పళ్లెరమునిండ రూపాయలను నింపుకొని బాబాయెదుట నాలుగు దినములు నిలిచియుండెను, కాని, బాబా ఆమె నేమియు దక్షిణకోరియుండలేదు.

ధనికురాలు:- (నాల్గవ దినమున) బాబా! నేను గురువు కొఱకు ఇచ్చుటకు వచ్చితిని. ఇప్పుడీనాదక్షిణ స్వీకరింపుము. నాకు గురువై ఉపదేశింపుము.

సా. బా:- గురువు తనకు దానుగ నీకు గురువుకాఁడు. నీవే అతనిని గురువుగ సంభావింప వలయును. (అనగా) విశ్వసింప వలయును. ఒక ఓిల్ల పెంకును స్వీకరించి దానిని నీగురువుగ సంభావించి సేవించి చూడుము! నీవు గమ్యమును - పరమార్థమును పొందెదవో లేదో నీవే పరీక్షించుకొనుము, (ఏకలవ్యుని వృత్తాంతము గమనింపుడు)

బ్రహ్మము (లేక) జ్ఞానముయొక్క స్వభావము-

గురువుద్వారా దానినిఁబడయు విధానము.

183. నా. గో. చం:- సంస్కృతమున చక్కని సాహిత్యమును గడించి, భగవద్గీతలకు శంకర భాష్యమును అధ్యయనముచేసిన పట్టభద్రుఁడు- ఒక సమయమున ద్వారకామాయి మసీదునందు బాబా పాదము లొత్తుచుండెను.

సా. బా:- నానా! నీవు లోలోన ఏమి గొణుగుకొనుచున్నావు?

నా. గో. చం:- ఒక సంస్కృత శ్లోకము

సా. బా:- ఆ శ్లోకమేమి?

నా. గో. చం:- భగవద్గీతలలోని శ్లోకము

సా. బా:- పెద్దగా వినఁబడునట్లు చదువుము

అంతట చందోర్కరు భగవద్గీతలలోని 4 అధ్యాయము 34 శ్లోక మిట్లు చదివెను.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శిన:

సా. బా:- నానా! దీనిని నీవు అవగాహనము చేసికొంటివా?

నా. గో. చం:- గ్రహించితిని.

సా, బా:- అట్లయిన, భావము తెలుపుము.

అంత నా. గో. చం. ఆ శ్లోక భావమును దెలిపెను.

సా. బా:- దాని సారాంశముకాదు – ప్రతిపదార్థము – శబ్ద–ధాతు – వ్యాకరణ విశేషాంశములతో తెలుపుము.

బాబా సంస్కృత వ్యాకరణాది విశేషాంశములను గ్రహింపఁ గలఁడా? అని, ఆశ్చర్యపడుచు ఆ శ్లోకమునకు చందోర్కరు వ్యాఖ్యానము గావించెను. బాబా అందలి భావ వ్యాకరణాంశములతోగూడ కఠినముగ ప్రశ్నించెను.

సా. బా:- తద్విద్ధి – అనుటలో 'తత్' – (దేనిని సూచించుచున్నది?) అన నేమి?

నా. గో. చం:- జ్ఞానము

సా. బా:- ఏ జ్ఞానము? (లేక) దేని జ్ఞానము?

నా. గో. చం:- వెనుక శ్లోకములందుఁ దెలుఁపబడిన జ్ఞానము.

సా. బా:- ప్రణిపాతము - అననేమి?

నా. గో. చం:- ప్రణమిల్లుట-

సా. బా:- 'పాతము' - అనిననో?

సా. గో. చం:- అదే అర్థము

సా. బా:- ప్రణిపాతము - పాతము ఈ రెండు ఒకే అర్థమైన వ్యాసుఁడు అనవసరముగ రెండక్షరముల ప్రత్యయమునుజేర్చియుండునా?

నా. గో. చం:- ఆ రెంటిలోని భేదము నాకు తెలియదు

సా. బా:- ప్రశ్న - అన అర్ధమేమి?

నా. గో. చం:- ప్రశ్నించుట

సా. బా:- పరిప్రశ్న - అనిననో?

నా. గో. చం:- అదే అర్ధము

సా. బా:- రెండు పదములు ఒకే అర్ధమైన వ్యాసుడు తల తిక్కతో పెద్దపదము ప్రయోగించి యుండునా?

నా. గో. చం:- ఏ మైనను - నాకు భేదము కానవచ్చుటలేదు.

సా. బా:- 'సేవ' - అననేమి?

నా. గో. చం:- పరిచర్యచేయుట - పాదము లొత్తుట మొదలగు సేవలు.

సా. బా:- అంతకంటె హెచ్చులేదా?

నా. గో. చం:- అంతకంటె నేమి విశేషార్ధము చూచించునో నాకు తెలియదు.

సా. బా:- సరే! దానిని విడువుము. చివర రెండు పాదములలో తత్త్వదర్శులైన జ్ఞానులవలన జ్ఞానము పడయుమని అర్జునునకు బోధించినాడే కృష్ణుఁడు - జ్ఞాని కాఁడా?

నా. గో. చం:- అవును - జ్ఞానియే

సా. బా:- అట్టియెడ - తానేల జ్ఞానము తెలుపక ఇతరుల వలన తెలిసికొనుమని అర్జునకు బోధించెను?

నా. గో. చం:- నేను చెప్పఁజాలను.

సా. బా:- అర్జునుఁడు - ఒకజీవి. చైతన్యాంశము కాదా?

నా. గో. చం:- అవును

సా. బా:- అట్టియెడ ఆ జీవికి - సహజముగ చైతన్యాంశము- జ్ఞానాంశయగువానికి జ్ఞానమెట్లీయఁబడును?

నా. గో. చం:- నేను తెలుపఁజాలను.

సా. బా:- దానినట్లుంచుము - ఆ శ్లోకము రెండవ భాగమున ఒక ప్రత్యయము-లేక-అక్షరముఁజేర్చి చదువనగునా?

నా. గో. చం:- అగును

సా. బా:- ఎట్లు?

నా. గో. చం:- జ్ఞాన శబ్దమునకు ముందు - అవగ్రహము- అకార ప్రశ్లేషచేర్చి చదువవచ్చును.

సా. బా:- అపుడెట్లు చదువఁదగును?

నా. గో. చం:- 'ఉపదేక్ష్యంతి తేఽజ్ఞానం' - అని. కాని బాబా ఈ పాఠము సంస్కృత వ్యాఖ్యానమునఁ గానరాదు.

సా. బా:- లేకున్ననేమి? అది సముచితమైన అర్థమునిచ్చునేని దాని వలన నేమి హాని?

నా. గో. చం:- అది ఎట్లు తగిన అర్థమిచ్చునో నేనెఱుగఁజాల.

సా. బా:- నీ వెఱుఁగుదువు

అంతట చందోర్కరు లోగడ బాబా తన్నడిగిన ప్రశ్నములకు సమాధానమిచ్చుచు తన భావానుసారమా శ్లోకములోని అంశములను వివరింపుమని బాబాను కోరెను.

సా. బా:- ఆ శ్లోకము సత్యతత్త్వ మెఱుఁగుటకు శిష్యుఁడు తన గురువునెట్లు ఆశ్రయింప వలయునో తెలుపఁబడినది. తనువును, మనమును, ఆత్మను సకలమును గురువునకు సంపూర్ణ సమర్పణముఁ

గావించి, శిష్యుఁడు గురువు నాశ్రయింప వలయును. ఆ ప్రణిపాతము అట్టి సమర్పణ బుద్ధితో కూడియుండవలయును.

ఇఁక పరిప్రశ్నము – అనగ – అలసతతోడనో (లేక) వేడుకకో – ఋజు భావములేక – వంచనేచ్ఛతో గురువునందు తప్పు నెమకు తలంపుతోగాక యథార్థ జిజ్ఞాస (పరతత్త్వము నెఱుగవలయునను కాంక్ష) గలిగి, విధేయతతో చక్కగ బోధపడువరకు పరుమారులు ప్రశ్నించి తెలిసికొనవలయునని భావము.

ఇఁక సేవ అనగా పాదములొత్తుట మొదలగునవి మాత్రమే కాదు. గురువు ఆనతి పరిపాలించుటకు జంకు – గొంకు – అలసత – పనికి రాదు. తన దేహమునకు తానధిపతియని తలంచరాదు. అది గురువునకు చెందినదై గురుసేవకొరకై అంకితమైయున్నదిగ భావింపవలయును.

ఇఁక గురువు శిష్యునకు అజ్ఞానము దెలుపుటను గూర్చి విచారించుదము—

సా. బా:- బ్రహ్మము – జ్ఞానము. శుద్ధ సత్త్వ వస్తువుకదా?

నా. గో. చం:- అవును

సా. బా:- తక్కినది (బ్రహ్మేతరము) అంతయు – అసత్తు – అజ్ఞానముకాదా?

నా. గో. చం:- అవును.

సా. బా:- 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ'- వాక్కునకు మనస్సునకు అందరానిది - అని శాస్త్రములు బ్రహ్మమును గూర్చి భాషించుటలేదా?

నా. గో. చం.- అవును.

సా. బా:- అపుడు గురువు పలుకులు – 'బ్రహ్మము' – 'జ్ఞానము' కావు గదా!

నా. గో. చం:— కాదు - బ్రహ్మము కాదు.

సా. బా:— అట్టియెడ గురువు తెలుపునది (పలుకునది) జ్ఞానము కాదు. అజ్ఞానముం గూర్చియేకదా!

నా. గో. చం:— అటులనే తోచుచున్నది.

సా. బా:— శిష్యుని అజ్ఞానమును తొలగించుటకు గురువు కావించు బోధ ఒక విధమైన అజ్ఞానమే అగుచున్నది. ముల్లును తొలగించుట కుపయోగించు మఱియొక ముల్లు విధమున.

"శ్రుతం సర్వమస ద్విద్ధి వేదం సర్వ మసత్ సదా.
గురు శిష్యా వసద్విద్ధి గురోర్మంత్ర మసత్తతః"

అగునా? కాదా?

నా. గో. చం:— అవును.

సా. బా:— శిష్యుఁడు ఒక జీవి. అతని సహజ స్థితి జ్ఞానము — కాదా?

నా. గో. చం:— అవును

సా. బా:— అపుడతనికి జ్ఞానమును ప్రసాదింప వలసిన పని లేదు. కాని, దానిని కప్పిపుచ్చు తెరను (అజ్ఞానమును) మాత్రము తొలగఁ జేయువలయును. కాదా?

నా. గో. చం:— అవును.

సా. బా:— హస్తవముగ ఆ పని ఒక్కమాఱుగ కావింప సాధ్యముకానిది. శిష్యుఁడైన ఆ జీవి వివిధ జన్మపరంపరాగతమైన అజ్ఞాన పంకమున మునిఁగి చిక్కుకొని యున్నాఁడు. అనేక జన్మములుగ పలుమాఱులు బోధింపఁబడినఁగాని దిగఁబడిన ఆ అజ్ఞాన పంకము (బురదగుంట) నుండి విడివడఁ జాలఁడు.

వాక్కున కతీతమైన ఆ సత్య తత్త్వమును గూర్చి తెలుపబడు వాగ్రూపమైన బోధా విధానమేమి? అది ఆ కప్పును - ఆవరణమును తొలఁగఁజేయుటయే. నీటిని నాచు కప్పిపుచ్చునట్లు జ్ఞానమజ్ఞానముచే నావరింపఁబడినది. నాచును తొలఁగఁజేయుము. స్వచ్ఛమైన జలము తోచును. నీటిని సృష్టింపవలసిన పనిలేదు. నీరు అందే కలదు. గ్రహణ సమయమున చంద్రుఁడు సూర్యుడు అచటనే యున్నారు. రాహువు కేతువు వారిని మనదృష్టికి గనఁబడనీయరు. రాహు కేతువులు తొలగిన అంతకు పూర్వమే వ్యాపించియున్న చంద్రసూర్యుల కాంతులు మనకు దృగ్గోచరములగును.

మఱియొక ఉదాహరణము. మనము నేత్రములతో సకలము చూతుము. కనులకు పొర క్రమ్మిన చూడలేము. పొరను తొలగించుము- అపుడు కనులు చూడగలవు. అజ్ఞానమే - పొర.

ఇట్టిదని నిరూపింప నలవికాని మాయచే కల్పితమైనదీ ప్రపంచము. అజ్ఞానమే మాయ. అయినను అజ్ఞానమే అజ్ఞానమును భాసిల్లఁజేయును.

సా. బా:- జ్ఞానము ఎఱుఁగబడవలసినదే కాని, ప్రత్యక్షముగ ఉపదేశింపఁబడుటకు సాధ్యముకానిది. ప్రణిపాత, పరిప్రశ్న సేవ లివన్నియు గురువుయొక్క కరుణ (అనుగ్రహము) పడయుటకు సాధనములు.

ఈ విశ్వము సత్యము అను తలంపు కేవలము భ్రాంతి. ఇది జ్ఞానమును కప్పిపుచ్చు చీకటి తెర. ఆ తెరను చీల్చివేయుము. అపుడు "ప్రజ్ఞాన బ్రహ్మము" వెలికి ప్రకాశించును.

ఈ సంసృతి బీజము అజ్ఞానము గురుకృప అను అంజనము (కాటుక) కనులకు పెట్టుకొనిన మాయఁ అను తెరతొలఁగును జ్ఞానము శేషించును. జ్ఞానము ఒక కార్యముకాదు అది యెల్లవేళల సహజసిద్ధమై యున్నది. అజ్ఞానము విషయము అటులకాదు. దానికి కారణము- అంతము - కలదు. "భగవంతుఁడొకఁడు - భక్తుఁడు మఱియొకఁడు."

ఇదియే అజ్ఞానమునకు మూలము. దానిని తొలగించుము. జ్ఞానము శేషించును. అజ్ఞానము - త్రాడునందు సర్పమును చూచును. అజ్ఞానమును తొలగింపుము. అపుడు అది పూర్వమువలె త్రాడు - త్రాడుగనే తోచును. అజ్ఞాన స్థితికి పూర్వము అజ్ఞానము తొలగినతరువాత అది త్రాడేకాని పాము ఎన్నడునుకాదు.

ఇంక కృష్ణుడు తాను స్వయముగ బోధింపక తత్త్వవిదులు-జ్ఞానులైన గురువుల నాశ్రయింపుమని అర్జునునకు చెప్పనేల? అను విషయము - శ్రీకృష్ణుడు జ్ఞానులను తనకు భిన్నులుగా చూచినాడా? "జ్ఞానీ త్వాత్మైవ మేమతం" జ్ఞానియు నేను ఏకము - అభిన్నము. అని తెలుపలేదా? వారి బోధయే తన బోధ కాదా?

నా. గో. చం:- అవును. బాబా! భగవద్గీతను సంపూర్ణముగ నాకు బోధింపుము.

సా. బా:- ప్రతి దినము ఒక అధ్యాయము అధ్యయనము చేసి నా దగ్గఱకువచ్చి కూర్చుండుము.

నా. గో. చం:- ఆవిధముగనే చేయుదును.

అది మొదలు నానా ప్రతిదినమొక అధ్యాయము చదివి వెళ్ళి బాబా పాదముల మ్రోల గూర్చుండెను. అందలి భావమతనికి చక్కగ బోధపడెను.

## సాధనము IV

### (A) గ్రంథములు - (పోటీ) పారాయణము.

#### (a) హరి సీతారాం దీక్షిత్తు.

138 A. సా. బా:- కాకా! ఈ రెండు చాలును. అవి i అధ్యాత్మ (భావార్థ) రామాయణము ii ఏకనాథ భాగవతము. వీనిని పఠింపుము (తరువాత దీక్షిత్తు కూతురు మరణించెను. అధ్యాత్మ రామాయణమున శ్రీరాముడు మండోదరిని ఓదార్చు ఘట్టము చదువుమని బాబా బోధించెను.)

(b) లక్ష్మణ్.

184. సా. బా. (లక్ష్మణ్‌తో) ఇది - తిలక్ గీతా భాష్యము మంచిది. బాబా ఆ గ్రంథముతో గూడ ఒక రూపాయి ఇచ్చెను.

(c) కుశభావ్

185. సా. బా:- (కుశభావ్‌తో) ఈ మసీదునకు వచ్చి గురు చరిత్రము చదువుచుండుము.

185 A. సా. బా:- దాసబోధ పఠింపుము!

(d) జి. జి. నార్కె

186. సా. బా:- (నార్కెతో) ఉత్తమమైన గ్రంథమును (యోగవాసిష్ఠమును) చదువు చున్నాఁడవు. అందుండి 15 రూపాయలు దక్షిణ నాకిమ్ము (అనఁగా-యోగ వాసిష్ఠమున 15 అంశములకు సంబంధించిన కొన్ని పరిచ్ఛేదములను చదివి, వానిని మననముచేసి, హృదయమున హత్తఁజేసికొనుము. ఆ విధముగ తన హృదయాసీనుఁడైన బాబాకు వానిని దక్షిణ నిచ్చినట్లగును - అని బాబా కావించిన బోధ.)

(e) ఉపాసనీ మహారాజు

187. సా. బా:- (ఉ. మ. తో) ఇది (పంచదశి) మా (ఖజానా) ధనాగారమై యున్నది. (మాకు కావలసినదంతయు నిందు కలదు అని భావము)

(f) మూలేశాస్త్రి

188. సా. బా:- (మూలేశాస్త్రితో) ఈ ద్వారకామాయి యందు పది దినములు నారాయణోపనిషత్తు - తైత్తిరీయ భాగము ఆవృత్తి చేయుచుండుము. (ఆవిధముగఁ జరుపఁబడెను)

## (g) బి. వి. దేవ్

189. సా. బా:- (బి. వి. దేవ్‌తో) జ్ఞానేశ్వరి (భగవద్గీతలకు సుప్రసిద్ధమైన మరాటి వ్యాఖ్య) పారాయణము చేయుము-

( చూ. 126 )

## (h) రామవిజయము

190. సా. బా:- (చరమకాలమున) మృత్యుంజయ ప్రీతి కొఱకు రామవిజయము ఇక్కడ (మసీదునందు) పఠించుచుండుము. (ఆ విధముగఁ జేయఁబడెను )

## (i) యం. బి. రేగే

191. సా. బా:- (రేగేతో) నీవేమియు గ్రంథపఠనము చేయ నక్కఱలేదు. కాని, నన్ను నీ హృదయమున నిలుపు కొనుము:

ప్రతి గురుపూర్ణిమనాఁడు బాబా ద్వారకామాయి మసీదున తన గద్దెపై కూర్చుండువాఁడు. భక్తులు తమ కిష్టములగు గ్రంథములను తీసికొనివచ్చి బాబానుజేరి సమర్పించువారు. బాబా వానిని స్పృశించి, ఆశీస్సులతో వానిని తమకు తిరిగి ప్రసాదించిన తమ పఠనసిద్ధి ఫలము లభించునని వారి సంకల్పము.

బాబా సాధారణముగ అటులకొనిరాఁబడిన గ్రంథముల తెచ్చిన వారికి తెచ్చినవి తిరిగియిచ్చువాఁడు. ఒక్కొక్క వేళ ఒకరు తెచ్చినది మఱి యొకరికి పర్యాయముగమార్చి యిచ్చుచుండువాఁడు. ఒక గురిపూర్ణిమకు ఒక భక్తుడు (యం. బి. రేగే) ఏ పుస్తకము తీసికొనిరాలేదు.

సా. బా:- (రేగేవంక చూచుచు నీవు మంచిపని చేసితివి. నీవే గ్రంథమును చదువువలదు! వీరి గ్రంథములందు బ్రహ్మమును (దైవమును) చూడఁ గలమని తలఁచుచున్నారు. కానివారు కాంచునది 'భ్రమ' మాత్రమే. నన్ను నీ హృదయమున నిలుపుకొనుము. నీ మనస్సును బుద్ధిని ఏకము చేయుము! చాలును.

## B. నామజపము

### 1. రామనామము.

192. సా. బా:- (యన్.ఆర్.యస్.తో) "రాం రామీఘ్యా"
(అనగా - రామనామము స్మరింపుము)

193. సా. బా:- (జి.యస్. కపర్దేతో) ఎల్లప్పుడు "రాజారాం - రాజారాం" అని స్మరింపుము! నీవటుల గావించిన నీ జీవితము ధన్యమగును. నీవుశాంతిని, అనంతశ్రేయమును పొందుదువు.

194. సా. బా:- (రావుబహద్దూర్ M. W. ప్రధానేతో) మన మేమి స్మరింపవలయును? "శ్రీరాం - జయరాం - జయజయరాం-"

195. సా. బా:- (హ. సీ. దీక్షిత్‌తో)
(చూ. 293 నామస్మరణము)

నేను నిరంతరము 'హరి' - 'హరి' యని స్మరించుచుంటిని. హరి నా కపుడు ప్రత్యక్ష మయ్యెను. అప్పటినుండి ఔషధములిచ్చుట మాని 'ఊధి' ప్రసాదించితిని

196. సా. బా:- (ఒకరితో) అల్లా అచ్ఛాకరేగా!

రాం - రాం - హ్మణా! (రాం - రాం - అని స్మరింపుము దైవము నిన్ననుగ్రహించును.)

197. సా. బా:- (బాంద్రాబాలునితో) పోటీపఠింపుము - అనగా పారాయణము చేయుము! ఏదొకనామ జపము చేయుము!

బాం. బా:- బాబా! నేను చేయను. ఎప్పడైన నేను మఱచిన నాకు పాపము కలుగును

సా. బా:- (తల్లితో) అమ్మా! నేనిపు డితని సంపూర్ణబాధ్యతలు వహింపవలయును

198. సా. బా:- నాకు హృద్రోగముండెను. విష్ణు సహస్ర నామములు నా హృదయమున హత్తుకొనియుంటిని. హరియందుండి దిగివచ్చెను. (అవతరించెను) నాకు స్వస్థత కలిగెను.

2. సాయీనామము

జస్టిస్ యం. బి. రేగే కావించు సాయీ నామజపము బాబా అంగీకరించెను.

సాధనము V

సకలము నందున్న దైవముగ బాబాపూజ

199. సా. బా:- నానా! పూరణ పోలీ నాకు ప్రియము. నైవేద్యమునకు సిద్ధముచేసి తీసికొనిరమ్ము.

నా. గో. చం:- బాబా! ఆలస్యమైనది - వంటమనిషిలేఁడు.

సా. బా:- సందేహింపకుము.

అంత చందోర్కరు 8 పూరణ పోలీలు - అనుపాకములతో పళ్లెరముల గొనివచ్చి బాబాముందుంచెను,

నా. గో. చం:- బాబా! ఆరగింపుము!

బాబా కొంత తడవువేచెను. అపుడు చీమలు-ఈగలు పోలీలపై చేరెను.

సా. బా:- మంచిది. ఈ పళ్లెరములఁ గొనిపొమ్ము!

నా. గో. చం:- బాబా! వానిని తాకనైన తాకక, తీసికొని పొమ్మందు విధియేమి? నీవేమియు భుజింపనియెడ నన్నేల వానిని సిద్ధపఱుపమంటివి? నీవేకొలదియేని స్వీకరింపనియెడల ఈ పళ్లెరముల తీసికొనిపోవను - నేనును భుజింపను.

సా. బా:- నేను పోళీలను తింటిని. ఈపళ్లెరముల గొనిపొమ్ము నీవు భుజింపుము.

నా. గో. చం:- నీవు పోలీ భుజించితివా? ఎప్పుడు? పళ్లెరము లలో తెచ్చినవి తెచ్చినట్లున్నవి. నీవు తినినతప్ప - వాని నిచటనుండి తీసికొని పోవను.

నా. గో. చం:- ద్వారకామాయి మసీదునుండివెళ్ళి చావడిలో ఆకటితో పరుండెను.

(బాబా తనబిడ్డపొందు బాధచూచి సహింపఁ జాలక నానాను పిలిపించెను)

సా. బా:- నానా! నేను పోలీయింతకు ముందు భుజించితిని మూర్ఖతవహింపక పళ్లెరములను తీసికొనిపొమ్ము. నీవు భుజింపుము.

నా. గో. చం:- (దులబరించుకొనుచు చావడికి తిరిగివెళ్ళెను- బాబామరల పిలువనంపెను)

సా. బా:- ఏమి? నానా! నీవు నాదగ్గఱ 18 సంవత్సరముల నుండి యున్నావు. ఈ మాత్రమేనా నీవు గ్రహించినది? నన్ను గూర్చి నిఅభిప్రాయమిదియేనా? ఈ 3½ మూరల ప్రమాణముగల దేహమే బాబా - అని నీవు గ్రహించితివా? ఆ మాత్రమేనా?

ఆహా! చిన్న చీమగా నేను భుజింతును. ఆభుజించు ఈఁగ యందుండి నేను భుజింతును. నేను కోరిన రూపమునందుండి ఆ రూపమున నేను భుజింతును. ని పోలీ యెప్పుడో నేను భుజించితిని. క్షమింపరాని మౌర్ఖ్యమింకేమాత్రము వహింపకుము.

నా. గో. చం:- బాబా! నీవిటుల చెప్పినను నే నేమియు గ్రహింపఁ జాలను. నేనేమి చేయఁగలను? నేను గ్రహించు నటుల చేయుము పిమ్మట ఈపళ్ళెరముల తీసికొని వెళ్ళెదను. నేను భుజింపెదను.

అంతట బాబా, నానా హృదయము మందడఁగియున్న నొక గోప్య మగు విషయము బోధపడునట్లేవో సైగ చేసెను. దాని భావము నానాకు తప్ప ఇతరులకు బోధపడలేదు. అంతట చందోర్కరు శ్రీసాయిబాబా తన అంతర్యామి యనియు, అట్లగుటచే సర్వాంతర్యామి యనియు - అనగా చీమలు - ఈగలు మొదలగు జీవములం దధివసించియున్న వాఁడని స్వానుభవమున గ్రహింపజాలెను.

నా. గో. చం:- బాబా! ఈ వస్త్రములను తీసికొనిపెళ్లెదను.

సా. బా:- నానా! ఈ నా (గుర్తు) సైగ నీవు గమనింతువేని నేనాయారూపముల నీవిడు పదార్థములను స్వీకరింతునని తెలిసికొనఁ గలవు: (చూ. 72.)

ప్రత్యుద్గమప్రశ్రయణాభి వాదనం విధీయతే సాధు మిథఃసుమధ్యమే
ప్రాజ్ఞైవరస్మై పురుషాయచేత సా గుహాశయా యైవ సదేహ మానినే

సత్వంవిశుద్ధం వసుదేవశబ్దితం యదీయతే తత్రపుమా నపావృతః
సత్వేచ తస్మిన్ భగవాన్ వాసుదేవో హ్యధోక్షజో మే మనసా విధీయతే,
శ్రీ మద్భాగవతము IV-(3) 22, 23

( శివుఁడు దాక్షాయణితో చెప్పు పలుకులు )

(లోకంబున జను లన్యోన్యంబును ప్రత్యుత్థానాభి వందనంబులు గావింతురు. అదియు ప్రాజ్ఞులయినవారు సర్వ భూతాంతర్యామి యైన పరమపురుషుండు నిత్య పరిపూర్ణుండు గావున కాయికవ్యాపారం బయుక్తంబని తదుద్దేశంబుగా మనంబునందు నమస్కారాదికంబు లాచరింతురు గాని దేహాభిమానంబులుగల పురుషులందుఁ గావింపరు గాన యేనును వాసుదేవ శబ్దవాచ్యుఁడు శుద్ధసత్వమయుండు అంతఃకరణంబు నందు ఆవరణ రహితుండునయి ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నెల్లప్పుడు నమస్కరించుచుందును.)

సాధనము VI ప్రకృతి దృశ్యములు

200. (a) బాబా తఱచుగ అస్తమించు సూర్యునిపైపు చూచు చుండును. ఒక్కొక్కయెడ పెద్దపావురాళ్ళ గుంపు సొంపును గని ప్రేమించువాఁడు.

(b) కె. జి. భీష్మ, బల్వంతు కపర్దే కలిసి శిర్డియందొకనాటి ఉదయ కాలమున విహారమేగిరి. స్వల్పముఁగ మంచు గురియుచుండెను. సూర్యుఁడుదయించుచుండెను. భీష్మ - పడమరకు తిరిగెను. అతని పాద ముల దగ్గఱనుండి పడమట దిక్కు కొనవరకు అపారదూర మాతనినీడ వ్యాపించినట్లుండెను. పడమట ఆకాశమున అతనినీడ ఇంద్రధనస్సును గూడి, తలపై కిరీటమును పెట్టినట్లుండెను. ఆదృశ్యమతనికి గొప్ప ఆనందమును గూర్చెను. అది అనంతము ప్రకాశవంతమగు అతని ఛాయయే. జీవాత్మ - పరమాత్మను చేరుచుండెనా! యనునట్లుండెను. క్షణకాలమతఁడు అపరిమితానందమున తేలెను. బల్వంత కూడ ఆ విధ మగు ఆనందము నొందెను. ఇరువురు తిరిగి వెళ్లగా జి. యస్. కపర్దే వారికి బాబా క్షణమాత్రము ఆత్మసాక్షాత్కార భాగ్యము అనుగ్రహించెనని పలికెను. అంత వారిరువురు బాబా దగ్గఱకు చేరగా, కపర్దే మాటలకు తన అంగీకారముఁ దెలుపుచుండెనా యనునట్లు బాబా చిఱునవ్వు నవ్వెను.

[ గమనిక:- సింధునది - నారాయణ సరస్సుదగ్గఱ సముద్ర మును జేరు దృశ్యానుభూతి (భాగ VI 5 ) - 3-5) ]

"తదుప స్పర్శనాదేవ వినిర్ధూతమలాశయాః
ధర్మే పారహంస్యేచ ప్రోత్పన్న మతయోప్యత"

సాధనము VII సంగీతము - (గానము)

1. లయ - బ్రహ్మ సంబంధమైన విద్య - బాబా - సంగీతము

201. సంగీతమునందు చక్కని ప్రవేశముగల భక్తుని (యం. బి. రేగే) బాబా పిలుపనంపి

సా. బా:- కానిమ్ము! గానము సలుపుము.

భక్తుఁడు పాడెను. అందలి లోపములను బాబా సవరించి మఱి కొన్ని శ్రుతులను - స్వరముల నాలపించు సిద్ధాంతమును సూచించెను.

బాబా శిర్డీకిఁజేరిన క్రొత్తలో తఱుచుగ రాత్రులందు 'తాకియా' (మహమ్మదీయుల విడిది గృహము) యందు కాళ్ళకు చిఱుగజ్జెలు కట్టుకొని నృత్యము చేయుచు కబీరు గేయములు మొదలగునవి కీర్తించువాఁడు. 1890 తరువాత చాల అరదుగ కావించెను.

202. సా. బా:- (అబ్దుల్ రహీం రంగారీతో) నీవు నిన్న వచ్చియుండిన ఇంకను బాగుండెడిది.

అబ్దుల్:- ఏల?

సా. బా:- గానము! సంగీతము జరిగెను. నేను రాత్రి యంతయు ఏడ్చితిని. వారునన్ను దూషించిరి?

అబ్దుల్:- వారేల నిన్ను దూషించిరి?

సా. బా:- నేను "దూషించిరి" - అనిన జనులు సాధారణముగ గ్రహించలేరు. నీవు గ్రహింపఁగలవు.

అబ్దుల్:- భగవానుని ప్రేమించువాఁడు దైవ సంకీర్తనము కావింపఁబడు చుండగ ఏడ్చును, నవ్వును, ఆనందమున నాట్యము చేయును.

సా. బా:- అవును సత్యమును పలికితివి. నీకు గురువు కలఁడు గదా?

అబ్దుల్:- కలఁడు, "బీబీ బడీషా-చిష్టి-నిజమా." •

---

• ఈ చిష్టిగురు వెక్కడకు ప్రయాణముచేసినను మేళతాళములతో పోవును. ఈ చిష్టిపంథావారు సంగీతమును మనోలయ సాధనముగ నుపయోగింతురు.

సా. బా:- కావుననే నీవు గ్రహింపఁగలవు.

i. వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః
తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్ష మార్గం సగచ్ఛతి. (యాజ్ఞవల్క్యస్మృతి)

ii. స్వరబ్రహ్మణి నిర్భాత హృషికేశపదాంబుజే
అఖండం చిత్తమావేశ్యలో కానను చరన్మునిః (భాగ VI (5) - 22)

"గీతార్థము - సంగీతానందము" (త్యాగరాజకృతులు)

(భగవద్గీతలలోని అర్థము - సంగీతానందములలో (హనుమంతునిలో) కలదు - అని శ్రీరాముఁడు మారుతికిఁ దెలుపుచున్నాఁడు)

నైతిక బోధలు – చక్కదిద్దుట.

శత్రుషట్కము - కామము - కోపము - లోభము -
మోహము - మదము - మత్సర్యము.

203. బాపూసాహెబ్ జోగ్:- బాబా! అనన్యభావమున ఇంత కాలమునుండి నీసేవ చేయుచున్నాఁడను. నాసేవ ఫలించెనని నేనెట్లు తెలిసికొనఁగలను?

సా. బా:- నీవు నావలె సర్వ బంధములనుండి విడివడి నా భావముపొంది, నావలె 'కుఫ్నీ' ధరించి, భిక్షించి జీవింప నేర్చినపుడు మనయిరువుర హృదయములను ఆనఁదింపఁజేయు నీసేవ సఫలమైనది- అని గ్రహింపుము.

కామము (a) దేవదాసు

204. సా బా:– సన్న్యాసియైన దేవదాసుతో 1. వైరాగ్యము పొదుకొలుపు కొనుము. 2. యతులకు కాంతలు అపాయ కారకములు - ప్రీతి బంధములని గ్రహింపుము. 3. మోహము - సుఖము మొదలగు ఉపాధులను విడువుము. 4. భగవానుని ధ్యానింపుము! అజ్ఞానమును త్యజింపుము. కామమును జయింపలేని వానికి దైవప్రాప్తి లేదు - దైవ సాక్షాత్కారమును పడయఁజాలఁడు.

కామ వ్యామోహమును జయించుట. (b.) నా. గో. చందోర్కరు.

205. నా. గో. చందోర్కరు బాబాచెంత మసీదులో కూర్చుండి యుండగ ఇరువురు ముస్లింకాంతలు (గోషాస్త్రీలు బాబాను సందర్శించుటకు వచ్చిరి. చందోర్కరు లేచి యావలకు వెళ్లఁ బ్రయత్నించెను.

సా. బా:- నీవు వెళ్లవలదు; ఉండుము. వారు రాఁదలచిన రానిమ్ము!

ఆ కాంతలు బాబాను సమీపించిరి. వారిలో వృద్ధ వనిత ముసుగు తొలగించి బాబా దర్శనము చేసికొనెను. ఆ పిదప రెండవ యువతి ముసుగును తొలగించి బాబాను సందర్శించి, మరల ముసుగు కప్పుకొనెను. నానా ఆమె చక్కదనమున కబ్బురపడి, "ఈ అసాధారణ సుందరముఖము మఱియొకమాఱు చూడగలనా?" అని, తనలోఁ దలంచెను. బాబా వెంటనే అతని తొడపై చఱచెను.

సా. బా:- నానా! నేనెందుకు కొట్టితినో నీ వెఱుఁగుదువా?

నా. గో. చం:- సర్వజ్ఞుఁడైన నా గురుదేవుని నుండి నేనేమి మఱుఁగుఁ జేయఁగలను? బాబా! మీ సమక్షమున నుండఁగ అట్టి అల్ప సంకల్పములు నా మనస్సునెట్లు లోఁగొనుచున్నవో నేనెఱుఁగఁజాలను.

సా. బా:- నానా నీవు కేవలము మానవమాత్రుఁడవు. కాదా? దేహము కోరికలతో నిండినది. ఏదేని విషయము ఇంద్రియ గోచరమైన మాత్రమున ఆ కోరిక వెలికి తోఁచును. కాని, చిత్రవిచిత్ర వర్ణశోభితములు, సుందర బాహ్యాకారములుగల దేవాలయము లీప్రపంచమున అరుదా? మన మచటకు వెళ్లినపుడు ఆ వెలుపలి రమ్యాలంకారములను జూచి ఆనందించుటా? లేక, ఆ గుడియందున్న దైవమును జూచుటా? లోపలనున్న దైవమును చూచుచున్నపుడా వెలుపల సౌందర్యమును లెక్కింతువా? లేక ఆ పరమాత్మ స్వరూపమును లక్షింతువా? భగవానుఁడొక్క దేవళమునందేయున్నాఁడా? దేవాలయములందున్నటుల ఈ ప్రపంచమున సకలవస్తువులందును దైవములేఁడా? మనమెల్ల వేళల

గుర్తింపవలసినది ఆ వెలికితోఁచు సురూప కురూపములను గాదు - అందు అధిష్ఠించి యున్న దైవమునే.

బాహ్య సౌందర్య రూపములను జూచుటయందు లోపమేమి యును లేదు. కాని, అటుల చూచునపుడు అట్టి మనోహరమైన నివాస మును కల్పింపఁజాలిన ఆ దైవమెంత శక్తిసంపన్నుఁడో! ఎంత నేర్పరి యైన శిల్పియో! మన మూహించుకొనవలయును.

నానా! నీ తలంపు లీమార్గమున నడచిన నీవా ముస్లింయువతి ముఖరామణీయమును మఱియొక సూఱు చూడవలయునని కోరుకొని యుండవు. ఈ విషయము నీ మనస్సు నందెల్ల వేళల నిలుపుకొనుము!

## (c) హెచ్. వి. సాతే

206. హెచ్. వి. సాతే - ఒక సెటిల్మెంటు ఆఫీసరు బాబా భక్తుఁడు. శిరిడియందు సాతేవాడలో తన నివాసమున నున్నవాఁడు. ఒకనాఁడు వేడుకకై మంచినడవడిలేని బాబా భక్తురాలిని చూడఁబోయెను. వెళ్ళుటకుముందు ఆ ఉదయమున బాబాను సందర్శించినాఁడు.

సా. బా:- సాహెబ్! 'శాలకు' వెళ్ళియుంటివా?

సాతే:- ఏమి! బాబా 'నన్నుబడికిపంపకయే డిప్యూటీ కలెక్టరును కావించితివా?

బాబా 'శాల' అనుపదమునకు స్థానిక అర్థము అతఁడు గ్రహించలేదని ఆ విషయమును అంతటితో నిలిపెను. తరువాత సాతే 'శాల' అని అచట పిలువఁబడు ఆచెడిపయింటికి వెళ్లెను. ఆమె తోడి సంభాషణలు క్రమముగ వ్యామోహావేశకరములై అతనికి పతనముఁ గూర్చు స్థితికిఁ గొనివచ్చినవి. తటాలున వాకిలి తలుపు తెరువఁబడెను. బాబా ఆ తలుపుదగ్గఱ నిలఁబడి, యేవిధాసైగలు — (అహా) ఇంత దూరము నీగురువుదగ్గఱకు వచ్చితివి. ఇపుడు నరకమునకు దిగుచుంటివా- యేమి? ఎంత చక్కని ప్రవర్తనము!- అను భావము (ప్రకటముగునట్లు) చేసెను.

అంతట బాబా అదృశ్యుఁడయ్యెను. ఈ విధముగ తన నియంతయైన బాబాచే అదనున సాతే రక్షింపఁబడెను. సాతే ఆ'శాలను' వెంటనే విడచి వెళ్లెను. మరల ఆ చెడిపను చూడలేదు.

కోపము (a) రామదాసి

207. సా. బా:- (రామదాసి) నీవు నిరంతరము అధ్యాత్మ రామాయణము పారాయణము చేయుచుంటివి. ఇంకను నీహృదయము కల్మషరహితము కాలేదు. నీవు సహస్రనామములను వల్లింతువు-కానీ, నీ కష్టములు తొలఁగలేదు. నీవు నిన్ను 'రామదాసి' యని చెప్పుకొను చున్నావు. నీవు రామదాసివే అయిన సకల విషయములకు విముఖుఁడవు కావలయును. నీవు దేనియందును 'మమత' కలిగియుండరాదు. సకల మున 'సమత' పాటించుచు, సకలమును సమదృష్టితో చూడవలెను. నీవు పిల్లవానివలె ప్రవర్తించుచు ఒక పుస్తకము కొఱకు తగవులాడు చున్నాఁడవు. ధనమును వెచ్చించిన పుస్తకములు కోకొల్లలుగ దొరకును; కాని. మనుష్యులు-మిత్రులు దొరకరు.

208. సా. బా:- ఎవఁడేని ఇతరుని కోపించెనేని నేను వెంటనే బాధపడుదును. ఇతరుని ఎవఁడేని నిందించిన నేను నొచ్చు కొందును. ఇతరులు నిందించిన ధైర్యముతో సహించు వానినిఁగూర్చి మిక్కిలి సంతోషింతును. (చూ.289.)

b) జోగ్

209. సా. బా:- (జోగ్‌తో) దక్షిణ నిమ్ము!

జోగ్:- (కోపముతో) బాబా! నాదగ్గర ఒక పైసాకూడా లేదని నీ వెఱుఁగుదువు. నేనెట్లీయఁగలను?

సా. బా:- ఈయకుము - కాని, నీకా ఆగ్రహావేశమెందుకు?

c) ఆర్. బి. పురందర్

210. సా. బా:- (పురందర్‌తో) ఎవరేనిఁవచ్చి నిన్ను తిట్టిన కొట్టినను వానితో పోరాడకుము. నీవు సహించ లేనియెడ సౌమ్యముగ

నొకటి రెండు పలుకులు పలుకుము. కాదా-అచ్చోటు విడిచిపొమ్ము. కాని, వానితో గ్రుద్దులాడి ప్రతీకారము కావింపకుము, నీవు ఇతరులతో కలహించుచున్న నేను విసుగునొంది బాధపడుదును.

### d) ప్రధాన్ సతి

211. సా. బా:- (ప్రధాన్‌సతితో) ఎవరేని మనల పదిమాట లనిన, సమాధానము చెప్పందలంచిన ఒక్క మాటతో సరిపుచ్చుము. ఎవరి తోడను కలహింపవలదు.

### e) బాబా - కోపజయము.

212. బాబా కోపోద్రిక్త సమయమున నుండగా ఉద్ధవేశ భావ్. బాబాను సమీపించి, ప్రణమిల్లి, సెలవుకోరెను. బాబా వెంటనే శాంతించి, మిక్కిలి సౌమ్యముగ "వెళ్ళుచున్నావా! ఎప్పుడువచ్చెదవు? మరల మరల పక్షమున కొకమారు రావలదు. నేను నీతోడ నున్నాడను. మంచిది! వెళ్ళిరమ్ము! "అనెను.

213. బాబా మిక్కిలి కోపావేశమునన్న సమయమున సామంతు (పోలీస్ సబ్ఇన్స్పెక్టరు) కొంచెము దూరమున నిలిచియుండి "బాబా వెంటనే సెలవుఇచ్చినగాని వెళ్లి, రైలుబండిని అందుకొనుటకు సాధ్యపడదని, లేకున్న పై యధికారివలన మాటవచ్చునని" తలంచెను.

సా. బా:- వెళ్ళందలంచిన వారినందఱనువచ్చి 'ఉధి' తీసి కొనుండని చెప్పుము!

214. కాకా ధూపేశ్వర్ పనుపున శిరిడి మసీదునుజేరిన 'తానా' ప్లీడరు 'జోషి'ని, మఱియొకనిని కోపావేశమునన్న బాబా చూచెను.

సా. బా:- వారినిక్కడకుం దీసికొనిరమ్ము! వారు సమీపింపం గనే బాబా మిక్కిలి శాంతించి, "అనుసలివానినిం జంపి యిక్కడకు వచ్చినారా?" అని, అడిగెను.

(గమనిక:- వారిని శిర్డీకి వెళ్లుడని ఆదేశించిన పిదప కాకా ధూపేశ్వర్ మరణించెనని భావము (చూ-411)

బాబా - కోపము

215. సా. బా:- నాకెవరిమీదను కోపములేదు. తల్లి బిడ్డలకు హానిచేయునా? సముద్రము నదీజలములను వెనుకకు త్రోసి వేయునా? నేను భక్తిని ప్రేమింతును. నా భక్తులకు నేను సేవకుడను.

216. సా. బా:- నానా! నీపై నాకు కోపములేదు. నాబిడ్డలైన మీకు నాపై కోపపడుటకు అధికారము గలదు. వేంకుశుడే యిచ్చట నున్న నేనాయనపై కోపపడుదును. (చూ. 179)

217. సా. బా:- (బాబా కోపించునని భయపడుచున్న ప్రధాన్ సతితో) చూడుము! నేనీదినమున నెవరిని కోపించుట లేదు.

218. సా. బా:- (తీవ్రకోపావేశమునందున్న సమయమున) ఎల్లరకు శుభాశీస్సులు! - శుభములు కలుగుగాక!

218 A (226) (ద్వేషము). సా. బా:- (శిరిడిలో నొకయింటి యజమాని తనకు విరోధియగుటచే తనను విందునకు పిలువలేదని చెప్పిన దాస్‌గాణూతో) ఎవరు దేని నెవరికిత్తురు? ఈవిందు ఏమిటి? ఎవరు భుజింతురు? నీకు విరోధియని ఎవరినిగూర్చి పలుకకుము. ఎవరు ఎవరివిరోధి? ఎవరియెడ ద్వేషబుద్ధి వహింపకుము. ఎల్లరు ఒకరే- అభిన్నులే.

"త్వయిమయిసర్వత్రైకోవిష్ణుః వ్యర్థం కుప్యసిమయ్యసహిష్ణుః
భవసమచిత్తస్సర్వత్రత్వం వాంఛస్యచిరాద్యదివిష్ణుత్వమ్"
(మోహముద్గర)

గర్వము

(a) తీర్థయాత్రిక గర్వము:- (బాబా - హాజీగర్వమడంచుట)

219. (మక్కా తీర్థయాత్ర చేసి వచ్చిన) ఒక హాజీ శిరిడి మసీదునకు జేరవచ్చెను.

సా. బా:- మసీదులోనికి రావలదు! ఆ హాజీ వెనుకకు తిరిగి వెళ్లెను. మసీదులోనికి బాబా అతనిని రానీయకుండుటచే శిరిడి యందే యుండెను. కొన్ని నెలల తరువాత శ్యామాద్వారా బాబాకు తన విషయము చెప్పించుకొనెను. బాబా ఆ హాజీని పరీక్షించి అతని గర్వము నడఁచెను.

సా. బా:- (శ్యామాతో) "బార్వేబావి దగ్గఱనున్న పొదల మధ్యగ ఇఱుకు కాలిబాటన సూటిగనడచి వచ్చెదువా? యని, చావడికివెళ్లి ఆ మనిషిని అడిగిరమ్ము!

శ్యామా వెళ్లి ఆ హాజీ సమ్మతి గానివచ్చెను.

సా. బా:- (శ్యామాతో)వెళ్ళి, నాలుగు 'దఫాలుగ' 40 వేలు రూపాయల నిచ్చునేమో అడిగిరమ్ము.

శ్యామావెళ్ళి "40 లక్షలు రూపాయలనిత్తు" నను సమాధానముఁగొని వచ్చెను.

సా. బా:- (మరల మూఁడవమారు శ్యామాతో) శ్యామా! వెళ్ళి అతనిని మేక మాంసమా? పిఱుదు ఎముక మాంసమా? లేక, వృషణములా? - ఏది యిష్టమో - అడిగిరమ్ము!

శ్యామావెళ్ళి, "బాబా (కోలంబ) మట్టిపాత్రలోని ఒక చిన్న రొట్టిముక్కతో మిక్కిలి సంతోషింతును" — అను సమాధానము, గాని వచ్చెను.

అంతట బాబా స్వయముగ చావడికివెళ్ళి, ఆ హాజీని చెడతిట్టి. (తనను వ్రేలితోఁజూపుచు, "ఇక్కడనున్నది ఎవరను కొన్నావు? నీవు వ్యర్థముగ డంబములు చెప్పుకొనుచు 'గొప్పవాఁడను' - అని తలంచు చున్నావు 'కొరాను' - నిన్నటుల వర్తింపుమని బోధించుచున్నదా? మక్కా

తీర్థయాత్రను తలంచుకొని గర్వించుచున్నాఁడవు. కాని, నీవు నన్నెఱుఁగవు. అని, కఠినముగ పలికెను.

ఆ హాజీ భయభ్రాంతుఁడయ్యెను - బాబా మసీదునకు తిరిగి వెళ్ళి, పండ్లనుకొని, ఒకబుట్ట నిండుగనింపి, హాజీకి పంపెను. తరువాత 50 రూపాయల నిచ్చెను. అది మొదలు అతని యిష్టము చొప్పున మసీదునకు రావచ్చునని అనుమతి నిచ్చెను.

(b) హెచ్. వి. సాఠే

220. సా. బా:- (సాఠేతో) (శంకుస్థాపనము చేయుటకు) నీ వచటకు ఏలపోవలయును? వీని అన్నిటితో మనకేమి సంబంధము గలదు? బేల్దారిలు - ఇతర పరివారలా పనిని గావింతురు.

(c) దాస్ గాణూ

221. సా. బా:- (దాస్‌గాణూతో) సంకీర్తనము కావించుటకు ఒక పెండ్లికొమరునివలె ఆ వేషమేమిటి? నడుము పై భాగమున గల ఆ దుస్తులను - జరీతలపాగను - అవన్నియు తీసివేయుము. నారదమహర్షి కీర్తన పద్ధతి నిర్దేశించినాఁడు, కావున నారదుని మార్గమునే అనుసరింపవలయును.

(ధోవతి - నడుమునకు బిగించిన ఉత్తరీయము - చేతుల చిఱుతలు తాంబుర - ఇవి మాత్రమే ధరించవలెనని భావము.)

## తుల గర్వము

d) ద. ఆఫ్రికా డాక్టరు (బ్రాహ్మణుఁడు)

222. మామ్లత్ దార్:- (ద- ఆ డాక్టరుతో) రమ్ము. సాయిబాబాను చూచివచ్చెదము.

డాక్టరు:- నేను రామోపాసకుఁడను, నేనితరులకు మ్రొక్కను.

మామ్లత్‌దార్:- వేఱుగ తలంపకుము-రమ్ము. నీవు మ్రొక్క వలసిన పనిలేదు.

ఆరతి సమయమున మసీదుదగ్గఱ కొంచెము దూరమున నిలిచి యున్న డాక్టరు తటాలున మసీదులోనికి దూసికొనివచ్చి, బాబా పాదముల వ్రాలెను.

మామ్లత్ దార్:- (తరువాత) నీమనస్సు నేల మార్చుకొని మ్రొక్కితివి?

డాక్టరు:- సాయిబాబా- శ్యామసుందరుఁడైన శ్రీరాముడుగ నాకు దర్శనమిచ్చినాఁడు. అందుచే మ్రొక్కితిని. ఈసాయి యోగ సంపూర్ణావతారుఁడు.

[మద్రాసీరామదాసికిగూడ బాబా శ్రీరామచంద్రుఁడుగ దర్శన మిచ్చెను.]

ఆ డాక్టరు సత్యాగ్రహమునకుఁదొడఁగెను. బాబా తనను పిలువ నంపి బ్రహ్మానందము-ఆత్మసాక్షాత్కారము ప్రసాదించునంతవఱకు మసీదు నకు వెళ్ళనని మూఁడుదినము లుపవసించెను. కాని, నాల్గవనాఁడు చాల కాలమునుండి దూరమైన ఒక మిత్రునితోఁగూడి మసీదుఁ జేరెను.

సా. బా:- నిన్నెవరేని ఇక్కడకురమ్మని పిలిచినారా?

డాక్టరు సిగ్గునొంది, తనకు పరమానందమును ప్రసాదింపుమని మానసికముగ బాబాను ప్రార్థించెను. ఆ రాత్రి శిరిడియందు, తరువాత తన పురమునందు బ్రహ్మానందాను భూతిని పొందగలిగినాఁడు (చూ. 112 జి. యస్. కపర్దే-బాబా యోగదృష్టి. మేనేజర్‌సతి- అనుభూతి.)

(౮) మూలేశాస్త్రి

223. నాశిక్ నివాసికుల గర్వితుఁడైన మూలేశాస్త్రి శిర్డీకి వచ్చినపుడు.

సా. బా:- (ఒకరితో) నావస్త్రములకు రంగువేసికొనుటకు కావి రంగు తీసికొనిరమ్ము.

(బాబా ఆదినమునఁగాని, మఱియేదినమునఁగాని కావి రంగు వస్త్రములను ధరించియెఱుఁగఁడు.)

సా. బా:- (బూటీతో) వెళ్ళి, క్రొత్తగావచ్చిన నాశిక్ బ్రాహ్మణునివద్దనుండి నాకు దక్షిణఁగొనిరమ్ము.

ఆ నాశిక్ బ్రాహ్మణుఁడు "మూలే" వచ్చి మసీదులోనికిఁ బోయిన మైల సోకునను తలంపున మసీదునకు కొంచెము దూరమున నిలబడియుండెను.

అంతట మూలేశాస్త్రి బాబా స్థానమున తన గురువును చూచి, మసీదులోనికి పరుగునవెళ్ళి, జై! గురు! జై! ధోలప్ మహరాజ్! అని పలుకుచు బాబా పాదముల వ్రాలెను.

సా. బా:- దక్షిణనిమ్ము!

కావి వస్త్రములు ధరించిన తన బ్రాహ్మణ గురువు - ధోలప్ మహారాజు తటాలున అదృశ్యుఁడై ఆ స్థానమున బాబా కూర్చుండెను. అతఁడు బాబాకు దక్షిణ నొసంగెను.

## (f) బయ్యాజి.

బాబా - బలగర్వమణచుట

224. బయ్యాజి - అప్పాజీ - పటేల్ - తనకు భీమ బలము కలదని గర్వించువాఁడు. బాబా తనువును "మాలీస్" - (ఒడలు పట్టుట) చేసిన తరువాత బాబాను తన చేతులతో లేవనెత్తుకొనివెళ్ళి, "ధుని"కి దగ్గఱఁగ దింపువాఁడు. ఒకదినమున అటుల బాబాను లేవనెత్తఁదలఁచెను- కాని, సాధ్యము కాలేదు. అతనివంకఁ జూచి బాబా నవ్వెను. ఆ నవ్వు అతని బలగర్వమును తొలఁగించు చిహ్నము.

[గమనిక - వాయువు ఒక తృణమును లేవనెత్త వ్యర్థ ప్రయత్నము చేయుట - కేనోపనిషత్తు]

(9) నా. గో. చందోర్కరు విద్యాగర్వము.

సంస్కృత భాషా పాండిత్యము - ముఖ్యముగ గీతా భాష్య గ్రహణశక్తి కలదని గర్వించు నా. గో. చందోర్కరు విద్యాగర్వమును బాబా అడఁచెను. (చూ. 182)

## మత్సరము (ఈర్ష్య)

225. సా. బా:- (నా. గో. చందోర్కరుతో) షడ్వికారములలోమిక్కిలి సులువుగ జయింపఁదగినది మత్సరము లేక (ఈర్ష్య), ఈ వికారమును జయించుటలో మనకు గలుగు లాభముగాని, నష్టముగాని లేదు. ఇతరుల లాభసంపదలఁగాంచి సహింపలేక పోవుటయే ఈర్ష్య. ఇతరుఁడు భాగ్యసంపదలు - ఉన్నతశక్తి - అధికారము సంపాదించిన మనముచూచి ఓర్వలేము. పైగా - అతనినిఁగూర్చి నిందలు పలుకుదుము. అతనికి నష్టకష్టములు కలిగిన సంతోషింతుము- ఆనందింతుము. కాని, యట్టివర్తనము మంచిదా? అతఁడు గొప్ప ఐశ్వర్యములనుపొందిన మనకు వాస్తవముగ నష్టమేమికలదు? కాని, జనులు ఈ దృష్టి వహింపరు. అతఁడు మేలుపొందిన అతనితోబాటు మనమును ఆనందింపఁదగును. మనముకూడ అదృష్టవంతులమని, మేలుపొందితిమని భావింపనగును. లేక, మనముకూడ అట్టి మేలుపొందుటకు ప్రయత్నము చేయఁదగును. మనకోరిక - మన నిశ్చయము ఆ రీతిగ నుండవలయును. మనవద్దనుండి అతఁడేమి తీసికొనెను?- ఏమియుఁలేదు. అతని పురాకృత సుకృత కర్మఫలముగ నతడా సంపదలను పొందెను. అట్టి దానినిఁగూర్చి మన మేల విచార పడవలయును? కావున, నానా! ముందుగ ఈర్ష్యను (మత్సరమును) జయింపుము.

## లోభము - (పేరాశ)

226. సా. బా:- ఇతరులయొక్క శ్రమ (కష్టము)గాని ధనముఁగాని ఉచితముగ స్వీకరింపకుము. దీనిని నీ జీవితనియమముగ పాటింపవలయును.

[ఒక యింటి కప్పుమీఁద నుండి క్రిందకి దిగుటకు నిచ్చెన తెచ్చిన వానికి 2 రూపాయలిచ్చుచు బాబా పలికిన మాటలివి.]

227. సా. బా:- (నా. గో. చం. తో) ఇతఁడొక పెట్టెను మనదగ్గఱ విడిచిపెట్టి వెళ్ళినాఁడు. ఇప్పుడు దానిని తిరిగికోరుచున్నాఁడు. నిరాకరించుట మనకు తగదు. అతనికి చెందినదాని నతనికి తిరిగి యీయవలయును.

228. సా. బా:- ( జయగుడి బాలనివాస్కరుతో ) ఆ భూములు తిరిగ బిడ్డలకు (కౌలునకిచ్చిన ఖామందులకు) ఇమ్ము. వారిని బాధింపనేల?

[క్షీరసాగర్ భూములను కౌలునకుతీసికొనిన "బాలనివాస్కర్"తో బాబా అనిన మాటలివి. ఈ భూములపై వచ్చు ఆదాయము బాబాకు సమర్పింపఁబడినది కాని 'నివాస్కర్' ఆ భూములను తిరిగి యజమానికి విడుదలచేయ నిరాకరించెను.]

229. సా. బా:- ( అణ్ణాయీతో ) నీ ఆస్తి సంపదలను అనుభవించు వాఁడు-అన్నా- నీ తండ్రి. అతనినే తిననిమ్ము. అతనితో వ్యాజ్యెముల కల్పించుకొనకుము. దైవము నీకు సమృద్ధిగ కూర్చును.

230. సా. బా:- (జోగ్‌తో) నీ ధనమునడుగుటకై నీకు బాకి పడినవాని గ్రామమునకు వెళ్ళకుము. అప్పు తీసికొనినవాఁడే యిచటకు వచ్చును.

జోగ్:- బాబా! వానియంతట వాఁడువచ్చునా? ఎట్లువచ్చును? వాఁడు వ్రాసియిచ్చిన కాగితము (నోటు) వాయిదా కడవనున్నది.

సా. బా:- వేచియుండుము!

జోగ్ వేచియుండెను. వాయిదా దాటెను ఆ బాకీపడిన, వాడు స్వయముగావచ్చి, అప్పు తీసికొనిన పైకము (అసలు) 1400 రూపాయలు చెల్లించెను. (చూ. 255)

సాదు - (శ్రేయమును కోరుకొనెను; బడేబాబా అటులకాదు.)

231. 15-2-1915న సాయంత్రము 4 గంటలకు సాదుభయ్యా (సదాశివదండిరాజు) 'హర్దా' గ్రామమున కొందఱు మిత్రులతోఁగూడి నడచుచుండెను. అతని ఎదురు మార్గము నుండి బాబా నడచుచువచ్చి యతని చేతిలో నొక పల్లు కుట్టుపుడకనుంచి యదృశ్యుఁడయ్యెను. (ఆవిర్భావము చూ. 52.)

దైవమును విశ్వసింపని మిత్రుడు:- ఇపుడు జరిగినదేమి?

సాదుభయ్యా:- ఇది సత్యము. మనము వచ్చునపుడు నా చేతిలో పల్లుకుట్టుపుడకలేదు. ఇపుడు నాదగ్గఱ ఒకటికలదు. బాబా దీనిని నాకిచ్చినాఁడు.

మిత్రుఁడు:- శిరిడికి ఉత్తరము వ్రాసి, యీ విషయమేల నిర్ణయింపరాదు?

సాదుభయ్యా - శ్యామాకు ఉత్తరము వ్రాసెను. శ్యామా పిలుపు ననుసరించి, భయ్యా శిరిడికివెళ్ళి బాబా సముక్షమున జరిగిన దంతయుఁదెలిపెను.

సా. బా:- సాదు! వెళ్ళి, బడేబాబాకు ఇదంతయు చెప్పుము [సాదుభయ్యావెళ్ళి బడే బాబా - డాక్టరుపిళ్ళె - మొదలగువారియెదుట) హర్దాలో జరిగిన వృత్తాంతము తెలిపెను. బడేబాబా చకితుఁడై, యోచించుచు, ఏడ్చుచు బాబాదగ్గఱకేగెను.]

బడేబాబా:- ఏమి? బాబా! నీ వెంతసేపు నాకు ధనము మాత్రమే యిచ్చుచుంటివి. కాని, సాదుభయ్యాకు సాక్షాత్కారము ప్రసాదించితివి! (అని ఏడ్చెను.)

సా. బా:- ఏమిచేయఁగలము? ఎవరు కోరునది వారు పొందుచుందురు.

[బడేబాబా అపరిమిత ధనము పొందుచు, దానిపై రాబడి పన్నులు చెల్లించినాఁడు తుదకా ధనమంతయు కోల్పోయి మరణించెను.]

232. యన్. ఆర్. సహస్రబుద్ధి – భక్తులందఱకు బాబా ప్రసాదము పంచిపెట్టుట చూచెను. బాబా చేతిలోనున్న ప్రసాదమంతయు తఱిగిపోయినది. స్వల్పముగ నుండుటచే తనకేమియు ప్రసాదము మిగులదేమో! యని సహస్రబుద్ధి తలంచెను.

సా. బా:- (అతని చేతిలో నొక రవ్వ ప్రసాదముపెట్టి) నీకేమియు మిగులలేదు:- అని అతని లౌకిక బంధములను – ఆశలను నిరసించినాఁడు.

## సంపద – (కాంచనము)

### a) దక్షిణ.

233. భక్తుఁడు:- (పురందర్) బాబా! అంత ధనము నీవేల అడుగుచున్నాఁడవు?

సా. బా:- నేను ప్రతివ్యక్తిని అడుగుటలేదు. ఆ ఫకీరు (దైవము) నిర్దేశించువానినే అడుగుదును. కాని, అట్టి దానికి పదిమడుంగులు తిరిగి యీయవలయును. నాకొఱకు నేను ధనము తీసికొనను. నాకు కుటుంబములేదు.

ప్రతి ఉదయము బాబా ఒక పైసాకూడ లేని పేదఫకీరే. పగలంతయు అపారముగ దక్షిణలు ప్రోగగును. సాయంత్రము – చీకటి పడునప్పటికి అటుల ప్రోగైన ధనమంతయు పంచిపెట్టఁబడును.

పది సంవత్సరముల కాలము ఒక గవర్నరు ఆదాయము మించిన ధనము బాబా స్వీకరించినను మహసమాధి నొందునాటికి ఆ తండ్రిదగ్గర 16 రూపాయలు మాత్రమే యుండెను.

234. ఇంటనొక ఉంపుడుకత్తె నుంచుకొని సుఖరోగములతో బాధపడు నొకడు శిర్డికిఁజేరి బాబాకు మ్రొక్కి బాబా ఈ 500 రూపాయలు తీసికొనుమనెను.

సా. బా:- కోపముతో నీధనము నాకేమియు నక్కరలేదు. నీయింట నొకతె నుంచుకొంటివి. కదా? ఆమె కీ ధనము నిచ్చుకొనుము.

[తన గుట్టు వెలిబుచ్చబడుటచే నతడు సిగ్గునొంది వెడలి పోయెను.]

**235.** కొందఱు బాబాఉన్న మసీదునకు ప్రయాణమై వచ్చుచుండిరి.

సా. బా:- (కోపముతో తీవ్రముగ తిట్టుచు వారు కావించిన దుష్టపాపకార్యముల వెల్లడించుచు.) దుష్టులు - వారేమి మేలు పొందఁగలరు?

దూషణలు పూర్తియగునప్పటికి ఆమనుష్యులు గొప్ప గొప్ప బహుమానములతో మసీదులోనికి ప్రవేశించిరి.

సా. బా:- నేనిపుడు చెప్పుచున్నది యీ విషయమే!

(అని, బాబా వారి బహుమతుల నిరాకరించి, వారి ననుగ్రహింపకయే వెడల నంపెను.)

[గమనిక:- భక్తుని సర్వబంధములనుండి విడివడఁజేయు నొక సాధనము.- దక్షిణ.]

"యస్యానుగ్రహమిచ్ఛామి తస్యసర్వం హరామ్యహమ్"

నేను అనుగ్రహింపఁదలఁచినవాని సర్వస్వమును హరింతును.

236. యస్. ఆర్. వి. జయకర్– ద్వారకామాయి మసీదు నందుంచబడిన బాబా చిత్రపటమును లిఖించిన చిత్రకారుడు జేబులో 2½ రూపాయలుంచుకొని, బాబాయెదుట నిలిచియుండెను. బొంబాయి నుండి "వార్డే" అనునతడు బాబానుచేరి.

వార్డే:– బాబా! సత్యనారాయణ వ్రతము జరుపుకొనుటకు నాదగ్గర ధనములేదు.

సా. బా:– నీకెంత కావలయును?

వార్డే.– 2½ రూపాయలు.

సా. బా:– (జయకరును చూపుచు) ఈతనిదగ్గఱ కలదు. ఇతని వద్దనుండి అప్పుతీసికొనుము!

వార్డే అతనిని కోరెను. తన దగ్గఱ మిగిలిన ఆ 2½ రూపాయలను సొంతముగ జయకర్ ఈయవలసి వచ్చెను.

237. పి. అర్. అవస్తే – ఇండూరుజడ్జి. బాబాభక్తుడు. వేసవిసెలవలలో భార్యను, కుమారుని వెంటబెట్టుకొని శిర్డికిఁ జేరెను. అతని కుమారుని వివాహము జరుపవలయునను ప్రయత్నమునమండి, కుమారుని దగ్గర 400 రూపాయలు, భార్య దగ్గర 300 రూపాయలు ఉంచెను. అతడు బాబాను సమీపింపఁగ

సా. బా:– (అవస్తేతో) దక్షిణ ఇచ్చెదవా?

అవస్తే:– ఎంత?

సా. బా:– 30 రూపాయలు.

సా. బా:– (అవస్తే కుమారునితో) నాకు 40 రూపాయలు దక్షిణ నీయుదువా?

ఈవిధముగ పలుమాఱులు అవస్తే సతిదగ్గరనుండి ఆమె కుమారుని దగ్గరనుండి 30 కొరవగా ఉన్నధనమంతయు బాబా దక్షిణ రూపమున స్వీకరిలచెను.

సా. బా:- (అవస్తేతో) నీవు 30 రూపాయలు ఇత్తువా

అవస్తే:- బాబా! - దానిని ఇయ్యవలసినదేనా?

సా. బా:- ఇమ్ము;

అంత మనస్సున మిక్కిలి బాధపడుచు అవస్తే తన భార్య వద్ద నుండి ఆ మిగిలిన 30 రూపాయలుకూడ తీసికొని బాబాకు సమర్పించెను.

ఇంక బాబా అతని నేమియు నడుగలేదు

బాబాదగ్గరనుండి విచారముతో తిరిగిపోవుచున్న అవస్తే వీపును విజయ సూచకముగ తట్టుచు

బాపూసాహెబ్ జోగ్:- మిత్రమా! నిన్నభినందించు చున్నాం డను. నీదగ్గరనుండి బాబా పలుమారులు దక్షిణలు తీసికొనినాడు. నీవు అదృష్టవంతుడవు. బాబా పది మడుంగులు తిరిగి ప్రసాదించుటకే స్వీకరించును.

అవస్తే:- నేనది యెరుంగను. నేనిపుడు వివాహస్థలమునకుం జేరుటకు చేతిలో పైసాకూడ లేదని మాత్రమెరుంగుదును.

జోగ్:- నీకెంత కావలయును?

అవస్తే:- నూరురూపాయలు.

జోగ్:- ఇదిగో! తీసికొనుము. బొంబాయిలోని వర్తకుండు పోయినవియని అనుకొనిన సరకులు తిరిగి లభించిన నాల్గవవంతు లాభము బాబాకు సమర్పింపందలచుటచే అతని కోరిక ఫలించి, బాబాకు 600 రూపాయలు పంపినాండు.

3 రోజులలో మూండువందలు ఖర్చు పెట్టినాండు. నీకు నూరు రూపాయ లిచ్చి తినని నేను చెప్పిన కాదనండు. తిరిగిఇమ్ము! అనండు. కాని బాబా నీదగ్గరనుండి 600 రూపాయలు స్వీకరించుటచే నీకిప్పుడు జీతములో నెలకు 50 రూపాయలు పెంపు జరుగును - అని ఘంటా పథముగ నీకుం జెప్పుచున్నాండను.

ఆవస్తే:- నాకు జీతము పెంపుసేయఁగల అభిమాని యెవ్వఁడు లేఁడని నేనెరుఁగుదును.

కాని జోగ్ తెలిపినట్లు వేసవిసెలవలు పూర్తికాగానే ఆవస్తేకు నెలకు 50 రూపాయలు జీతము పెంపు చేయఁబడినట్లు ఉత్తరువులు అందినవి.

రాఁబోవు ధనము పెంపును సూచించుటయే,
తొలిఫలము రూపమున దక్షిణ స్వీకరించుట.

238. సా. బా:- (యస్. బి. ధుమాల్‌తో) భావ్! 50 రూపాయలు దక్షిణతెమ్ము!

ధుమాల్:- బాబా! నాదగ్గర పైకములేదు.

సా. బా:- అయితే – సాహెబ్‌ను (హెచ్. వి. సాతే) అడుగుము. ధుమాల్, సాతే దగ్గరకు వెళ్ళి 50 రూపాయలు అడిగెను. సాతే సంతోషముతో నిచ్చెను సాతే తన పింఛనులో 50 రూపాయలు హెచ్చు రావలయునని ప్రభుత్వమునకు పంపు కొనిన కాగితము ఆలోచనలో నుండెను. బాబా 50 రూపాయలు స్వీకరించిన దినముననే (ఆతేదీననే) ఆ 50 రూపాయలు పింఛన్ వృద్ధిచేయఁబడినటుల ఉత్తరువులు జారీ చేయఁబడినవి.

239. సోమనాథ్ యస్. డి. నిమోన్కర్ - పోలీసు సబ్ ఇన్స్పెక్టరు 1912న బాబాను జేరెను.

సా. బా:- 10 రూపాయలు దక్షణనిమ్ము:

సోమనాథ్ 10 రూపాయలు సమర్పించెను.

6 నెలల తరువాత బాబాకు 10 రూపాయలు సమర్పించిన తేదీ నుండి జీతము పది రూపాయలు పెంపు చేయబడినటుల ఉత్తరువు లందెను.

## దక్షిణ - భవిష్యత్సూచకము - నిర్ణయము.

240. ఆర్. యస్. దేవ్. 5 గదులతో నొక భవనము కట్టఁ దలంచి, బాబా అనుమతి కొఱకు బాబానుజేరి మ్రొక్కెను

బాబా నేలపై 25 గీతలుగీయుచు ఒక్కొక్క గదికి 1 రూపాయి చొప్పున 25 రూపాయలు ఇమ్ము అనెను. దేవ్ ఆ పైకము బాబాకు సమర్పించెను. అతఁడు మొదట 5 గదులు మాత్రమే కట్టింపఁదలచి, వానిని పెంచుచు 25 గదులు కట్టించెను. ఇప్పటికి 25 గదులు మాత్రమే కలవు.

241. సా. బా:- (యస్. బి. నాచ్నేతో - శంకరరావుతో) నాకు 64 రూపాయలు ఈయుడు!

నాచ్నే:- మా దగ్గఱ పైకములేదు. బాబా!

తరువాత బాబా జబ్బుపడినపుడు పేదలకు అన్నదానము చేయుటకై ధనము వసూలుచేసిపంపిరి. వారు ప్రోగు చేసినది మొత్తము 64 రూపాయలు మాత్రమే. (చూ. 374)

## దక్షిణ - తొలిఫలమును గైకొనుట

242. దాజీహరిలేలే:- నాశిక్‌లో ల్యాండురికార్డు డిప్యూటి ఇన్స్పెక్టరు - శీర్డికివెళ్ళుచు మార్గమున 'కోపర్గాము'లో తనజీతము 125 రూపాయలనుండి 150 రూపాయలకు పెంపుచేయఁబడినట్లు గెజెట్‌లో చూచెను. అతడు శీర్డికిఁజేరి బాబాకు మ్రొక్కెను.

సా. బా:- 15 రూపాయలు తీసికొనిరమ్ము!

లేలే:- బాబా! నా దగ్గఱ పైకములేదు.

సా. బా:- నిన్ననేకదా! నేను 25 రూపాయలిచ్చితిని పొమ్ము! పైకము తీసికొనిరమ్ము!

తేలే అప్పతీసికొనివచ్చి బాబాకు ఆ పైకము చెల్లించెను.
హెచ్. వి. సాతే అనుభవములను చూడుము

దక్షిణ – మనుష్యుఁడు తీసికొనఁదగని – ఉంచుకొనఁ
దగని, ధనము పరిహరింపఁబడుట.

243. యస్. బి. ధుమాల్, బాబా సేవకునిపై, మోపబడిన నేరముతీర్పుపై కోర్టులో అపీలుచేయుటకు కోరఁబడెను (చూ. 404) బాబా చమత్కారమువలన క్రిందికోర్టులో చేయబడిన నేరముతీర్పు త్రోసి వేయఁబడి, బాబా సేవకుఁడు 'నిర్దోషి' అని నిర్ణయింపఁబడెను. ఆ నేరమునకు సంబంధించినవారు ధుమాలునకు 300 రూపాయలిచ్చిరి. ఆ ధనమును తీసుకొని ధుమాల్ శిర్డీకిఁజేరెను.

సా. బా:- భావ్! దక్షిణ ఇత్తువా?

ధుమాల్:- బాబా! ఇత్తును.

ఈవిధముగ పలుతడవలడిగి ఆ 300 రూపాయలను బాబా దక్షిణరూపమున గ్రహించెను. ఆతరువాత అడుగలేదు.

దక్షిణ–సంకల్పసిద్ధికొరకు స్వీకరింపఁబడుట.

244 M W. ప్రధాన్ ప్రప్రథమమున బాబాను సందర్శించుటకు బయలుదేరునపుడు 20 వెండి రూపాయ నాణెములు బాబాకు ఈయ నుంచలంచెను. 50 రూపాయలు "కరెన్సీనోటు" మార్చెను. తుదకు బాబాను చేరిన తరువాత అతని తలంపుమార్చుకొని ఒక సవర బంగారు నాణెము బాబాకు సమర్పించెను.

సా. బా:- ఇదియేమి?

నూల్కర్:- అది సవర.

సా. బా:- దాని విలువ ఎంత?

నూల్కర్:- 15 రూపాయలు.

సా. బా:- ఇది నాకువలదు. నాకు 5 రూపాయలిమ్ము. దీనిని నీదగ్గర ఉంచుకొనుము.

ప్రధాన్, బాబాస్పృశించి యిచ్చిన బంగారు నాణెమును భద్రపఱచుకొని 15 రూపాయలు వెండినాణెముల నిచ్చెను.

సా. బా:- (మరల మరల లెక్కించుచు.) ఇచ్చట పదిమాత్రమే కలవు. తక్కిన 5 రూపాయలు తెమ్ము.

ప్రధాన్ – ఇదిగో 5 రూపాయలు అధికము.

ఇటుల బాబా తప్పులెక్కపెట్టు నెపమున తన గురువుతోడ బుద్ధి బలమును కొలువజాలు ప్రధానును పరీక్షించు విధమున ప్రధాన్ తొలి సంకల్పము ప్రకారమీయదలచిన 20 రూపాయలు బాబా స్వీకరించెను. ఆ పిదప అతనిని నేమియు నడుగలేదు.

దక్షిణ–మరియొక అర్థము.

245. సా. బా:- (బి. వి. దేవ్‌తో) భావ్! దక్షిణనిమ్ము

బి. వి. దేవ్ ఒక సవర ఇచ్చెను.

సా. బా:- ఇంకను ఇమ్ము!

బాబా అటుల నాలుగు స్వీకరించిన తరువాత ఇట్లనెను. నీవు నాలుగు ఇచ్చినను బాబా పొందినది ఒకటే.

దేవ్:- నేను నాలుగు ఇచ్చితిని.

సా. బా:- నిజమే! నాదగ్గర ఒకటేకలదు. నీవెఱుగుదువు [దాని భావము భక్తుడు తన నాలుగు అంతః కరణములు (మనస్సు-బుద్ధి - అహంకారము - చిత్తము) సమర్పించినను బాబా స్వీకరించునది జీవుని మాత్రమే. తక్కిన వికారములన్నియు దైవమును - బాబాను, చేరునప్పటికి ఒక్కటే అగును. దైవము అగు గురువుతో ఐక్యము పొందుటకు మనస్సు పలుమారులు సమర్పణము కావలయును.]

"రేరే చిత్త త్యజద్వం ద్వం త్వమేకత్వం సమాశ్రయు
తతశ్చాసి చివే వత్వం నాత్రకార్యా విచారణా."

దక్షిణ

246. సా. బా:- (జి. జి నార్కేతో) నాకు 15 రూపాయలు దక్షిణఇమ్ము!

నార్కే:- బాబా! నా దగ్గఱ పైసాకూడ లేదని నీ వెఱుంగుదువు. తఱచుగ నన్ను 15 రూపాయలు దక్షిణ ఏల అడుగుదువు?

సాబా:- నీ దగ్గఱ ధనములేదని యెఱుంగుదును. నీవు యోగ వాసిష్ఠము పఠించుచుంటివికదా! నాకు 15 రూపాయలు దక్షిణ అందుండి తెమ్ము.

[ఇచ్చట దక్షిణతెచ్చుట అనగ యోగవాసిష్ఠమునుండి పాఠముల గ్రహించి, వానిని బాబా అధిష్ఠించియున్న అతని హృదమున పదిల పఱచుకొనుటయే.] చూ. 186.

247. సా. బా:- (ఆర్. బి. పురందర్‌తో) 2 రూపాయలు దక్షిణ నిమ్ము!

పురందర్:- బాబా! నేనొక పేద గుమాస్తానని యెఱింగియు నన్నేల 2 రూపాయలు దక్షిణ ఇమ్మని తఱచుగ నడిగెదవు?

సా. బా:- ఈ నాణెనములుకావు నాకు కావలసినవి 1 నిష్ఠ (గాఢ విశ్వాసము) 2. సబూరి (ధైర్యముతోఁగూడిన ఓర్పు).

పురందర్:- నేనిచ్చితిని. వీనిని నాచే కావింపనిమ్ము.

248. సా. బా:- (తార్కాడ్‌సతితో) నాకు 6 రూపాయలు దక్షిణ నిమ్ము.

తార్ఖాడ్‌సతి:- (భర్తతో) మన దగ్గఱ ధనములేదు. బాబా అడిగినప్పుడు ధనము లేకపోవుట చాల బాధగ నుండును.

తార్ఖాడ్:- బాబా కోరునది నీ అంత శ్శతృవులను (కామ క్రోధాదులను,) సమర్పణచేయుమని.

సా. బా:- (మరల తార్ఖాడ్ సతితో) నాకు 6 రూపాయలు దక్షిణ నిత్తువా?

తార్ఖాడ్‌సతి:- బాబా! నేను వానినిచ్చితిని.

సా. బా:- తొలగిపోకుండ చూడుము!

## దక్షిణ _ పిండగలపుట

249. జడ్జి యం. బి. రేగే 1912న రు 100 లు జేబునందుంచుకొని బాబా దగ్గఱ కేగెను.

సా. బా:- నాకు 40/- రూపాయల దక్షిణ ఈయుము! (రేగే ఇచ్చెను)

సా. బా:- (మరల) 40 రూపాయలు దక్షిణ ఈయుము! (రేగే యిచ్చెను)

సా. బా:- (మరల) 20 రూపాయలిమ్ము!

బాబా తన దగ్గఱనున్న దంతయు స్వీకరించుచున్నాడని తలంచి, ఆ 20 రూపాయలిచ్చెను.

సా. బా:- (తరువాత జడ్జితో) 40 రూపాయలు దక్షిణ ఈయుము.

రేగే:- ఎవరి దగ్గఱకు వెళ్ళుదును?

సా. బా:- శ్యామా.

అంతట రేగే శ్యామా దగ్గఱకు వెళ్ళి చెప్పెను.

శ్యామా:- బాబాను నీవు గ్రహించలేదు. నీ రూపాయలు ఆయనకు తృణప్రాయము ఆయన కోరునది నీ మనస్సు, బుద్ధి - నీ కాలము - నీ ఆత్మను ఆయనకంకితము చేయుటయే, బాబా భావ మదియే.

రేగే తిరిగివెళ్ళి బాబా కా విషయము తెలిపెను.

సా. బా:- (చిఱునవ్వు నవ్వి) దీక్షిత్ దగ్గఱకువెళ్ళి అడుగుము.

రేగే దీక్షిత్తునకు చెప్పెను.

దీక్షిత్:- ఈ సందర్భమున బాబా ఆదేశము గ్రహింపుము ధనముదగ్గఱ లేకపోయెనని కించకాని, ధనముకొఱకుకాని, మఱిదేనికొఱకుం గాని యాచించుట అగౌరవమని కాని, ఇతరుల దగ్గరకేగిచేయి చాచు స్థితికి మించియున్న వాడవనికాని, నీవు, తలంచరాదు - అనుపాఠము నీకు బోధించుట బాబా అభిప్రాయమని నీవు గుర్తింపుము.

రేగేవెళ్ళి ఆ విషయములను బాబాకు విన్నవించెను.

సా. బా:- (చిఱునవ్వునవ్వుచు) నా. గో. చందోర్కరు దగ్గరకు పొమ్ము!

రేగే నానా దగ్గఱకువెళ్ళి తెలిపెను.

నా. గో. చం:- బాబా దక్షిణ అడిగినపుడు ఇచ్చుటకు మన దగ్గఱ ధనము లేకపోయిన ఎంత బాధాకరమో నేనెఱుంగుదును నావద్ధతులను నీవు గ్రహించవలయును. నే నెప్పుడు శిర్డికి బయలుదేరిన కొంత ధనము తీసికొని ప్రయాణమై అందు సగము కోవర్గాము' నందుంచి, తక్కిన సగముతో నిచటకు వత్తును. ఉదాహరణకు. ఈ పర్యాయము 200/- రూపాయలతో బయలుదేరితిని సగము కొవర్గాము నందుంచి 100/- రూపాయలతో నిచటకు వచ్చితిని. నా దగ్గఱనున్న దానినుండి బాబాకు దక్షిణ నిచ్చుచుందును. అది పూర్తి అయినపిదప

కోపార్గాము నందుంచిన నిలువకొఱకు వర్తమాన మంపుదును. నీవును ఈ మార్గము ననుసరింపుము.

రేగే వెళ్ళి ఆ విషయము బాబాకు తెలిపెను. బాబా నానాను పిలువనంపెను. నానా వచ్చెను.

సా. బా:- నానా! 40/- రూపాయలు నాకిమ్ము!

నానా యిచ్చి వెడలిపోయెను. మరల నానా పిలువనంపబడెను. నానా వచ్చెను.

సా. బా:- నానా! ఇంకను 40/- రూపాయలిమ్ము.

నానా యిచ్చెను. మరల చందోర్కరును పిలువనంపి 20/- రూపాయలు తీసికొనెను. అంతట చందోర్కరు కోపర్గామునకు వర్తమానమంపెను. అచ్చటనుండి పైకము అందు లోపల బాబా యింకను ధనమీయుమని అడుగ చందోర్కరు చిన్నవోయెను.

బాబా కోరినపుడెల్ల మనుష్యుఁడు తానే మహా ప్రభువువలె ఇచ్చుచుండెననికాని, బాబాకు కావలసిన అవసరతెల్ల తానే తీర్చుచున్న వాఁడనికాని, అనుకొనరాదు—అనుపాఠము బోధించుటకే యీ విధముగ పలుమాఱులు దక్షిణ రూపమున బాబా ధనమడిగినాఁడని మనము గ్రహించవలయును.

## దక్షిణ

2, 5, 6, 10, 16 రూపాయలు బాబా దక్షిణకోరిన సందర్భములను — వాని భావములను 135, 136, 18 , 248, 255 నెంబర్లలో గమనింపుడు.

[దక్షిణ ఇచ్చిన ఈయకపోయినను బాబా కోపముగాని, ప్రకటించినదిలేదు. దక్షిణ నిచ్చినవారిపై ప్రత్యేక అభిమానముగాని, ఈయనివారిపై నిరభిమానముగాని చూపడు. అమూల్యమైన బాబాకరుణ

అందరకు ఉచితముగ ప్రసాదింపఁబడినది అటుల దక్షిణ రూపమున తీసి కొనఁబడిన ధనము బాబా చేతులలో ఒకక్షణమునిలువదు. ఎప్పటికప్పుడు వెంటనే బాబా తలచినవారికి ఆ ధనము ఇచ్చి వేయఁబడును. బాబా ఏ విధమైన సుఖాడంబర జీవితము గడపియెఱుఁగఁడు. భిక్షించి తెచ్చి కొనునది. నైవేద్యరూపమున భక్తులొసంగినది తప్ప మఱేమియు భుజించి యెఱుఁగడు-అని చక్రనారాయణ – పోలీసు ఇన్స్పెక్టరు బాగుగ గుర్తించినాడు.]

## సంపదలయెడ బాబా నిర్లక్ష్యము

250. బాబా:- (బాలకృష్ణ గోవింద ఉపాసనీశాస్త్రితో) నాకు దక్షిణ నిత్తువా?

బా. గో. ఉ:- బాబా! నా దగ్గఱ ధనములేదు.

సా. బా:- నీ జేబులోనున్నదేమి? దానినిమ్ము!

బా. గో. ఉ:- ఇది వెండిగడియారము. బాబా! తీసికొనుము.

సా. బా:- దీని నిచ్చుటచే నష్టపడుచుంటివని తలంకుము.

బా. గో. ఉ:- బాబా! నీకు సమర్పించిన దేదియును నష్టము కాదు.

బాబా గడియారమును గ్రహించి, అక్కడనున్నవారిలో నొక నికి దానిని బహూకరించెను. బా. గో. ఉపాసనీ పూనాకు వెళ్లెను. అచ్చట ఒక ధనికుఁడైనమిత్రుఁడు గోవింద ఉపాసనీ, బాబాకు గడి యారము సమర్పించిన విషయము తెలిసికొని (బాబా పలికిన పలుకు లెఱుఁగకయే) ఒక బంగారు గడియారమును స్వీకరింపుమని ఉపాసనిని నిర్బంధించెను. కావున బా. గో. ఉపాసనీ, బాబాకు వెండిగడియారము సమర్పించుటచే లాభముపొందిన వాఁడేకాని, నష్టపడలేదు.

251. ఒకసమయమున ఒక స్వదేశసంస్థానాధిపతి వ్యాజ్యము గెలిపించి, ఆ ప్రభువువలన పొందిన ధనమును ఒక ట్రంకుపెట్టె నిండుగ పోసి, హరిసీతారాం దీక్షిత్ శిర్డికితీసికొని వచ్చెను.

హ. సీ. దీక్షిత్:- బాబా ముందుంచి, బాబా! ఇదియంతయు నీదే!

సా. బా:- అలాగా?

అంతట బాబా పెట్టెమూతతెరచి, రెండుచేతులతో ఆధనమును తీసికొనుచు అచటచేరిన వారికందరకు పంచిపెట్టెను. కొలది నిమిషము లలో ఆపెట్టె ఖాళీయయ్యెను. దీక్షిత్ మిత్రుడు నాగపూర్ సబ్ జడ్జి శ్రీగార్డే-దీక్షిత్తు ముఖమువంక చూచుచుండెను. అటుల మిక్కిలి శ్రమపడి సంపాదించిన ధనమావిధముగ వంచిపెట్టఁబడుచున్నను దీక్షిత్తు ముఖమున లేశమేని సంకోచముగాని, విచారముగాని, నిస్పృహగాని చూపెట్టలేదు. దీక్షిత్తు వైరాగ్యమును పరీక్షించి దృఢపరచుటకే బాబా ఆధనమంతయు ఆవిధముగ పంచిపెట్టినాఁడు.

252. భక్తులు వెండిపాలకి తీసికొనివచ్చి బాబాకు బహూకరించినపుడు.

సా. బా:- దీనిని తీసికొనిపొండు. ఇది నాకు వలదు.

కాని, భక్తులు బాబా చిత్రపటమందునిలిపి, ఊరేగించుటకు కావలయునని పట్టుదల వహించిరి. ఆ పాలకి బయటనుంచఁబడెను. ఆ రాత్రి దానికి పూన్చఁబడిన వెండి గుబ్బము లపహరింపఁబడెను.

భక్తుఁడు:- బాబా! పాలకి వెండి గుబ్బములను రాత్రి యెవరో అపహరించిరి.

సా. బా:- వెండిపాలకి మొత్తమేల దొంగిలింపఁ బడలేదు?

253. దామోదర్ రసానే ఒక వ్యాపారము ప్రారంభింపఁ దలఁచి, బాబా అంగీకారము కొఱకొక ఉత్తరము వ్రాసెను. బాబా

అపనికి సమ్మతి వలేదు. అపుడు దామియా (రసానే) బాబాదగ్గరకువెళ్లి తాను చేయఁబోపు వ్యాపారమునందు లాభములో బాబాకు భాగమిత్తునని చెప్పెను.

సా. బా:- ఓయీ! దామియా! నేను దేనితో సంబంధము కల్పించుకొనను. (అనగా-నాకు ధనములతో ఏవిధమైన సంబంధములేదు.)

[ఏదేని ఒక మఠము - ఆశ్రమము నిర్మించుటకుగాని, ఒగ సంస్థ నేర్పరచి దానికి యాజమాన్యము వహించుటకుఁగాని, తన శిష్యులలో (ఆశ్రితులలో) ఎవరినో నొకరిని స్వీకరించి, తనయనంతరము తన పీఠము నధిష్ఠింప ననుమతి నిచ్చుటగాని బాబా సమ్మతించినవాఁడుకాఁడు. మరియొకఁడు యాజమాన్యము వహించుటకు బాబా ఏవిధమైన స్థిర చర ఆస్తులను విడిచి వెళ్ళలేదు. బాబా నిర్లిప్తస్థితి యట్టిది.]

254. సా. బా:- ఒక తఱి నేను "పుంటంబ" అనుచోట నుంటిని. అచట ఇరుపక్షములవారు కలహించుచుండిరి. వారేల తగవులాడుచుండిరా! అని ఆశ్చర్యపడితిని. వారి సమీపమున ధనముతో నింపఁబడిన కుండనొకదానినిఁ జూచితిని. వారి కలహకారణమది. నేను మెల్లగ అచటకుఁజేరి ఆకుఁడను తీసికొని వెళ్లితిని. వారి సంపద నశించుట కనుగొని వారు మిక్కిలి దుఃఖింప సాగిరి.

"నేనెవఁడను? ఈధనమేమి? ఇది యెవరిది? దీనికొఱకింత భ్రాంతి, ఇంత కలహము, దేనికి? ఆకుండనాది. ఆకుండ యజమానిని నేను" - అని, నాలోనేననుకొంటిని.

255. ఇవుపు దక్షిణదేశ బ్రాహ్మణులు బాబా దగ్గరకుఁజేరిరి.

సా. బా:- శ్యామా! (ఒకరిని వ్రేలితోఁజూపుచు) ఈతనిని 15/- రూపాయలడుగుము!

అతఁడు వెంటనేయిచ్చెను. బాబా తీసికొని ఉంచుకొనెను. అడుగబడకయే రెండవవాఁడు 35/- రూపాయలు బాబాకు సమర్పించెను. బాబా ఆపైకము లెక్కపెట్టి తిరిగి అతని కిచ్చెను.

శ్యామా:- దేవా! ఈ విచక్షణమేమి? ఇట్టిది నేనెప్పుడు చూచి యెఱుఁగను. కొద్దిపైకమడిగి తీసికొంటివి! తనకుఁదానే పెద్దమొత్త మీయఁగ దానినతనికిఁ దిరిగి యిచ్చితివి!

(ఈ క్రింది విషయములు 103/- లో చెప్పబడినవి.)

సా. బా:- శ్యామా! నీవుపసివాఁడవు నీకేమియుఁ దెలియదు నేనేమియుఁజేయను. నేనేమియు స్వీకరింపను. దత్తస్వామి తనకుఁ జెందవలసనది తానడిగెను. తనకుఁ జేరవలసిన 15/- రూపాయలు అడిగి తీసికొని మసూది ఆయీకిచ్చెను. కావున ఆ ధనము (నాచే) స్వీకరింపఁ బడినది (చూ. 8.) కాని, యీ 15/- రూపాయలు మనవికావు అందుచే తిరిగి యీయబడినవి.

ఇతఁడు (మొదటివాఁడు) మొదట మిక్కిలి పేదవాఁడు. తనకు ఉద్యోగము దొరికిన మొదటి నెలజీతము దత్తస్వామికి సమర్పించెదనని మ్రొక్కుకొనెను. అది 15/- రూపాయలు. ఇతఁడా మ్రొక్కుబడి మఱచెను. కాలముగడచెను. ఇతని జీతము 15 నుండి 30, 60, 100, 200, 400, చివరకిపుడు 700 రూపాయలయ్యెను. ఇతని సుకృతమిఁచటకుఁ గొనివచ్చినది. కావున నాకుఁ జెందవలసిన 15 రూపాయలను దక్షిణగ అడిగి తీసికొంటిని.

తరువాత మఱియొక ఉదంతము కలదు.

సముద్రతీరమున నేను సంచరించుచు నొక ధనికుఁడు మంచి కుటుంబీకుఁడగు నొక బ్రాహ్మణుని భవనమును జేరితిని. అచ్చట నన్ను మిక్కిలిగ ఆదరించిరి. ఆబ్రాహ్మణుఁడు సమృద్ధిగ భోజనముపెట్టి నిద్రించుటకు గోడ "అలమర" దగ్గరగ నాకు చక్కని స్థలముఁజూపెను. నేను గాఢనిద్రయందుండగ నతఁడా అలమరకుగల పెద్ద రాతిపలకను ఊడఁబెరికి లోనికిఁబ్రవేశించి, నాజేబులోనున్న వేయిరూపాయలనోట్లు 30 గల కట్టనపహరించెను. నేను నిద్రలేచిన తరువాత, నాసర్వము అపహరింపఁ బడినదని తెలిసికొని, మిక్కిలి వ్యాకులపడి దుఃఖించితిని. ఆబ్రాహ్మణుడే నాధనము దొంగిలించెనని తలంచితిని. అన్నము తినుట నీరు త్రాగుట కేని

మనస్సు - కలుగక 15 దినములాతని పంచలోనే పడియుంటిని. 15వ దినమున ఆ దారినపోవుచున్న ఫకీరొకఁడు మిక్కిలిగ దుఃఖించుచున్న నన్నుజూచి, ప్రేమతో నా విషయమడిగెను. జరిగినదంతయు నేను చెప్పితిని. "నేను చెప్పినట్లాచరింతువేని నీకు మేలు కలుగును. ఒక ఫకీరు పేరును – అతని విలాసమును నీకుఁ దెలుపుదును. ఆయన పాదములను శరణుపొందుము. నీధనము నీకు తిరిగి లభించునట్లాయన అనుగ్రహించును. నీవొక మ్రొక్కును మ్రొక్కుకొనుము. నీ ధనము నీకుఁదిరిగి లభించువరకు నీకు మిక్కిలి ప్రియమైన ఆహారమును మానుకొందునని, ప్రతినఁజేయుము. ఆప్రతిన నీకు విజయముఁ బ్రసాదించును." అని, బోధకాపించినాఁడు.

"ఆ ఫకీరు బోధననుసరించి, నాకు మిక్కిలి ప్రియమైన ఆహారమును వర్జించి, ఆ ఫకీరు పాదముల శరణొందితిని. అంతట నాధనము నాకుఁదిరిగి ప్రాప్తించెను. తరువాత ఆగృహము విడిచి, ఆ సముద్రతీరమునఁ దిరుగుచుంటిని. ప్రయాణీకులఁ గొనిపోవుట కచట నొక పొగయోడ యుండెను కాని, దానిలోఁ బ్రవేశింప సాధ్యపడలేదు. ఆయోడలోని, నౌకరియొకఁడు నాకుఁగాఁ బనికల్పించుకొని, అదృష్టవశమున నన్నందు ఎక్కఁజేసెను. దానిపై ప్రయాణముచేసి రైలుస్టేషనునకుఁ జేరితిని, చివరకీ మసూది ఆయినాఁ జేరగలిగితిని." – అని బాబా యిది యంతయుఁ దెలుపుచుండ ఆ వచ్చినవారు చకితులైరి. కాని, శ్యామాకు బాబామాటలేమియు బోధపడలేదు.

సా. బా:– శ్యామా! ఈ వచ్చినవారిని మీ యింటికిఁ గొనిపోయి తినఁబెట్టుము.

భోజన సమయమున "బాబా సముద్రమునుగాని, సముద్ర తీరముఁగాని చూచియెఱుఁగడు. ఎప్పుడు నిక్కడేయుండువాఁడు. ఎవరేని దొంగిలించుట కాయనదగ్గర 30 వేలు ధనమునులేదు. బాబా పలుకులు మీకేమైన అర్థమైనవా?" అని శ్యామా, వారల నడిగెను.

ఆయిరువురలో నొక అతిథి మిక్కిలిగ భావోద్రేకముతో నివిధ ముగఁ బలికెను.

"నాజన్మస్థలము సముద్రతీరమున పడమటి కనుమలలోయ. నా జీవనోపాధికొరకు 'గోవా' చేరితిని నాకేడని. వృత్తి లభించిన మొదటి నెలజీతము దత్తస్వామికి సమర్పింతునని మ్రొక్కుకొంటిని. దత్తస్వామి అనుగ్రహమున నెలకు 15/- రూపాయలు జీతముగల ఉద్యోగము దొరికెను. బాబా పలికినటుల అది క్రమముగా వృద్ధినొందెను. దత్త స్వామికి 15 రూపాయలు చెల్లించు విషయమిచట బాబా తెలిపినంత వరకు నాకు జ్ఞప్తియందులేదు. బాబా దయచే 15/- రూపాయలు స్వీక రించుటచేత నా మ్రొక్కుబడిని నేటికిఁ జెల్లించఁ గలిగితిని."

ఆ రెండవ అతిథి తన కథ మొదలు పెట్టెను. "నావంట బ్రాహ్మణుఁడు 35 సంవత్సరముల కాలము నా దగ్గఱనుండి మిక్కిలి విశ్వాసముతో సేవించినాడు. దురదృష్టవశమున వాని బుద్ధి మాఱినది. నేను కూడఁబెట్టుకొనిన ధనమంతయు దొంగిలించినాఁడు. నాయింట 'అలమర' వెనుక పలకరాయి కలదు. ఆ వంటవాడు ఆ రాతిని తొలగించి కన్నముద్వారా లోనికిఁబ్రవేసించి, నా ధనమును సర్వము దొంగిలించికొని పోయెను. అది 30 వేల రూపాయల "కరెన్సీనోట్ల" కట్ట. నా జీవితనమున కష్టించి సంపాదించి కూడఁబెట్టుకొనిన ధనమది. ఆ ధనము సంఖ్య బాబా యెట్లు తెలిసికొనెనో నా కాశ్చర్యముగ నున్నది. నాకు గలిగిన ధన నష్టమునుగూర్చి దివారాత్రములు దుఃఖించితిని. ఆ నష్టద్రవ్యమును ఎట్లు తిరిగి రాఁబట్టుకొనుటయా! యని ఆలోచించితిని. పోలీసులకుఁ దెలుపుకొంటిని. ఏమి ప్రయోజనము కలుగలేదు. 15 దినములు మిక్కిలి దుఃఖముతోఁ గడపితిని. నా యింటిపంచలో నటుల మిక్కిలి విచారముతోఁగూర్చుండియున్న నన్ను ఆ దారినఁబోవుచున్న ఫకీరు చూచి, విచారమునకుఁ గారణమేమని ప్రశ్నించెను. జరిగిన సంగతి యంతయుఁ దెలుపుకొంటిని.

"కోపర్గాం తాలూకా శిర్డీ గ్రామములో 'సాయి' అను పేరుగల 'అవాలియా' కలఁడు. నీ ధనము తిరిగి నీకు లభించిన ఆయన నను

సందర్శింతునని మ్రొక్కుకొనుము. సాయిని దర్శించునంతవరకు నీకు మిక్కిలి ప్రియమైన భోజన పదార్థమును త్యజింతునని వ్రతినఁబూను కొనుము." అని ఆ ఫకీరు తెలిపినాఁడు.

'నా ధనము నాకుఁ దిరిగి లభించి, శ్రీ సాయిని సందర్శించు నంతవరకు నాకు మిక్కిలి ప్రియమయిన వరియన్నమును మాను కొందును." అని మ్రొక్కుకొంటిని.

తరువాత 15 దినములు గడచినవి. ఆ వంటబ్రాహ్మణున కేమి జరిగినదో నే నెఱుఁగను. అతఁడు తనంతటతానే తిరిగి నా దగ్గఱకువచ్చి, నా ధనమంతయు నాచేతుఁ ఁదుంచి "నా బుద్ధిచెడి నేనిట్లు ప్రవర్తించి తిని. ఇపుడు నీ పాదములపై మోఁలపడి నా తప్పు క్షమింపుమని ప్రార్థించుచున్నాఁడను." అని పలికినాడు.

ఆ 30 వేలనుండి, వానికి 2 వేలు ఇచ్చితిని. 'కోలాబా'లో నొకనాటరాత్రి స్వప్నమున శ్రీసాయిని చూడఁ గలిగితిని. అది, నేను శీరిడికివెళ్ళి సాయీసందర్శనము చేసికొందునని కావించిన మ్రొక్కును జ్ఞాపకము చేయుటకే యని గ్రహించితిని. గోవాకు వెళ్ళితిని, అచట నుండి 'స్టీమరు'మీద బొంబాయిఁజేరి, రైలుమీద శీరిడికి రావలయునని బయలుదేరితిని, ఓడరేవునకుఁజేర స్టీమరులో జనము క్రిక్కిరిసియుండిరి. తావులేదని ఆ ఓడ అధికారి (కెప్టెన్) పలికెను. ఆ ఓడపైనొక సేవకుఁ డుండెను. అతని నేనెఱుఁగను. నేనాతని సంబంధీకుఁడనని ఆ సేవకుడు కెప్టెన్‌తోఁజెప్పి, నన్నా ఓడలోనికెక్కించుకొనునట్లు తోడ్పడెను. బొంబాయికిఁజేరి యచటనుండి రైలుపై ప్రయాణముచేసి యిచటకురాఁ గలిగితిని, సత్యముగ శ్రీసాయి సర్వవ్యాప్తి, మనమెవరము? మన నెలవేమి? బాబా తన దగ్గఱకుఁ జేర్చికొనుటచే మనమెంత అదృష్ట వంతులము! అపహరింపఁబడిన ఆ ధనమంతయుఁదిరిగి నాకు లభించుట ఎంత ఆశ్చర్యకరము? (చూ. 230)

## ఆస్తి – సంపద

256. సా. శా:– మార్వాడిబాగ్‌చందు – తన గడ్డివామి నిప్పంటుకొనినదని, తనకు నష్టము కలుగనీయక రక్షింపుమని ప్రార్థించు

చున్నాఁడు. లాభనష్టములు పుటుక చావులు దైవాధీనములు. కాని, జను లంధులై దైవమును మరతురు. లాభము కలిగినచో వారానందింతురు. నష్టముకలిగిన నేడ్తురు. ఏల "ఇదినాది" – అని చెప్పుకొననేల? దాని భావమేమి?

ఆగడ్డివామి ఆమార్వాడిదికాదు. అది గడ్డిమాత్రమే అతని తనువుకాదు. నేలనుండి విత్తనములవలన మొలచినది. మేఘములనుండి కురిసిన వానవలన, సూర్యరశ్మివలన పెరిగినది. భూమి, మేఘము, సూర్యుఁడు దాని అధిపతులు 'తనది'— అని చెప్పుకొను వీనిపలుకులు నిరాధారములు. ఈ అధిపతులైన మూఁటియందు 'అగ్ని' కలదు అదియే యీగడ్డివామిని కాల్చివేసినది. మనము అధిపతులముకాము. భగవానుఁడొకచేత నిచ్చును— మఱియొకచేత దానిని తీసికొనును.

ఓ సేత్! ఇంటికిఁబొమ్ము. నీకుఁ గలిగిన యీ నష్టమును మరి యొక వ్యాపారమున సద్దుకొనఁగలవు.

257. సా.బా:- ఈతని (హ. సీ. దీక్షిత్తు) ఆవు జైన్ మనుష్య నిది. అంతకుఁబూర్వము ఔరంగబాద్ వానిది. దానికిఁ బూర్వము మహల్సాపతిది. ఇది యెవరిదో ఆభగవానునకే ఎఱుక!

భగవానునందు గాఢవిశ్వాసముగలవాని కేవిధమైన కొఱత కలుగదు.

258. పరమేశుఁడిడున దెప్పటికినిఁ జెడదు.

నరుఁడొసంగునది యెన్నఁడు నిల్వఁబోదు.

259. సా. బా:- ( నా. గో. చందోర్కరుతొ ) నానా! నాదియని నేను చెప్పుకొనుచున్నది ఒక గుడ్డపేలికగోచీ (లంగోటీ) కుఫ్నీ, ఒక చిన్నకుండ ఒకరేకుడబ్బా మాత్రము - చూడుము! ఈ జనులు వివిధ కామితములుకోరి నన్నెట్లుపీడించి, బాధించి వేధించుచు చున్నారో! దీనినిఁ గూర్చి నేనేమి చెప్పవలయును!

## దురదృష్ట విత్తము

260. యస్. ఆర్. వి. జయకర్ - ఒక ముస్లింకాంతకు 4 వేలు రూపాయలు అప్పు ఇచ్చెను. ఆ ధన మామె అతనికిఁదిరిగి చెల్లించలేదు.

జయకర్:- బాబా! ఆ ధనము రాఁబట్టుకొనుటకు నేనటకు వెళ్లుదునా?

సా. బా:- ఆ దురదృష్ట విత్తముతో మనకెట్టి సంబంధము కల్పించుకొనఁదగదు.

ఆ ముస్లింకాంత తన సంపదలను సర్వము 2, 3, సంవత్సరములలోఁ గోల్పోయెను. జయకరునకు ఒక కాసేనియు తిరిగిదక్కలేదు.

## పేదరికము - ఫకీర్ - అవక్ల పాదుషా.

261. సా. బా:- పేదరికము సర్వసంపదలకంటె మహోన్నతమైనది. ఒక ప్రభువుస్థితికంటె నిది వేయి రెట్లుమేలు. దైవము పేదవాని సోదరుఁడు. ఫకీరే సత్యమైన చక్రవర్తి. పేదతికము చెడదు. సామ్రాజ్యము క్షణమున క్షీణించును.

## (దైవము) - విధి

262. సా. బా:- జనులు విధివిధానమునందు గాఢ విశ్వాసము వహింపవలయును. తిండి గుడ్డలకైవారు ఆరాటపడరాదు. వీని నిమిత్తమై జీవితము వ్యర్థముచేసికొనఁదగదు.

నా భక్తులయింట తిండిగుడ్డలకు ఎట్టిలోటు కలుగదు.

"భోజనాచ్ఛాదనే చింతాం వృధాకుర్వంతివై జనాః
యోఽసౌవిశ్వంభరస్సోఽపి స్వభక్తాన్ కిముపేక్ష్యతే"
"అభావమన్నవస్త్రాణాం నమేభక్తగృహేభవేత్
తస్యదేహకుటుంబార్థం వ్యగ్రోఽహంపాలనేసదా"

## నైతిక బోధలు

బాబా వివిధభావములు - దైవభక్తుఁడుగ.

263. సా. బా:- (రంగారీతో) ఈ హైందవులు నన్ను సేవించుచున్నను నేను భగవంతుని భక్తుఁడను. నేనుదైవము స్మరింతును. మఱువను.

264. సా. బా:- నేను అల్లాను ప్రార్థించుచున్నాఁడను. నా ప్రార్థనము (హ వి. సాఠేకు పుత్రజననము) ఆతండ్రి అనుగ్రహించును.

265. సా. బా:- నేనిక్కడ ఆయావిషయములఁ బలుకుచుందును. అవి అక్కడ జరుగుచుండును.

266. సా. బా:- ఓ అల్లా! ఇక చాలును! వర్షమును ఆపుము. నా బిడ్డలు తిరిగి యింటికి వెళ్లవలయును. ఎట్టి కష్టములఁ బొల్పడ నీయక వారినింటికిఁ బోనిమ్ము! (వర్షముఆగెను....ప్రధాన్ కుటుంబము వారు క్షేమముగా వెళ్ళిరి.)

## సంతృప్తి — శరణాగతి.

267. సా. బా:- దైవము గొప్పవాఁడు. అతఁడు మహా ప్రభువు. "అల్లామాలిక్" దైవమెంత గొప్పవాఁడు! ఆతనితో నెవరు సమానులుకారు. అద్వితీయుఁడు. అతఁడే సకలమును సృష్టించి, పోషించి, లయింపఁజేయువాఁడు. ఆతండ్రిలీల లనూహ్యములు.

మన తలంపుల నాయన కధీనములుగాపించి, ఆయన మనల నిలుపఁదలఁచిన విధమున నిలుచుటకు సంతృప్తి నొందుదము. 'అల్లా రఖేగావైసారహెనా' — ప్రాప్తించిన దానిని స్వీకరింపుము. సంతృప్తి సంతోషములఁ బొందుము. ఎన్నఁడును ఆందోళన పడకుము. ఆ తండ్రి సమ్మతి - సంకల్పము లేక ఒక ఆకేనియు కదలదు.

ఋజుభావము - నిర్భయము - సాధుత్వము కలిగి యుండవలయును. మనలో నెవరికివారు వారి ధర్మములను విధులను

నిర్వర్తించుచుండవలయును. కాని, ఏ పనులకు మనమే కారణము లము - కర్తలము - అనితలంచి, ఏ క్షణము నందైనను మోహభ్రాంతులను పొందరాదు. కర్త దైవమే. ఆయన స్వాతంత్ర్యమును మన పారతంత్ర్యమును గుర్తించి సకల కార్యములు ఆ స్వామివిగనే తెలిసికొనవలయును. అట్లు కావించిన మనము అలిప్తులమై కర్మబంధముల నుండి విడివడుదుము.

దామియా అకసము నందుకొనఁ జూచు చున్నాఁడు. భగవానుఁ డాతనికిఁ బ్రసాదించినది నిలుపుకొని సంతృప్తిని పొందఁదలఁచుటలేదు.

## సకల జీవములను ప్రేమించుట

268. సా. బా:- ఎల్లప్రాణులను ప్రేమించుము. ఎవరితో కలహింపకుము ప్రతీకారబుద్ధివహించకుము. ఎవరిని నిందింపకుము. ఎవరేని నీకు వ్యతిరేకముగ మాటాడిన కలతపడక తొలగిపొమ్ము. ఇతరుల మాటలు నీ తనువున దుస్సికొనవు. ఇతరుల పనులు వారినే బాధించును. నిన్ను బాధింపవు. నీవు కావించునవియే నిన్ను బాధించునవి. (చూ. 208, 289)

## అలసత (సోమరితనము)

269. సా. బా:- సోమరితనము వహింపకుము. ఏదొక కృషి చేయుము. దైవనామము స్మరింపుము. సద్గ్రంథములను పఠింపుము.

## ఇతర నైతిక బోధలు

270. సా. బా:- (చంద్రబాయిబోర్కర్‌తో) మన మితరుల యెడ ద్వేషము – ఈర్ష్య – ప్రతీకారవాంఛ వహింపఁ దగదు. ఇతరులు మనల ద్వేషించిన, నామజపమునకుఁ గడఁగి, వారికి దూరముగ తొలంగుట మేలు.

271. సా. బా:- (బాపూరావ్ యన్. చందోర్కర్‌తో) నీ తల్లి దండ్రుల మాటలు వినుము. పనులందు నీ తల్లికిఁదోడ్పడుము.

ఎల్లవేళల సత్యము – సత్యము మాత్రమే పలుకుము. నేను సమృద్ధిగ నీయఁగోరుదాని నెవ్వరు స్వీకరింపరు. నేనీయఁజాలనిదానినే వారు కోరుకొనుచుందురు. తల్లియే దైవము.

271. A. సా. బా:– (యన్. జి. చందోర్కర్‌తో) నిన్ను విడిచి వెళ్లుచున్న ఈ హరిదాసును చూడుము! తుదివరకు కష్టసుఖము లందు నిన్ను హత్తుకొనియుండు మిత్రులనే సంపాదించుకొనుము.

(తాను బాబా బొంబాయికి బయలుదేరుచు తమవెంట నొక మిత్రునిఁగొనిపోయి, మధ్యమార్గమున నతనిని దిగవిడిచ్చి, వెళ్లుద మనిన, హ–సి– దీక్షిత్తుతో)

నేను ఎవ్వర నెప్పుడు మార్గమధ్యమున దిగవిడువను.

## దయ్యములు – భూతములు

272. ఒక భక్తుఁడు:– బాబా! భూతములు వాస్తవముగ కలవా?

సా. బా:– కలవు. వానితో మనకేమియు సంబంధము లేదు.

273. ఆర్. ఎ. తార్ఖాడ్ ఒకరాత్రి వెలుపలకేగెను. ఒక చెట్టుక్రింద నొక ఆకారమును చూచెను. భయపడి బాబాను ధ్యానించుచు ధైర్యమువహించి, శిర్డియందు తన విడదికిఁ జేరెను. మఱునాటి ఉదయమున బాబా తానే స్వయముగ ఆవిషయమును ప్రస్తావించుచు,

సా. బా:– రాత్రి నీవేమి చూచితివి?

తార్ఖాడ్:– ఒక భూతమును జూచితిని.

సా. బా:– కాదు. అది నేనే.

తార్ఖాడ్:– కాదు – బాబా! అదియొక భూతము.

సా. బా:– అది నేనే. వెళ్ళి తన తల్లిని అడుగ ఆమె, సకల భూతములు బాబా అధీనములో నున్నవి – యని ఆమె చెప్పెను.

సా. బా:- నేనా భూపాదులన్నింటిలోను లేనా? ఆహా! అవి మనకెట్టి హని కలిగింపవు. ఈ విషయమును నేను క్రిందటి సంవత్సర మున చెప్పలేదా?

## అమానిత్వము

274. సా. బా:- (ప్రధాన్ సతితో) ఎవరేని మనల పది మాటలనిన సమాధానము చెప్పవలసిన ఒకమాటలో పలుకఁదగును ఎవరి తోడను కలహించుట కాని, ప్రతీకారవాంఛకాని, వదరుటకాని మాఱు పలు కుటకాని తగదు.

## సహనము - ఓర్పు

275. ఉద్ధవేశభావ్:- (ప్రథమ దర్శనమున) నామోక్ష గురువెందుగలఁడు? అతని నేనెట్లు పొందఁగలను?

సా. బా:- 5 సంవత్సరములు వేచియుండుము. నీవెఱుగగలవు. రొట్టెనంతయు నొక్కమాఱుగ నెట్లు మ్రింగఁగలవు? 5 సంవత్సరములు వేచిచూడుము.

## సందేహముపట్టున విశ్వాసము పొటించుము

276. ఒక ప్రార్థనా సమాజికుఁడు బాబా దగ్గఱకేగెను. అచటకు వెళ్లుపూర్వము ఎవరితోడనో "బాబా - గీతలందు దెలుపంబడిన 'స్థితప్రజ్ఞ' లక్షణములు కలవాఁడగునా? కాదా?" యని, యేమేమో చర్చించినాఁడు. ఇది - అతని మనస్సునందు అశాంతి కలిగించెను. ఆతని విశ్వాసము సడలెను. అట్టిస్థితిలో నాతఁడు బాబాను జేరినాఁడు.

సా. బా:- శ్యామా! ఆతనిని తీసికొనివెళ్లి యేదొకటి తెలుపుము.

అంతట 'శ్యామా' ఆతని తనయింటికిఁ గొనిపోయి యీసు బోధ కావించెను.

i ప్రజలు పలుకు బాధ్యతారహితములు—అజ్ఞాన చోదితము లైన పలుకుల నాదరింపకుము.

ii) నీ మనస్సును బాబాపాదములందు నిలుపుము.

iii) సకనము సురక్షితమగును.

తరువాత వారిరువురు బాబానుజేరిరి.

సా. బా:— శ్యామా కావించిన బోధ పాటింపుము!

## విపరీత వ్రత నియమము.

277. సా. బా:— ఆహారాదులను పూర్ణముగ త్యజించి విపరీత వ్రతనియమములను పాటింపఁదగదు.

"యుక్తాహార విహారస్య" (భగవద్గీత)

277A. సా. బా.- (కుశభావ్‌తో ఈ పర్యాయము నీవు వచ్చునపుడు 'ఇరువురు' రండు! (వివాహితుండవై రమ్ము).

278. హ. సీ. దిక్షిత్ రాత్రులందు భోజనము మానవలయు నని నిశ్చయించుకొని బాబాను జేరఁగ—

సా. బా:- కాకా! రాత్రివంట చేయించుకొని భుజింపుము! హరిసీతారాం దీక్షిత్తు రాత్రులందుపవసింప వలయు నను తలంపు మానుకొనెను.

## వ్యర్థములగు ఉపవాసములయెడ బాబా అసిష్టత

279. ఒకపరి సింహావండుగకు గోఖలేసతి శిర్డికిఁజేరి, దాదా కేల్కారు ఇంటనుండి శిర్డియందున్నంతవరకు ఉపవాసము చేయఁ దలఁచెను.

సా. బా:- (దాదా కేల్కారుతో) నా బిడ్డలు సింహావండగ యందు ఉపవసింతురా? నేనది సమ్మతింపను - జరుగనీయను.

ఆ మఱునాఁడు గోఖేల్‌సతి శీర్డికిఁజేరి బాబాను సందర్శించి, మోఁకాలఁగూర్చుండెను.

సా. బా:- (తానే ఆ విషయము ప్రస్తావించుచు) మనమేల ఉపవసింపవలె? దాదా కేల్కారు ఇంటికిఁబొమ్ము. పూరణ్ పోలీలను సిద్ధపరచి, నీవు భుజించి, ఆ కుటుంబములోని వారి కందఱకు పంచి పెట్టుము.

గోఖేల్‌సతి, దాదా ఇంటికి వెళ్లెను. కేల్కారుసతి వెలుపల నుండుటచే, అతిథి యయ్యును ఆమే వంటచేయవలసి వచ్చెను. బాబా నిర్దేశించినట్లు పూరణ్ పోలీల సిద్ధపఱచి, తాను భుజించి ఆ యింటిలోని వారికందఱకు పెట్టెను.

280. సా. బా:- (యస్. బి. నాచ్నేతో) నీవు భుజించితివా?

నాచ్నే:- బాబా! ఈ రోజు ఏకాదశి, (నాచ్నే, తన యింటి వద్ద ఏకాదశి నుపవసించు ఆచారము లేనివాఁ డైనను తనవెంట శీర్డికిఁ జేరిన ఇరువురు మిత్రులు ఏకాదశీ ఉపవాస వ్రతముగల వారగుటచే తాను ఉపవసింపవలయునని ఆ రోజున తలంచెను)

సా. బా:- ఈ ఇరువురు పిచ్చివారు. నీవు వెళ్ళి భుజింపుము.

నాచ్నే, బాలభావ్ 'హోటలు' నకువెళ్లెను. కాని బాలభావ్ నైష్ఠిక పరుఁడగుటచే హారతి జరుగని కారణమున భోజనముపెట్ట నిరాకరించెను. అందుచే నాచ్నే బాలభావ్‌తోకలసి ఆరతివేళకు మసీదుఁజేరెను.

సా. బా:- (నాచ్నేతో) నీవు భుజించితివా?

నాచ్నే:- బాబా! ఇది ఆరతి సమయము గదా! ఆరతి- అయిన తరువాత భోజనము పెట్టఁబడును.

సా. బా:- కాదు - నీవువెళ్ళి భుజింపుము. ఆరతి - నీకొఱకు ఆగును.

కావున బాలభావ్ నాచ్నేకు భోజనము పెట్టక తప్పలేదు. నాచ్నే భుజించిన తరువాత నాచ్నే బాలభావ్ ఇరువురు ద్వారకామాయిఁజేరిరి, అప్పుడే 'మావుసీ' పెక్కు 'అకుబీడాలు తెచ్చి బాబాకు సమర్పించెను.

సా. బా:- (నాచ్నేతో) ఈఆకుబీడాను తినుము.

నాచ్నే ఆకుబీడాను తీసికొని ఏకాదశినాఁడు తాంబూల చర్వణము ఆచారము కానికారణమున సందేహించుచుండెను.

సా. బా:- సందేహింపకుము, కానిమ్ము! నమలుము. నాచ్నే ఆకుబీడాను నమలెను.

## యోగము - ఉల్లి భక్షణము.

281. యోగ సంబంధమైన కొన్ని విషయములను బాబా వలన తెలిసికొనఁ దలచిన ఒక యోగాభ్యాసకుని వెంటఁ బెట్టుకొని 'నా, గో - చందోర్కరు శిర్డీకిఁజేరెను. వారు మసీదుఁజేరఁగ బాబా ఉల్లి పాయలను భక్షించు చుండెను. ఆయోగాభ్యాసి, తామసికాహారమగు ఉల్లిగడ్డలను తినుచున్న బాబా తనకాయోగసాధన విషయమున నెట్టి సాయముఁ జేయఁజాలఁడని తలంచెను.

సా. బా:- నానా! జీర్ణించుకొనఁ (తామసిక గుణమును నిరోధింప) జాలెనేని ఉల్లిభక్షణమున నేమిహానికలదు?

అంతట తనతలంపు గుర్తింపఁజాలిన బాబాయోగేశ్వరుండగుట సత్యమని ఆయోగసాధకుఁడు గుర్తించెను.

## బాబా - దాసుగాణూను ఉల్లిని తినిపించినవిధము.

282. నైష్ఠికుఁడైన గాణూదాసునకు ఉల్లి అనిన అనిష్టము.

సా. బా:- (దాస్‌గాణూతో) 'పిట్లా' తయారుచేసి, ఉల్లికూర అనుపాకముగ నాకు కొంతపెట్టి మిగిలినది నీవు భుజింపుము.

దా. గా:- అలాగే బాబా!

మఱునాఁడు. దా. గా. ఉల్లికూర సిద్ధపఱచి తన వ్రేళ్ళ కొనలతో దానిని తాకి, దానిని తినినట్లు ఆ వ్రేళ్లతో క్రిందిపెదవిని స్పృశించి, తన చేతులు ముఖము నీటితో శుభ్రపఱచు కొనెను ఆతవాత బాబా దగ్గఱకేగెను.

సా. బా:- ఉల్లి భక్షించితివా?

దా. గా:- భక్షించితిని.

సా. బా:- ఈతఁడు తినినట్లు నటించుచున్నాడు, కాని, యితఁడా ఉల్లికూరచేతి వ్రేళ్ళతోతాకి, తనపెదవిని ఆ వ్రేళ్ళతో స్పృశించినాడు - (అనుచు గాణూ కావించిన విధమును బాబా అచటివారికి ప్రదర్శించెను.)

సా. బా:- గాణూ! నీవు యదార్థముగ ఉల్లి తినవలె, నటించుట కాదు.

దా. గా:- ఆలాగే - బాబా!

దాసుగాణూ అదిమొదలు, బాబా భౌతిక తనువున్నందున్నంత వరకు (1918) ఏకాదశినాఁడు తప్ప తక్కిన దినములలో ఉల్లి భక్షించెను.

## కుశభావ్ - ఉల్లి

283. ఒక ఏకాదశీ దినమున కుశభావ్ - (కృష్ణజీ - కాశీనాథ జోషి; మీర్జగాఁనివాసి) బాబాచెంతఁగూర్చుండి యుండెను.

సా. బా:- (కుశభావ్‌తో) నీవీదినమేమి భుజించుదువు?

కు. శ:- ఏమియును తినను. ఈదినముఏకాదశి-బాబా!

సా. బా:- ఏకాదశి యననేమి?

కు. శ:- ఉపవాస దినము.

సా. బా:- ఉపవాసమన అర్థమేమి?

కు. శ:- అది 'రోజాస్' వంటిది.

సా. బా:- 'రోజాస్' - అననేమి?

కుశ:- మేముపవశింతుము. కందములుతప్ప మతేమియును తినము.

సా. బా:- ఓ! కాండములా! (ఉల్లిపాయలని అర్థము) మీరి నాఁడు భక్షించునది, ఇవిగో ఉల్లిపాయలు. ఇచటకలవు తినుము-

కుశ:- (బాబా తనను అనాచారభుక్తి చేయింపఁ దలచినాడని తలచి) బాబా! నీవుతినిన నేను తిందును.

అంతట బాబాకొన్ని తినెను. కుశభావ్‌కొన్ని తినెను. ఇంతలో కొందఱు ద్వారకామాయి మసీదుఁ జేరిరి. బాబా కొంత చమత్కారముఁ గావింపఁదలంచెను.

సా. బా:- (చేరినవారితో) ఈబాపనిఁ జూడండి! ఏకాదశినాఁడితడు ఉల్లిపాయలను తినుచున్నాఁడు.

కుశ:- బాబాతినినాఁడు. నేనునుతింటిని.

సా. బా:- నేనుకందములను (తీపిగడ్డలను) తింటిని.

బాబాతీపిగడ్డలనుక్రిక్కెను.

కుశభావ్, బాబా కావించిన అద్భుత చమత్కారమును! గను గొని, ఆత్యాతురతతో - ప్రసాదముగ భావించి బాబా క్రిక్కిన ఆ తీపి ఉరలగడ్డలను తీసికొని తినెను.

సా. బా:- (కుశభావ్‌ను కొట్టుచు) మూఢుడ! ఆ క్రిక్కిన వాని నేలె తినెదవు?

కాని కుశభావ్ ఆ దెబ్బలను లెక్కచేయలేదు. బాబా హృదయము ద్రవించినది.

సా. బా:- (కుశభావ్, మస్తమున హస్తము నిలిపి) నిన్నను గ్రహించు చున్నాఁడను. నన్ను తలంచుచు దోసిలి పట్టుము. నా ప్రసాదము నీద లభించును.

కుశభావ్, అదిమొదలు బాబాను ధ్యానించుచు దోసిలి పట్టిన అందు బాబా ప్రసాదము 'ఉధి' జేరును. ఆ 'ఉధి'ని బాబా ప్రసాదముగ నతఁడు కోరినవారి కీయును.

## దాదాకేల్కర్ – ఉల్లి

284. దాదాకేల్కారు మిక్కిలి పట్టుదలఁగల బ్రాహ్మణుఁడు. ఉల్లిగడ్డలనిన మిక్కిలి ఏవగించును. అతఁడు మిక్కిలి అభినివేశముతో సాతేవాడలో విడియువారలను ఉల్లిపాయల నుపయోగింపనీయకుండు వాఁడు. యస్. బి. నాచ్నే అత్తగారు ఉల్లిపాయల నుపయోగించు చుండ నామెను నిందించెను. అతని మనుమరాలికి కనులకలక ఏర్పడెను. కేల్కారు - బాబానుచేరి,

దా. కే:- బాబా! బిడ్డకు కండ్లకలక ఏర్పడినది. నేనేమి చేయువలయును?

సా. బా:- కనుల కాపునకు ఉల్లిపాయ లుపయోగింపుము.

దా. కే:- ఉల్లిగడ్డలకు నే నెక్కడకు వెళ్లెదను?

సా. బా:- (నాచ్నే అత్తగారిని వ్రేలితో చూపుచు) ఈ తల్లి దగ్గఱనుండి తీసుకొనుము.

నాచ్నే అత్త:- బాబా! దాదాకేల్కార్ నేను ఉల్లిపాయలు ఉపయోగించుచుంటినని నన్ను తిట్టినాఁడు. అతనికేమియు నిచ్చుటకు నా కిష్టములేదు. నీ వాజ్ఞాపింతువేని ఇచ్చెదను.

సా. బా:- ఇమ్ము!

ఆమెఉల్లిగడ్డలనిచ్చెను. బాబా ఆఘద్వారా దాదాకేల్కారు యొక్క స్వాతిశయము, సహింపరాని మూర్ఖపు పట్టుదలను అడఁచెను. ((c) 587)

## ఆదరణము - అతిథి సత్కారము

బాబా భోజన ధూమపానములచే నితరుల నాదరించును

285. (a) సా. బా:- (డి. వి. సంభారేతో) బిడ్డా! దగ్గఱకు రమ్ము! దూరముగనుండనేల? పొగ్రతాగుము!

- 286. (b) సా. బా:- ఆకలి నొందిన వారిని ముందుగఁ దినఁ బెట్టుము. తరువాత నీవు భుజింపుము.

287. (c) సా. బా:- (హాస్యముగ అన్నాసాహెబ్ దభోల్కర్‌తో) ఆహా! అది అతని అలవాటు. మధుర పదార్థములను తానొక్కఁడే భుజించును. ఇతరులకు పెట్టఁబోఁడు.

"ఏకం స్వాదు నభుంజీథ"

288. (d) సా. బా:- (అ. ద. భోల్కర్‌తో) నీభోజన సమయమున నేను నీదగ్గఱలేనా? నాకొక ముద్దయైన పెట్టుదువా?

(e) అతిథి నిర్వచనము - బాబా, నా. గో. చందోర్కరునకు కావించినబోధ గమనింపుడు. (199, 306.)

## ఐకమత్యము - పొందిక.

289. సా. బా:- స్పర్థ, జగడములను మానుకొంటివా భగవానుఁడు నిన్ను రక్షించును.

కీడునకు కీడు చేయకుము - 'దెబ్బకు, దెబ్బ' - అనకుము
కీడునకు తిరిగి మేలుచేయుము!
ఇతరుల మాటలు నీకు హానికలిగింపలేవు.

## పరిశ్రమ - సహనము.

290. సా. బా:- యోగ - యాగ - తపో - జ్ఞానముల నుపార్జింపఁ జాలని జీవితము వ్యర్థము.

291. సా. బా:- (ఒక భక్తునకు సందేశమంపుచు) నీవు భోజనము చేయుచు ఊరక కూరుచుందువా? (సబూరి) ఓర్పును ధైర్యమును పాదుకొలుపుకొనుము.

292. సా. బా:- (ఒకని నుద్దేశించి వానియెదుటనే) మన (నీ) గతి తుదకు మిక్కిలి దుస్సహము - హేయమునగును. ఒకటరెంట నేను హెచ్చరిక చేయుదును. ఇచ్చిన సలహాను పాటింపనియెడ తుదకతనిగతి దుర్ఘటమగును. గర్భమున పెడతిరిగిన పసికందునేని కండతుండెములుగ ఖండించి వెలికి పాఱవేయవలయును.

## త్రాగుడు దురభ్యాసమును బాబా తొలగించుట.

292. A (1) సా. బా:- (త్రాగుడు దురభ్యాసముగల డి. వి. సాంబారేతో) బిడ్డా! నీవిట్లేల ప్రవర్తించెదవు? చూడుము! నీ యీ త్రాగుడు అలవాటు మానుమని తొలుత నీకీ హెచ్చరిక చేయుచున్నాను. దీనిని నీవు పాటింపవేని మరల నీకు హెచ్చరిక చేయను. నీ కర్మమునకు నిన్ను విడిచి పెట్టుదును.

డి. వి. సాంబారే సురాపానము చేయనని ప్రతిజ్ఞ చేసెను. త్రాగవలయునను కోరిక అతనికి శమించెను. ఒక దినమున అతనిపై అధికారి విందుచేయుచు సాంబారేను ఆహ్వానించెను. అది ఒక పెద్ద విందు. ఒక గ్లాసునిండుగ బ్రాందిని ఆతని ముందుంచిరి. సాంబారే ఏవేవో కారణములఁ దెలుపుకొని త్రాగజంకెను. ఎల్లరు నవ్విరి. ఇట్లు సాంబారే అయోమయస్థితిలోపడి, యేమిచేయుటకు తోచకుండెను. తటాలున విద్యుద్దీపములన్నియు నారిపోయెను. ఆయుజమాని కారణమరయుటకు వెళ్లెను. ఇంతలో సాంబారే ప్రక్కనున్న అతిథి సాంబారే గ్లాసులోని సురను త్రాగెను. దీపములు వెలిగెను. యజమాని తిరిగివచ్చెను. ఆగ్లాసు 'ఖాళీ' యగుట చూచి, తనమాటను సాంబారే ఆదరించెనని తలంచి వెడలిపోయెను. ఈవిధముగ బాబా, తనవాని సాంబారేను

రక్షించుటకీలీలను నెఱపెను. ఆదీపములేల ఆరిపోయెనో తిరిగి ఎట్లు వెలిగెనో ఆకారణమెవరు నెఱుఁగజాలకుండిరి.

(2)సా. బా:- ( (a) త్రాగుడు దురభ్యాసముగల శాంతారాముతో (b) కమసాలిబాలునితో) ఇచ్చట ఆరుదినములుండుడు!

వారుండిరి. అదిమొదలు వారికి త్రాగవలయునను కోరిక శమించెను. వారు శీరిడి విడిచి వెళ్ళిన తరువాత త్రాగియెఱుఁగరు.

## మసీదునందు బల్లపలకపై బాబాతపస్సు-జాగరూకత

293. ఒకసందర్భమున బాబా తాను పరుండిన బల్లపలకను గూర్చి తెలిపెను. ఆబల్లపలక 5అడుగులు పొడవు 15 అంగుళములు వెడల్పుగలది. ప్రమిదదీపములు దానిపై నలువైపుల నుంచఁబడును. మసీదుకప్పునందలి దంతెలనుఁడి సన్నని గుడ్డపేలికలతో వ్రేలాడ కట్టఁబడినది. నేలమట్టము నుండి 6, 7, అడుగుల ఎత్తున వ్రేలాడఁ గట్టబడిన ఆబల్లపైకి ప్రమిద దీపములు క్రిందఁ బడకుఁడ, గుడ్డపేలికలు తెగకుండ బాబాఎటుల పైకిఎగిరి పరుండునా! అను ఆశ్చర్య మొకటి; బల్లపైఁ జేరిన బాబా బరువునకు ఆసన్నని గుడ్డపేలిక లెట్లు తెగక నిలువఁగలవా! యను వింత రెండవది. దాసుగాణూ మఱియితరులా చోద్యమును చూడ వలయునని ప్రయత్నించుటచే, బాబా కుపితుఁడై, విసుగొంది ఆ బల్ల పలకను ముక్కలు ముక్కలు చేసి పాఱవైచెను,

హరిసీతారాం దీక్షిత్తు, బాబా పరుండుటకొక మంచమునిత్తు ననెను.

సా. బా:- వలదు. మహల్సాపతిని క్రింద నేలపై పరుండనిచ్చి, నేనుమంచముపై పరుండుదునా? దానికంటె నేనే నేలపై శయనించి, మహల్సాపతిని ఉన్నతస్థానమున పరుండ నీయుట మేలు.

హ.సీ.దీక్షిత్ నేనురెండు బల్లలనిత్తును. ఒకటినీకు-మఱొకటి మహల్సాపతికి.

సా. బా:- అతఁడు బల్లపై పరుండఁడు. నేలమీద నే పరుండను. బల్లపై పరుండుట మాటలుకాదు. కనులు తెఱచికొని నావలె మెలఁకువతో నిద్ర పోఁగలవారెవరు? అట్టివాఁడే బల్లపై పరుండఁగలడు.

నేను నేలమీఁద పరుండునపుడు మహల్సాపతిని నాప్రక్కన గూర్చుండి, ఆతని అరచేతిని నాయురముపై నుంచుమని నియమింతును. కావునబల్ల అతని కేవిధముగ నుపయోగములేనిది. నేను క్రిందపరుండి మానసికముగ నామస్మరణముఁజేయుచుందును. "నా ఉరముపై నీచేతిని నిలుపుము- నేనునిదురించుచున్నట్లు గమనించితివా నన్ను మేల్కొల్పుము" అని మహల్సాపతికిఁదెలిపితిని. ఇదివరకు-ఇప్పుడు నాఆజ్ఞ అదియే.

యోగనిష్ఠయందు సాధారణముగ నిద్ర ఒకప్రతిబంధకమే. ఆ ధ్యాననిష్ఠ కొన్ని విషయములఁ నిద్రను పోలియుండును. నామస్మరణ-ధ్యాననిష్ఠయందు - సాధారణ నిద్రయందు హృదయస్పందమున భేదము కలదు.

## సాధకులకుబోధ

294. సా. బా:- (అబ్దుల్‌తో) చాలాతక్కువగ భుజింపుము వివిధ శాకాపాకాదులుతగవు. ఏదేనొక అనుపాకము చాలును. ఎక్కువగ నిద్రింపకుము. నీవుచదివిన అంశములనుగూర్చి ధ్యానింపుము - అల్లాను స్మరింపుము.

294. A. అడఁకువ వలని లాభములు:- హలకూర్ (పాకీవాఁడు) అని మిరియంబి అని (లౌకికదృష్టిలో నీచములు అనుకొను ఊడ్చుట మొదలగు సేవలుచేయువాఁడు.) పిలువఁబడు అబ్దుల్‌నకు బాబా కావించినబోధ.

1 నీ మట్టి బంగారముగ పరిణమించుచున్నది.

2 సప్తసముద్రముల నీవు దాటఁగలవు.

3 గొప్ప భవనము నీకొఱకు నిర్మింపఁబడుచున్నది.

## పరనింద

295. బాబాభక్తుఁడొకఁడు దూరముననున్న మఱియొక భక్తునిఁగూర్చి యేవేవియో నిందలు పలికెను. బాబా వెలుపలకేగి, యాతని "లేండి" వనము దగ్గఱకలిసెను.

సా. బా:- దానినిఁ జూచుచుంటివా?

భక్తుఁడు:- అదియొకపంది.

సా. బా:- అదియేమిచేయుచున్నది?

భక్తుఁడు:- పెంటను తినుచున్నది.

సా. బా:- ఆపంది ఎంత ఆతురత - ఆసక్తితో ఆఅశుద్ధమును తినుచున్నదో చూడుము! మనుష్య మలమునందు దానికెంత ఆనఁదము కలదో కనుగొనుము! కాని మనకది అసహ్యము కలిగించును. నీప్రవర్తనము అదే విధము, జనులు తమసోదరులపై క్రొధావేశమువహించి, తమ హృదయములు సంతృప్తి పడునట్లు నిందించుచుందురు. ఎన్నెన్నో సుకృతములు చేసికొనిన పిదపఁగాని మనుష్య జన్మము లభింపదు. అట్టి నరుఁడు శిర్డికిఁ జేరియు నైతిక ఆత్మహత్యకు గడఁగుటా!

296. సా. బా:- ('సగున్' తేయాకు దుకాణము దగ్గఱ పరనిందకావించిన "మాత్రదాసుతో") సగున్ ఏమనుచున్నాఁడు?

మాత్రదాసు సిగ్గునొందెను.

సా. బా:- మంచివారు చెడ్డవారు అందఱు ఇచటకుఁ జేరుదురు. వారిలోపముల, దోషములఁగూర్చి పలువుర యెదుట వెలిబుచ్చి, వారిని నిందింపనేల?

## అహింస

### a) మహల్సాపతి - కుక్క

297. మహల్సాపతి యొకనాఁడు పుండ్లుపడి రోగిష్టియైన ఒక కుక్కను కర్రతో కొట్టెను తరువాత బాబాను జేరెను.

సా. బా:- భగత్! ఈ గ్రామములో నావలె రోగిష్టియైన ఒక కుక్క గలదు. ప్రతిజనుఁడు దానినిఁగొట్టుచున్నాఁడు.

బాబా తనను ఉపాలంభించు చున్నాడఁడని గుర్తించిన మహల్సాపతి తాను గావించిన తప్పిదమునకు విచారపడెను.

## b) హ. సీ. దీక్షిత్తు - సర్పము

298. హ. సీ. దీక్షిత్తు:- బాబా! సర్పము మనుష్యులను చంపును. కావున సర్పము కంటఁబడినపుడు దానిని వరుఁడు చంపవలదా?

సా. బా:- తగదు. మనమెప్పుడు దానిని చంపరాదు ఏల? యన - దైవము ఆజ్ఞలేనిదే అది మనలవెప్పుడు చంపదు. దైవ మా విధమున ఆజ్ఞాపించిన మనము దానిని తప్పుకొనఁజాలము.

## c) పిచ్చికుక్కయెడ దయ

299. 1917 వైశాఖమున ఒక పిచ్చికుక్కచే కఱువఁబడిన ఒక చిన్నకుక్క పెద్దకుక్కలను తఱుము చుండెను. గ్రామములోని జనులు గుదియలఁజేఁబూని, ఆ చిన్నకుక్క వెంటఁబడిరి. అది వీధుల వెంటఁ బరుగెత్తి తుదకు ద్వారకామాయి మసీదునుజేరి బాబావెనుకనుండి బాబాను శరణస్థానముఁ గావించుకొనెను.

గ్రామజనులు:- బాబా! ఆ కుక్క పిచ్చిది. వెలుపలకు తరుముము. మేము దానిని చంపెదము.

సా. బా:- పిచ్చివారలారా! వెలుపలకు పొండు! దిక్కులేని యీ చిన్న జీవమును బాధించి చంపదలచినారా? అని బాబా ఆ చిన్న కుక్క ప్రాణములఁ గాపాడినాఁడు. దానికి పిచ్చిలేకుండుట విదిత మయ్యెను.

## కీడునకు ప్రతిఘటనము తగదు.

300 (a). సా. బా:- (ఒక కాంతతో) అమ్మా! అతనినే తిననిమ్ము. ఆ తినువాఁడు నీ తండ్రియే. (నీకు ఇంతకుఁ బూర్వము దత్తముచేసిన దానిని తానే తినుచున్నాఁడు) ఆతనితో వ్యాజ్యెము లాడకుము. దైవము నీకు సమృద్ధిగ ప్రసాదించును.

(b) సా. బా:- (తనపై కుఱికిన నానా వాలిని క్రిందకుఁ ద్రోసిన, హ. వి. సాతేతో) సాహెబ్? ఆ విధముగ ప్రవర్తింపకుము.

(c) జవర్ ఆలీ వృత్తాంతము 304 చూడుడు.

బాబా అడకువ - గురుబాబా - దైవము అగునుకాఁడు.

301. 1917లో తర్కాడ్‌సతి, కుమార్ తార్కాడ్ బాబాను సందర్శించిరి.

సా. బా:- (కుమార్ తార్కాడ్‌తో) బిడ్డా! 8 రూపాయలు దక్షిణనిమ్ము!

కు. తా:- బాబా! నాదగ్గఱ 8 రూపాయలు లేవు.

సా. బా:- పొమ్ము. బాపూసాహెబ్ జోగ్ దగ్గఱనుండితెమ్ము.

కు. తార్కాడ్ జోగ్‌దగ్గఱకేగెను. జోగ్ ధ్రువచరిత్రముఁ జదువుచు వ్యాఖ్యానము చేయుచుండెను. "సాధువులు దైవము కాకపోయినను ఆదైవము వలన ప్రసాదింపబడిన కొన్నిమహిమలు కలవారు"- అనుచుజోగ్ ఏమేమో వివరించుచుండెను.

ఆబాలుఁడు కుపితుఁడై వెంటనే బాబా దగ్గఱకు తిరిగి వెళ్లెను.

కు. తా:- బాబా! నన్నక్కడకేల పంపితివి!

సా. బా:- ఏమి విశేషము?

కు. తార్కాడ్:- నీవు మానవ మాత్రుఁడవేయని, దైవము కావని అక్కడవారు నిన్ను లాఘవ పఱచుచున్నారు,

సా. బా:- అవును. దానిలో అసత్యమేమి కలదు? ఆహా! నేనెవఁడను? ఒక పేద ఫకీరును, నేను దైవమును కాను. దేవుఁడెంత గొప్పవాఁడు! దైవముతో నెవరుసరిపోల్చుకొనఁదగరు.

కు. తా:- బాబా! నీవట్లు పలుకుచు మమ్ము మోసపుచ్చుచున్నాఁడవు. నీవు దేవుఁడవని మేము పూర్ణముగ విశ్వసింతుము, ఎవరేని నిన్ను లాఘవపఱచుచున్న, దానిని మేమెట్లు సహింపఁగలము? సాధువులను గేలిచేయుచోట ఒక క్షణమేని మేము నిలువరాదను మాట వాస్తవముగదా!

సా. బా:- నిజము.

కు. తా:- భగవంతుని నిందించిన అతఁడు కోపింపఁడు. కాని, భాగవతుల నిందించిన దైవము సహిఁపడు. కాదా?

సా. బా:- అవును.

కు. తా:- అట్టియెడ ఆసాధువు గొప్పవాఁడు. ఈసాధువుకాదు- అని సాధునిందా చర్చలవినుటవలన ప్రయోజనమేమి?

సా. బా:- సాధు సత్పురుషులను గూర్చి నిందలు పలుకఁబడుతావున ఒక క్షణమేని నీవు నిలువరాదు. (బాబా ఆబిడ్డతల ప్రేమతో నిమురుచు) సద్గ్రంథము పారాయణముచేయుము. నామజపముఁగావింపుము.

కు. తా:- బాబా! నేను మధ్యలో ఆపితినా - నాకు పాపము కలుగును. ప్రత్యవాయమాపాదించును. కావున నేనుచేయను.

సా. బా:- (తార్కాడ్ సతితో) అమ్మా! నీబిడ్డయొక్క సంపూర్ణ బాధ్యతలు నేను వహింపవలయును.

తా. సతి:- బాబా! మాయందఱ సంపూర్ణబాధ్యతల నీవేవహింపవలయును.

(ఇరువురు బాబాపాదముల వ్రాలి మ్రొక్కిరి. అపుడుకొందఱు వచ్చిరి)

నానావాలి:- బాబా! నీయథాస్థానమగు నీగద్దెపైఁ గూర్చుండుము.

అంతట బాబా కూర్చుండెను. నానావాలీ బాబాపాదములకు వ్రాలి మ్రొక్కెను.

ఆవిధముగ నాజ్ఞాపింపఁబడుటకు బాబా ఏలవమేని అనిష్టమును ప్రకటింపలేదు.

## అన్నదానము - బిచ్చము పెట్టుట.

**a)** మంచితనము - సరళభావముతోఁ బిచ్చము పెట్టుట.

306. సా. బా:- నానా! నీకు మఱియొక బోధకావించుచున్నాఁడను.

నా. గో. చందోర్కర్:- మంచిది. బాబా!

సా. బా:- నానా! నిన్నెవరేని ఏదేని కోరిన, యాచించిన, అదినీకు సాధ్యమైనదైన, అది నీవిచ్చుటకుఁ గాని, యిప్పించుటకుఁగాని వీలుపడునదైన అటుల కావింపుము. కాదు - లేదు - అనకుము. నీయందు బాటులో లేనిదైన సరళముగ "నావల్లకాదు-" అనుము. ఆ అర్థిని-యాచకుని నిరసించుటకాని, హేళన చేయుటగాని, యతనిపై కోపము వహించుటగాని తగనిది. నీకుఁగలదాని నిచ్చుటకు సమ్మతింపవా "లేదు"- అని, అసత్యము పలుకకుము. ఈయుంజాలను - అనికాని, ప్రతిబంధకము కలదు - అనికాని సౌమ్యముగఁ దెలుపుము. ఈబోధ జ్ఞప్తియందుంచుకొందువా? మఱతువా?

నా. గో. చం:- బాబా! ఇందు కష్టమేమికలదు? తప్పక జ్ఞప్తియందుంచుకొందును.

సా. బా:- ఈ బోధ వెలికి తోఁచునంత తేలికయైనదికాదు.

నా. గో. చం:- బాబా! నేను మనస్సుననిలుపుకొందును.

కొంతకాలము జరిగిన తరువాత, కోపర్గామున దత్తస్వామి దేవాలయమునకు 300/- రూపాయలు ధర్మమిడుదునని వాగ్దానముచేసి, ఆ పైకము తీసికొనిరాని కారణమున, శీర్డికివచ్చు మార్గమున నున్నను కోవెలకేగి దత్తస్వామిని దర్శింపక, అతని స్నేహితుని సమ్మతితో సరియైన దారినిగాక ముండ్లమార్గమున నడిచి, చందోర్కరు అతని మిత్రుడు తనువుల ముండ్లుగ్రుచ్చుకొన శీర్డికిఁజేరి బాబాను సందర్శించి మ్రొక్కిరి. బాబావారితో మాట్లాడలేదు.

నా. గో. చం:- బాబా! నాతో పలుకాడవేమి?

సా. బా:- నానా! నేను కావించిన బోధ జ్ఞప్తియందుంచుకొనునని మాటయిచ్చి, వాస్తవముగ అటుల కావింపని వానితో నేనేమి మాటడగలను?

నా.గో.చం:- బాబా! నీవు కావించిన బోధలన్నియు మనస్సున నిలుపుకొనినాఁడను.

సా. బా:- పెద్దమనుష్యులు మీరు. మహాప్రభువును (దత్తస్వామిని) సందర్శింపక పెడమార్గమున వచ్చినారు. ఏల? అచట సాధువు 300 రూపాయలడుగుననికదా! నాబోధ మనస్సున నిలుపుకొను విధ మిదియేనా? నీదగ్గఱ ధనములేదేని, ధనము తీసికొనివచ్చుటకు సాధ్యపడదేని ఆవిషయమాతనితోఁ జెప్పనగును. ఆసాధువునిన్ను తినునా? ఆసాధువు నిన్ను ధనమడుగునను భీతితో స్వామి కోవెలను తప్పకొని, పెడమార్గమునవచ్చు ఈ ఉపాయమేమి? నీపాదముల దేహమున, నీమిత్రుని వెనుకభాగమున ముండ్లు గ్రుచ్చుకొనలేదా? అట్టి మనుష్యులతో నేనెట్టుల మాటాడగలను?

b) గర్వము కోపములేక బిచ్చము పెట్టుట.

307. సా. బా:- నానా! ఈదినమున నీకు మఱియొక బోధ కావించుచున్నాఁడను.

నా. గో. చం:- బాబా! మంచిది.

సా. బా:- నానా! ఎవరేనిచేరి ఏమేని యాచించిన నీశక్తి కొలఁది సమర్పింపుము. ఆయాచకుఁడు దానితో తృప్తినొందక అధికముగ యాచించెనా సౌమ్యముగ "వీలుకాదు"- అనుము. ఆగ్రహోదగ్రుఁడవై నీఅధికార దర్పమును ఆబిచ్చగానిపై ప్రకటింపకుము.

నా. గో. చం:- మంచిది. బాబా!

కళ్యాణ్ పురమున చందోర్కరు కుటుంబముతో నివసించుచుండ నొక బిచ్చగత్తె వారింటికి వచ్చెను. చందోర్కరుసతి బిచ్చము పెట్టెను. ఆబిచ్చగత్తె మఱికొంచెము హెచ్చుపెట్టినఁగాని కదలనని మంకు పూనెను. ఆగృహిణి తన భర్తయగు చందోర్కరుతో చెప్పెను. నా. గో. చందోర్కరు వేగముగ లేచివచ్చి "ఆపెట్టినది తీసికొనిపోయినసరే-లేకున్న మెడపట్టి వెలుపలకు గెంటుము" అని తన బంట్రోతు నాజ్ఞాపించెను. తరువాత కొంతకాలమునకు చందోర్కరు శిరిడికి వెళ్లి బాబాను సందర్శించెను. బాబాచందోర్కరు వైపునకుఁ దిరుగక మౌనముగ నుండెను.

నా. గో. చం:- బాబా! నాతో మాటాడవేమి?

సా. బా:- నామాటలు పాటించని వారితో నాకేమి మాటలు కలవు?

నా. గో. చం:- బాబా! నీవుకావించిన బోధలేమిమఱచితిని? నీ బోధలన్నియు జ్ఞప్తియందుచుకొనుచుంటినే.

సా. బా:- అనాఁడొక బిచ్చగత్తె నీయింటికివచ్చి, పెట్టినబిచ్చముతో తృప్తినొందక అధికముగ పెట్టుమనిమూర్ఖత వహింపఁగ నీయధికార దర్పముఁ బ్రకటించుచు ఆబిచ్చగత్తెను మెడపట్టి వెలుపలకు గెంటుమని నీ'జవాను' నాజ్ఞాపించవలసిన పనియేమికలదు? నీవధికముఁగ పెట్ట

నిరాకరించిన వెడలిపోక మంకుఁబూని ఆపేదరాలు నీవాకిటఁ గూర్చున్న మాత్రమున నీకు గలుగు నష్టమేమి? కొంత తడవు కూర్చుండి వెడలి పోయెడిదికదా! సౌమ్యముగ చెప్పుటకు బదులుగా ఆగ్రహావేశమున ఆ ఆవదను మెడెపట్టిగెంటుమని నీనకరిని ఆజ్ఞాపించనేల?

308. సా. బా:- ఎవరేని ఇతరునిపై ఆగ్రహించిన నన్ను ఆతఁడు వైశమబాధపెట్టిన వాఁడగును.

ఎతరేని ఇతరుని నిందించిననేను బాధపడుదును. తన్ను ఎవరేని నిందించిన ఓర్పుతో సహించువానియెడనేను మిక్కిలి సంతోషింతును.

C) విచక్షణ పాటింపక బిచ్చము పెట్టుట

అతిధి (శబ్ధ) వివరణము

309. నా. గో. చందోర్కర్, నిత్యకర్మాదులు వైశ్యదేవము పూర్తికావించికొని. అతిథుల కొఱకు కొన్ని నిమిషములు వేచిన నెవరు రాకపోవుటచే, అతిథికొఱకు వేచియుండుమని వేదములాదేశించుట నిరర్థక విషయమా?- అని బాబాను అడుగఁదలఁచెను. అతఁడు బాబాను సమీపింపఁగనే చందోర్కరు అడుగఁబోవు ప్రశ్నమును తెలిసికొనిన బాబా యిట్లనెను.

సా. బా:- అవును- అవును. అతిథులు వత్తురు. తప్పకవత్తురు.

నా. గో. చం:- బాబా! సత్యము నేనునిత్యము కాక బలిసమర్పించి, వెలుపలకేగి, అతిథులకొఱకువేచి యుందును - ఎవరు రారు.

సా. బా:- నానా! శాస్త్రములలో పొరపాటులేదు. మంత్రములు లోపభూయిష్టములు కావు. కాని అందలి సత్య విషయమునీవు గుర్తింపలేదు. నిరర్థకమైన వివరణము (భావము) నీతలకెక్కించుకొని, అతిథుల కొఱకు వేచి నిలిచి యుందువు. వారురారు. అహో! 'అతిథి'- అను పదమున కర్థము 3½ మూరలుపొడవుగల బ్రాహ్మణుఁడని యేనా? ఆకలి గొంది నీదతికావేళకువచ్చు ఏజీవియైన "అతిథి" యే. నరజంతు పశు

పక్ష్యాదు లేవైనను అతిథియే ఇవన్నియు ఆహారము కొఱకు నిరీక్షించును. నిన్ను జేరు నిజమైన అతిథిని నీవు అటుల గుర్తింపఁజాలవు. ఇవి లక్షల కొలఁది నీదరికి వచ్చునవి. నానా! నీవ్యర్థమైన తలంపు త్రోసిపుచ్చుము. కాకాబలిసమయమున తగినంత అన్నమును ఇంటివెలుపలకుఁ గొనిపోయి ఒకచోట పెట్టుము. నీవు వేనిని పిలువ వలదు. చప్పటుల చఱచవలదు. డాసిన వానిని వేనిని తరుమవలదు. ఏజీవివచ్చితినినను నీమనస్సున కలతపొందవలదు. ఈవిధముగ లక్షలకొలఁది అతిథులఁ దనిపినసుకృతము పొందుదువు.

## కర్మ సిద్ధాంతము
## విత్తినది కోసికొందువు

310. సా. బా:- (ఆర్. యస్. దేవ్‌తో) నీవు విత్తినది కోసికొందువు. నీవు ఇచ్చినది పొందుదువు.

311. సా. బా:- (అవినీతి కృతికి శిక్షితుఁడై పై అధికారలకు తనశిక్షను రద్దుచేయుమని మనవిచేసికొని, బాబా అనుగ్రహముఁ బడయఁగోరి వచ్చిన ఒకసబ్జడ్జితో) వేప విత్తనము విత్తుము. వేపపండ్లను కోసికొనుము. ఆతరువును నటికి వేయుము!

## పూర్వకర్మము - దేహప్రారబ్ధము.

312. సా. బా:- ఇపుడునీవు కృషిసలుపుటచే పొందఁగలిగిన ఫలము ప్రస్తుతకర్మఫలము. నీవిపుడుపొందుచు కారణ మెఱుఁగఁజాలనిది పురాకృతకర్మఫలము, ఒకేపనికావించు నిరువురకు ఫలములు విభిన్నములుగ ప్రాప్తించుచుండును. అభేధమువారిపూర్వకర్మ భేదఫలములుగనిర్ణయించుకొనగును. ముందుఁగజూడఁబడని చూచుటకు సాధ్యముగాని ఫలములు పూర్వకర్మజనితములగుటచే వానికారణములు మనకగోచరములు. (కావున ఉప్పొంగుటగాని, నిస్పృహ నొందుటకాని తగదు. ఇతరుల నిందించుటయుఁ గూడదు.) ఫలసిద్ధికారణమగు నైతికధర్మము కలదని

గుర్తింపుము. కావున తోణకక నైతికధర్మమునను సరింపుము. నీవు కావించు కృషిఫలితముల నీవిపుడు పొందఁజాలకున్నను కలుగనున్న జన్మములలో వానినిపడయఁగలవు, ఇంక వాసనలవిషయమున నైతికధర్మము అతికఠినమైనదని. అప్రతిహతమని గుర్తింపుము కావున నైతికధర్మమును పాటించుచు అనుసరించుచుసీగమ్యమును — నైతికధర్మపరిపూర్ణమును — దైవమును — జేరుము.

## సత్సంగము - యమనియమములు మొదలగునవి.

313. సా. బా:— సత్సంగము — మంచివారితో సాంగత్యము శ్రేయము-మేలుగూర్చును. దుస్సంగమము-చెడ్డ వారితోడి చెలిమి హాని-కీడుకలిగించును. కావున ప్రయత్న పూర్వకముగ దుస్సంగతి విడనాడవలయును.

**యమము — నియమము :-** నిషిద్ధములగు ఆహార పానీయముల జోలికిపోవకుము "యుక్తాహార విహారశ్య...." వ్యర్థములగు కలహముల మానుము. కల్లలు— అబద్ధములు పలుకకుము. పలుకుపొంకము కలిగిమిత భాషివగుము!

ఇచ్చినమాట నిలుపుకొని ఋజుభావముకలిగి యుండుము. పరకాంతావ్యామోహము విడువుము. స్వప్రత్నియందే నిమితప్రవృత్తి కలిగియుండుము.

దాంపత్యసుఖము పొందుట దర్మసమ్మతమే, కాని, కామమునకు బానిసీఁడు కాఁదగదు. కామలంపటులకు ముక్తి దుర్లభము. కామము మనశ్శాంతిని, బలమును, స్థైర్యమును చెఱచును. మహావిద్వాంసులనేని కామినీ వ్యామోహము పతితులనుజేయును.

అథీనములుగాని పశువుల గమనమును నిరోధించుటకు మెడలో గుదికొయ్య (గళకొష్టము) కట్టుదురు. కాముక వ్యామోహమును రూపుమాపుటకు మనస్సునకు వివేకము - (యుక్తాయుక్తపరిజ్ఞానము) అను గుదికొయ్యనుకట్టవలయును.

కోరికలను అధీనమునందుంచుకొనవలయును అవి నీకులొంగి యుండవలయునుగాని, నీవు వానికిలోఁగియుండఁదగదు. "విజితాత్మా జితేంద్రియః"

నీఅంతశ్శత్రువులను (కామక్రోధాదులను) మితిమీఱ నీయక నీవు ఉపయోగించు (కొనఁగలవు) కొనుము.

కామము — ధర్మపత్ని విషయమున,

క్రోధము — నీదుష్ప్రవర్తనమునెడ,

లోభము — దైవనామస్మరణమున,

మోహము — ముక్తి విషయమున,

మత్సరము — చెడ్డపనులయెడ - పఱపుము-

మదము — ఎన్నఁడుతగనిది, వర్జింపుము.

## మృతి (చావు)

(a. నైతిక బోధలు)

313. A. బాబా ప్రేమనుఅనుగ్రహించుట

సా. బా:- (రావుసాహెబ్ గాల్వంకర్ ఎదుట పొడమి.) నీకేమి కావలయును?

గాల్వంకర్:- ప్రేమతప్ప మఱేమియువలదు.

సా. బా:- అలాగే. (అని, బాబా అదృశ్యుఁడయ్యెను.) అదిమొదలు గాల్వంకరునకు ప్రేమ తరంగములు హృదయమున నుప్పొంగఁదొడగెను.

313. B. (ఇమాం) విశ్వాసమును బాబా ప్రసాదించుట.

రాజబాలీ మహమ్మద్ బాబాను సందర్శించెను.

సా. బా:- నీకేమికావలయును?

రా. మ:- (ఇమామ్) విశ్వాసము మాత్రమే.

సా. బా:- అల్లాఅచ్ఛాకరేగా! (దైవమనుగ్రహించును)

314. సా. బా:- ఏలనీవు దుఃఖించెదవు?

గిట్టుటకే మనుష్యుఁడుపుట్టినది. ఏదొకదినమున మనలోప్రతి వ్యక్తియు మరణించవలసినదే.

సా. బా:- (అప్పాకులకర్ణిభార్యతో) చావుపుట్టుకలు దైవవిధానములు. ఈరెంటిని వేర్పఱుపఁజాలవు. సకలమున దైవమనుస్యూతమై యున్నవాఁడు. (వాస్తవముగ) పుట్టువాఁడెవ్వఁడులేఁడు. ఎవ్వఁడుమృతి నొందఁడు. నీఅంతర్దృష్టితో చూడుము! నీవుదైవమనని - దైవమునకు భిన్నుఁడవు కావనిఎఱుఁగుదువు. చినిఁగి చీకినవస్త్రమువలె, ఈదేహము దైవముచే పాఱవేయఁబడినది. నేను నా 'కుఫ్నీ'ని పాఱవేయుపూర్వము 'అప్పా' తన దుస్తులను మార్చుకొనఁగోరినాఁడు. అప్పానుపోనిమ్ము! ఆతని నాపవలదు. ఉధికొఱకు అడుగవలదు.

లాభనష్టములు- పుట్టుకచావులు దైవాధీనములు. ఈజనులెంత అంధులై దైవమును మఱచుచున్నారు! ప్రాణముండునంతవరకు దానిని రక్షించుకొనుము. మృతిఆసన్నమైన దుఃఖింపకుము.

వివేకముగలవారు "మృతి" అనినఏడ్వరు. అవివేకులు దుఃఖింతురు.

చూడుము! ఇంతదనుక ఈఐదుప్రాణములు తాత్కాలికముగ ఉపయోగించుకొనుటకుఁబదులు ఈయఁబడినవి. అబదులు ఇచ్చినవాఁడు

తనసొత్తు తానుతిరిగి రాఁబట్టుకొనినాఁడు. అవి తిరిగి ఆయుజమానినిఁజేరినవి గాలి - గాలిని, అగ్ని- అగ్నిని, ఇట్లీ పంచభూతములు వానిస్వస్థానమును జేరుకొనినవి.

ఈదేహము పృద్వీవికారము. భూతత్త్వము వలన కలిగినది. యథార్థముగ అవియన్నియు నొకటే.

కావున దేహము భూమినిఁజేరుట దుఃఖింపఁ దగిన విషయము కాదు.

## జననము- (పుట్టుక.)

315. సా. బా:- పుట్టుకు విషయమును గూర్చియు అదే విధము. పుట్టుగును గూర్చి ఆనందోత్సాహములను పొందకుము. సృష్టి లోనిది యొకవిధానము.- క్రమము. (మొదటినుండియు ఇది జరుగుచునే యుండును) దానిచే చలింపరాదు.

భూమి బీజముల వహించును. మేఘములు వానిపై వర్షించును. సూర్యుఁడు కిరణములఁబఱపివానిని మొలకెత్తఁ జేయును. ఇవి మొల కెత్తినపిదపభూమి, మేఘము, సూర్యుఁడు వారి వారి లీలలను బఱపుచు వానికి ఎల్లవిధముల సుఖానందములఁగూర్చుచునే యుందురు. ఆమొల కలు పెరుగు చున్నచో నవిప్పొంగరు. అవినశించిని దుఃఖింపవు.

వీని (పృధివిమేఘసూర్యుల) వలెనీవును కలత పొందరాదు. అటుల నీవున్న నీకుదుఃఖమెందుండి కలుగును? ఈ దుఃఖరాహిత్యమే 'ముక్తి'.

## దుఃఖము - స్వార్థపరత

316. సా. బా:- (దీర్ఘకాలవ్యాధిచే బాధలు పడిపడి బాబాను ధ్యానించుచు ప్రాణములు విడిచిన భర్తకొఱకు దుఃఖించుచున్న ఒక వృద్ధురాలి ఏడ్పులువిని) ఆ వృద్ధురాలి ఏడ్పులు వినుఁడు! "నాగతి యేమి కావలె? నాకు తిండి గుడ్డ లెవరిత్తురు?" - అని, విలపించుచున్నది.

ఆమెభర్తయొక్క బాధలను, సుఖమును సంపూర్ణముగ మఱచుచున్నది సుమా! (భర్త బాధలు - కష్టములు కావు ఆమెకు కావలసినవి - తిండి గుడ్డలు!)

## పుత్రమరణము - పుత్రికామరణము మొదలగునవి

(డబ్లుయు. జి. ప్రధాన్)

317. సా. బా:- (ఒక మేజస్ట్రేటుతో) ఒక కుమారుని మరణముంగూర్చి ఆ అవివేకి అటులేల ఏడ్వవలె? అది పృథివినిఁ జేరుటయే. ఆ తనువు భూమినిఁ జేరవలసినదే. దానినిఁగూర్చి యటుల విలపించుచుండనేల? రామఫలముల అన్నిదిశల వెదజల్లుము!

సా. బా:- (మనుమనిమృతికై విచారపడు నానాగోవింద చందోర్కరుతో) - చూ. 371.

318. సా. బా:- (బయ్యాజిపటేల్‌తో నీవు నీ తండ్రి మృతి కొఱకు విచారవడనేల? 5 నెలలలో నతఁడు తిరిగివచ్చును. (5 నెలలలో బయ్యాజీకి పుత్రుఁడు జనించెను.)

## జ్ఞాని - నిర్యాణము

319. సాధు సత్పురుషులు మృతినొందినవారు - అని అనరు, వారు సమాధి నొందుదురు. (చూ. కబీరు)

బాబా:- మృతినిఁ దప్పింపఁబోని సమయము. a) బెండేకు- b) సర్పదష్టుఁడైన బాలునకు c) ప్రిదిలిన పెదవిగల పిల్లలతండ్రికి d) అప్పాకుల కర్ణికి - బాబా హెచ్చరికచేయుట.

- (a) 4 దినములలోనుతని గోల్పోనున్న జి. పి. బెండేకు బాబా హెచ్చరిక చేయుట.

320. సా. బా:- వెళ్లుము! బూటీని 10 రూపాయలు దక్షిణ నడుగుము.

బెండ్రే, బూటీదగ్గఱకేగ అపుడే మృతినొందిన యాతని గుమాస్తాను భూస్థాపితముఁజేయుటకై ప్రశాంతముగ నడచుచు పోవుచున్న బూటీనిఁజూచెను. (తిరిగివచ్చెను)

సా. బా:- (బెండ్రేతో) మిక్కిలి విచారకరమగు విషయము ఆపాదించెను భయపడకుము. ధైర్యము వహింపుము. పొమ్ము. తబ్బిబ్బు కావలదు.

ఆవిధముగ సిద్ధపఱుపఁబడిన బెండ్రే ఆతరువాత రెండు రోజులకు మృతినొందిన కుమారునిఁగూర్చి అంతగా శోకమగ్నుఁడుకాలేదు.

(b.) మృతి మేలుకలిగించునెడ బాబా దానిని తప్పింపడు.

(సర్పదష్టుఁడైన బాలుఁడు.)

వడదెబ్బతగిలి మృతినొందిన బాలుని బాబాబ్రతికించిన కొంత కాలము తరువాత ఒక కాంత సర్పదష్టుఁడైన తనకుమారుని రక్షింపుమని, 'ఊధి' ప్రసాదింపుమని, బాబానుజేరి ప్రార్థించెను. ఊధి ప్రసాదింపఁబడ లేదు. ఆబాలుఁడు మరణించెను. ఆమె మరల బాబానుజేరి పెద్దపెట్టున ఏడ్చెను.

321. హ. సి. దీక్షిత్:- బాబా! ఆకాంత విలాపము హృదయ విదారకముగనున్నది. నన్నుగూర్చియైన-నాకొఱకు అమృతినొందిన ఆమెపుత్రుని బ్రతికింపుము.

సా. బా:- భావ్! ఈ విషయమున నీవు జోక్యము కల్పించుకొనవలదు. భావ్! ఏమిజరిగినదో అది మేలునకే. అతఁడు నూతన తనువునఁ బ్రవేశించెను. అతఁడీ నీవు చూచు తనువున చేయఁజాలని గొప్పగొప్ప పనులా నూతన తనువునఁ జేయఁగలఁడు. నేనాతని ఈతనువు లోనికి ఆకర్షించితినా ఆతనువు మృతినొందును. ఈ తనువు పునర్జీవిత మగును. నీకొఱకు నేనీపనిఁ గావింతును – కాని, దాని పర్యవసాన మాలోచించితివా? దాని బాధ్యత విషయమై నీకేమేని యోజనకలదా? నీవా బాధ్యత వహింపసిద్ధపడుదువా?

హ. సీ. దీక్షిత్తు తనకోరిక విషయమైన పట్టుదల విడిచెను.

## c) పగిలిన పెదవిగల బాలిక

322. 1913లో యస్. బి. మోహితే, డాక్టర్లకు సాధ్యము గాని, ప్రీలిన పై పెదవిగల తనపుత్రికను చక్కఁబఱపించుకొనుటకై బాబా దగ్గఱకుఁ గొనిపోయెను.

సా. బా:- నీవెందుకు వచ్చితివో నేనెఱుఁగుదును. నేనీ బిడ్డను చక్కఁబఱుపఁగలను. కాని, ప్రయోజనము లేదు. ఈ బిడ్డ దైనసంపద గలది, ఈ బిడ్డ ఆయుఃప్రమాణము మిక్కిలి స్వల్పము. రాఁబోవు మాఘ శుద్ధ చతుర్దశినాఁడు (మార్చి 1914) ఈమె తనువును విడుచును. నీవా దినమున నింటనుండక ఆఫీసుకు వెళ్ళినయెడ నీవు తిరిగి వచ్చునప్పటికి బిడ్డను సజీవముగఁ జూడఁజాలవు.

తండ్రి ఆఫీసులోనుండగ బాబా తెలిపిన దినముననే ఆమె మృతినొందినది.

## d) అప్పాకులకర్ణి

323. (=314) సా. బా:- (అప్పాకులకర్ణితో) బందిపోటు దొంగలు గ్రామమునఁ బ్రవేశించినారు. నీవే వారి మొదటి లక్ష్యమగు దువు. ప్రధానవస్తువులను చేజిక్కించు కొనుటయే వారి ఆశయము. వీనినిఁదీసికొని పాఱిపోవుదురు.

ఇది కలరావ్యాధి శిర్డిలో ప్రవేశించు విషయమునుగూర్చి తెలుపఁబడినది. అప్పాకులకర్ణియే దీనికి మొదటిబలి. అప్పా ఈవిషయ మును అపార్థముఁ జేసికొని చావడిలోనుంచిన 'సర్కారుపైకము' అని తలంచి దానికి ప్రత్యేకముగ 'కాపలా' పెట్టినాఁడు. అప్పాకు కలరావ్యాధి సోకి మృతినొందెను.

323. A. అప్పాకులకర్ణి భార్య:- (ఏడ్చుచువచ్చి) బాబా! నా భర్తను బ్రతికింపుము.

సా. బా:- అమ్మా! అప్పాను పోనిమ్ము. ఆతని నాపవద్దు, నా కుప్పీని నేను విడుచుచుందు ఆతఁడు తన కుప్పీని విడుచుచున్నాఁడు. అటుల అతఁడు వెళ్ళుట ఆతనికిమేలు.

## మృతిని తప్పించుయత్నము - బుద్ధిసాధనము

324. 'నిగోజి' పటేల్‌భార్య ప్లేగు వ్యాధివలన ప్రమాదస్థితి యందుండెను. ఆరాత్రిబాబా భగత్‌మహల్సాపతితో చావడియందుండెను.

సా. బా:- భగత్! ఈరాత్రి నిద్రింపకుము. నిలిచి కనిపెట్టియుండుము. నేనీదినమున దైవమును స్మరించవలె ఆకఠిన రోహిల్లా (మృత్యువు-ప్లేగు) ఆకాంతను చంపగోరు చున్నది. నేను అల్లాను ప్రార్థించు చున్నాఁడను.

బాబా ప్రార్థనములకు ఏవిధమైన అంతరాయము - భంగము కలుగకుండమహల్సాపతి జాగ్రత్తవహించుచుండెను. కాని, ఆరాత్రి 'నివాస్' మామ్లత్‌దారుఆతపని సేవకులతోవచ్చెను. ఆసేవకులు ఆర్భాటముచేయుచు మామ్లత్ దారునకు బాబాదర్శనము కావలయును - అనిబిగ్గఱగ అఱచు చుండిరి. మహల్సాపతితో వారిసంభాషణ - మహల్సాపతి "ఊధీ" తీసి యిచ్చుట ఇవన్నియు బాబా ధ్యాననిష్ఠకుభంగము గలిగించినవి. బాబా కోపించి మహల్సాపతిపై వస్త్రమునావల విసరివైచెను.

సా. బా:- (మిక్కిలిగ దూషించినతరువాత) ఓయీ! భగత్! నీవొకకుటుంబమునకు తండ్రివేనా? "నిగోజి" గ్రామములో నేమి జరుగు చున్నదో నీవుగుర్తించుటలేదు. (పటేల్‌భార్యకు ప్లేగుతగిలినవిషయము.) ఆట్టిపరిస్థితులలో జనులనేలరానిచ్చితివి? - కానిమ్ము - ఏమిజరిగినదో ఆది మంచికే!

## ఆరాత్రి పటేల్ భార్యమృతినొందెను.

325. సా. బా:- (ఇరువురుబిడ్డలను గోల్పోయి ఒక కుమారు నకు జబ్బుగానున్నపుడువచ్చిన, దామోదర్ బి. రాంపూర్‌కర్‌తో) నీవేల

భయపడుచున్నావు? గతించినవారు గతించిరి. ఉన్నవారితో తృప్తినొందుము. భయపడకుము. నీవెంట నేనులేనా? ఇంకేమి?

326. సా. బా:- (కుమారై మరణించిన సమయమున హ. సీ. దీక్షిత్తుతో) ఆధ్యాత్మ రామాయణమున శ్రీరాముఁడు మండోదరిని ఓదార్చుఘట్టము చదువుము!

## బాబా - మృత్యువును తప్పించుట.

### (a.) అభినవమార్కండేయుఁడు.

327. 1917 మే - జూన్ నెలలలో ఒక బొంబాయికాంత - ఆమె చిన్న కుమారుఁడు బాబాయెదుట మధ్యాహ్న హారతి సమయమునఁ గూర్చుండిరి.

సా. బా:- (బాలునికో) నీవు సరిగ మధ్యాహ్నము 2 గంటల కిక్కడకు రావలయును.

బాలుఁడు:- అలాగే - బాబా!

సరిగ పగయి 2 గంటలకాబాలుఁడు ద్వారాకామాయి మసీదునకుఁ జేరెను.

సా. బా:- బిడ్డా! ఇక్కడకురమ్ము. ఈ చాపపై నాపాదముల దఱిఁ గూర్చుండుము.

నా పాదములొత్తుచు నేను తెలుపునంతవరకు నాపాదముల విడువకుము.

ఆవిధముగ ఆబాలుఁడు బాబా పాదముల నొత్తుచుండెను. పగలు 3 గంటలకు వెంట్రుకలు విరియఁబోసికొనినతల, మలినమైన ముఖము వెలికిప్రేలాడు పొడవైననాల్కతో నొక భయంకరమైన స్త్రీరూపము ప్రహరిగోడనుదూకి కుక్కనడక ననుకరించుచు ఆబాలుని సమీపించి యిట్లనెను.

"ఈతఁడు నాకుకావలయును"

సా. బా:- నేనీతనినీయను.

ఆమె:- నాకుకావలసినది యీతఁడే. ఆమెఆబాలునిఁ జేరిలాగెను. బాబాలేచి కోపోద్రిక్తుఁడై, ఆబాలునొకచేతఁ బట్టుకొని, ఆ వికటరూపిణి యురమున నొకతన్నుతన్నెను. ఆమెపెద్దగ మొఱపెట్టుచు పాఱిపోయెను.

సా. బా:- బిడ్డా! నీవు గమనించుటలేదా? ఆవచ్చిన స్త్రీని నీ వెఱుఁగుదువా? అహో! ఆమె నిన్నీయుమని కోరుచున్నది. కాని నేనెటుల నీయఁగలను? నేను నిరాకరించితిని.

బాలుఁడు:- ఇది జరుగుచుండగ కుక్కిరి మిక్కిరిలాడక మౌనముగ బొమ్మవలె కూరుచుంటిని. నేనంతయుఁ జూచితిని. కాని, నాదేహము మొద్దుబాఱినది.

(ఆ వికటస్త్రీరూపము కలరాదేవతయని బాబా తెలిపెను. ఆ మరునాటి ఉదయమున బాబాఆబాలుని, తల్లిని తిరిగి బొంబాయికి వెళ్లుఁడని ఆజ్ఞాపించెను. అంతట శీర్డిలో కలరా వ్యాధి విజృంభించెను.)

## (b.) బాబా నిర్యాణము

i 1886 లో బాబా ప్రపంచమును విడనాడు మొదటిప్రయత్నము.

328. 1886 లో బాబా మహల్సాపతితో నిట్లనెను. "నేను అల్లా దగ్గఱకు పోవుచున్నాఁడను. ఈతనువును 3 దినములు కాపాడుము. నేను తిరిగి వచ్చితినా - నావిషయమును గూర్చి నేనుజాగ్రత్తపడుదును. నేను తిరిగిరానా - (అచటనెలువలనొకప్రదేశమును వ్రేలితోచూపుచు) ఆప్రదేశమున ఈతనువును భూస్థాపితముచేసి, యీతనువుస్థాపితమైన చోటును తెలుపునటుల అచటరెండు జెండాలనుపాతుము".

అంతట బాబా శ్వాస, నాడిచలనము, రక్తప్రసారము స్తంభించెను. ఆశరీరమొక శవమయ్యెను. గ్రామాధికారులు - పోలీసులు పంచా

యితీజరిపిరి. ఆతనువును భూస్థాపితము చేయుమని వారు మహల్సాపతిని ఆజ్ఞాపించిరి. అది శంకరాచార్యుల విషయమునఁగలిగిన మహావిపత్తు ఇపుడు బాబా తనువునకుఁగలిగినది శంకర భగవత్పాదుల విషయమున ఆతనువును దైవముకాపాడెను. ("లక్ష్మీనృసింహమమదేహికరావలంబమ్") మహల్సాపతి పట్టుదలపూని బాబా తనువును ఎవ్వరినిఁదాకనీయలేదు 72 గంటలు గడచినతరువాత బాబా తనువునకు చైతన్యముకలిగెను. శ్వాస ప్రారంభమయ్యెను. పొత్తికడుపు చలించెను. బాబాకనులు తెఱువఁబడెను. బాబా పునర్జీవితుఁడయ్యెను.

## ii 1916

329. 1916 అక్టోబరు. విజయదశమినాఁడు బాబా మహాకోపావేశముననుండెను. తనదుస్తులనన్నిటిని చింపి, తునియలు తునియలు చేసి, ముందున్న "ధుని" – అగ్నియందు పడవేసి, పూర్ణముగ దిగంబరియయ్యెను. అగ్నికణములవలె ఎఱ్ఱగ ప్రజ్వరిల్లు నేత్రములతో నిట్లు బిగ్గఱగఁబలికెను. "మీరందఱు ఇటురండుఁ చూడుడు! నేనుమహమ్మదీయుఁడనో–హైందవుఁడనో చూచి మీరేనిర్ణయించుకొనుఁడు!"

అటుల కోపావేశమున 2 గంటలు గడచినతరువాత భగోజిసింధి (కుష్ఠురోగియైన బాబా అనుచరుఁడు) ధైర్యమువహించి, బాబా మొలకొక లంగోటినికట్టి యిట్లనెను. "బాబా ఇదంతయు ఏమి? ఈ దినము సీమోల్లంఘన పర్వదినముఁగదా!" అంతట బాబా తన 'సట్కా' – (చిన్న బెత్తము) తో నేలపై చఱచుచు "అవును! ఇది నాసీమోల్లంఘనము – నా జీవితపరిమితి నుల్లంఘించుట."

జనులు బాబా అభిప్రాయమపుడు గ్రహింపఁ జాలరైరి. కాని, 1918 సంవత్సరమున విజయదశమినాఁడే బాబా తన భౌతిక జీవిత పరిమితిని ఉల్లంఘించినాఁడు.

1916. విజయదశమికిఁ బూర్వము బాబా మిక్కిలిగ వ్యాధి గ్రస్తుఁడయ్యెను. బాబా మరణింపనున్న వాఁడను జన ప్రవాదమన్ని ప్రాంతముల వ్యాప్తమయ్యెను. బాబా ఆరోగ్యప్రాప్తి కొఱకు భక్తు లందఱు 'సప్తాహము' జరిపి, పేదలకన్న దానముగావించిరి. తరువాత బాబా తిరిగి స్వస్థతఁగనెను. కాని, నానాసాహెబ్ నిమోన్కర్ పూనాకు వెళ్ళుచు బాబా దగ్గఱకుఁజేరెను.

సా. బా:— నానా! నీ విక్కడ నిలువుము! నన్ను భూస్థాప నము చేసిపొమ్ము!

బాబా – నానానిమోన్కరును తిరిగి అతని స్వగ్రామమగు 'నిమోన్' నకుఁగాని, పూనాకుఁగాని వెళ్ళుట కంగీకరించలేదు.

నిమోన్కర్ పక్షమవలంబించి, శ్యామానిమోన్కరును వెళ్లుట కనుజ్ఞ నీయుమని ప్రార్థించెను.

సా. బా:- శ్యామా! నాబిడ్డలను చంపఁదలఁచితివా? కాకా (నానానిమోన్కర్) నీ అబ్బసొమ్ము ఏమైన తినిపోవు చున్నాఁడా?

శ్యామా:- కాని, బాబా! ఆతని కోడలు గర్భిణి. ఆమెకు సహాయమవసరము.

సా. బా:- (నిమోన్కరుతో) ఓయీ! కాకా! నీవు ఆందోళన చెందనేల? దైవము (అల్లా) కాపాడును. నన్నుపూడ్చి మఱి వెళ్ళుము!

అతని కోడలునకు సాయములేదు. ఒకనాటి రాత్రి 10 గంటలకు కొన్ని నొప్పులు కలిగెను. వెంటనే పూనాలోని పురపాలక ప్రసూతి వైద్యాలయమునకొక 'టాంగా' లో ఆమె కొనిపోఁబడెను. ఒకపాన్పుపై పరుండబెట్టిరి. అచటనున్న దాది 11 గంటలకు వేఱొకగదికి వెళ్ళెను. ఆమంత్రసానిలేని సమయమున ఏ సహాయముతో నిమిత్తములేకయే ఆమె మగశిశువును ప్రసవించెను. ఆ సమయమున శిర్డిలో బాబా, నిమోన్క రుతో నిట్లనెను. "ఒక కాంతకలదు ఆమె ఒకచోటునకుఁ గొనిపోఁబడెను. అచట నామె మగబిడ్డను కనెను."

## iii 1918 లో బాబా — మహానిర్యాణము.

330. కొన్ని నెలలకుఁబూర్వము బాబా ఉద్ధవేశభావుతో పక్షపక్షమునందన్ను సందర్శింప రావలదని తెలిపి, కడసారి వీడ్కో లొసంగెను. దసరాకు పూర్వము చాలదినములనుండి బాబా - తాత్యాపటేలు - ఇరువురు జబ్బుగానుండిరి దసరాలో తొలుతటి దినములలో నితరుల నాధారము చేసికొని నియమిత గృహములకేగి బాబా భిక్షఁగొనివచ్చెను. చివర రెండు మూఁడు దినములలో బాబా వెలుపలకు వెళ్ళఁజాలక పోయెను.

15—10—1918 నాఁడు - విజయదశమినాఁడు మధ్యాహ్న హారతి పూర్తి అయిన పిదప

సా. బా:- మీరు (కాకా (హ. సీ దీక్షిత్) బూటీ మొదలగువారు) మీ భోజనములకు పొండు!

అపుడు వారు వెళ్ళిరి. బాబాతనగద్దెపైఁ గూర్చుండి 'బయ్యాజి'ని ఆనుకొని "నేను వెళ్ళుచున్నాను. నన్నువాడకుఁ గొనిపొండు. బ్రాహ్మణులందఱు నాదగ్గఱనివసింతురు." అని, తుది యూర్పు విడిచెను.

నానా నిమోన్కరు బాబా నోటిలో నీరు పోసెను. కాని, ఆనీరు వెలుపలకు వచ్చెను. అపుడు పగలు 3 గంటలయ్యెను. అది విజయదశమి దినమే, కాని, అప్పటికి ఏకాదశి ప్రారంభ మయ్యెను.

తన నిర్యాణమును ముందుగా గుర్తించిన బాబా ఆదశమి ఉదయమున దానములు బహూకరించెను. తన గద్దెపైఁ గూర్చుండి, ప్రతిదినము ఆహారములు సిద్ధపఱచి బాబాకుఁదినఁబెట్టుచు, ప్రతిదినము బాబావలన 4 రూపాయలు స్వీకరించు లక్ష్మీబాయిసింధేకి, బాబా తన జేబునుండితీసి మొదట 5 రూపాయలు, తరువాత 4 రూపాయలు ఇచ్చెను.

ఇంతకుఁ బూర్వము ఫకీరులకుఁ దినఁబెట్టుటకు, పుణ్యక్షేత్రముల వాజ్యములు మొఱయించుటకు 200/- రూపాయలు పంపెను. మఱియొక ముస్లిం సాధువునకు ఇటుల సందేశ మంపెను.

"అల్లా వెలిగించిన దీపమును ఆతఁడు తీసికొని పోవు చున్నాఁడు."

[ఆసాధు వావార్తను అశ్రుధారతో స్వీకరించెను (= 330. A.)]

బాబా జబ్బుగానున్న 14 దినములు "రామవిజయము" పఠింపఁ బడినది. దసరా. 9, 10, 11 వ దినముల బాబాచక్కఁగ వినునట్లు చదువఁ బడెను. అది మృత్యుంజయ ప్రీతికరమని బాబా పలికినాఁడు.

దసరాపండుగనాటిరాత్రి బాబా లక్ష్మన్ మామకు స్వప్నమున గోచరించి "వేగములెమ్ము, నా (కాకడ్) ప్రభాత హారతి కావింపుము. 'జోగ్' నేను మృతినొందితినని తలంచు చున్నాఁడు. ఆతఁడురాఁడు"- అనిచెప్పెను,

ఆ మఱునాఁడు మౌల్వీలు ఆక్షేపణ తెలుపుచున్నను లక్ష్మన్- ద్వారకామాయిమసీదునకు వెళ్లి, ప్రభాత హారతి కావించినాఁడు. 16-10-1918-మధ్యాహ్న హారతిని "జోగ్" యథావిధిని గావించెను.

## తనమహాసమాధి సమీపించుచుండెననిబాబాతెలుపుట.

330. A. సా. బా:- (ఛోటాఖాన్‌తో) ఈపూలమాలను ఫకీర్ బన్నేమియా గళమునసుంచి, "(ఇక్కడ) అల్లానిలిపినదీపమును అల్లా కొనిపోవుచున్నాడు"- అనిచెప్పుము. మౌలానా, కావిషయము 15-10-18కి కొలఁది దినములకు పూర్వము తెలుపఁబడినది. అపుడాఫకీరు అశ్రువుల స్రవించెను.

## iv. బాబాసమాధి - దేవాలయము.

ఒకనాటిరాత్రిబాబా, గోపాలరావుబూటీని ఒక (వాడ) భవనము - దేవాలయము నిర్మించుమని కోరినట్లు, శ్యామా, బాపూ సాహెబ్‌బూటీ ఇరువురుకలఁగనిరి.

హ. సి. దీక్షిత్, శ్యామాతోకలిసి, యీవిషయమై తెలిసికొనుటకు బాబాదగ్గఱకువెళ్ళెను.

శ్యామా:- దేవా! ఎట్టి అద్భుతచిత్రములను నీవుసంఘటించు చున్నాఁడవు!

సా. బా:- (చెవులుమూసికొని) నేనునాస్థానములోనే యున్నాఁడను. నేనెవ్వరికి నేమియుఁజెప్పుటలేదు.

వారుభవన నిర్మాణమునకు అనుజ్ఞనీయుమనికోరిరి. బాబా అనుమతినిచ్చెను.

తరువాత బూటీ ప్రత్యేక గర్భగృహములేకయే ఆభవనము చావడిమధ్య మురళీధర విగ్రహమును ప్రతిష్ఠింపఁగోరి బాబా అంగీకారము నర్థించెను.

సా. బా:- ఆదేవాలయము నిర్మింపఁబడిన తరువాత అక్కడ మనమునివసింతము.

(1918 లో బాబా జబ్బుపడి చివర గడియసమీపించు చుండగా, బయ్యాజీ పటేల్‌తో మఱియితరులతో బాబా యిట్లనెను "నేనువెళ్లు చున్నాను. నన్ను (బూటీ) వాడు యందుంచుఁడు, బ్రాహ్మణులు నా సమీపమునను౦దురు."

బాబా నిర్యాణమొందిన తరువాత బాపూసాహెబ్ బూటీ ఆ వాడలో నివసించుటకుగాని, అందుమురళీధరుని ప్రతిష్ఠించుటకుగాని కాంక్షింపలేదు, ఆవాడలో బాబా భౌతిక తనువును సమాధి చేయుటకే అంగీకరించెను.

బాబా భౌతిక తనువును సమాధిచేయు విషయమై హైందవులకు మహమ్మదీయులకు తీవ్రభేదాభిప్రాయము లేర్పడినవి. ఆతాలూకా మామ్లత్ దారు 'మహజరు' రూపమున జనవాక్యము సేకరించుఁడని ఆజ్ఞాపించెను. అత్యధిక సంఖ్యాకులుగ హైందవులు బాబా భౌతికతనువును

'ఖూటీవాడ' లో సమాధిచేయుండని తమ (వోటు) సమ్మతిఁ దెలుపుటచే ఆవిధమునఁగావింపఁబడినది. బాబా సమాధియైనాఁడు శీరిడియందు ఖూటీవాడలోకలదు.

## సద్గతి.

### 1. గ్రుడ్డివాఁడు

332. ఒకగ్రుడ్డివాఁడు తనకు చూపును ప్రసాదింపుమని బాబానుజేరి వేడెను. బాబా ఆతని కోరిక ననుగ్రహింపమని కారణమున అతఁడు మసీదునివిడిచి అపుడు ఖండోబా దేవాలయమున నున్న ఉపాసనీ బాబానుచేరి ప్రార్థించెను. "నీయీస్థితిలోనున్నవానికి "ప్రాకృత దృష్టి" ప్రసాదించిన లాభములేదు, దానివలన నీకోరికలు హెచ్చునేగాని తగ్గవు. కావునఆధ్యాత్మిక దృష్టి - లోనిచూపు - ప్రసాదింపుము - అని, బాబాను కోరుము - పొమ్ము" అనిఉపాసనీబాబాతెలుప అగ్రుడ్డివాఁడు ద్వారకామాయినిఁజేరి "బాబా! నాకుప్రాకృతదృష్టి వలదు. నాకు నీ ఆశ్రయమొసఁగి "లోనిచూపు" ప్రసాదింపుము-అనికోరెను.

సా. బా:- ఇక్కడనిలువుము?

అగ్రుడ్డివాఁడచట నెలదినములుండెను. ఆధ్యాత్మికముగ వృద్ధి నొంది మరణించెను.

సా. బా:- ఈతఁడు మరణింపలేదు. ఈతని భార్యయే (అజ్ఞానమే) మరణించినది. ఇతడు సద్గతి నొందినాఁడు.

### 2. యల్. కె. నూల్కర్.

333. 1909లో నా. గో. చందోర్కర్ పండరిపురమున డిప్యూటి కలెక్టరుగ నున్నపుడు లక్ష్మన్ - కే నూల్కర్ అచట 'సబ్జడ్జి' గానుండెను. శీరిడికివెళ్ళి బాబా దర్శనము చేసికొనుమని చందోర్కర్ నూల్కరును ప్రేరేపించెను.

నూల్కర్:- నాకు వంటబ్రాహ్మణుఁడు, బాబాకు సమర్పించుటకు నాగపూర్ నారింజఫలములు లభించినగాని నేను వెళ్ళఁజాలను. ఈరెండు నిచట లభింపవు.

నా. గో. చం:- బాబా అనుగ్రహమున నీకవి లభ్యములగును.

ఆరాత్రి ఒక వంట బ్రాహ్మణుఁడు నా. గో చందోర్కరు దగ్గఱకువెళ్ళి, తన కెక్కడనేని పనిచూపింపుఁడని కోరనతఁడా బ్రాహ్మణుని నూల్కరు దగ్గఱకు పంపెను. నూల్కరాతని తన దగ్గఱ వంటమనిషిగ నుంచుకొనెను. ఉదయమున నాగపూరు నారింజపండ్లు నిండుగగల ఒక బుట్ట 'బంగీ' నూల్కర్‌నకుఁజేరెను. అవి ఎచటనుండి యెవరుపంపిరో తెలియదు. ఎట్లైననేమి! బాబా అద్భుతశక్తి సమర్థతలను గుర్తించి, తన కోఱతలుతీరిన నూల్కరు నా. గో. చందోర్కరుతోఁ గలిసి శీరిడికిఁజేరి బాబాను సందర్శించెను.

సా బా:- నానా! నీ వెంటఁగొనిరాఁబడి, మిక్కిలి వెఱ్ఱివాఁడని పేరెన్నికకన్న ఈతఁడెవఁడు?

మఱునాఁడు నూల్కరు మసీదునకు వెళ్ళగా బాబా కోపోద్రిక్త స్థితియందుండి, ఆనూల్కరు ఆనూల్కరు తలనుపట్టుకొని, ఒక స్తంభమునకానించి కొట్టుచు – "తుఝాసత్యానాశహో ఇల్" (నీ ఉనికి లేక సత్యము నాశనమగును–లేక–నీ అసత్యము నాశనమగుగాక!)

నూల్కర్ మిక్కిలి భయపడెను. కాని, చందోర్కర్ ఆజరిగిన విషయములఁగూర్చి అవి సకలము శుభ సూచకములేయని వివరించి తెలిపెను.

ఆరాత్రి నూల్కర్ అదాటునలేచి, తాను సాధారణముగ నుపయోగింపకున్నను, పాన్‌బీడా – ఆకుబీడా కావలయునని చందోర్కరును కోరెను. అపుడు బాబా దూరమున మసీదు నందుండెను.

సా. బా:- (అచటనున్న ఒకనితో) ఈ నాలుగు ఆకుబీడాలు తీసికొని వెళ్ళి, చందోర్కరుతోఁగూడి ఆకుబీడాకొఱకు నిరీక్షించు ఆముసలి వానికి వీనిఁనీయుము.

తానుకోరిన వెంటనే ఆమనిషివచ్చి ఆకు బీడాలందించుట నూల్కరునకు - బాబా తన 'అంతర్యామి' - అను నిశ్చయముగలిగి, బాబాయందు గాఢవిశ్వాసము పెంపొంది యతఁడు శిర్డియందేయుండెను. నూల్కరునకు అవసాన కాలము సమీపించెను. సద్గ్రంథము లాతనికి వినబడునట్లు చదువఁబడెను. బాబా పాదతీర్థమాతనికీయఁబడెను. బాబా యందు దృష్టినిలిపి, బాబాను ధ్యానించుచు నూల్కరు ప్రాణముల విడిచెను.

సా. బా:- (నూల్కర్ మృతినిఁగూర్చి తెలుపుచు) తాత్యా (నూల్కర్) (మనకంటె) ముందుగ వెళ్ళినాఁడు. నేను నియమించి నటుల నతఁడిచటనుండెను. ఆతఁడు (గన్యమను) సద్గతిని పొందినాఁడు. ఇఁక ఆతనికి జననము లేదు.

## (3) విజయానందస్వామి.

334. మద్రాసు నివాసియగు విజయా నందస్వామి మద్రాసు నుండి మానస సరోవరమునకు తీర్థయాత్రకై బయలుదేరెను.

మార్గమధ్యమున నతఁడు శిరిడిఁజేరి బాబాను సందర్శించెను. అచట హరిద్వారమునుండి వచ్చిన సోమదేవస్వామి నతఁడు కలిసెను. ఆ సోమదేవస్వామి మానససరోవరతీర్థయాత్ర యందలి కష్టములను - గాఢమైనమంచు, నూరునూరు మైళ్ళనువేఱు వేఱు భాషలు, మార్గము భూటానుద్వారాకలదు. కావున ఆభూటాన్ దేశజనుల దుష్ట స్వభావములను గూర్చితెలిపి, ఆ మద్రాసు వాసిని భయచకితునిఁ గావించెను.

ఆతరువాత విజయానందస్వామి, బాబాదగ్గరకువెళ్ళగా "ఈవ్యర్థుఁడైనసన్యాసిని బయటకు వెడల నడుపుము!" అని, బాబా కఠినముగఁబలికెను.

ఆతడు మసీదు వెలుపలకు వెళ్ళెను. కాని, మంటపము దగ్గఱనిలిచి, బాబాను వీక్షించుచుండెను. సాయిబాబా యందతనికి విశ్వాసము పాదుకొనెను. ఆపిదప బాబా అతనిననుగ్రహించెను. కొన్నిదినములు గడచిన వెనుక "అతని తల్లి మిక్కిలి జబ్బుగనుండెననియు, వెంటనే మద్రాసునకు తిరిగివచ్చి, తన తల్లిదగ్గఱ నుండవలయుననియు," అతనికొక ఉత్తరము చేరెను. ఆసన్యాసి తిరిగివెళ్ళి తన తల్లి చరమ కాలమున దగ్గఱనుండవలయునని తలంచి బాబా అనుమతిని అర్థించెను. ఆసన్యాసి కంటె నాతని భవిష్యత్తును బాబా లెస్సగా ఎఱింగిన వాఁడగుటచే "నీవు నీ తల్లిపై నింత ప్రేమగలవాఁడవేని నీవీ సన్యాసివేషమేల ధరించితివి? కావివస్త్రములకు - మమతకు సంబంధములేదు. పొమ్ము! నీవిడిదియందుఁ గూర్చుండుము. ధైర్యము వహించి, కొన్ని దినములు వేచియుండుము. భవిష్యత్తునుగూర్చి తదుపరి విచారించుదము. నీవాడ (విడిది) లో పలువురు దొంగలు కలరు. తలుపులు గడియలు వేసికొని జాగరూకత కలిగియుండుము. వారు సకలమునపహరింతురు. ధనము బంధు మిత్రాదులు మొదలగునవి అస్థిరములు. భయకారణములు. సంపూర్ణవిరక్తియే మోక్షమునకుఁజేర్చునది. రేపటినుండి 'భాగవత సప్తాహము' ప్రారంభింపుము. తనూవాఙ్మనముల నియమించి, ధ్యాననిష్ఠగలిగి మూఁడు సప్తాహములను గావింపుము. అది సకల వాసనలను క్షయింపఁజేయును. భ్రాంతి నశించును." అని, బాబా బోధించెను.

ఆమఱుదినమునుండి విజయానందస్వామి చక్కని నిష్ఠతో భాగవతపారాయణ సప్తాహము ప్రారంభించెను. రెండు సప్తాహములు (14 దినములు) పూర్తిఅయిన పిదప నతఁడు మిక్కిలిడస్సి, దుర్బలుఁడయ్యెను. అందుచే రెండు దినములతఁడు విడిదియందుఁగడపెను. మూఁడవదినమున "బడేబాబా" తొడమీద తలఁజేర్చి పరుండి ప్రాణములు విడిచెను.

అతని అవసానకాలమెఱిఁగి, బాబా, ఆ విజయానందునకు 'సద్గతి'ఁగూర్చిన విధమిది.

## (4) యస్. బి. ధుమాల్ సతి.

335. సా. బా:- (యస్. బి. ధుమాల్‌తో) ఈ మాఘ నీభార్య మాసికము శీర్డియందు జరుపుము. ఆమెకు సద్గతినిఁ బ్రసాదింతును. (ఆవిధముగ మాసికము జరుపబడెను.)

## (5) ఉపాసనీ మహారాజు సతి.

336. 1912 జనవరిలో ఉపాసనీబాబా సతి మరణించి నపుడాతఁడు మిక్కిలి వ్యాకులపడి, బాబాను సమీపించి, "బాబా! ఇవిగో 10 రూపాయలు నాసతికి సద్గతిఁ గలిగించుట కేదేనిఁ గావింపుము:" అనెను.

సా. బా:- ఆధనముంచుకొనుము. ఆమె (ఆమె ఆత్మ) ఈవరకే నన్ను జేరినది. నీ దగ్గఱనుండి తీసికొనఁదగినది యీవరకే తీసికొనఁ బడెను.

## (6) జంతువులకుసద్గతి — ఒకగేదె.

337. సా. బా:- (జోగ్‌సతితో) నీ దగ్గఱకొక గేదె వచ్చును. దానికి నేతితో సమృద్ధిగ సిద్ధపఱచిన పూరణపోలీలను తృప్తిగ పెట్టుము.

జోగ్‌సతి:- బాబా! ఆగేదెను నేనెట్లు గుర్తింపఁగలను?

సా. బా:- అది తనకుదానే నీతలుపుదగ్గఱకు వచ్చును.

జోగ్‌సతి:- అనేకములగు గేదెలు నా తలుపు ప్రక్కగ పోవు చుండును.

సా. బా:- నీవు చేయఁదలచిన పూరణపోలీలన్నియు పూర్తి యైనపుడు నీ తలుపు దగ్గరకువచ్చు గేదెయే నేను చెప్పునది.

జోగ్‌సతి:- బాబా! నాయింటికి ఉత్తరమున దక్షిణమున రెండు తలుపు లున్నవి.

సా. బా:- అది దక్షిణపు తలుపుదగ్గఱ నుండును.

ఆరోజు మధ్యాహ్నమునకు జోగ్‌సతి పూరణపోలీలను నేతితో అలది సిద్ధపఱచెను. అప్పుడే ఒక గేదె ఆమె దక్షిణపు తలుపుదగ్గఱ నుండెను. ఆపూరణపోలీలన్నియు నామె దాని ముందుంచెను. ఆ పశువు వాని నన్నిటిని తిని క్రిందపడి చచ్చెను. పరలోకమున ఆమెకుఁ గలుగ నున్న పాప శిక్షనుగూర్చి, యిచట ఆగేదె యజమానివలన, ప్రభుత్వము వారివలన తనకుఁ గలుగనున్న బాధలనుగూర్చి తలచుకొని ఆజోగ్‌సతి భయకంపితయయ్యెను. ఆమె బాబాను సమీపించి, జరిగిన విషయ ములగూర్చి, అమె భయములనుగూర్చి చెప్పుకొనెను.

సా. బా:- ఆగేదెకు నేతితో బాగుగ అలదబడిన పూరణపోలీలను తినవలయునను వాసనతప్ప తక్కిన వాసనలన్నియు నిదివరకే క్షయించి నవి. ఆ కోరికయు తీరిన పిదప దానికి సకలవాసనా క్షయమగుటచే ఆగేదె తనువును విడిచిపెట్టెను. ఇంటికి పొమ్ము! నీవు కలతపడవలసిన నిమిత్తములేదు. ఈ తనువునుండి దానికి విముక్తిఁగల్పించిన దానవు.

బాబా అభిప్రాయము.

337. A. యం, బి. రేగే–బిడ్డకు సద్గతి. 1914 న యం. బి. రేగే – గర్భవతియైన తన భార్యాతోఁగూడి, బాబాను దర్శించెను. ఆపుడు బాబా "నాబహుమతులలో నొకటి మీదగ్గఱఁగలదు" అని, పలికెను. బిడ్డ జన్మించిన తరువాత ఆ బిడ్డను వారు బాబాదగ్గఱకుఁ గొనిపోయిరి.

సా. బా:- (రేగేతో) ఈబిడ్డనావాఁడా? నీవాఁడా?

రేగేసతి:- బాబా! నీవాఁడే.

సా. బా:- నాకుఁగా నీదగ్గఱనుంచుము!

18 నెలల తరువాత ఆ బిడ్డమరణించుస్థితిలో నుండెను. "ఈబిడ్డను స్వీకరించి, నీపాదములదరిఁ ఈబిడ్డకు ఆత్మశాంతి ప్రసాదింపుము- ఈబిడ్డయొక్క శేషించినకర్మము నన్ననుభవింపనిమ్ము-" అని రేగే- బాబాను ప్రార్థించెను. అంతట ఆబిడ్డచిఱునగవు మోమునతోప యోగివలె బ్రహ్మరంధ్రము మార్గమున ప్రాణములఁ విడిచెను. రేగెకొంత కాలముతరువాత శిర్డికిఁజేరఁగా

సా. బా:- (అచటవారితో) ఆబిడ్డనాది. ఈతఁడు (రేగే) ఆబిడ్డను కాపాడనియ్యకొనెను. ఒకదినమున"వీనిని నీదగ్గఱనుంచుకొనుము. ఆకర్మము నేననుభవింతును." అనినాఁడు. నేను తీసికొనియిచట (హృదయమును జూపుచు) ఉంచుకొనినాఁడను. అతఁడిచట శాశ్వతముగనుండును.

## శక్తులు — సమర్థతలు

### శక్తులు — సిద్ధులు — (లేక) యోగమార్గము.

338 సా. బా:- (ప్రాణాయామాదుల నభ్యసించి కొన్ని యోగ శక్తులసంపాదించి దూరమున నతని యంత్రశాల తగులఁబడుచుండగ, తనధ్యానమందిరమున అగ్నిని జూడఁ జాలినవానితో సిద్ధులచే నాకర్షింపఁబడుట వలని అపాయములఁ గూర్చి తెలుపనెంచి,) వేశ్యాప్రదర్శనములనేల ఆసక్తితో చూచుచున్నాఁడవు? నే నెప్పుడు తమాషాలను ప్రదర్శింపఁ జాలను. వేశ్యతో ముద్దులాడుట మనకెప్పుడుతగదు.

## బాబా-దృష్టిని తిరిగి ప్రసాదించుట

339. 1916లో విఠ్ఠలరావు - వై - దేశపాండే సంపూర్ణముగ అంధుఁడైన తనతాతను శిర్డికిఁగొనిపోయి రెండుచేతులు పట్టుకొని ఆయనను బాబాదగ్గఱకుఁజేర్చెను. ఆతాతసాగిలఁబడి మ్రొక్కి "బాబా! నేను చూడజాలను-" అనెను

సా. బా:- కలవు! నీవు చూడఁగలవు! 4 రూపాయలు దక్షిణనిమ్ము!

వి. వై. దేశపాండే 'కరెన్సీ' కాగితముమార్చి చిల్లర తెచ్చుటకు వెలుపలకు వెళ్లెను. ఆముసలివాని తలపైన బాబా తనహస్తమునిలిపెను. ఆతనికి సంపూర్ణముగ దృష్టితిరిగి ప్రసాదింపఁబడెను.

ముసలివాఁడు:- (ఆనందబాష్పములతో) బాబా! నీకరుణ అపారము. నీశక్తి అత్యద్భుతము. నేనిపుడు ప్రతి వస్తువును చూడఁ గలుగుచున్నాఁడను.

సా. బా.:- 'ఉధి' తీసికొని వెళ్లుము.

ఆముసలివాఁడు మసీదునుండి శిరిడిలోనికి, శీర్డినుండి బొంబాయికి, సంపూర్ణమగు దృష్టికలిగి, యేయితరుల సహాయము లేకయే వెళ్ళఁగలిగెను.

బాబా — (తాత్కాలికముగ) దృష్టినిప్రసాదించుట

'బాస్సీను' నుండి ఒకకాంత బాబాదగ్గఱకు జేరెను, ఆమె అంధురాలు. మసీదుఁజేరి, "బాబా! ఈనేత్రములతో నిన్ను చూడ వలయునని నాకోరిక"- అనెను. వెంటనే ఆమె బాబాను చూడగలిగెను. ఆమెవెలుపలకు వెళ్ళగ యథాప్రకార మామెకు అంధత్వము ప్రాప్తించెను.

## తుపానురాకడ గుర్తించుట.

340. 1914 వైశాఖమున బొంబాయినుండి 'భీమా' అనునతఁడు బాబాచమత్కారములనుకొన్ని చూడవలయునను తలంపుతో ద్వారకామాయి మసీదుఁజేరెను. మధ్యాహ్న హారతి అయినతరువాత.

సా. బా:- మీరందఱు వెళ్ళుఁడు, మీమీ విడుదులలోనే కూర్చుండుఁడు, వెలుపలతిరుగవలదు. మిమ్ముతిరిగి పిలువ నంపినపుడేరండు!

బాబా యీమాటలు పలికినపుడు వాతావరణము నిర్మలముగనే యుండెను. అంతలో ఇండ్ల కప్పుల రేకుల నెగురకొట్టి, యిండ్లను కూల్చివేయఁగల యంతభీభత్సకరమైన పెద్దగాలివీచెను. 15 నిమిషము

లైనపిదప ఆగాలితగ్గెను. కొలది నిముసములపాటు ఆకసమున మబ్బులు క్రమ్మి కొద్దిగవర్షించెను, తరువాత తీవ్రమగు సూర్యరశ్మి ప్రకాశించెను. అంతటబాబా వారినందఱంబిలువనంపి. "మీరు భయభ్రాంతులైతిరా?" అనెను. అపుడు 'భీమా' బాబా పాదములవ్రాలి ఆనందోత్సేకమున ఏడ్చెను.

సా. బా:- భయపడకుము. ఇది భగవానుని లీల - ఇట్టి లీలలనేకములను నీవు చూడఁగలవు.

## బాబా — తుపానును అధీనమునందుంచుకొనుట.

341. మఱియొక సమయమున తుపాను (గాలి—వాన) వీచు సందర్భమున (మేఘగంభీర ధ్వనితో ఆ తుపాను నుద్దేశించుచు) "ఆపుము! ఇదంతయు ఆపుము!" అని బాబా పెద్దగ ఆజ్ఞాపించెను.

కొలది నిమిషములలో ఆతుపాను తగ్గెను. ఇఁకగాలియు వానయులేదు. ఆకసము నిర్మలమయ్యెను.

## బాబా — అగ్నిని అధీనమునందుంచుకొనుట.

### (a) కొండాజీ గడ్డివామి

341. A సా. బా:- (ఒక దినమున మధ్యాహ్నమున) కొండాజీ! నీగడ్డివామిదగ్గఱకు పొమ్ము! నీవామికి నిప్పంటు కొనినది.

కొండాజీ దూరమునునన్న తన వామిదగ్గఱకు వెళ్ళి, అచట మంట లేమియుఁ జూడలేక తిరిగివచ్చి

కొండాజీ:- బాబా! అచట మంటలేదు. నన్ను తమాషాకొఱకు దూరముగ ఎండలోపంప దలఁచితివి. అంతేనా?

సా. బా:- ఇప్పుడు తిరిగి నీవెనుకవైపునకుఁజూడుము

ఆసమయమున ఆగడ్డివామిపైన పొగరేగుచుండెను. గ్రామములోని జనులు పరుగెత్తిరి. కొండాజీవామి తగుల్బఁడుచుండెను,

గ్రామములోని జనులు బాబానుజేరి, కొండాజీ వామిదగ్గఱంగల తక్కిన వారి పెక్కువాములను తగులంబడకుండ రక్షింపుమని ప్రార్థించిరి. (చూ. 603)

342. సా. బా:- (కొండాజీ వామిచుట్టు సన్నని నీటిథారతో గీటుగీచి) ఈ వామిమాత్రమే తగుల బడును. ఇతరము తగులంబడవు.

గాలి వీచుచున్నను, సమీపమున నితరములు పెక్కు వాము లున్నను ఆకొండాజీవామి మాత్రమే తగులంబడెను.

## (b) 'ధుని' లోనిమంట

343 సా.బా:- (ధునిలోని అగ్నిని ఉద్దేశించిమంటలు విజృంభించి పైకిలేచి, మసీదు పైకప్పు వాసముల అంటుకొనం బోవుచుండంగా 'సట్కా'తో దగ్గఱనున్న స్తంభమును కొట్టుచు) వెనుకకుపొమ్ము! వెనుకకు పొమ్ము! జాగ్రత! జాగ్రత!

ఆమంటలు వెంటనేతగ్గి యథాస్థితి యందుండెను.

## (c) బాబా — అగ్నిని — ఎండవేడిని అదుపునందుంచుట.

344. ఒక వేసవి మధ్యాహ్నసమయమున ఎండవేడిచే వాతావరణము అతిదుర్భరముగ నుండెను. ఐదుగురుతక్క తక్కిన వారందఱు మశీదువిడిచి వెళ్ళిరి.

సా. బా:- (ఆఏవురతో) మీరువెళ్ళి (ధుని) అగ్నిదగ్గఱం గూర్చుండుడు!

వారటుల కావించిరి. కొలది నిమిషములలో మసీదులోని వాతావరణము చల్లంబడెను. చల్లనివాయువులు వారికి విసరెను.

## బాబా — తనువువిడిచిన జీవాత్మలను అధీనమునందుంచుకొనుట— వానికి మార్గము నిర్దేశించుట

345 సా. బా:- నాస్నేహితురాలు ఒక బాలిక కలదు. ఆమె ఒకశిల్పి. ఆమె మరణించెను. సమాధిచేయబడెను. నేనామె సమాధి

ప్రక్కగఁబోవుచు, ఆగి, ఒకరాత్రి అచట గడపితిని. ఆమె ఆత్మ నన్నను సరించెను. ఆమెను మొదటనొక "బాబుల్" చెట్టునందుంచితిని. తరువాత శీరిడికిఁదీసి కొనివచ్చితిని.

## అనుగ్రహ విదర్శనము.

346. సి. కె. గాడ్గిల్. మఱియొక తావునకు బదలీచేయఁబడి. వెంటనే చేరవలసినదిగ ఆజ్ఞాపింపఁబడుటచే, రైలు పెట్టెలోఁగూర్చుండి, "బాబాను దర్శింపకయే వెళ్ళుచుంటిని" అని మిక్కిలి విచారపడెను, అదాటుగనతనితొడపై ఒక 'ఊధి' పొట్లము పడెను. తరువాత అతఁడు శీర్డికివెళ్ళినపుడు.

సా. బా:- (చిదంబర్ - కేశవ - గాడ్గిల్‌తో) నీవు రాజాలవైతివి. అందుచే నీకు ఊధి పంపితిని నీకు అందలేదా?

347 సా. బా:- (కుశభావ్‌తో) కుశభావ్! నన్ను తలంపుము. వెంటనే నీదఱి నుందును. (కుశభావ్ బాబాను ధ్యానించినపుడెల్ల అతని అంజలిపుటమునుండి 'ఊధి' (బాబా ప్రసాదము) వెలికి: ప్రవహించుచుండును. (చూ-283)

## గంగా యస్యపదోద్భవా.

348. దాసుగాణూ (జనులు గంగ అను పేరునపిలుచు) గోదావరీనదికి స్నానమునకై వెళ్ళఁదలచి, "బాబా! ఇది మహాశివరాత్రి, (శీర్డికి 3 మైళ్ళ దూరమునగల) 'సింగబా' గ్రామమున గంగాస్నానము చేయవలయునని తలంచుచున్నాఁడను.

సా. బా:- నీవక్కడకు పోనేల?

దా. గాణూ వెంటనే నిస్పృహనొందెను.

సా. బా:- గంగ ఇక్కడ నాపాదములదగ్గఱ కలదు. వెళ్ళకలదు.

దా. గాణూ. మరల నిరుత్సాహమునొందెను. ఏలన? - అతఁడు బాబా సాక్షాత్ విష్ణుదేవుఁడని గ్రంథములలో రచించినను అతడు పలికిన పలుకులలో విశ్వాసము మిక్కిలి తక్కువ.

సా. బా:- ఇచటకురమ్ము! నాపాదములదగ్గఱ దోసిలి పట్టుము!

దా. గాణూ. అట్లు కావించెను. అహో! చూడుము! ఒకసన్నని నీటిధార బాబా పాదములనుండి దాసుగాణూ దోసిలిలోనికి ప్రవహించెను. దా. గా. అంజలి ఆ పవిత్రతోయములతో నిండెను. ఇచట గంగకలదు. ఆజలమును దా. గా. తలపై చల్లుకొనెను.

## శక్తిని ప్రసాదించుటకు శక్తి

349 సా. బా:- (జనులకు వివిధజాడ్యములకు ఔషధములిచ్చుచున్న నా. గో. చందోర్కరుతో) అన్ని వ్యాధులకు ఒకే ఔషధమిమ్ము!

అదిమొదలు, నా. గో. చం. తేలుకుట్టినపుడు పాము కాటునకు - వివిధ జాడ్యములకు 'సున్నపుతేట' నే ఔషధము గనిచ్చి జనులకు స్వస్థతఁగూర్చినాఁడు.

## ఉపలాదభవజ్జలమ్

(ఱాతినుండి నీరుపుట్టుట)

350. నా. గో. చందోర్కర్ - ఒక వేసవిదినమున హరిశ్చంద్ర పర్వతమెక్కుచుండగ మిక్కిలి దప్పిక గొనెను. ఆప్రదేశమున నెక్కడ త్రాగుటకు నీరులేదు. చందోర్కరు "బాబా ఇచ్చటనుండిన నాకు నీరు యిచ్చును." అని, అనుకొనెను. ఆయెడ బాబా 40 మైళ్ళదూరమున శీర్డి యందుండెను. శీర్డిలో మసీదునందు.

సా. బా:- నానా దప్పిక గొనినాఁడు. వేసవి యెండవేడిమి అధికముగఁగలదు. దోసెడు పానీయ మాతనికీయఁదగమా?

అచటఁజేరియున్న భక్తులు బాబా వలుకుమాటలు గ్రహింప నేరకుండిరి. కాని, ఆకొండ మీదనొక భిల్లుఁడు క్రిందికిదిగివచ్చుట నా. గో. చం. చూచెను.

నా. గో. చం:- ఓయీ! భిల్లుఁడా! నేను దప్పికగొని యున్నాఁడను. నాకుత్రాగుటకు నీరెచట నేనిలేదా?

భిల్లుఁడు:- నీవు కూరుచున్న బండక్రిందనే నీరుకలదు. అని వలుకుచు ఆభిల్లుఁడు వెళ్ళెను.

ఆబండపైకి ఎత్తగ దానిక్రింద స్వచ్ఛమైన జలముండెను. నా. గో. చం. ఆజలముత్రాగెను.

బాబా—గింజలుగల ద్రాక్షలను గింజలులేని ద్రాక్షలుగ మార్చుట,

## టి. డి. జతభాయ్.

351. కాకా మహాజని యజమాని (షాహుకార్) సేత్ తక్కార్-ధర్మసే - జతభాయ్ (బాబానుగూర్చి) తెలిసి కొనవలయునను కోరికతో కాకామహాజనిని వెంటఁబెట్టుకొని శిర్డికివెళ్ళెను. వారు గింజలుగల ద్రాక్ష పండ్లనుతెచ్చి బాబాకు సమర్పించిరి. ఆసేత్ బాబా కావించు చమత్కార ములను కొన్ని చూడఁదలఁచెను, కాని దక్షిణ సమర్పింపవలయునను తలంపులేదు.

సా. బా:- సేత్! ఇవిగో కొన్నిద్రాక్షలు తినుము!

ఆ సేత్ మిక్కిలి ఆందోళన చెందెను. ద్రాక్షలను నోట నుంచుకొనెను. అందలి విత్తనముల నేమిచేయవలయునో అతనికి తోచలేదు. ఆమసీదులో ఉమియుటతగదు. కావున ఆగింజలను తన

జేబులోనుంచుకొనెను. అదియు నతనికి అనిష్టము. సాయి గొప్ప సాధువే అయిన అతని అనిష్టత గుర్తింప కెట్లుండునని యతఁడాశ్చర్య పడెను. వెంటనే

సా. బా:- ఇవిగో మఱికొన్ని ద్రాక్షలు, వీనిని తీసికొని తినుము.

అని పలుకుచు వారు తెచ్చిన ద్రాక్షలనే మఱికొన్నిటి నిచ్చెను ఆసేత్ వానివి చేతిలోపట్టుకొని, యేమిచేయిదునా! అని తలంచెను.

సా. బా:- వానిని తినుము.

సేత్ వానిని నోటిలోవేసి కొనెను. అవి గింజలులేని వయ్యేను. ఆతఁడు చమత్కారములు కోరెను. అవిలభించెను. మొదట బాబా ఆతని తలంపు నెఱిఁగెను. పిదప సబీజ ద్రాక్షలను నిర్బీజ ద్రాక్షలుగ మార్చెను.

అంత 'శ్యామా' "ఈయన మన కాకా మహాజని యజమాని"- అని ఆసేత్‌ను బాబాకు పరిచయముచేసెను.

సా. బా:- అతఁడు కాకా యజమాని ఎట్లగును? పరమానందము ను ప్రసాదించు వేఱొక యజమాని కాకాకుకలఁడు.

ఆరతి అయిన తరువాత సేత్, కాకామహాజనితోకలిసి తిరిగి వెళ్ళఁదలచెను. సాధారణముగ కాకా ఎప్పుడు వచ్చినను బాబా ఆతనిని కొన్ని రోజులు నిలుపుచుండువాఁడు. సేత్ కాకాలు తిరిగి వెళ్ళుట కనుమతి నీయుమని శ్యామా వారికిఁగా బాబాను ప్రార్థించెను. బాబా తన ప్రత్యేకవైఖరి అనుసరించి యిట్లనెను.

సా. బా:- సంపూర్ణ ధనారోగ్యములు గలిగి మనస్థిమితములేని యొక పెద్దమనిషికలఁడు. అనవసరమైన బరువులన్నియు తలపై కెక్కించుకొని ఇక్కడ కక్కడకు వానిని మోసికొనిపోవుచు మనశ్శాంతి నతఁడెఱుఁగఁడు. ఆ బరువులను క్రిందఁబడవేయుచు మరల.తలకెక్కించు కొనుచుండును. అతని మతిస్థిరముకాదు. నేనాతనిపై జాలికలిగి "ఇప్పుడు

నీకిష్టమైన ఏదో ఒకతావున గాఢ విశ్వాసము కలిగియుండుము. నీ యీ సంచారములు - ఆందోళనలు వ్యర్థములు" అని చెప్పుచున్నాఁడను.

ధర్మసే ఆబాబాపలుకులు తన వాస్తవస్థితి వివరణముగా గ్రహించెను.

అంతటబాబా కాకాను 15 రూపాయలు దక్షిణ అడిగి తీసికొనెను.

సా. బా:- నేనెవరిదగ్గఱనుండియేని ఒకరూపాయి దక్షిణ తీసికొంటినా-దానికి పదిమడుంగులుతిరిగి యీయవలయును నేనెప్పుడు దేనిని ఊరకస్వీకరింపను. విచక్షణలేక ప్రతివానిని దక్షిణకోరను. ఆఫకీరుని నిర్దేశించువాని వద్దనుండియే గ్రహింతును. ఆదాత యిచ్చును. వాస్తవముగ నతఁడుబహుమతి రూప విత్తనమువిత్తి, ఆపిదప మిక్కిలి సమృద్ధమైన పంటను కోసికొనును, సంపద - ధనము - ధర్మసాధనము మాత్రమే. కేవలము స్వకీయ సుఖానందములకు దానిని వెచ్చించెనా - అది వ్యర్థ వ్యయమే యగును. సంపద నీవిదివరకిచ్చియుండవ యేని ఇపుడు పొందఁజాలవు. సంపద ఈయఁబడినది కావుననే ఇపుడు కోరఁబడు చున్నది. దక్షిణనిచ్చుటవలన వైరాగ్యము - దాని మూలమున భక్తి జ్ఞానములు పెంపొందును నేనిపుడేమి చేయుచున్నాఁడను? ఒకటి స్వీకరించి దానికి పదిరెట్లు తిరిగి యిచ్చుచున్నాఁడను.

## పులుపు — పులుపుకాదు.

351 A యం. బి. రేగే (జడ్జి) శిర్డిలోనొకనాఁడు బాబాకు సమర్పింపనిమ్మరస 'షర్బత్' తయారుచేసెను. ఆతఁడు ముందుగ దానిని రుచిచూచెను. ఏమాత్రము పులుపులేదని గ్రహించెను. పిదప దానిని గొనిపోయి బాబాకు సమర్పించెను.

సా. బా:- (రుచిచూచిన తరువాత హ. సీ - దీక్షిత్తుతో) కాకా! ఇది యెంత పులుపుగానున్నదో చూడుము!

హ. సీ. దీక్షిత్తు-రేగేయిరువురు రుచిచూచిరి. పులుపుగ నుండెను. రేగే నివ్వెఱపోయెను.

సా. బా:- కాదు - నేనూరక తమాషాకు పలుకు చున్నాఁడను. ఇపుడు చవిచూడండి!

మరల హ. సీ. దీక్షిత్తు - రేగే - యిరువురు రుచి చూచిరి. ఈమాఱు అది యేమాత్రము పులుపులేదు.

## (మూర్తీభవించుట) ప్రత్యక్ష విదర్శనములు

### 1. మాహల్సాపతికి "జజూరి" లో దర్శనమిచ్చుట.

352. మహల్సాపతి తన పాలకితో "జజూరి"కి తీర్థయాత్రకై వెళ్లెను. అచట ప్లేగువ్యాధి విజృంభించుచుండెను. మహల్సా - అతని అనుచరులు పాలకిని క్రిందికి దింపి, మిక్కిలి విచారముగనుండిరి. మహల్సా ఆపాలకినానుకొని కూర్చుండెను. అతని వెనుక నెవరో ఉన్నట్లు తనికి తోచెను. వెనుకకు తిరిగి బాబాను చూచెను. వెంటనేబాబా అదృశ్యుఁడయ్యెను. బాబాతమ వెంటనేయున్న వాఁడని మహల్సా అతని మిత్రులతో చెప్ప వారు ధైర్యమువహించి, నాలుగు దినములచట నుండిరి. వారిలో నెవరికి ప్లేగువ్యాధి సోకలేదు. సురక్షితముగ తిరిగి యింటికిఁజేరిరి. వారు బాబాను దర్శించినపుడు-

సా. బా:- భగత్! నీవు చక్కని తీర్థయాత్రఁగావించితివి పాలకి నానుకొని నీవు కూర్చుంటివి. అపుడు నేనచటికి వచ్చితిని.

ఆవిధముగ తాను స్వయముగ 'జజూరి' యందు తన అద్భుత మహిమా విశేషమున ఉన్నవాఁడనియు, మహల్సా-బాబాను చూచిన విషయము ఏవిధమైన భ్రాంతి - ఊహలు కావని బాబా దృఢపరచినాఁడు.

### (2) మూలేశాస్త్రికి ఘోలప్ మహారాజుగ

ద్వారకామాయి మసీదున బాబాకు మ్రొక్కుటకు దురభిమానము వహించిన మూలేశాస్త్రికి నాతని గురువగు ఘోలప్ మహారాజుగ బాబా దర్శనమిచ్చి మూలేశాస్త్రిని చక్కదిద్దెను- (చూ. 223)

## (3) సగుణోపాసన నిరసించువాని తండ్రికంఠధ్వని బాబా వినుచుట

353. కాకామహాజని మిత్రుడు నిరాకారోపాసకుఁడు. సాకారోపాసన అన్నిటిని నిరసించువాఁడు. బాబానుగూర్చి తెలిసికొనవలయునను కోరికతో కాకావెంట శీర్డికివెళ్ళెను. బాబాకు మ్రొక్కవలెననియు, దక్షిణ సమర్పింపవలెననియు ముందుగ కాకాతో చెప్పెను. అతఁడు శీరిడిలోని మసీదు మెట్లెక్కుచుండగా- "కాం- యా వేజీ"-స్వాగతము! బాబూ! - అని బాబాపలికెను.

కాని, కాకామిత్రునిచెవికి వినవచ్చిన ఆకంఠధ్వని అతనితండ్రి కంఠస్వరమగుట నతని కత్యంతానందోత్సేకముఁ గలిగించెను. వెంటనే అతఁడు బాబా పాదముల శిరముఁజేర్చి మ్రొక్కెను.

బాబా రెండు పర్యాయములు కాకాను దక్షిణ అడిగి తీసికొనెను. కాని, ఆతని మిత్రుని నడుగలేదు. అతఁడు కాకాతో రహస్యముగఁ దానును దక్షిణ సమర్పింపఁగోరు చున్నాఁడనని తెలిపెను.

సా. బా:- (కాకాతో) నీమిత్రుఁడేమి చెప్పుచున్నాఁడు?

కాకా ఆతఁడనిన మాటలు తెలిపెను.

సా. బా:- ఆతనికి దక్షిణ నిచ్చుట కిష్టములేదు. కావున నేనతని నడుగలేదు. ఇప్పుడాతఁడీయఁదలచిన నీయవచ్చును.

అంతట కాకా మిత్రుఁడు బాబాకు 17 రూపాయలు దక్షిణ నిచ్చెను.

సా. బా:- (ఆతనితో) నిన్ను నన్ను వేర్పఱచునది యీ (త్రైలవర్తకునిగోడ) తెర. దీనిని తీసివేయుము. అపుడు మన మొఁడురుల ముఖములను విస్పష్టముగఁజూడఁగలము.

ఆపిదప కాకా అతని మిత్రుఁడు తిరిగి వెళ్ళుటకు ప్రయాణ మగుచుండిరి. మేఘములు క్రమ్మి వాతావరణము భయకారణముగ నుండెను.

సా. బా:- శ్యామా! వారిని భయాందోళనములు లేక వెళ్ళ మనుము. వారి తిరుగు ప్రయాణమున వర్షబాధలేమియు కలుగవు.

ఉరుములు మెఱుపులున్నను వారురైలు ఎక్కునంత వరకు వారికేవిధమైన వర్షబాధలు కలుగలేదు.

ఇతర సాధువులుగ — తానే యితర సాధువులుగ బాబా తోచుట

ఇతర సాధువులు తాను ఏకమని బాబా నిరూపించుట.

354. యస్. బి. నాచ్నే సోదరునకు బొంబాయిలో జరుగు చున్న మిక్కిలి ప్రమాదకరమగు శస్త్రచికిత్సనుగూర్చి నాచ్నే – అతని కుటుంబములోని వారందఱు మిక్కిలి ఆందోళన పొందుచుండిరి. వారున్న "దహను" వారింటికొక సాధువువచ్చెను. నాచ్నే వదిన ఆ సాధువునకు భోజనముపెట్టెను. పెట్టుటకు యోగ్యముగలేని కారణమున బెండకాయ బజ్జిమాత్రము వేయలేదు. ఆసాధువు తానే దానిని పెట్టుమని కోరుటచే దానినివేసిరి. అసాధువు భుజించినపిదప వారి నాశీర్వదించుచు "బొంబాయిలో జరిగిన శస్త్రచికిత్స విజయవంతమని – క్షేమకరమని" తెలిపి, వెళ్ళెను. ఏ సంవత్సరముల తరువాత నాచ్నే బాబా దగ్గఱకు వెళ్ళెను. అపుడు—

సా. బా:. (నాచ్నేను చూపుచు) నేనీతని యింటికి భోజనము నకై వెళ్ళితిని. ఈతఁడునాకు బెండబజ్జి పెట్టలేదు.

ఆసాధువు హైందవుఁడు. బాబాకు ఆతనికి ఏవిధమైన పోలికలులేవు.

355. బాలకృష్ణ గోవింద ఉపాసనీశాస్త్రి – (సంస్కృతభాషా చార్యుడు) హరిద్వారము – తపోవనము (స్వర్గాశ్రమము)నకు వెళ్లెను.

అచట ఒక సాధువును జూచెను. ఆసాధువు అతనితో ఉపాసనీలవంశమున తరతరములనుండి కులధనముగా వచ్చుచున్న 'సాలగ్రామము' తానిచ్చి నదే – యని చెప్పెను. తానెవరో – తన అభేదతత్త్వమును దెలుపుమని ఉపాసని అడుగ, హిందూస్థానీ భాషలో "అహో! ఒక చెట్టు (దూలము) కలదు. ఒకరు క్రిందికి వచ్చిరి. రెండవవాఁడు పైకి పోయెను. నీవు తెలిసికొనఁగలవు" అనిపలికి అదృశ్యుఁడయ్యెను.

పెక్కు సంవత్సరముల తరువాత 1911 చివర భాగమున అతఁడు తనతమ్ముని కాశీనాథుని (ఉపాసనీబాబా) జాడ నరయుచు నిందందు తిరుగుచుండెను. మామ్లత్ దారు కోరికపై నతఁడు కోపర్గామునదిగెను. ఆమామ్లత్ దారు ఆతని శీర్డికిఁ బంపెను. గోవింద ఉపాసని, బాబాను దర్శింపగా

సా. బా:- ఖండోబా వద్దకు పొమ్ము!

బా. గో. ఉ:- బాబా! నిన్ను సందర్శించిన సకల దేవతలను సందరర్శించినవాఁడనే.

సా. బా:- (మరల) ఖండోబా దేవాలయమునకుఁబొమ్ము!

బా. గో. ఉపాసని మసీదునుండి వెలుపలకువచ్చి, బాబా ఆజ్ఞఁదెలుపఁగా అచటజనులు కాశీనాథ ఉపాసని ఖండోబా దేవాలయమున నున్నవాఁడనిచెప్పిరి. ఒకరు చెప్పకయే బా. గో. ఉ. సంబంధము- ఆతని అన్వేషణము బాబా తెలిసికొనెను. బా. గో. ఉపాసని ఖండోబా దేవాలయము నుండితిరిగివచ్చి బాబానుజేరగనే బాబా తపోవనమున ఆ సాధువుపలికిన పలుకులే ఆ హిందూస్థాని భాషలోనే యిట్లుపలికెను

"ఒకచెట్టు (దూలము) కలదు. ఇరువురు దానిపైకెక్కిరి. ఒకఁడుక్రిందికిదిగెను. రెండవవాఁడు పైకివెళ్లెను" అ విధముగ సాయి బాబా తపోవనమున సాధువు తానేయని నిరూపించెను–

355. A. 1908 శ్రావణమున (చాతుర్మాస్యము) చంద్రాబాయ్ - ఆర్. బోర్కర్ – కోపర్గామున నుండఁగ ఆమె యెఱుఁగని ఒకవకీరు

వచ్చి, రొట్టె - ఉల్లిపచ్చడి పెట్టుమని కోరెను. చాతుర్మాస్యమున ఉల్లి భక్షింపనని ఆమె చెప్పెను. ఆఫకీరు అదృశ్యుఁడయ్యెను. ఆమె సాయీబాబానుగూర్చి. ఆయన నిత్యము ఉల్లి భక్షించుటనుగూర్చివిని ఆవచ్చిన ఫకీరు సాయిబాబా ఏమోయని తలంచెను, అందుచే ఆమె ప్రప్రథమున శిర్డికివెళ్ళి బాబా పాదములకు మ్రొక్కెను "నీవు రొట్టె-ఉల్లిపచ్చడి పెట్టకుంటివి. ఇక్కడ కేలవచ్చితివి?" అని, బాబా అనెను. ఈ మాటలు ఆవచ్చిన ఫకీరు 'బాబా' యను నామె తలంపును ధ్రువపఱచినవి. అంత నామె "అవును - నీకురొట్టె - ఉల్లిపచ్చడి పెట్టుటకే నేను వచ్చితిని" - అని అనెను.

"ఆమె ఏడుతరములుగ తన సోదరియనియు, తనకొఱకు ఎవ్వుడు అన్వేషించుచుండెడిది యనియు"- బాబా తెలిపెను.

చూ. (460)

[గమనిక:- భక్తుల అనుభవములు iii భాగమున తెలుపఁబడిన వానిలో కొన్నిమార్పులుకలవు. కావున 'సాయిలీలామాసిక్' - వాల్యూమ్ iii. భాగము' పుటలు 383 .......లో ప్రచురింపఁబడిన చంద్రాబాయి తెలిపిన అంశములే మిక్కిలి గణనీయములు.]

## బాబా - అనసూయ; దత్తస్వామి - అభేదస్థితి.

356. 1911 దత్తజయింతినాఁడు బల్వంత్ కోహాజ్కర్, సాయంత్రము 5 గంటలకు బాబాను దర్శించెను.

సా. బా:- నాకు కాన్పునొప్పులేర్పడినవి, నొప్పులు దుర్భరముగ నున్నవి. - అని పలుకుచు మసీదునుండి యందఱను వెలుపలకు పంపెను. అనసూయ తన - అభేదస్థితి నిరూపించుటయది. కొంచెముసేపు అయిన తరువాత బాబా అందఱను లోనికి పిలిచెను. కొహాల్కర్ మొదట వెళ్లెను.

అచటగద్దె మీద బాబా లేడు. ఒక జగన్మోహనాకారుఁడగు మూఁడు శిరములబిడ్డ (దత్తస్వామి) అచటనుండెను. మఱుక్షణమున దత్తస్వామి అదృశ్యుఁడై బాబా ఆస్థానమున నుండెను.

## బాబా - ఇతర రూపముల దర్శన మిచ్చుట

357. బి. వి. దేవ్ - ఒక ఉద్యాపన వ్రతము చేయునెంచెను. అన్నసంతర్పణము కూడకలదు. అతఁడు బాబాను ఆ విందునకు తప్పక రావలసినదిగ తెలుపుమని శిర్డిలోనున్న 'జోగ్'నకు ఉత్తరము వ్రాసెను- అప్పుడు-

జోగ్:- బాబా! దేవ్, 'దహను'లో తాను జరుపు ఉద్యాపనము విందునకు రావలసినదిగ, నిన్ను కోరుచున్నాఁడు.

సా. బా:- ఆ విందునకు తప్పక నేను ఇంక నిరువురతో కలిసి వత్తునని, నేను ప్రయాణము చేయుటకు వాహనము లవసరములేదని, నా భక్తుఁడు ప్రేమతో నన్ను పిలిచిన మాత్రమున తత్ క్షణము నేను ప్రత్యక్షమగుదునని తెలుపుచు ఉత్తరము వ్రాయుము.

ఆ దినము విందునకు వచ్చువారిలో బాబాలేఁడు. దేవ్ అంతకు ముందు ఎఱిఁగిన ఒక సన్యాసి, మఱియిరువురతో వచ్చి "నేను విందునకే వచ్చితిని, ధనముకొఱకు రాలేదు" అని, వారితో భుజించెను. అంతట దేవ్ - బాబా విందునకు రాక. మాటతప్పినాఁడని జోగ్‌నకు ఉత్తరము వ్రాసెను. ఆ ఉత్తరము బాబా దగ్గఱకు తీసికొనివెళ్ళి, దానిని తెఱచు పూర్వమె.

సా. బా:- ఆతని ఉద్యాపనము విందున భుజింతునని ఆతనికి నమ్మఁబలికి, నేను మోసపుచ్చితి ననుచున్నాఁడా? నేను మఱియిరువురతో వచ్చి యుంటిననియు, ఆతండు నన్ను గుర్తింపఁజాలకుండెననియు వ్రాయుము. నేను ధనముకొఱకు రాలేదని, కేవలము విందుకొఱకే వచ్చియుంటినని నేను స్పష్టముగ తెలిపితిననియు వ్రాయుము.

జోగ్ ఉత్తరము వ్రాసెను - బాబా ఒక సన్యాసి రూపమున వచ్చి విందుభోజన మారగించినాఁడని దేవ్ విశ్వసించెను.

358. ఆదందలాలీదగ్గఱకు ఒక మార్వాడీవెళ్ళి భోజనము కోరెను. ఆ. ద. కొంతధనమిచ్చి అతనిని మార్వాడీ 'హోటలు'నకు పంపెను. తరువాత, ఆ. ద. లాలీశ్రీడ్డికి వెళ్ళెను.

సా. బా:- (ఆదందలాలీని చూపుచు) నేనీ మనిషి దగ్గఱకు వెళ్ళితిని. తిండికి నన్నీతడు మార్వాడీ హోటలునకు పంపినాడు.

## కుక్క రూపమున—బాబా

359. జి. యస్. కపర్దేసతి, ప్రతిదినము నైవేద్యము తెచ్చి బాబాకు సమర్పించుచు బాబాను తన విడిదికి భోజనమునకు రావలసినదిగ కోరుచుండెను. బాబా మాట ఇచ్చెను. కాని వెళ్ళలేదు. ఒక దినమున ఆమె శాకపాకములు సిద్ధపఱచుచుండగ ఒక కుక్క ఆమె దగ్గఱకు చేరెను. అదియొక అసహ్యకరము, అశుభమైన జంతువని తలంచి కాలుచున్న ఒక కట్టెకొఱివిని తీసికొని దానిమీద విసరెను. అది పాఱిపోయెను. ఆదినమున మధ్యాహ్నము బాబాకు నైవేద్యము సమర్పించు నపుడు

జి. యస్. కపర్దేసతి:- నా విడిదికి భోజనమునకు రమ్ము.

సా. బా:- అలాగే- నేను వచ్చినపుడు మండుచున్న కట్టెకొఱివిని నాపై విసరుము.

## బాబా—భవిష్యత్సూచనము—నియంతృత్వము—ఆధిపత్యము

## రానున్న షిరిడివిఖ్యాతిని గూర్చిబాబాముందుగఁ దెలుపుట

360. 1903 కి చాలాపూర్వము (అప్పటనుండియే బాబా ప్రసిద్ధి వ్యాపించినది) శిరిడీ ఒక మాఱుమూల గ్రామమైయుండినపుడు బాబా తెలిపినాడు "ఈగ్రామమున భవనములు నిర్మింపబడును. గొప్ప

గొప్పవారు చేరుదురు. తుపాకులు ప్రేల్చబడును. రథములు-గుఱ్ఱములు-ఏనుగులు వచ్చును. పెద్దవూరేగింపులు జరుపబడును.

అట్టి కుగ్రామమున నిట్టివి దుర్లభములని తలంచి జనులు నవ్విరి. పరిహసించిరి. బాబా విఖ్యాతి వ్యాపించినకొలది యివి యన్నియు రూపొందినవి.

361. మాహింబజారు నివాసి. లక్ష్మన్-వి. నాద్కర్ 1915లో శీర్డికి వెళ్ళి బాబాను సందర్శించెను. అచ్చటనుండి బాబా సెలవు తీసికొని వెళ్ళఁబోవునపుడు కోపర్గామున రైలు అందుకొనుటకు వేళమించినట్లు తోచెను.

సా. బా:- పొమ్ము కోపార్గామునరైలు అందుకొనఁగలవు.

నాద్కర్ వెళ్ళెను. గోదావరినదినిఁజేరగ చీకటిపడెను. చీకటిపడిన తరువాత వరదలలోనున్న గోదావరిపై పడవలను నడువనీయరు. ఆతఁడు తీరమున చిక్కుబడినవాఁడయ్యెను. అపుడు అకస్మాత్తుగ మామ్లత్ దారు అచటకు వచ్చెను. అతనికొఱకొక పడవ సిద్ధపఱుపఁబడెను. నాద్కర్కూడ అందులోనికెక్కెను. ఆవిధముగ దొంగల భయము, మఱియేవిధమైన భీతిలేకయేయతఁడు స్టేషన్జేరి రైలు నందుకొనెను.

## డి. వి. సంభారే-రైలు ఆలస్యము

362. డి. వి. సంభారే ఉదయము 8 గంటలకు బొంబాయికిఁజేరురైలులో ప్రయాణముచేయఁదలచి బయలుదేరునపుడు-

సా. బా:- పొమ్ము! మధ్యాహ్నమునకుఁ జేరుదువు.

ఆరైలు 4 గంటలాలస్యమగుటచే బొంబాయికి అతఁడు మధ్యాహ్నమునకుఁజేరుకొనెను.

## వా. గో. చందోర్కరు - రైలు ఆలస్యము

చూడుము. 143. (1) రైలు ఆలస్యమయ్యెను. నానాఅందుకొనెను.

## మహల్సాపతి

363. మహల్సాపతి "ధోర్హాలీ" యందు అతని వియ్యంకుని (కూతురుమామ) యింటియందు విందునకు ఆహ్వానింపఁబడెను. బాబా సెలవు కోరఁగ—

సా. బా:- నీవచట అవమానము పొందుదువు.

ఏమైనను వెళ్ళకతప్పదని మహల్సావతి వెళ్ళెను. అతఁడు 'డోర్హాలీ' చేరఁగా ఆవిందునకుఁ జేరినవారాతని కొఱకు వేచియుండక భోజనములు చేసిరి.

364. మహల్సాపతి "అర్ధాగ్గోను" నకు వెళ్ళఁదలఁచి బాబా సెలవు కోరెను.

సా. బా:- అక్కడకు వెళ్ళకుము. అచట కలహములు దెబ్బలాటలు జరుగును.

కాని, మహల్సాపతి వెళ్లకతప్పలేదు. అతఁడు అచటకువెళ్ళి 'మల్హారి మాహాత్మ్యము' పారాయణము చేయుచుండెను. అతఁడు పఠనము కావించునపుడు పిల్లలు తగపులాడుకొనిరి. కర్రలతో కొట్టుకొనిరి. పారాయణమునకు భంగముకలిగి. మహల్సాపతి తిరిగి శీర్డికిఁజేరెను.

## సింగ్వేకర్

365. అనంత మహదేవ్ సింగ్వేకర్, బాబాను అడిగెను— నేనుపరీక్షలో నుత్తీర్ణుఁడనగుదునా? నా 'నెంబరు' విజయము పొందిన వారి "జాబితా"లో నుండునా?

సా. బా:- నీ నెంబరు 114 - పరీక్షలో గెలుపొందిన వారి "జాబితాలో" లో నుండును.

ఆతని నెంబరు 114. పరీక్షఅయినవారి జాబితాలో ఆనెంబరు ఉండెను.

## యన్. ఎ. సామంత్

366. సా. బా:- (యన్. ఎ. సామంతుతో) నీవీ 5 రూపాయలు తిరిగతీసికొనుము. దానినిజాగ్రత్తగాదాచి పెట్టుకొనుము. అది అపహరింపఁబడును.

సామంతుఁతనకోటును భోజనశాల వెలుపల తగిలించి, భోజనమునకు వెళ్ళెను. ఆ 5 రూపాయల 'నోటు' అపహరింపఁబడెను.

## టెండల్కర్ - మఱియు - సపత్నేకర్ మిత్రుడు.

367. సా. బా:- జాతకములు - భవిష్యత్తులు జ్యోతిష్కులతో చర్చలు మొదలగునవి దూరముగ త్రోసివేయుమని అతనితో (టెండల్కర్‌తో) చెప్పుము, సుస్థిమితముగ పరీక్షకు వెళ్ళుమనుము, అతఁడు విజయము పొందును. (అథముగ నతఁడు విజయము పొందెను,)

సా. బా:- (సపత్నేకర్ మిత్రునితో) ఎంతకష్టపడి చదివినను నీవీసంవత్సరమున 'లా' పరీక్ష (న్యాయవాది పరీక్ష) యందుజయ మొందఁజాలవు. రాఁబోవు సంవత్సరమున ఎంత స్వల్పముగఁ జదివినను నీవు గెలుపొందుదువు.

(ఆమరుసటి సంవత్సరమతఁడు విజయము పొందెను.)

## తప్పిపోయిన ఒక పార్శీ వర్తకుని బిడ్డ.

368. సా. బా:- కాక! ఆ పిల్లవాఁడు దక్షిణ, దిశకువెళ్లెను. అతఁడుక్షేమము - ఉత్సాహముగ నున్నాఁడు. తనంతటతానే తిరిగి వచ్చును

త్వరలోనే ఆపిల్లవాఁడు మద్రాసునుండి తిరిగివచ్చెను.

## మతిచెడిన పార్శీబాలుని ఆరోగ్యము

369. సా. బా:- (మతిచెడిన పార్శీబాలుని తండ్రితో) నీబిడ్డ చక్కఁబడును.

ఆబిడ్డ ఆరోగ్యముపొందెను. ఆ పిదప వ్యాపారము చేయ సుద్ధుఁడయ్యెను.

## న్యాయవాది సోదరుని పిచ్చి.

370. సా. బా:- (బొంబాయి హైకోర్టు న్యాయవాదితో) నీ సోదరుని పిచ్చి నివారణమగును. (అతఁడుస్వస్థుఁడయ్యెను.)

## శ్రీ. ఎ. మనశ్చాంచల్యము.

370. A. యం. బి. రేగే. 'ఎ' అనునతని ప్రప్రథమమున శిర్డికిఁదీసికొనిపోయెను.

సా. బా:- (ఆ 'ఏ' ను చూచి) పిశాట్! (పిచ్చివాఁడా!) ఏల వచ్చితివి?

ఒకటిరెండు దినములలో ఆ 'ఏ' కు మతిభ్రమణ మేర్పడెను. అతఁడు శిర్డినుండి వెడలినతోడనే స్వస్థత నొందెను

## అద్భుతములు - భవిష్యత్తు దెలుపుట - వీనిభేదము

371. సా బా:- (నా. గో. చం తో) నేను సమృద్ధిగ నీయ దలఁచుదానిని స్వీకరింపనెవరుకోరరు. నేనీయఁజాలనిది నానుండి వారికి కావలె!

బాబా ఒక సందర్భమున నా. గో. చం. తో 'చమత్కారములి' (?) మనోహరముగఁదెలిపినాఁడు. అది 1901 – 1904 మధ్యకాలమున

విషయము, చందోర్కరు పుత్రిక 'మీనాతాయి' ప్రసవ సంకటస్థితి యందుండగ గోసావి (గిర్ ఖావ్) ద్వారా బాబా 'ఊధి' పంపి అనుగ్రహించెను. మీనాతాయి బిడ్డ అతిబాల్యముననే మృతినొందెను. ఆమె భర్తయు మరణించెను. చిన్నతనముననే ఆమెకు వైధవ్యము ప్రాప్తించెను. సంతానములేదు. ఆకుటుంబమునకంతయు ఇది మిక్కిలి విచారణ కారణమయ్యెను. నా. గో. చందోర్కరు తనకుటుంబముతో శిర్డికి వెళ్ళి బాబా యెదుట మిక్కిలి విచారముతో మౌనముగఁగూర్చుండెను. అతఁడెప్పుడు బాబాను సందర్శించిన ఇరువురు అమితోత్సాహముతో సంభాషించుచుందురు. ఈపర్యాయము మిక్కిలి విచారకరమైన సమావేశమయ్యెను. కొన్నినిమిషములట్లు నిశ్శబ్దత అలమిన పిదప బాబా ఉపక్రమించెను.

సా. బా:- ఏల నీవిట్లు మౌనముగనుంటివి?

నా. గో. చం:- బాబా! నీవు సర్వము నెఱుఁగుదువు. నీసంరక్షణ మందున్న మాకిట్టి దుఃఖములు ప్రాప్తించెను. మనుమని, అల్లుని కోల్పోయి దుఃఖముల పాలైతిని.

సా. బా:- నీవు బిడ్డ – అల్లుడు మొదలగువారియందు ఆసక్తిఁ బూని, వారికొఱకే నాదగ్గఱకుఁజేరుచుంటివా – నీవు పొఱపడుచున్నాఁడవు. వీరి కొఱకు నా దగ్గఱకు రావలసిన పనిలేదు. ఇవి నా అధీనమునలేవు. ఇవి (బిడ్డజననము – బంధువుల మరణము) పూర్వకర్మములపై నాధారపడియున్నవి. ఈ విశ్వమును సృష్టించిన పరమేశ్వరుఁడేనియు వీనిని మార్పఁజాలఁడు. నియమిత స్థానములకు రెండుగజములు దూరముగ నుదయింపుడని సూర్యునకు, చంద్రునకు పరమేశ్వరుఁడేని చెప్పగలఁడని నీవుతలంతువా? కాదు–అటుల చెప్పలేఁడు. చెప్పఁడు.

నా. గో. చం:- అట్లయిన, బాబా! నీవు ఒకనితో "నీకు కుమారుడు జనించు" నందువు – కుమారుఁడు పుట్టును; మఱియొకనితో "నీకు ఉద్యోగము దొరకు"నందువు–అతనికి ఉద్యోగము దొరకును; ఇవి నీవుకావించు చమత్కారములు కావా?

సా. బా:- కావు-నానా! నేనెట్టి చమత్కారములను కావింపను. మీకు జ్యోతిష్కులు కలరు. వారు గుణించిచూచి, రెండు రోజులు ముందుగ ఏవో భవిష్యత్తులను దెలుపుదురు. కొన్ని నిజములగును. నేను ఇంక కొంచెము ముందు దూరము చూచుదును. నేను చెప్పునది జరుగును. నేను చేయుపనియు నొకవిధమగు జ్యోతిష్యమే. కాని, పామరులు మీరు దీనిని గ్రహింపలేరు. నీవు ముందు జరుగునవి ఎఱుఁగజాలవు గాన నా మాటలు నీకు చమత్కారములుగ నుండును. ఆయావిషయములు నా అద్భుత శక్తిఘటనా నిదర్శనములుగ భావించి, భయ భక్తులతోఁగూడిన గౌరవము నాయందు వెలపుచుందురు. నేను వానిని - మీరువలపు భయ భక్తి గౌరవములను ఆ భగవానునకు సమర్పించి, మీరు యదార్థముగ అనుగ్రహింపఁబడునట్లు చూతును.

372. సా. బా:- (1918లో నాసిక్‌నివాసి నారాయణరావు-మోటీరాం-జానీతో) ఇంకమీదట నీవు సేవకుఁడవుగా నుండవు. నీస్వంత వ్యాపారముఁగావించు కొనుము!

అంతట నారాయణరావు నాశిక్‌లో ఆనందాశ్రమహోటల్-ప్రారంభించెను. అది ఆతనికి మిక్కిలి భాగ్యసంపదలను జేకూర్చెను.

373. సా. బా:- (నాచ్నేతో) 1 ఉద్యోగమునకు బొంబాయికి రమ్ము. 2. పిచ్చివారిని నమ్మకుము.

[ (1) నాచ్నే బొంబాయి శివారునకు బదిలీచేయఁబడెను. 2. అతఁడు పూజ యుందుండగా హానిచేయనివాఁడని యతడు నమ్మిన ఒక పిచ్చివాఁడు నాచ్నేపైకి ఉరికి కంఠము పట్టుకొని చంప ప్రయత్నించెను]

374. సా. బా:- (శంకర రావు మఱియు నాచ్నేతో) 15 రూపాయలు దక్షిణనిమ్ము!

శంకరరావు:- బాబా! నాదగ్గఱధనములేదు-

సా. బా:- నాకు 30 రూపాయలు దక్షిణ ఇమ్ము.

శంకరరావు:- నావద్ద ధనము లేదు. బాబా!

సా. బా:- నాకు 64 రూపాయలు దక్షిణ తెమ్ము-

నాచ్నే: (అంతట) బాబా! మేము పేదవారము అంతపెద్ద మొత్తములీయ సమర్థులముకాము.

సా. బా:- అయితే ప్రోగుచేసిఈయుండు!

తరువాత కొంతకాలమునకు (1916లో) బాబా జబ్బుపడెను. బాబా ఆరోగ్యము పొందుటకు పెద్దసప్తాహము కావింపఁబడినది. పేదలకు అన్నదానము కావించుటకై చందాలు 'వసూలు' చేయుబడినవి. శంకర రావు నాచ్నేలు ఇరువురు కలిసి చందాలు ప్రోగుచేసిపంపిరి. ఆపంపిన ధనము సరిగ 64 రూపాయలు మాత్రమే.

## హ. సీ. దీక్షిత్తు కుమారుఁడు.

375. 1913లో బాంద్రాలోనున్న కుమారుఁడు జబ్బుగానున్నాఁడని, హ. సి దీక్షిత్తునకు ఉత్తరము అందెను. అతఁడు వెళ్ళుటకు బాబా అనుమతిని కోరెను.

సా. బా:- నీవు వెళ్ళవలదు. ఆపిల్లవాని నిక్కడకు పిలిపింపుము.

హ. సీ. దీక్షిత్తు, కుమారుని శిర్డికి పంపుడని ఉత్తరము వ్రాసెను. కాని, పరీక్షలు సమీపించు చుండెనని, శిర్డియందు వైద్య సహాయముగాని, విద్యాసహాయముగాని దొరుకుట దుర్లభమని, ఆ బాలునకది తగిన ప్రదేశముకాదని తిరుగుజవాబు వచ్చెను.

సా. బా:- అదిలక్ష్యపెట్టకుము. పిల్లవానిని పిలిపింపుము. ఆబాలుఁడు శిర్డికిఁగొనిరాఁబడెను. త్వరలో ఆరోగ్యము పడసెను. తరువాత 2-11-1913 న పరీక్షలు ప్రారంభింపఁబడునని, పిల్లవానిని వెంటనే పంపుమని బొంబాయినుండి ఉత్తరమువచ్చెను.

సా. బా:- ఆబిడ్డను పంపవలదు.

పరీక్షలు 2-11-1913 నుండి, 6-11-1913 వరకు మార్పఁబడినవని ఆతేదీనాటికి పరీక్షలకాబాలుని పంపుమని మరల ఉత్తరమువచ్చెను.

సా. బా:- ఆగుము! మనము చూచెదముగాక!

6-11-1913 నాటికి బాలుని పంపలేదు.

పరీక్షలు 13-11-1913 నాటికి మార్పబడినవని మరల ఉత్తరము హ. సి. దీక్షిత్తునకు అందెను.

సా. బా:- 13-11-1913 నాటికి బిడ్డనుపంపుము.

ఆబాలుఁడు పరీక్షలకు హాజరై ఉత్తీర్ణుఁడయ్యెను.

## జోగ్ నకు గోదావరీజలము.

376. బాపూ సాహెబ్ జోగ్:- (1910 నవంబరులో) బాబా గోదావరీ-స్నానమునకు రేపువెళ్ళుటకు నాకనుజ్ఞనిమ్ము. రేపు పర్వదినము.

సా. బా:- వెళ్ళవలదు.

జోగ్ అసంతృప్తినొంది శిర్డియందే నిలిచెను.

మఱునాటి ఉదయమున గ్రామములోని జనులు బాబాదగ్గఱకు పరువెత్తికొని వెళ్ళిరి.

గ్రామజనులు:- బాబా! (సర్కారువారు 1912 నుండి నీకు అందించునట్లు ఉత్తరువులిచ్చినను) క్రొత్తగా త్రవ్వఁబడిన కాలువలద్వారా గోదావరిజలము మనశిర్డిలోనికి వచ్చుచున్నవి.

సా. బా:- జోగ్! భగవానుఁడెంత దయామయుడో చూడుము.

377. బాపూసాహెబ్ జోగ్ పితృశ్రాద్ధము సమీపించుచుండెను.

జోగ్:- (బాబాతో) బాబా! కోపర్గామునకు వెళ్ళినాతండ్రిగారి శ్రాద్ధమునకు మాశాఖ బ్రాహ్మణులను తీసికొనివచ్చుటకు సెలవిమ్ము

సా. బా:- నీవు వెళ్ళనక్కఱలేదు.

జోగ్:- బాబా! శ్రాద్ధము మానుకొను మందువా?

సా. బా:- ఇంక నాలుగు రోజులు వ్యవధికలదు. మనము చూచెదముగాక!

రెండురోజుల తరువాత జోగ్ బాబా దగ్గఱకు వెళ్లెను.

జోగ్:- నాశాఖ బ్రాహ్మణులునాకు కావలయును. నన్ను వెళ్ళనిమ్ము. బాబా!

సా. బా:- వారు వత్తురు.

జోగ్:- వారు శ్రాద్ధమువిషయమై ఎట్లెఱిఁగివత్తురు? నాశాఖ వారగుదురా?

సా. బా:- అవును.

శ్రాద్ధదినము "పున్‌టంబా" నుండి యిరువురు బ్రాహ్మణులు బాబాదగ్గఱకువచ్చి "మాకిచట బ్రాహ్మణ భోజనము దొఱకునా?" అని అడిగిరి.

సా. బా:- జోగ్ దగ్గఱకు వెళ్ళుడు!

వారు జోగ్‌దగ్గఱకు వెళ్ళిరి. ఆవచ్చినవారు తనశాఖవారును, శాస్త్రపారంగతులును. పితృశ్రాద్ధము జరిపించుటకు సమర్థులని జోగ్ తెలిసికొనెను.

## జోగ్ ఇచ్చిన అప్పు ( =230 )

378. జోగ్ ఔరంగాబాదులోని ఒకనికి రు. 1400లు అప్పు ఇచ్చెను. ఆనోటు వాయిదాకడచిపోవు ముందు.

జోగ్:- బాబా! ఔరంగాబాదు వెళ్ళుటకునాకు సెలవీయుము.

సా. బా:- అప్పుతీసికొనిన వాఁడే యిచటకు వచ్చును. అప్పుడతని నడుగుము.

జోగ్:- (ఉద్రిక్తుడై) నన్ను 2, 3 వేలు రూపాయలు నష్టపడమందువా? రేపట నుండి మీపూజ ఆరతులు నేను చేయను. ధనములేక నేనిక్కడ ఎట్లుబ్రతుకగలను?

సా. బా:- నీధనమెక్కడకు పోవును? ఇంటిలో ప్రశాంతముగ కూరుచుండుము. అది వచ్చును.

జోగ్:- నీమాటలు వినజాలను. వాఁడు తనంతటతానే వచ్చునా? నేనువెళ్ళినను నాపైకమును చెల్లించలేదు. 'దావా' వేసిన గాని నాపైకముతిరిగి యీయఁడు.

సా. బా:- ఆవిషయముట్లుంచుము!

జోగ్ తానిచ్చిన ధనము తిరిగిరాఁబట్టు కొనుఆశవదలు కొనెను. ఆనోటు వాయిదా వెళ్ళిన తరువాత కొంతకాలమునకు ఆఅప్పు తీసికొనినవాఁడు వచ్చి అతనికి జోగ్ ఇచ్చిన అసలు రు. 1400 లను ఈయబోయెను. జోగ్ సమ్మతింపలేదు.

సా. బా:- జోగ్! తీసికొని నోటురద్దు వ్రాసియిమ్ము!

అంతటజోగ్ తీసికొని ఆపైకమును బాబాముందు పెట్టెను. బాబా దానిలో కొంత తీసికొని మిగిలినది జోగ్‌నకు ఇచ్చెను.

# నార్కే ఉద్యోగము - సంతానము - ధర్మకర్తృత్వము

379. (1913 లో) జి. జి. నార్కే తల్లి:- (బాబాతో) నాబిడ్డ పెక్కుతావులకు అటునిటు త్రిప్పఁబడు చున్నాఁడు. వానికి స్థిరమైన ఉద్యోగములభింపలేదు. బాబా! వానినొకచోట స్థిరముగా నిలుపుము!

సా. బా:- నేనతనిని పూనాలో స్థిరపఱచుదును. మూఁడు సంవత్సరముల తరువాత కాశీ కళాశాలలో ఉద్యోగమునకు అవకాశము కలిగెను.

జి. జి. నార్కే:- బాబా! దానికి ప్రయత్నింతునా?

సా. బా:- మనకు కాశీతో ఏమిపని కలదు? మనము పూనాకు - సతారాకు పోవలయును.

1917 న పూనాలోని ఇంజినీరింగ్ కళాశాలలో ఉద్యోగము ఖాళీ ప్రకటింపఁబడెను.

జి. జి. నార్కే:- బాబా! దీని నభ్యర్థించ మందువా?

సా. బా:- కానిమ్ము! ప్రయత్నింపుము!

(తరువాత) సా. బా:- నార్కే ఎక్కడకు వెళ్ళినాఁడు?

భక్తులు:- ఉద్యోగ ప్రయత్నమున నతఁడు పూనాకు వెళ్లెను.

సా. బా:- అల్లా అనుగ్రహించును. అతనికి బిడ్డలుకలరా?

భక్తులు:- ముగ్గురు నలుగురు పుట్టిరి. కాని పసివారుగనే మరణించిరి.

సా. బా:- అల్లా అనుగ్రహించును.

1918 లో నార్కే పూనాలో ఉద్యోగమును సంపాదించుకొనెను. 1913 తరువాత జనించిన బిడ్డలు ఇప్పటికిని జీవించియున్నారు.

380. సా. బా:- (1913న. జి. జి. నార్కేతో) నీమామ 'ఖూటీ' ఇచటనొక దేవాలయము నిర్మించును. నీవు దానికి ధర్మకర్త వగుదువు.

1916-18 లో సాయీ దేవాలయము నిర్మింపఁబడెను. 1931 తరువాత సాయీ సంస్థానమునకు నార్కే ధర్మకర్తయై సమాధిమందిరము యొక్క యాజమాన్యము వహించెను.

381. సా. బా:- (యం. డబ్లియు. ప్రధాన్ సతితో) నీబిడ్డకు మూర్ఛకలుగును (రెండుగంటల తరువాత ఆబిడ్డకు మూర్ఛ వచ్చెను)

## కల్యాణ్ నివాసి — కార్ణిక్

382. సా. బా:- (కల్యాణ్ నివాసి కార్ణిక్ ప్రప్రథమమున శీర్డికి వచ్చి బాబాను దర్శించినపుడు) స్వాగతము! సాహుకార్!

కార్ణిక్ - ఆసమయమున దుర్భర దారిద్ర్యముననున్న వాఁడు. ఆపిదప పెక్కు సంవత్సరముల కతఁడు ఒక పెద్దసాహుకారు (కోటీశ్వరుఁడు) అయ్యెను.

## శ్యామావదిన — ప్లేగువ్యాధి.

383. శ్యామా సోదరుని భార్యకు ప్లేగుజ్వరమేర్పడి, పొత్తి కడుపుక్రింద బొబ్బ పొడమినది. శ్యామాసోదరుఁడు శీర్డికి వేగముగవెళ్ళి 'ఊధి' తీసికొని తనవెంటరమ్మని కోరెను. శ్యామా, ఊధిని ప్రసాదించి వెళ్ళుటకు సెలవిమ్మని బాబాను కోరెను.

సా. బా:- ఇప్పుడు 'ఊధి' పంపుము - దైవముమన ప్రభువు. ఆజ్వరము - బొబ్బ వానియంతట అవే శమించును. రేపు ఉదయమున వెళ్ళి తిరిగిరమ్ము - ఇప్పుడు వెళ్ళవలదు.

ఆ 'ఊధి' ఉపయోగింపఁబడెను. ఆరోగి స్వస్థతఁగనెను. మఱునాఁడు ఉదయమున శ్యామా అచటకు వెళ్ళగా అతని వదిన 'కాఫీ' సిద్ధపఱచుచుండెను. శ్యామా తిరిగి వచ్చి.

శ్యామా:- బాబా! ఎట్టి అద్భుతలీలలు నీవు కావించు చున్నాడవు!

సా. బా:- ఆ ప్రశంసయంతయు దైవమునకే, నేను భగ వానుని సేవకుఁడను మాత్రము.

బల్వంత్. జి. కపర్దే — ప్లేగు ( = 521 )

384. 1911 లో శీర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించెను. బల్వంత్. జి. కపర్దేకు జ్వరము. బొబ్బలు ఏర్పడెను. బల్వంత్ తల్లితో నామె బిడ్డ ప్రాణములను రక్షించుట కాతని వ్యాధిని తానాకర్షించు కొంటిని. అని బాబా ఆప్లేగు బొబ్బలను తన దేహమున చూపెను.

సా. బా:- (జి. యస్. కపర్దెతో) నీకుమారుని బల్వంతును రక్షించితిని. ఆ ఆజ్ఞలు అవితథములు— (తిరుగులేనివి.)

ఆదమ్ దలాలీ — అపరాధ ఆరోపణము

385. ఆదందలాలీ:- బాబా! అన్యాయముగ తీవ్రమైన నేరము నాపై ఆరోపింపఁబడినది.

సా. బా:- భయపడకుము! అన్నియు చక్కఁబడును.

ఆదందలాలీపై నేరము త్రోసివేయఁబడెను. ఆతనిని ప్రభుత్వ పక్షము సాక్షిగ తీసికొనిరి.

## హెచ్. యం. పెన్సే — నేరము తీర్పును గూర్చి పైకోర్టునకు అర్జీ

386. నాచ్నే:- (బాబాతో) బాబా హరిభావ్ యం-పెన్సే, తాను నిర్దోషి యగుటచే తనపై మోపఁబడిన నేరమునుగూర్చి పైకోర్టునకు అర్జీపెట్టుకొనినాఁడు. నీఅనుగ్రహము- సహాయము కోరుచున్నాఁడు.

సా. బా:- ఎట్టి ఆందోళన చెందవలదని అతనికిఁ జెప్పుము. పై అధి కారులు అతఁడు నిర్దోషియని తీర్పు చెప్పుదురు.

(అతఁడు నిర్దోషియని తీర్పు చెప్పబడెను.)

## ఒక బ్రాహ్మణుని మరణదండనము

387. సా. బా:- 4 రోజులలో నతఁడు నిర్దోషియని తీర్పు చెప్పఁబడును.

( ఆవిధముగ జరిగెను )

## విద్యార్థులకు (పరీక్షలో) బాబా సహాయము

1. టెండల్కర్
2. సపత్నేకర్ మిత్రుఁడు.

} ( చూ. 367 )

3. హ. సీ. దీక్షిత్ కుమారుఁడు. (చూ. 375 ) విజయము పొందిరి.

## 4. వైద్య విద్యార్థి

388. 1917 లో ఒక వైద్యవిద్యార్థి పరీక్షకు సిద్ధమగుచుండెను. ఆతని స్వప్నమున బాబా దర్శనమిచ్చి యిట్లనెను.

సా. బా:- నాకడుపు (ప్రేగులు) నొప్పిగా నున్నది. నీవు వైద్యుఁడవు. నా కౌషధము తీసికొనిరమ్ము.

విద్యార్థి:- నేనింకను విద్యార్థినే - వైద్యుఁడను కాను.

సా. బా:- పొమ్ము! మందు తీసికొనిరమ్ము!

ఆ విద్యార్థిలేచి లోపలికివెళ్లెను. బాబా అదృశ్యుండయ్యెను. ఆతని పరీక్షయందు కడుపునొప్పికి సంబంధించిన ప్రశ్ననడిగిరి.

## బాబా — సంస్కృతము బోధించుట.

389. సా. బా:- ముకుందలేలేశాస్త్రి యెదుట ఈ శ్లోకము నుదహరించెను.

"అపిచేదపిపాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వంజ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి"
(చూ. 355. A )

390. సా. బా:- (నానానిమోన్కర్‌తో) కాకా! నీవు పారాయణ మేలచేయవు?

నా. ని:- బాబా? నాకు సంస్కృతమురాదు.

సా. బా:- సందేహింపకుము. మనూది ఆయీ నీకు సంస్కృత మును బోధించును. క్రమముగా నీవు నేర్చుకొందువు. ప్రారంభింపుము!

నా. నిమోన్కరు ప్రారంభించి, త్వరలో అభివృద్ధి పడసి సంస్కృతమున పండితులైన హ. సీ. దీక్షిత్తునకు బాపూసాహెబ్ జోగ్ నకు 'జ్ఞానేశ్వరిని' వివరింపఁదొడఁగెను.

సా. బా:- (నా. ని. తో) మనమితరులకు విషయములు వివ రింపఁనేల? అదిమనకు అహంభావమును స్వాతిశయమును కలిగించును.

## బాబా - ఔషధయోగములు (నిర్దేశించు ఔషధములు)

391. సా. బా:- దేవాలయ సమీపమున నీదగ్గరకువచ్చు నల్ల కుక్కకు పెరుగుకలిపిన అన్నము పెట్టుము. (ఇది చలిజ్వరమునకు బాబా తెలిపిన ఔషధయోగము) ఆవిధముగ చేయఁబడెను. చలిజ్వరము నివారణమయ్యెను.)

392. సా. బా:- కాకామహాజని! వేరుశనగపప్పుతిని, నీరు త్రాగుము. నీపాయువు (మలద్వారము) గట్టిగ మూసికొనినది. (అతి సారమునకిది ఔషధయోగము అతిసారము శమించెను.)

393. సా. బా:- (ఖూటీతో) విరేచనమునకు వెళ్ళకుము! వాంతి చేయకుము! (ఖూటీ విరేచనములు, వాంతులు, ఏ ఔషధములు లేకయే నివారణమయ్యెను.)

394. సా. బా:- అతని (ఖూటీ) కలరా వ్యాధికి బాదము, సీమబాదముపప్పు, 'అక్రోటి' కాయపప్పుకషాయము పాలలోఁజేర్చి త్రాగుమనుము! (అపానీయము కలరావ్యాధిని నివారించెను.)

395. సా. బా:- బాగుగ వెచ్చచేసిన కలబంద నొప్పిగల భాగమున కట్టుమనుము. ఆ నొప్పి శమించును. [ఇది ఒక సేవకుని నడుమునొప్పిని నివారించెను.)

396. ఆర్. ఆర్. సామంతు బిడ్డల అతిసార వ్యాధికి బాబా 'శీరా' (గోధుమపిండితో సిద్ధపఱచిన ఒక తీపి ఆసనము) ఔషధయోగముగఁదెలిపెను. 'శీరా' తో వారి వ్యాధి ఉపశమించెను.

## బాబా - కర్మ సిద్ధాంతము

### డాక్టరు, జి. పిళ్లై - నారకురుపు.

397. డాక్టరు. జి. పిళ్లై:- (నారకురుపుచే మిక్కిలిగ బాధపడుచు హ. సీ. దీక్షిత్తుతో) కాకా సాహేబ్! ఈనారకురుపు బాధ దుర్భరముగనున్నది. దీనికంటె మృతియే మేలనిపించుచున్నది. ఈ బాధ పూర్వకర్మానుభవమే. సందేహము లేదు. బాబా దగ్గఱకు వెళ్ళి యీ బాధను ఇంతటనాపి, శేషించిన పూర్వకర్మఫలము నింక పది జన్మములలో అనుభవించి క్షయింపఁజేసికొనునట్లు అనుగ్రహింపుమనుము.

హ. సీ. దీక్షిత్తు బాబా దగ్గఱకు వెళ్ళి అతని ప్రార్థనమును విన్నవించెను.

సా. బా:- భయపడవలదని అతనికిఁజెప్పుము. ఇంక పది పుట్టువులేల? పది దినములలో ఆ బాధయంతయు పూర్తి చేసికొనఁగలఁడు. భక్తుల లౌకిక పారలౌకిక (ఆధ్యాత్మిక) శ్రేయమును గూర్చుటకే సాధు

సత్పురుషులు పొలుతురు. దీనికై పిళ్ళే కోరుచున్నది మృతినా? ఆతని నిక్కడకుఁ గొనిరమ్ము! ఆతనిని చీకాకు పడనీయకుము.

ఆడాక్టరు బాబా దగ్గఱకు వచ్చెను. బాబా ఆతడు విశ్రమించుటకు తనదిండు నొసఁగి యిట్లనెను, "దీనిపై నానుకొనుము. వ్యర్థాలోచనలను విడువుము. నీకాలు చాచుకొని నిశ్చింతగ నుండుము. నిక్కముగ అనుభవింపకయే కర్మము విరుగడకాదు. (తీరదు) అది సత్యము. సుఖ దుఃఖములకు కర్మమే కారణము. నీకేది యెటుల ప్రాప్తించిన సహింపుము. అల్లామాలిక్! దైవము సర్వనియంత - రక్షకుఁడు ఎల్లపుడా ప్రభువునే తలంపుము. ఆతఁడెల్లరను కాపాడును, ఆస్వామికి సంపూర్ణశరణాగతిఁజేయుము. ఎల్లపుడా ప్రభువును గూర్చియే తలంచుము. ఆస్వామి యేది యెట్లు కావించునో నీవు తెలిసికొనఁగలవు.

అంత నా. గో. చందోర్కరు ఆగాయముపై కట్టుకట్టెను.

సా. బా:- దానిని తీసివేయుము. నానా పిచ్చివాఁడు' అది నిన్ను చంపును. ఇపుడొక కాకివచ్చి ఆగాయమును పొడుచును. అది నీకు క్షేమము కలిగించును.

మఱునాఁడు అబ్దుల్ క్రిందికి మెట్లుదిగుచు, చూడక తన పాదమును పిళ్లె కురుపుపై నిలిపెను. వాచిన ఆ పుండు త్రొక్కఁబడెను. అందలి పురుగులు వెలుపలకు త్రోయఁబడెను. డాక్టరు పిళ్లె మిక్కిలి బాధతో పెద్దపెట్టున కేక పెట్టెను- తరువాత,

పిళ్లె:- బాబా! ఇఁకమీద ఆకాకివచ్చి నా పుండును పొడుచునా!

సా. బా:- రాదు ఆ కాకి (అబ్దుల్) వచ్చినది. ఆ పుండునగల పురుగులు వెలార్చఁబడినవి పొమ్ము! వాడలో విశ్రమింపుము.

ఊధిని లోపలికిఁగొనుచు, పుండుపైన అలదుటచేత ఏ యితర ఔషధములతో నిమిత్తము లేకయే పదిదినములలో ఆనారకురుపు పూర్తిగ నివారణ మయ్యెను.

## ii శరణాగతుండు — కర్మము నతిక్రమించుట

### భీమాజి పటేల్,

398. పూనామండలమున 'జున్నేర్' అను గ్రామమున 'భీమాజీ పటేల్' కలండు. విడువని జ్వరము, నెత్తురుకళ్లె, జీర్ణాశయ బాధతో గూడిన క్షయవ్యాధి కలిగెను. కావించిన చికిత్సలన్నియు వ్యర్థమయ్యెను. నా. గో. చందోర్కరు అతనిని సాయినాథుని దగ్గఱకు పంపెను. భీమాజీని టాంగా నుండి దింపుటకు నలుగురు మనుష్యులు సాయపడ వలసివచ్చెను. శ్యామా ఆతనిని బాబా దగ్గఱకుఁజేర్చెను.

సా. బా:- శ్యామా! ఈ దొంగను నాదగ్గఱకుఁ గొనివచ్చి ఎంత బాధ్యతా రూపమగు బరువు నా భుజములపై నిలుపుచున్నాఁడవు!

అంత భీమాజీ తన తలను బాబా పాదములమోపి, ఓ దీన బంధూ! నేను దీనుఁడను. నాపై జాలివహించి అనుగ్రహింపఁ బ్రార్థించు చున్నాఁడను.

బాబా తనవైఖరిని మార్చి, చిఱునగవుతోప నాతనితో నిట్లనెను.

సా. బా:- నిలువుము! ఆందోళన విడువుము! వివేకులు విచారము వహింపరు. నీవు శిర్డిని మెట్టిన తోడనే నీపూర్వకర్మ ఫలానుభవములు తీరినవి. అతికఠిన కష్టములచే కృశించి క్రుంగిన జనులు ఈ మసీదునందలి మెట్లెక్కిన తోడనే ఉద్ధరింపఁబడి సుఖానందములఁ బడయుదురు. ఆఫకీరు (దైవము) మిక్కిలి దయామయుఁడు. నీవ్యాధిని నిర్మూలించును. ఆయన ప్రేమను ప్రదర్శించును. సకల జీవులయెడ దయఁగలవాఁడు. పొమ్ము! భీమాబాయి యింటనుండుము!

ఆ విధముగ భీమాజీ శిర్డియందు భీమాబాయి యింట బాబా ప్రసాదించిన ఊధిమాత్రమే ఉపయోగించుచు నుండెను. మొదటి రోజున బాబా స్వయముగ ఊధిని అతని నుదుటనుంచి, తన అభయ హస్తము నాతని శిరముపై జేర్చి, అనుగ్రహించెను.

సా. బా:- భీమాజీ! నీ విడిదికి నడిచిపొమ్ము!

ఆ పటేల్ ఎవరి సహాయము లేకయే తనబండి దగ్గఱకు నడిచి వెళ్ళెను. బాబా ఏ ఔషధములీయలేదు. అన్నిటికంటె బలీయమైనది, సమర్థమైన దానినే ప్రసాదించెను. భీమాజీ రెండుకలలు కనెను. మొదటి స్వప్నమందు అతఁడొక బాలుఁడుగ నుండెను. ఉపాధ్యాయుఁడతనికి పాఠము బోధించుచు బెత్తముతో అతికఠినమైన దెబ్బలు కొట్టెను. అతఁడా నిద్రలో పెద్ద పెట్టున అఱచుచు ఏడ్చెను. రెండవ కలలో ఎవరో అతని ఱొమ్ముపైకెక్కి దానిపై పెద్ద రుబ్బుడు బండను అటునిటు పొరలించి నట్లు కనెను. అతని ప్రాణములు పోయినంత బాధతోచినది. అంతట నతఁడు మేల్కొనెను. ఈ రెండు స్వప్నములలో నాతని జాడ్యమడు గంటెను. ఆతఁడు మెల్లగ మసీదునకు వెళ్ళి బాబా పాదములకు మ్రొక్కెను. ఒకనెల బాబా దగ్గఱ గడపి సంపూర్ణమగు ఆరోగ్యము పడసి స్వగ్రామమునకు తిరిగి వెళ్లెను.

## ప్రారబ్ధము వ్యతిరేకముగనున్నను బాబా సంతతి ననుగ్రహించుట

399. 'హర్దా' నివాసి 'సింధియా' అను నతనికి ఏడుగురు పుత్రికలు జనించిరి - కాని, కుమారుఁడు కలుగలేదు.

1903లో నతఁడు "గంగాపూర్"నకు వెళ్ళి, అంత దత్తస్వామిని పుత్రుని ప్రసాదింపుమని ప్రార్థించి, సంవత్సరము లోపల కుమారుఁడు కలిగిన ఆ బిడ్డను స్వామి దర్శనము చేయించుటకు గంగాపురమునకు తీసికొనివత్తునని మ్రొక్కుకొనెను. 12 నెలలలో నతనికి కొడుకుపుట్టెను. కాని యాతఁడా బిడ్డను గంగాపూరునకుఁ దీసికొని వెళ్ళలేదు. 1911 నవంబరునెలలో శిర్డికి వెళ్ళి బాబాను సందర్శించెను.

సా. బా:- ఏమి! నీవు గర్వించుచున్నావా? నీ (నశీబ్) ముఖమున వ్రాయుబడిన వ్రాతలో పుత్రప్రాప్తి ఎచట కలదు? (తన శరీరముఁ జూపుచు) ఈ శరీరమును చీల్చి నీకుమారుని ప్రాసాదించితిని.

దామోదర్ రసానే విషయమునఁగూడ అతని జాతకములోని గ్రహదోషములను సైతము త్రోసి రాజని అతనికి బాబా సంతానమును ప్రసాదించెను.

(గమనిక.) మాంత్రిక విధానములతో బాబా పద్ధతులను పోల్చి చూడుడు!

శ్రీమద్భాగవతము, vi (19) 25-26 కాశ్యపుడు పుంసవన వ్రతము బోధించిన ఘట్టము.

"ఏతచ్చరిత్వావిధివద్వ్రతంవిభో। రభీప్సితార్థంలభతేపుమానిహ
స్త్రీత్వేతదాస్థాయలభేతసౌభగం । శ్రియంప్రజాంజీవపతింయశోగృహం
కన్యాచవిందేతమసమగ్రలక్షణం । వరత్వవీరాహతకిల్బిషాగతిమ్
మృతప్రజాజీవసుతాధనేశ్వరీ । సుదుర్భగాసుభగా రూపమగ్ర్యమ్"

## బాబా — ఔషధములేకయే వ్యాధినివారించుట

400. సా. బా:- (దూరగ్రామమున భార్యవ్యాధిగ్రస్తయై యున్న మహల్సాపతితో) నీభార్య కంఠమువాపుచే మిక్కిలి బాధపడు చున్నది. నేను నివారింతును. అది యితరులవలన సాధ్యముకాదు.

మహల్సాపతి ఆకంఠమువాపు విషయముగాని, మఱియేజబ్బు విషయముగాని యెఱుఁగఁడు. ఆతనిభార్య కంఠమువాపు చేబాధపడినట్లు. నివారణమైనట్లు ఆతనికి తరువాత ఉత్తరము అందెను.

## హ. సీ. దీక్షిత్తు సోదరుఁడు

401. హ. సీ. దీక్షిత్తు సోదరుఁడు నాగపూరులో వ్యాధిగ్రస్తుఁడై యుండెను. ఆవిషయమును తెలుపు జాబు దీక్షిత్తు శీర్డియందు బాబా దగ్గఱనుండగా అందెను.

హ. సీ. దీక్షిత్తు:- బాబా! (నా సోదరునకు) నేనెట్టి సహాయము చేయలేని స్థితిలోనున్నాఁడను. (అనగా తన తమ్మునకు తానే రూపమైన సాయము చేయలేకున్నాడను అని భావము)

సా. బా:- నేను మిక్కిలి సహాయము చేయనున్నాను.

బాబా పలికిన పలుకులలోని శక్తి హ. సీ. దీక్షిత్తునకు తరువాత విదితమైనది. దీక్షిత్తు బాబాతో మాట్లాడుచున్న సమయమున నాగపూరులోనున్న అతని సోదరుని దగ్గఱ కెవరో వెళ్లి, ఇక్కడ బాబాపలికిన పలుకులే "నేను మిక్కిలి సహాయము చేయనున్నాను" అనిపలికి, ఆతనిని స్వస్థునింగావించెను.

## బాబా - తన ఇచ్ఛాశక్తి నితరులలోగంజేయుట
## ఇతరుల బుద్ధులను నియమించుశక్తి

### (i) జి. యస్. కపర్దేపై నేరము మోపంబడుట

402. సా. బా:- ఆగవర్నరు బల్లెమునుచేంబూని దాదా సాహెబును (జి. యస్. కపర్దెను) పొడువ వచ్చెను. కాని నే నాతనిని తుదకు సమాధానపఱచి పంపితిని.

[ఆ సమయమున లోకమాన్య బాలగంగాధరతిలక్ చెరసాలలో బంధింపంబడెను. అతివాదులలో ముఖ్యుండని జి. యస్-కపర్దేపై నేరము మోపి ఆతనింగూడ కారాగారశిక్ష విధింప ప్రభుత్వమువారు యత్నించు చుండిరి. "నేనిచటనుండ నీంకభయమేల?" అను బాబా అభయ ప్రదానమును విశ్వసించి కపర్దే, బాబాదగ్గఱ 6 నెలలుండెను జి. యస్. కపర్దేమీద ఎట్టినేరము మోపంబడలేదు.]

402A. యం. బి. రేగే 1914న క్రిస్మస్ సెలవలలో శీర్డికి ప్రయాణమై తనవెంట 'పి. ఆర్-అవస్తేనుగూడ తీసికొని రాందలంచెను. కాని, విచారణములు పూర్తి అయిన దావాలన్నిటికి తీర్పులు పూర్తిచేయు వరకు స్వస్థానము విడిచి వెళ్ళరాదని పై అధికారులు 'అవస్తే'కు ఉత్తరువులు పంపిరి. సాధారణముగ 2, 3, రోజులలో ఆ తీర్పులన్నియు పూర్తిచేయుట అతనికి సాధ్యము కానిపనియే. కాని, 'అవస్తే' పనింబూని కూర్చుండి సఫలుండయ్యెను. అంతట రేగే - అవస్తే - ఇరువురు

ఇందూరు నుండి రైలులో వచ్చుచుండ మార్గమున 'మ్హౌవ్' అను సైనిక స్టేషన్ చేరిరి. అచట సైనికాధికారి ఉత్తరువుల ప్రకారము ప్రయాణీకులు రేగే - అవస్తేలుకూడ దిగవలసివచ్చెను. తలవని తలంపుగ సేనాధికారివచ్చి, రేగే - అవస్తేలున్న పెట్టె అవసరములేదని దానిలో వారి నెక్కమనెను. వారు శీరిడికిఁజేరి బాబాను దర్శింపఁగ -

సా. బా:- (రేగేను చూపుచు) చూడుడు! ఈతఁడొక్కఁడు వచ్చుటకు తృప్తినొందఁడు. ఇతరులనుకూడ వెంటఁగొనిరా పట్టుదల వహించును.

సా. బా:- (మరల) నా బిడ్డలను వారు రైలునుండి దింపఁ దలంచిరి వారిని నా దగ్గఱకు రానీయుమని నేను సేనాధిపతితో చెప్పితిని.

రేగే రైలు ప్రయాణమున రాత్రియంతయు మేల్కొని బాబా భజనముఁ గావించుచునే యుండెను. అతడు శీర్డికిఁజేరఁగనే.

సా. బా:- (రేగేను చూపుచు) ఇతఁడురాత్రి నన్ను కన్ను మూయనీయ లేదు. నాశయ్యచుట్టు రాత్రియంతయు 'బాబా! బాబా!' - అను కేకలే!

403. సా. బా:- (బి. వి. దేవ్‌తో) ఇది 25 రూపాయలు గూర్చిన వివాదము! నేను తఱచుగ 25 రూపాయలు ఈయుమని చెప్పితిని. కాని, అతడు నామాట లాలకించుటలేదు. 2 లేక 4 నెలలులో నతఁడిచ్చును—

[ఆ సమయమున బి. వి. దేవ్‌నకు పైకక్ష్యకు పెంపు, జీతమునందు 25 రూపాయలు అభివృద్ధిని. పై అధికారులు నిలుపుదల చేసిరి. 2 (లేక) 4 నెలల కావల నతఁడా రెంటినిఁ బడయఁగలిగెను.]

404. బాబా సేవకుఁడు 'రఘు' మఱి ఐదుగురు ఒక మార్వాడీకాంతను మానభంగము కావించిరను నేరమున 6 నెలల కాలము

చెరసాల శిక్ష విధింపఁబడిరి. రఘు చెరసాల యందుండి ఏడ్చెను. బాబా అతని స్వప్నమున గోచరించి, "మఱునాఁడు, విడుదల యగుదువు" - అని అభయమిచ్చెను, అంతకుముందు, నేరము తీర్పుకు సంబంధించిన కాగితములను చదివిన న్యాయవాదులు, పై న్యాయస్థానమునకు 'అపీల్' చేసిన లాభములేదనిరి.

తాత్యాపటేల్:- బాబా! 'అపీల్' కాగితములివి.

సా. బా:- వానిని భావ్ (యస్. బి. ధుమాల్ — నాశిక్‌లో న్యాయవాది) దగ్గఱకుఁదీసికొనిపొమ్ము!

ఆకాగితములను తీసికొని వెళ్లిరి. యస్. బి. ధుమాల్ క్రింది కోర్టు తీర్పు-పై కోర్టుకు 'అపీల్' కాగితములు అహమ్మద్‌నగర్ జిల్లా మేజస్ట్రేటు బంగళాకు తీసికొని వెళ్ళెను.

జి. మేజస్ట్రేటు:- నీవు దేనికివచ్చితివి?

ధుమాల్:- సాయిబాబా సేవకుఁడు రఘు, మఱి ఐదుగురపై చెప్పబడిన నేరము తీర్పునుగూర్చి, పై కోర్టునకు 'అపీల్' అందించుటకు.

జి. మేజస్ట్రేటు:- ఆ విషయములేవి?

ధుమాల్ అందలి విషయముల సంక్షేపముగ దెలిపెను.

జి. మేజస్ట్రేటు:- అది బలీయమైన తీర్పుగా కనఁబడుచున్నదే! ఏమి! ప్రత్యక్షముగ చూచిన ఆరుగురు సాక్షులా? నీవేమి అభిప్రాయపడుచున్నావు?

ధుమాల్:- ఆరుగురేమి? పాక్షిక వైషమ్యములుగల శిర్డీవంటి గ్రామము 60 మంది ప్రత్యక్షసాక్షులను సంపాదింపఁ గలరు.

జి. మేజస్ట్రేటు:- నీవటుల తలంతువా?

ధుమాల్:- తలంచుట! ఏల! గాఢముగ విశ్వసించుచున్నాడను.

జి. మేజస్ట్రేటు:- మంచిది. నీకక్షిదారుల నందఱను నిర్దోషులని తీర్పు నిత్తును. నీ 'అపీల్' కాగితము లిటు తెమ్ము.

ఆ జిల్లామేజస్ట్రేటు క్రిందికోర్టు తీర్పు దానికి సంబంధించిన కాగితములు తెప్పించుకొనక 'అపీలు' లోని విషయములను విశ్వసించి, వారందఱు నిర్దోషులని తీర్పునిచ్చెను.

జి. మేజస్ట్రేటు:- మీ సాయీ బాబా హైందవుఁడా? మహమ్మదీయుఁడా?

ధుమాల్:- ఈ ఇరుతెగలకుఁజేరఁడు. ఈ యిరువురకు అతీతుఁడు.

జి. మేజస్ట్రేటు:- ఆయన ఏమి బోధించును.

ధుమాల్:- దానిని తెలిసికొనుటకు నీవు స్వయముగ వెళ్ళఁదగును.

ఆరోజుననే అహమ్మద్ నగర్‌నుండి ఆ విడుదల చేయఁబడిన వారు శిర్డికి తిరిగి వచ్చుచుండఁగా-

సా. బా:- (కొందఱు గ్రామజనులతో) ఇక్కడకురండు! మీ రొక చమత్కారము (ఆశ్చర్యము) చూచుదురు.

కొంచెము కాలము గడచినపిదప యస్. బి. ధుమాల్. ఆ విడుదల చేయఁబడిన ఆరుగురు శిర్డికిఁజేరిరి. అదియే చమత్కారము.

బాబా ఆ జిల్లా మేజస్ట్రేటు బుద్ధిని ప్రేరేచి, ఇతర కాగితములతో, ఇరుపక్షముల విచారణముతో నిమిత్తము లేకయే, ఆ ఆరుగురను నిర్దోషులు అనుతీర్పు నీయ నియమించెనని బాబా పలుకులు- ఆ మేజిస్ట్రేటు పలుకులు నిరూపించుచున్నవి.

## బాబా - ఇతరులబుద్ధుల నియమించి ఆటంకములు తొలగించుట.

### (iii) దేవ్ - మామ్లత్‌దార్.

405. బి. వి. దేవ్. బి. ఏ; మామ్లత్ దార్. 'జ్ఞానేశ్వరి' ని పారాయణము చేయందలంచెను. కాని, యెప్పుడు ప్రారంభించిన ఏదో ఒక ఆటంకము తప్పక కలుగుచుండెను. కావున బాబా ప్రారంభింపుమని ఆజ్ఞాపించు నంతవరకు పారాయణము ప్రారంభింపంగూడదని అతండు నిశ్చయించుకొనెను. దేవ్. శీర్డికివెళ్ళి. (ఆగ్రంథమునుతిరిగి యిచ్చునను తలంపున) 'జ్ఞానేశ్వరి'ని ఒక రూపాయిని బాబాకు సమర్పించెను.

సా. బా:- ఒక రూపాయి యేల? 20 రూపాయలు తెమ్ము!

దేవ్ తీసికొనివచ్చి 20 రూపాయలు బాబాకు సమర్పించెను. కాని బాబా (పోతీ) పారాయణమునుగూర్చి, యేమియు చెప్పలేదు. బాబా అనుగ్రహమున ఆధ్యాత్మికాభ్యున్నతిని పొందుచున్న 'బాలకరామమాన్కర్'ను జేరి, అతండు పొందిన అనుభూతులను. బాబా కరుణ కాతండెట్లుపాత్రుండైన విషయములను దెలుపుమని అడిగెను. ఆవిషయములను మఱునాండు సాయంత్రము తెలుపుదునని బాలకరాము చెప్పెను. మఱునాండు.

సా. బా:- (దేవ్‌తో) 20 రూపాయలిమ్ము.

దేవ్ ఆపైకము బాబాకు సమర్పించి తిరిగివెళ్ళి బాలకరాముతో మాట్లాడు చుండెను. బాలకరాము చెప్పుట ప్రారంభించెను.

ఆసమయమున బాబా, దేవ్‌ను పిలువనంపెను. దేవ్ వెళ్ళెను.

సా. బా:- నీవేమి మాటాడుచున్నావు? ఎవరితో? ఎక్కడ?

దేవ్:- దీక్షిత్ వాడలో మీ గొప్పతనము కీర్తినింగూర్చి బాలకరాముతో మాట్లాడు చున్నాను.

సా. బా:- 25 రూపాయలు తెమ్ము!

దేవ్ తీసికొనివచ్చి 25 రూపాయలు బాబాకు సమర్పించెను.

సా. బా:- ఇక్కడ మసీదులో కూర్చుండుము!

అంతట బాబా తలవని తలంపుగ మిక్కిలి ఆగ్రహావేశమున "నాగుడ్డపేలికలేల దొంగిలించు చున్నాఁడవు? తల నెరసిన వాడవై యుండియు అట్లు దొంగిలుట నీ పద్ధతియా? గొడ్డలితో నిన్ను చంపుదును" అనిపలికెను.

దేవ్ మిక్కిలి ఆందోళన చెందెను. ఆగుడ్డ పేలికలేమిటో ఆతనికి బోధపడలేదు- ఆకోపము తుదకు దేనికి దారితీయునో ఆతఁడెఱుఁగ కుండెను. అటులపది నిమిషములు ఆగ్రహావేశమున గడచినపిదప దేవ్ విడిదికి పంపఁబడెను. అరగంట గడిచినపిదప దేవ్ మఱి యితరులు మసీదునకు పిలువఁబడిరి.

సా. బా:- తంబీభావ్! ఆగుడ్డపేలికల విషయమై మాట్లాడుచు నిన్ను నొవ్వఁజేసితినా? దొంగతనమేదేనిఉన్న, దానిని తెలుపవలయును. వేఱుమార్గములేదు. అది అట్లుండనిమ్ము! దైవము సకలమును కనిపెట్టి యుండును. అంతట దేవ్‌ను 12 రూపాయలు దక్షిణ నడిగెను. దేవ్ తెచ్చి యిచ్చెను.

సా. బా:- (దేవ్‌తో) నీవేమి చేయుచున్నావు?

దేవ్:- ఏమియు లేదు.

సా. బా:- వాడలో ప్రతిఉదయము పారాయణము చేయు చుండుము. నేను నీకు పూర్ణమగు చక్కని జరీఅంచు సాలువ బహూకరింపఁదలచి యుండఁగ చినిగి చీకిన గుడ్డలకై వెళ్ళి నీవు దొంగిలింపనేల?

దేవ్ జ్ఞానేశ్వరి పారాయణము ప్రారంభించెను. ఇఁక ఆతని కెట్టి ఆటంకములు కలుగలేదు. బాబా యొక్క మహాద్భుత నియంతృత్వ దివ్యశక్తి సంపదఁదెలుపునది స్వకీయానుభూతి; కావున, ఇతరుల

అనుభవములంగూర్చి తెలిసికొన వలసిన అవసరములేదు. అట్టి స్వాను భవమే చక్కనిజరి అంచు సాలువయని- ఇతరుల అనుభూతులం గూర్చి వారి వీరివలన వినుట చినిగిన గుడ్డపేలికలను దొంగిలించుట - యని, దేవ్ గ్రహింపంగలిగెను.

ఎట్టి ఆటంకములులేకయే దేవ్ జ్ఞానేశ్వరి పారాయణను సాగింపం గలిగినను, అందలి భావమును గ్రహించుట యందెట్టి అభివృద్ధి పొంద లేకుండెను. ఒకనాండు బాబా అతని స్వప్నమున గోచరించి.

సా. బా:- నీవు చదువునది బోధపడుచున్నదా?

దేవ్:- (కన్నీరు స్రవించుచు) లేదు - బాబా! నీ కరుణను ప్రసరింపంజేయవేని నేనెట్లు గ్రహింపంగలను?

సా. బా:- నీవు త్వరగ చదువు చున్నాండవు. నా ప్రక్కనం గూర్చుండి చదువుము.

దేవ్:- దేనిని చదువుదును?

సా. బా:- అధ్యాత్మ-

అంతట దేవ్ వెళ్ళి అధ్యాత్మరామాయణము తీసికొని వచ్చెను. దానితో స్వప్నమంత మొందెను. దేవ్ మేలుకొనెను.

బాబా యీ విధముగ 'గాడ్గీభావ్' యొక్క దురదృష్టమును తొలంగించెను. అతండు ప్రారంభించిన సత్రముల నిర్మాణము పూర్తి చేయలేక పోయెను. కావున అతండు సాయిబాబా దగ్గరకు వెళ్లెను. బాబా ఆతనిని చెడందిట్టెను. భావ్ నవ్వెను. అతని దురదృష్టము తొలంగెను. ధనము సమకూడెను. సత్రములు పూర్తియయ్యెను.

## 405. A. పరమానంద బాబా

ఏవిధమైన పలుకులు పలుకకయే భక్తుల హృదయములను ఆనంద ప్రపూర్ణముం గావించువాండు. ఉదా:-1) యస్. జి చందో

ర్కర్ 2) నారాయణ ఆశ్రమ. 3) మేనేజర్ సతి (సదాశివతార్కాడ్‌సతి) 4) జి. యస్. కపర్దే. (యోగదృష్టిచేత) 5. దక్షిణ ఆఫ్రికా డాక్టరు.

## అంతర్జ్ఞానము — (ఋతంభరప్రజ్ఞ.)

### (1) బాబాస్పష్టీకరణము.

406. బాబా ఒకదినమున మధ్యాహ్న హారతి పూర్తియైనతోడనే (బాబాభక్తులెల్లలకు వారివారి నిత్యానుభవముల గుర్తింపఁగలుగు విషయము) యీ విధముగఁ బలికెను.

మీరెక్కడనైన నుండుడు. మీరేమైనను కావింపుడు. ఇది సర్వ కాలముల జ్ఞప్తియందుంచుకొనుఁడు. మీరు తలంచునది, పలుకునది, కావించునది నేనెల్ల వేళల తెలిసికొను చుందును.

### (2. బాబా తన సర్వజ్ఞత్వమును నిరూపించు స్థిరనిదర్శనములను — హ. సీ. దీక్షిత్తునకు ఎఱుకపఱచుట.

407. 1917 దసరా తరువాత కాకా మహాజని యజమాని (టాకర్ సేసేత్) జబ్బుగానుండెను. సేత్ కుమారుఁడు మహాజనిని శీర్డికివెళ్ళి, తన తండ్రి ఆరోగ్యమునుగూర్చి బాబా ఆజ్ఞలను తెలిసికొని రమ్మని తనతండ్రి చెప్పినటుల కాకామహాజనికిఁ జెప్పెను. హ. సీ. దీక్షిత్తు శీర్డియందున్న వాఁడు కావున ఉత్తరము వ్రాయుదమని మహాజని అనెను. కాని, ఆ, సేత్ కుమారుఁడు అటులకాదు - మహాజని స్వయముగా వెళ్ళి బాబా ఆజ్ఞలను కొనివచ్చినగాని తన తండ్రికి సంతృప్తి కలుఁగదనెను. అసమయము మున శీర్డిలో బాబా, హ. సీ. దీక్షిత్తుతో "అచట జరుగుచున్న చర్చలు- ఆ ఆలోచనలు ఏమి?" అనెను. ఆ మఱునాడు కాకామహాజని శీర్డికిఁజేరి, బాబాను సందర్శించి, తాను వచ్చిన విషయమును తెలుపఁగా "నిన్న నేను నీతో పలికిన విషయమిదే - అని బాబా - దీక్షిత్తుతోననెను.

అంత కాకా మహాజని - హ. సీ. దీక్షితు ఈ విషయమును గూర్చి కలియఁబలుకుకొని, వందలమైళ్ళ దూరమున ఏమి జరుగుచున్నది, పలుకుచున్నది సకలము బాబా తెలిసికొనగలఁడని వారు గుర్తించిరి.

## (3) బాబా గజానన్ మహారాజు నిర్యాణము

408. 'షిగోను' నందు గజానన్ మహారాజు నిర్యాణ మొందఁగా శీర్డియందు బాబా "నాగజాననుఁడు దాటిపోయినాఁడు"- అనెను.

శీర్డిలోని వారు కొందఱు గజానన్‌మహారాజు విషయమునుగూర్చి 'షిగోను'నకు ఉత్తరము వ్రాసిరి. బాబా తెలిపిన దినముననే గజానన్ మహారాజు పరమపదించినటుల సమాధానము వచ్చెను.

## సర్వవ్యాపిత్వము - అంతర్జ్ఞానము
## సర్వజ్ఞత్వము అథర్వవేదము

ఇరువురుచేరి ఆలోచనలు చేయుచున్న, వరుణుఁడు మూఁడవ వాఁడు గఁజేరి సకలము నెఱుఁగును.

గగనోపరిస్థలమునకు చాలదూరము ఎగిరి పాఱిపోయినను, వరుణునిదాటి పోఁజాలఁడు.

> భూమ్యాకాశములమధ్య ఇంకను వీనికావలవరుణుఁడు చూడఁ గలఁడు. మనుష్యుల పక్ష్మచలనములను బంధించినాఁడు.
>
> అథర్వవేదము. iv: 16-2, 4, 5.
>
> సకలసముద్రములు ఆతనివడుము (రొండి) అయినను
> వరుణుఁడు ప్రతిబిందువునందు నధివసించియున్నవాఁడు. ,, ,,3

## (4) దాస్‌గాణు - 'పోలీసు సబిన్స్పెక్టరు' పదవి.

409. సా. బా:- (అపుడొక కాన్స్టెబిల్ అయినదాస్ గాణుతో) గాణు! నీపోలీసు ఉద్యోగమువిడిచి పెట్టుము.

దా. గా:- బాబా! నేను ఫౌజుదారు (సబిన్స్పెక్టరు) నై ఒక సంవత్సరము పనిచేసిన పిదప ఉద్యోగమును వదలుదును.

సా. బా:- నీవు దానిని పొందలేవు.

గాణూ పై అధికారుల అనుమతిలేకయే తన పొలిమేరదాటి నైజామురాష్ట్రము పొలిమేరలోనికి వెళ్ళెను. అతఁడు తిరిగి స్వస్థానమునకు వచ్చుటకు గోదావరి తీరముఁజేరెను. అతనిపై ఈర్ష్యగల పోలీసులు ఆవలతీరమునుండి ఆతనిఁగనిపెట్టి అధికారులకుఁదెలుప వారువేచియున్నట్లు గాణూ గుర్తించెను. అంతట నతఁడు గోదావరీజలములను దోసిటఁబట్టి 'ఆ అపాయమునుండి (శిక్షనుండి) తాను తప్పుకొనిన, తన ఉద్యోగమును విడుతునని ప్రమాణ పూర్వకముగ బాబాను ప్రార్థించెను. వెనుకకు తిరిగి నైజాము సరిహద్దువైపునకు దృష్టిమరల్చెను. దొంగలు కొందఱు దోచినధనమును పంచుకొనుట నతఁడుచూచెను. వారిని బంధించి, ఆదోపిడీ ధనముతో వారిని తన వెంటఁగొనివచ్చి తన పోలీసు స్టేషనునకుఁజేరెను. ఈ కారణమున తన స్థానమువిడిచి వెళ్ళినటుల గాణూ పై అధికారులకుఁ దెలుపు కొనెను. దానిచే అతనికి శిక్ష లేకపోవుటయే కాదు – ఉద్యోగాభివృద్ధికి మంచి అవకాశమేర్పడెను. అందుచే నతఁడు ఉద్యోగము విడువ లేదు. ఒకనాఁడు తన ఉద్యోగము పనిమీద వెళ్ళుచు బాబా కంటఁబడకుండుటకై శిర్డిప్రక్కగా గుట్టముపై పోవుచుండ బాబా అమార్గమున గాణూకు ఎదురయ్యెను.

సా. బా:- గాణూ! గోదావరీ జలమును దోసిటఁబట్టి ప్రమాణము చేసిన వారెవరు?

దా. గా:- బాబా! అందేమి చెప్పుగలదు? నేనీ ఉద్యోగమును సత్యముగ విడువనున్నాఁడను.

సా. బా:- ఆగుము! పరిస్థితులిట్లు (అనుకూలముగ) ఉన్నంత వరకు నామాటలు వినవు,

కొంతకాలము తరువాత మిక్కిలి ప్రమాదస్థితి యేర్పడెను. ఒక నేరము చేసినవానినుండి 'వసూలు' చేయబడిన 'జుల్మానా' గాణా ఆధిపత్యముననున్న స్టేషన్‌లో అతడు లేని సమయమున చెల్లింపఁబడెను. ఆధనము పై అధికారులకు జేరలేదు. కావున గాణాపై నేరము మోవబడెను. అతనికి చెరసాల శిక్షకూడ ప్రాప్తమగు స్థితి కలిగెను.

అంతట గాణా ఆ అపాయమునుండి తప్పుకొనగలిగిన తన ఉద్యోగమును త్యజింతునని ప్రమాణముచేసి బాబాను ప్రార్థించెను. బాబా అనుగ్రహమున ఆధనమపహరించిన ఉద్యోగి పట్టుబడుటచే గాణా ఆనేరము - శిక్షనుండి తప్పుకొనెను. ఉద్యోగమును విడిచెను.

## (5) తెంబెస్వామి - కొబ్బరికాయ.

410. దాస్ గాణా సంచారమున, తెంబెస్వామి అతని కొక కొబ్బరికాయనిచ్చి, దానిని శ్రీ సాయిబాబాకు సమర్పింపుమనెను. కాని, మార్గమధ్యమున గాణామిత్రులాకాయను పగులకొట్టితినిరి. గాణా శిర్డీకిఁ జేరి వట్టిచేతులతో (కొబ్బరికాయలేకయే) బాబాను దర్శించెను. అతని కెదురుగ బాబా వెళ్ళి యిట్లనెను- "ఇదుగో! దొంగ. నా సోదరుఁడిచ్చిన కొబ్బరికాయఏది?"

## (6) కాకా మహారాజు నిర్యాణము ( = 214)

411. దోపేశ్వర్‌లోని కాకామహారాజు తానాప్లీడరు (సాతే అల్లుని తమ్ముడు, హెచ్-జి. జోషిని, మఱియొకరిని శిర్డీకివెళ్ళి సాయిబాబాను సందర్శింపుఁడని ఆజ్ఞాపించెను. కానివారు కొంతసేపు వేచియుండిరి. కాకామహారాజు పరమపదించెను. వారు శిరిడి మసీదుఁజేరినపుడు బాబా మిక్కిలి ఆగ్రహావేశమున పారవశ్యస్థితియందుండెను. బాబా వారినిఁజూచెను. "వారి నిరువురను ఈమసీదులోనికిఁ గానిరండు!" అనెను.

వారు లోనికివెళ్ళగా బాబా శాంతివహించి ప్రసన్నుఁడయ్యెను.

సా. బా:- మీరు. ఆ ముసలివానిని చంపి యిచటకు వచ్చితిరా?
(ఇది కాకామహారాజు నిర్యాణమును తెలుపుట)

### (7) గాడ్గిల్ - ప్రథమమున బాబాను దర్శించుట.

### భీమశంకర్ నుండి ఆగమనము.

412. పూనాలో భీమశంకర దేవాలయమువనున్న ఒక సాధువు చిదంబర్ కేశవగాడ్గిల్‌ను శిర్డీలోని సాధువును దర్శింపుమని చెప్పెను.

గాడ్గిల్:- (ప్రథమమున శిర్డీకిఁజేరి అచట ఉపాధ్యాయుఁడుగ నున్న శ్యామాతో) ఇచట సాధువులు ఎవరేని ఉన్నారా?

శ్యామా:- ఎవ్వరులేరు. అచట మసీదులో కూర్చున్న ఆపిచ్చి ముస్లింఫకీరును చూడుము! ఇచటమేము ఎఱిఁగినది అతఁడొక్కడే.

ఏమైనను - గాడ్గిల్ - ఆతని మిత్రులు ఆమసీదు వైపునకు కొన్ని అడుగులు నడిచిరి.

సా.బా:- (కఠినముగ దూషించుచు) ఈమసీదులోనికి రావలదు! నేనొక ముస్లిమును. వెళ్ళి ఆభీమశంకర దేవాలయముననున్న సాధువు కాళ్ళపై పడుడు!

గాడ్గిల్ ఆక్షణముననే బాబాయొక్క అంతర్జ్ఞానమును గుర్తించి, బాబాయందు గాఢభక్తిఁగలిగిన వాఁడయ్యెను.

## (3.) గాడ్గిల్ బహూకరణలు

413. యల్. జి. ముంగే, సిన్నోరి మామ్లత్‌దార్ చిదంబర - కేశవ - గాడ్గిల్ తోడను, ఆతని మిత్రుఁడు వామనరావు తోడనుగూడి, శిర్డీకి ప్రయాణమయ్యెను. మార్గమధ్యమున శిర్డీకిఁజేరుదినమునకు కిందటిరాత్రి, కొన్ని ఖర్జూరపు పండ్లు, ఒకరూపాయి, అగరువత్తులకట్ట బాబాకు సమర్పించుటకు గాడ్గిల్ ప్రత్యేకించి యుంచెను.

సా. బా:- (గాడ్గిల్‌తో) నాఖర్జూరఫలములు, అగరువత్తులకట్ట నారూపాయి నాకీయుము! (చూ. బాఖూరావ్ బోరవ్కే 442.)

## (9.) బాబాను గణపతిగ గాడ్గిల్ పూజించుట.

414. సి. కె. గాడ్గిల్ సాయిబాబాను గణపతిగ హృదయమున భావించి సేవించుచుండెను.

సా. బా:- ఈటక్కటి నాక్రింద ఎలుకను చూచుచున్నాఁడు
(గణపతి మూషకవాహనుఁడు)

## (10.) ఆర్. యస్. దేవ్. అభిప్రాయము. ఉపదేశము.

415. ఆర్. యస్. దేవ్. అకల్ కోటకు ప్రయాణమై మార్గ మధ్యమున శిర్డికిఁజేరెను.

సా. బా:- నేను అకల్ కోటకువెళ్ళి తీరవలయును.

( ఈ విధముగ ఆవచ్చినవాని ప్రధానాశయము బాబా వెలిపుచ్చెను)

ఆర్. యస్. దేవ్. రత్నగిరియందు సాంప్రదాయ (వంశ) గురువుకలిగియు "బాబా! నాకు ఉపదేశముగావించి నాగురువు నీవగుము-" అనికోర,

సా. బా:- గురువులతో నేమియు అవసరములేదు. అది (ఆ ఉప దేశము) అంతయు నీలోనేయున్నది. నీ అంతరాత్మను వినుము! నీవు నిర్దేశింపఁబడు విధమున నడువుము. మనము అంతర్ముఖులము కావల యును. నీ బోధకుఁడు-నీగురువు నీలోనేయున్నాఁడు.

(ఆర్. యస్. దేవ్ హృదయము నందున్న భావములవియే. బాబా యీపైనఁ దెలుపబడిన విధమున ప్రతిధ్వనించు చున్నాఁడు)

## (11.) డాక్టరు ముల్కీ తప్పిదము.

416. డాక్టరు. డి. యం. ముల్కీ పెద్ద జబ్బుపడి వ్యాధి నివారణమైనపిదప శిర్డికి వెళ్ళి, బాబాను దర్శింతునని మ్రొక్కుకొనెను. వ్యాధి నివారణమైన పిదప వెళ్ళలేదు. ఒకపరి ఆ అభిప్రాయముతో 'మన్మాడ్' వరకు వెళ్ళి, అచట రైల్వేస్టేషన్‌లోని గుమాస్తాను కలిసెను. ఆగుమాస్తా సాయీ బాబా ఒక అవినీతి పరుఁడని, అపాయకరుఁడని బాబానుగూర్చి విరుద్ధముగఁ దెలిపెను. ముల్కీ అచటనుండి వెనుదిరిగి బొంబాయిఁ జేరెను. అతని వదిన బాబాను దర్శించుమని గట్టిగ ప్రేరేచెను.

ముల్కీ శిర్డికివెళ్ళి బాబాను దర్శింపగా బాబా ఆతని మ్రొక్కుబడినిగూర్చి మన్మాడ్ స్టేషనులోని విషయములను మొదలగు వానిని వివరింప ముల్కీ ఆరైల్వే గుమాస్తా మాటలను నమ్మినందున మిక్కిలి సిగ్గుపడెను.

ముల్కీ:- బాబా! స్వస్థానమునకుఁదిరిగి వెళ్ళుటకు నాకు సెలవిమ్ము.

సా. బా:- మంచిది. వెళ్ళుము. జ్ఞానేశ్వరిపఠింపుము. జీతము పెంపుమీద బీజపూరునకు నీకు బదిలీ అయినట్లు ఉత్తరువులు నీబల్లమీద ఉండును.

డాక్టరు తిరిగివెళ్ళి బాబా తెలిపినట్లు అతని బదిలీ ఉత్తరువులు తన బల్లమీదనుండుట గమనించెను.

### జి. జి. నార్కే

## (12.) బాబా పిచ్చివాఁడు. (13.) భిక్షాపాత్రము. (14.) తుప్పీజహుమతి.

417. ఆరతిసమయమున ఏవిధమైన కారణములేకయే బాబా అత్యధిక కోపోద్రిక్తుఁడైనట్లు జి. జి. నార్కేగమనించి, "బాబా ఒక పిచ్చి

వాఁడా ఏమి?" – అని తలంచెను. అది ఆతని మనస్సున పొడమిన తలంపు. తరువాత ఆ సాయంత్రము నార్కే, బాబా పాదములొత్తుచుండఁగ బాబా నార్కేతో "నేను పిచ్చివాఁడనుకాను."–అనెను.

418. ఒక సమయమున బాబా జబ్బుగానుండఁగ వామనరావు పటేల్ (బి.ఎ., యల్. యల్. బి) బాబా కొఱకు భిక్షకై వెళ్ళుచున్నాఁడని తెలిసికొని, జి. జి. నార్కే, బాబా కొఱకు ఆ మధ్యాహ్నమున నియామక గృహములందు బిక్షగొని వచ్చుటకు తనకా అవకాశము కలిగించి సేవా భాగ్యము ప్రసాదింప వలయునని కోరుకొనెను.

ఒక భక్తుఁడు:- బాబా! ఈరోజు భిక్షకొఱకు వామనరావును పంపవలదా?

సా. బా:- (నార్కేనుజూపుచు) నాకొఱకు భిక్షగొని వచ్చుటకు ఈతని వెళ్ళనిమ్ము!

జి. జి. నార్కే ఆరూపమగు సేవామహాభాగ్యము (ఆగొప్ప అధికారము) నాలుగు మాసములు పొందెను.

419. బాబా 'కుఫ్నీ'లను భక్తులకు పంచియిచ్చుట నార్కే దూరమునుండి గమనించి, తనకునొక 'కుఫ్నీ' బాబా తప్పక ప్రసాదింప వలయునని తలంచెను.

సా. బా!- (అతనికీయక) నీకు 'కుఫ్నీ' ఈయలేదని నన్ను నిందింపవలదు. ఆఫకీరు (దైవము) నాకు అనుమతి నీయలేదు.

[గమనిక:- కుఫ్నీ సన్న్యాసమును సూచించును.

జి. జి. నార్కే – గృహస్థుఁడుగ నుండవలసినదేకాని సన్న్యాసి కాఁదగఁడు.]

## (15.) యస్. బి. నాచ్నే - సెలవు.

420. యస్. బి. నాచ్నే – ప్రప్రథమమున బాబాను సందర్శింపఁబోవుచు 'కోపర్గాము' నందుదిగెను. అచట 'స్టేషన్‌మాష్టరు'

బాబా ఒక మాయావియనియు, మన దేశమునఁగల పలువురు ఇంద్ర జాలికులవలె జనులను మోసగించుచున్నాఁడనియుఁజెప్పెను - ఇదినాచ్నే మనస్సున సందేహము కలిగించెను. నాచ్నే శిర్డీకివెళ్ళెను.

సా. బా:- (నాచ్నేను చూచినతోడనే) ఏమి! మామ్లత్‌దారు వలన సెలవు తీసికొనకయే వచ్చితివా?

నాచ్నే:- అవును.

సా. బా:- అవిధముగ ప్రవర్తింపకుము.

తాను మామ్లత్‌దారు గుమాస్తాయనియు యజమాని సెలవు లేకయే తాను వచ్చెననియు బాబా యెట్లు తెలిసికొనెనా? - యనియు నాచ్నే ఆశ్చర్యపడెను. బాబా తనకు మిక్కిలి ప్రేమతో నొసఁగిన సలహాకు సంతోషించెను. బాబా అంతర్జ్ఞానము - బాబా ప్రదర్శించిన ప్రేమ, అ స్టేషన్ మాష్టరు మాటలవలన కలిగిన సందేహములన్నియు నిర్ధూతము లయ్యెను. ఆపనికొఱకే బాబా తన అంతర్జ్ఞానమును, ప్రేమను ప్రదర్శించి నాఁడు.

## (16.) యస్. బి. నాచ్నే - 2 అణాలు.

421. ఒక భక్తుఁడు బాబాకు సమర్పింపుమని నాచ్నేకు 2 అణాలు, కొబ్బరికాయ మొదలగునవి యిచ్చెను. నాచ్నే ఆ వస్తువులను మాత్రమే బాబాకు సమర్పించి ఆ రెండు అణాలు విషయము మఱచెను.

నాచ్నే:- బాబా! నేను తిరిగి వెళ్ళుటకు సెలవీయుము.

సా. బా:- మంచిది, 'చితాలే' మీదుగ వెళ్ళుము కాని, ఒక పేద బాపని రెండు అణాలను ఏల దాచుకొనెదవు?

ఆ విధముగ జ్ఞప్తి పఱుపఁబడి నాచ్నే ఆరెండు అణాలను సమర్పించి, తన విధిని నిర్వర్తించెను.

సా. బా:- నీవేపనికేని ఒప్పుకొంటివా - దానిని సంపూర్ణముగ కావింపుము. కాదా - దాని జోలికి పోవకుము!

## (17.) దాతే - నారింజలు.

422. నాచ్నే - 'దాతే' తో కలిసి ఒక పరి శిర్డికి వెళ్ళెను. దాతే - తన ఫలాహారము కొఱకు తన విడిదిదగ్గఱ బండిలో కొన్ని నారింజ పండ్లునుంచి, మిగిలిన పండ్లను గొనివెళ్ళి బాబాకు సమర్పించెను. అచటఁ జేరిన వారికాపండ్లు పంచిపెట్టఁబడెను. ఒక మార్వాడీ బాలిక మఱికొన్ని పండ్ల కొఱకు బాబాను కోరెను.

సా. బా:- (దాతేతో) వెళ్ళి నారింజపండ్లను తీసికొనిరమ్ము!

## (18.) రాజబల్లీమహమ్మద్ — చెట్టు పట్టా.

423. (నాశిక్‌లోని ఒక 'కంట్రాక్టరు' దగ్గఱనుండి నూనిన చెట్టుపట్టాలనందు కొనుటకు రాజబల్లీ మహమద్ నాశిక్ వెళ్ళెను. అవి సిద్ధముకాని కారణమున అచటనుండి శిర్డికిఁజేరెను. అతఁడు తిరిగి వెళ్ళఁ దలఁచి బాబా సెలవుకోరెను.

సా. బా:- అతఁడు నీకిచ్చుటకు సరకుల సిద్ధపఱుపలేదు. తరువాత నాశిక్ చేరెను. బాబా తెలిపిన విషయము యథార్థమని కనుగొనెను. (చూ. 535 - బి )

## (19.) మేఘుని కులాభిమానము.

424. మేఘుడు (మేఘశ్యామ) హెచ్. వి. సాతే ప్రేరణమున శిర్డికిఁజేరిన ఒక చదువురాని బ్రాహ్మణుఁడు ఆతఁడు మార్గమధ్యమున బాబా ఒక మహమ్మదీయుఁడని తెలిసికొని, బాబాపై మిక్కిలి అసూయ వహించెను కాని హెచ్. వి. సాతే ఆతనిని బలవంతపెట్టెను. మేఘుడు బాబా దగ్గఱకు వెళ్ళెను.

ఉపాసనీ మహారాజు అపుడు కాళ్ళను చాచుకొని కూర్చుండెను. లోండా, ఉపాసనీబాబాను జేరి మ్రొక్కవలయునని పలుమారులు యత్నింప ఉపాసనీమహారాజు తనకాళ్ళను ముడుచుకొని, "నీవు బ్రాహ్మణుడవు- నీవు సాయిబాబాను దర్శింపఁజాలవు. అట్టియెడ నిచటనాతో నీకేమి పనికలదు?"- అనెను.

## (21.) హరికనోబా – పాదరక్షలు.

426. హరికనోబా - అతని మిత్రులతోఁగలిసి సాయిబాబాను పరీక్షించుటకై బొంబాయినుండి శీర్డికిఁజేరెను. అతఁడు తలపై జరీతల పాగ, పాదరక్షలను ధరించెను. చెప్పులను వెలుపలవిడిచి, మసీదులోనికి వెళ్ళి, బాబాను సందర్శించెను. తిరిగి వెలుపలకువచ్చి చూడగా చెప్పులు లేవు. ఆప్రాంత మంతయు వెదకెనుగాని ప్రయోజనము లేకపోయెను. అతఁడు విడిదికిఁజేరెను.

బాబా ఆ పాదరక్షలనొక మార్వాడిబాలునకిచ్చి, "బిడ్డా! యీ పాదరక్షలనొక కర్రకొనకుఁదగిలించికొని, "హరి కాబేటా! - జరీకా పేటా!" అని అఱచుచు పొమ్ము ఎవరేని ఆ చెప్పులుతనవి - యనిన అతఁడు హరి పిల్లవాఁడేనా? -యని, అతనికి జరీతలపాగ కలదా? యని యడిగి, అతఁడే యనిన ఈ చెప్పులతనికీయుము" అని చెప్పెను ఆపిల్లవాఁడు హరికనోబా బసిదగ్గఱకురాగానే హ. క. ఆపాదరక్షలు తనవేయని, తాను హరికుమారుఁడనని-తెలిపి, తనజరీతలపాగను చూపెను. కనోబా అతని తండ్రిపేరు. అనగ - హరి - హరి కనోబా - ఈ రెండును అతనిపేర్లే బాబాపలుకులు 'హరికాబేటా'- దానికెంతయు సరిపోలియున్నది. బాబా తనపేరెట్లు తెలిసికొని ఆ పాదరక్షలను పంపెనా? -యని అతఁడాశ్చర్య పడెను.

## (22) సోమ దేవస్వామి – బాబా జెండాలు.

426. A. 1911 న సోమదేవస్వామి, బాబాను చూచుటకు శీర్డికి వెళ్ళెను. అతఁడు మసీదుపై మిక్కిలి ఎత్తుగ రెండు జెండాలు ఎగురుచుం

డుటచూచి, "ఈగర్వసూచకమైన జెండా ఎగురవేయుట సాధువినయమున కెంతయుందగనిది"- అని, తనలో తలంచి, బాబాను చూచుట తనకిష్టము లేదని అతని మిత్రులతోంజెప్పెను. కాని వారి నిర్బంధమువలన బాబాను దర్శించుటకై వెళ్ళవలసి వచ్చెను. మంటపమును సమీపించి, బాబా నేత్రములవంక చూచినతోడనే అతండు పరవశుండయ్యెను. ఆతని కానందాశ్రులు స్రవించెను. కంఠము గద్గదికనొందెను. ఆనందమున మేను కంపించెను. ఆతండు బాబాను సమీపింపంగ బాబా మహాగ్రుండై కఠినముగ దూషించెను.

సా. బా:- నీయింటికిందిరిగి పొమ్ము- ఇంక మీదనా మసీదు లోనికింబ్రవేసించితివా- జాగ్రత్త! జెండా ఎగురవేయువాని దర్శింప నీకేల? అది సాధులక్షణమా! ఒక నిమిషముంగూడ నీవిచటనుండరాదు.

బాబా యొక్క సంపూర్ణ అంతర్జ్ఞానమునకు సోమదేవస్వామి ఆశ్చర్య చకితుండయ్యెను.

## (23.) గుర్జార్ — ఒకరూపాయి.

427. ధండిరాజు — విగుర్జార్ (వరఫ్) బాఖూసాహెబ్, శీర్డికి బయలుదేరి వచ్చుచుండగ 'కనిత్కార్‌సతి' - బాబాకు సమర్పింపుమని ఒక రూపాయ ఆతనికిచ్చెను. శీర్డియందతండు రెండుమూండు దినములుండెను. ప్రతిదినము బాబా అతనిని దక్షిణ అడుగుచుండెను. చివరరోజున

సా. బా:- ఈమూండు దినములు నేను వినోదముగ గమనించు చున్నాను. నేను దక్షిణ నడిగినపుడెల్ల నీధనము నిచ్చుచుంటివి. ఆసంత యొసంగిన రూపాయ నీ జేబులోనే దాచియుంచితివి. దానినిచ్చెదవా?

ఈ విధముగ గుర్జార్ ఆరూపాయ విషయము జ్ఞప్తిచేయంబడి, బాబాకు సమర్పించెను.

## (24.) మాన్కర్—తార్కాడ్ సతియొసంగిన 'పేడా'ను సమర్పింపక పోవుట

428. 1915 నందు జి. బి. మాన్కర్ శిర్డీకి వెళ్ళుచుండ తార్కాడ్‌సతి తనయింట బాబాకు నివేదింపఁబడి శేషించిన పేడా (లడ్డు) మాన్కర్‌నకొసఁగి దానిని బాబాకు సమర్పింపుమని కోరెను. శిరిడికిఁజేరి మాన్కర్ ఆలడ్డు విషయము మఱచిపోయెను. బాబాదర్శనము చేసికొనెను. ఆ ఉదయము బాబా ఏమియు నడుగలేదు. ఆ సాయంత్రము రిక్త హస్తములతో మాన్కరు వెళ్ళెను. బాబా ఇఁక సహింపలేక పోయెను.

సా. బా:- నా కొఱకేమి తెచ్చితివి?

మాన్కర్:- ఏమియు తీసికొని రాలేదు.

సా. బా:- నా తల్లి తార్కాడ్ సతి నేను తినుటకు 'పేడా' పంపలేదా?

మాన్కర్:- సిగ్గు - భయముపొంది, క్షమాపణము తెలుపుకొని విడిదికి వెళ్ళి 'పేడా' తెచ్చి బాబా చేతులందుంచెనో లేదో బాబా అత్యాప్యాయతతో దానినిఁ దినెను.

## (25.) బల్లి పలుకు.

428. A. బాబా మసీదునందొక బల్లి టిక్కు టిక్కు అని ధ్వనిఁజేసెను.

ఒకరు:- బాబా! ఆబల్లి కావించు ధ్వనియందలి భావమేమి?

సా. బా:- ఔరంగబాదునుండి తన సోదరి వచ్చుచున్నదని అది ఆనందించుచున్నది.

ఆ సమయమున ఔరంగబాదునుండి 'గుఱ్ఱముపై నొక రచటకు వచ్చి, తన సంచిలోనున్న ఉలవల నచటఁబోసెను. అందుండి ఒక బల్లి

క్రిందఁబడెను. ఆ బల్లి మసీదులోని కతివేగముగ పరుగిడి గోడపైకి ప్రాకి, అంతకుముందు అచటనున్న బల్లితో నాడుకొనుచుండెను.

## (26.) చోల్కారునకు పంచదారతో తేనీరు.

429. చోల్కార్ - అనునతఁడు బాబా అనుగ్రహమున పరీక్ష యందుత్తీర్ణుఁడై ఉద్యోగమును బడసెను. శిరిడికి వెళ్ళి బాబాను సందర్శించ వలసిన మ్రొక్కుబడి మాత్రము శేషించెను. అతని వేతన మతి స్వల్పము. కావున తాను త్రాగు తేనీటియందు పంచదారను మాను కొనెను. అటుల కూడఁబెట్టిన ధనముతో శిర్డీకిఁజేరి బాపూసాహెబ్ జోగ్ ఇంట బసచేసి, బాబాను సందర్శించెను. తన విషయము అతఁడు జోగ్‌న కెటిఁగించు పూర్వము.

సా. బా:- (జోగ్‌తో) ఈతనికి (చోల్కారునకు) లెస్సగా పంచదార కలిపిన తేనీరు నీయుము!

## (27.) పండరి న్యాయవాది.

### వక్రప్రవర్తనము - పరదూషణము - ప్రకటింపఁబడుట

430. హ. సి. దీక్షిత్తునకు పరిచయముగల పండరి న్యాయవాది శిర్డీకివెళ్ళి, యితరులతోఁగూడి బాబాకు ప్రణమిల్లి, దక్షిణ సమర్పించెను.

సా. బా:- జనములెంత మోసగాండ్రు! పాదములకు ప్రణ మిల్లుచు, దక్షిణలు సమర్పించుచు వారినే హృదయముల నిందించు చుందురు.

బాబా పలికిన పలుకులు - పండరిపురమున న్యాయవాదులుచేరి విశ్రమించు గదిలో తాను - ఇతర న్యాయవాదులు కలిసి, 'సబ్జడ్జి' 'నూల్కరు'ను గూర్చి "ఇంతటి విద్యావంతుఁడయ్యు ఈ నూల్కర్ తన కంటిబాధ మధుమేహవ్యాధి నివారించుకొనుటకు ఒక చదువురాని ఫకీరు- బాబా దగ్గఱకు వెళ్ళుచున్నాఁడు" - అని, అవహేళన చేసినమాటలు

యథార్థమని ఆ వచ్చిన పండరిన్యాయవాది తరువాత హ. సి. దీక్షితు నకుఁ దెలిపెను.

## (28.) వి. హెచ్. టాకూర్, దున్నపోతుపై స్వారి.

431. వి. హెచ్ - టాకూరు. బి. ఎ. సర్వే డిపార్టుమెంటులో నొక గుమాస్తా కన్నడి 'అప్పా' అను సాధువతనికి 'నిశ్చలదాసు' రచించిన 'విచారసాగరము' అను గ్రంథమును బహూకరించి, "కొంత కాలమునకు నీవు దక్షిణ దేశమున ప్రయాణము చేయునపుడు బ్రహ్మజ్ఞుఁడైన ఒక సాధువు నీకు బోధించును." - అని టాకూరునకుఁ దెలిపెను.

టాకూరు ఆయాప్రాంతములఁదిరుగుచు నొక చోట కొండ ప్రదేశమున దున్నపోతుపై స్వారిచేయ వలసివచ్చెను. ఆ సవారి అతనికి చాల బాధ కలిగించెను. తరువాత కొంత కాలమునకు శిర్డీకిఁజేరి బాబాను సందర్శించెను. బాబా తానే ప్రస్తావించుచు నిట్లనెను.

సా. బా:- ఆ సాధువు నీ కిక్కడ బోధకావింపఁబడునని తెలిపినాఁడు. కాని, ఆధ్యాత్మిక మార్గము మిక్కిలి, ఒడుదుడుకులుఁ గలది. మిక్కిలి కఠినము. నీవు మహిషముపై సవారిచేసినట్లు పెక్కు శ్రమలకు లోనుగావలయును.

## (29.) మోదక్ - మిత్రుఁడు.

ఈయఁదలచిన బహుమతినిడుటకు వెనుకాడుట.

432. వి. యస్. మోదక్ - ఒక మిత్రునితోగూడి శిర్డీకి వెళ్లెను. బాబాకు వేర్వేఱుగ రెండు రూపాయలు సమర్పింపఁదలచి వారి జేబులందు ప్రత్యేకించి యుంచుకొనిరి. వారు బాబాను దర్శించిరి.

సా. బా:- (మోదక్‌తో) నాకు దక్షిణనిత్తువా?

మోదక్:- ఇత్తును. (అని 2 రూపాయలు సమర్పించెను.)

సా. బా:- (మోదక్ మిత్రునితో) నీవు దక్షిణనిత్తువా

మిత్రుడు:- ఇత్తును. (అని ఒక రూపాయి సమర్పించెను.)

సా. బా:- కొందఱు జనులెంత బొంకరులు! ఆ ఫకీరున కీయదలచి 2 రూపాయలు జేబులో వేఱుగనుంచినారు. ఇప్పుడు ఒక్క రూపాయి మాత్రమే ఈయనేల? ప్రయాణము ఖర్చులకు వేఱొకజేబులో ధనము సమృద్ధిగలేదా?

## (30.) యన్. ఆర్. యస్. — బాంధవ్యము

433. యన్. ఆర్. - సహస్రబుద్ధి, బాబా ఊధి అనుగ్రహముల వలన నొక కొంత ప్రాథమిక స్థితియందున్న మతిభ్రమణమును (పిచ్చిని) నివారించెను. ఈవిషయమునుగూర్చి సహస్రబుద్ధియొక్క నేర్పుగ ఎవరో బాబాకు తెలిపిరి.

సా. బా:- అతడెవరికి సాయము చేసినాడు? ఆమె ఆతని కోడలేకదా!

యన్. ఆర్. యస్. ఆమెతోగల బంధుత్వమెఱుగడు. విచారించినపిదప ఆమె తన సన్నిహిత దాయాది యొక్క భార్యయని తెలిసికొనినాడు.

## (31.) జయకర్ సందేహములు నివారణమగుట.

434. ఒకనాడు మంటపమున సత్యనారాయణ పురాణమును చదువుచుండిరి. జయకర్ మసీదునందు బాబా దగ్గఱ కూర్చుండెను. ఆ మంటపము మట్టము మసీదు మట్టమునకంటె 3 అడుగులు తగ్గుగనున్నది. జయకర్ అచటగూర్చుండుటను గూర్చిన తలంపులాతని తారుమారు కావించినవి.

(i) బాబా సన్నిధినిగూర్చుండుట ఎప్పుడు శ్రేయస్కరమే.

(ii) సత్యనారాయణ పురాణశ్రవణ మాతనికి ప్రత్యేక ఆకర్షణీయ విషయము.

(iii) సత్యనారాయణ పురాణము తగ్గు ప్రదేశమున చదువఁబడుచుండ తాను ఉన్నత ప్రదేశమునఁగూర్చుండుట ఉచితముకాదు.

ఈ విషయములఁగూర్చి యేమి చేయవలయునో అతని మతికిఁదోఁచకుండెను. బాబా ఆతని తలంపుల గుర్తించి "పొమ్ము! ఆ పురాణము వినుము!" - అనెను. దీనితో అతని సందేహములు నివారణములయ్యెను.

## దక్షిణలు మొదలగు తలంపులను - విధులను నిర్వర్తింపఁ జేయుట.

## (32.) దీక్షితు - 25 రూపాయలు దక్షిణ.

435. హ. సే. దీక్షితు. బాబాకు పూలమాల 25 రూపాయలు దక్షిణ సమర్పింపఁదలచి బాబాను సందర్శించి పూలదండను ముందుగ సమర్పించెను.

సా. బా:- ఈ పూలమాల 25 రూపాయలను కోరుచున్నది.

అంత హ. సీ. దీక్షితు 25 రూపాయలు దక్షిణ బాబాకు సమర్పించెను.

## (33.) దీక్షితు - తాంబూలము.

436. హ. సీ. దీక్షితు బాబా పటమునకు నిత్యము పూజ జరుపువాఁడు - ఒకనాఁడు తాంబూలము సమర్పించుట మఱచెను. ఆ దినము బాబాను దర్శింపగాఁ

సా. బా:- కాకా! నాకు తాంబూలమిమ్ము!

## (34.) కపర్దే - దక్షిణ.

437. జి. యస్. కపర్దే కుమారుఁడు స్వప్నమున బాబా తన ంటికివచ్చి భుజించినట్లు కలఁగనెను. మఱునాఁడు ఆ విషయమును ర్చి - బాబా తనయింటికి వచ్చిన విషయమునుగూర్చి - తెలిసికొనఁ ని బాబా దగ్గఱకు వెళ్ళెను. అతఁడడుగనున్న ప్రశ్నమును గుర్తించి,

సా. బా:- రాత్రి నీవు నాకు భోజనము పెట్టితివి. కాని, దక్షిణ ములేదు. ఇపుడు దక్షిణనిమ్ము!

## (35.) ఉద్ధవేశభావ్ - ధననష్టము దప్పిక

438. దహన్ నివాసి ఉద్ధవేశభావ్ కొందఱు మిత్రులఁగూడి ్వారకకు వెళ్ళుటకై పొగయోడ నెక్కెను. ఆనావ మీదనుండగ అతని గ్గఱనున్న ధనము - అందఱికెట్లు మొత్తము సముద్రమునఁబడెను. ్వారకనుండి శిర్డిలోని సాయిబాబాకు జరిగిన విషయముఁ దెలిపి నుచు ధనము కొఱకు ఉత్తరము వ్రాసెను. ఆరాత్రియే (అతనిజాబు ర్డికిఁజేరు పూర్వమే) "నీ తండ్రి ధనము సముద్రమున పడిపోయినది. తనికి ధనముపంపుము!" - అని దహనులో నొకభాగ్యవంతుఁడు ఎవరో ెలిపినట్లు కలఁగనెను. అతఁడుద్వారకలోని ఉద్ధవేశభావునకు 150 ూపాయులు పంపెను. అంతట ఉద్ధవేశభావ్ తన తీర్థయాత్ర ాగించుచు నొకదినమున నొకకొండ సగముదూరమెక్కునప్పటికి మిక్కిలి ప్పికగానెను. అపుడొక ఫకీరు అతనికి పానీయ మొసఁగి దప్పిక ీర్చెను, ఉ. భా. శిర్డికిఁజేరగ శ్యామాముందుగవెళ్ళి బాబాతో ఉద్ధవేశభావ్ రాకను దెలిపెను.

సా. బా:- (వెంటనే) నేనతనిఁజూచితిని. - అని ఆతని ధనము సముద్రమున పడినవిషయము - దైవమతనికెట్లు ధనమొసంగినది, ఆతని దప్పిక నెట్లు తీర్చినది ఆరెండు విషయములను శ్యామాకుఁ దెలిపెను.

## (36.) వి. యస్. మల్వార్కర్ — పక్కాభక్తుఁడు

439. వి. యస్. మల్వార్కర్ బాంద్రాలోని పెద్దగుమాస్తా నా. గో. చందోర్కర్‌తో కలిసి శీర్డికి ప్రయాణమై వచ్చుచు కోపర్గామునందొకనితో నా. గో. చందోర్కరును గూర్చి "యితఁడుపక్కా (పండు) భక్తుండు" — అని అనెను. అతఁడు శీర్డికిఁజేరినతోడనే బాబా అతఁడనిన మాటలనే మరలఁ జెప్పొనుచు "నానా పక్కా భక్తుఁడు — నీవు కచ్చా భక్తుఁడవా?" అనెను. (పక్కా = పండు — కచ్చా = పచ్చి)

## (37.) ప్రత్యేకపేడా — మల్వార్కర్ సతిజీవితము

440. మల్వార్కర్ — పండరీపురమున ప్రత్యేక పేడాకొని శీర్డికి తీసికొనివచ్చి బాబాకు సమర్పించెను.

సా. బా:— (ఆవిషయము లెవరివలనఁ దెలిసికొనకయే) ఈ పేడా పండరినుండి తేఁబడినది. ఇది ప్రత్యేకించి నాకొఱకుఁ గొనిరాఁబడినది.

అంతమల్వార్కర్ సతి నిత్యజీవిత విషయములను బాబా వివరించి తెలిపెను.

## (38.) డి. డి. రసానే — జేబులో ఇంకను ధనముకలదు.

441. డి. డి. రసానే — అతని బంధువు బాబాకు పలుమాఱులు దక్షిణలు సమర్పించిరి. వారిదగ్గఱనింకను 25 రూపాయలుండెను, ధనము పంపుమని యింటికి ఉత్తరము వ్రాసిరి.

సా. బా:— (వారితో) దక్షిణనీయుడు!

రసానే — అతని బంధువు:— బాబా! మాదగ్గఱధనము మిగులలేదు.

సా. బా:— మోసములాడనేల? మీదగ్గఱనింకను 25 రూపాయలు కలవు. మీరు పంపుఁడని ఉత్తరముద్వారా కోరిన ధనము త్వరలో రానున్నది. (చూ. ఆర్. బి. పురందర్)

## 39) బాబూరావు బోరవ్కే – మఱచిన రూపాయి.

442. బాబూరావు బోరవ్కే. చిన్నతన మగుటచే దగ్గఱ ములేదు. శీర్డికిఁబోవుచుండెను. మార్గమధ్యమున అతని పినతండ్రి ఇంటికు వెళ్ళెను. సాధువుల దగ్గఱకు రిక్త హస్తములతోఁ బోరాదని కుఁడు బాబాకు సమర్పింపుమని ఒకరూపాయి బాబారావునకిచ్చెను. రవ్కే శీర్డికిఁజేరి బాబాను సందర్శించెను.

సా. బా:- నాకు రూపాయి దక్షిణ తెమ్ము!

బోరవ్కే:- (క్రొత్తగా సంపాదించిన రూపాయిమాట మఱచి) 'దగ్గఱ ఏమియులేదు.

సా. బా:- చూడుము! నీజేబులో రూపాయి ఉన్నది. ఒక కిరునకు నీవొకరూపాయి ఈయవలయును.

బోరవ్కే తనజేబు తవిడి రూపాయితీసి బాబాకు సమర్పించెను.

## (40.) అచ్చువేయువాని - యస్. వి. యుక్తివి వెలిపఱచుట

443. డి. వి. సంభారేమిత్రుఁడు బొంబాయిలో అచ్చు వేయువాఁడు యస్. వి. బాబా దక్షిణనడుగునని తెలిసి కొనెను. యథార్థ ముగ తనదగ్గఱ ధనములేదని పలుకుటకు వీలుగ తనధనము సంభారే - దగ్గఱనుంచెను. వారు శీర్డికిఁజేరి బాబాను సందర్శించిరి.

సా. బా:- (యస్. వి. తో) నాకు 2 రూపాయలు దక్షిణనిమ్ము! అతని డి. వి. (సంభారే) దగ్గఱనుండి తీసికొని యీయుము!

సర్వముఁజూడఁజాలు బాబా కనులఁ గప్పఁజాలమని యస్. వి. గ్రహించెను.

## (41) శ్రీ టి. (తార్కాడ్—?) తప్పు తెలిసికొనిన తరువాత సరిదిద్దు కొనవలయును.

444. శ్రీ. టి. (తార్కాడ్) ఇంటినుండి వెళ్ళు చుండగా నతని భార్య పైకమడిగెను. తన జేబులో నేమియు లేదను తలంపుతో లేదని చెప్పి మేడదిగి వచ్చెను. క్రిందికిదిగిన తరువాత జేబులో రూపాయి ఉన్నట్లు తెలిసికొనెను. కాని పైకివెళ్ళి దానినీయలేదు ఆఫీసునకు వెళ్లెను.

కొన్ని వారములు జరిగినపిదప తార్కాడ్ దంపతులు శీర్డికి వెళ్ళి బాబాను సందర్శించిరి.

సా. బా:- (తార్కాతో) అమ్మా! ఈ రోజులలో జనులెంతటి వంచకులు! అతని జేబులో రూపాయి ఉంచు కొనియు లేదనినాఁడు.

తార్కాడ్ అప్పుడు భార్యతో తనతప్పు నొప్పుకొనెను.

## (42.) లాలా లక్ష్మీచంద్

445. 1910లో లాలా లక్ష్మీచంద్, తానెప్పుడు నెఱుఁగనివాడును భక్త జనులతోగూడి, గడ్డముగలిగినముసలి వానిని స్వప్నమునఁ జూచెను. ఆపిదప దాసుగాణూ మహారాజు దగ్గఱగల ఆముసలివాని పటముఁజూచి, యాతడు శీర్డిలోని సాయిబాబా - అని తెలిసికొనెను. ఆతఁడు శీర్డికి వెళ్ళ నిశ్చయించుకొని ప్రయాణము ఖర్చులకు 15 రూపాయలు అప్పు తీసికొనెను. మార్గమధ్యమున నింకను అధికముగ దెలిసి కొనవలయునని బాబానుగూర్చి జనులనడిగెను. లా. లా. చంద్ శీర్డికిఁ జేరి బాబాను సందర్శింపగనే.

సా. బా:- మూర్ఖుఁడు! అందఱను ప్రశ్నించుండును. ఇతరుల నడుగనేల? తన స్వప్నమునఁ జూచినది సత్యమగునా? కాదా? అనునది తాను నిర్ణయించు కొనవలయును. మార్వాడీదగ్గఱ అప్పు తెచ్చుకొని నాఁడు. ఈ దర్శనమున కింతత్వరయేల? అతని హృదయ కామిత మిప్పుడు తీరినదా?

## (43.) లాలాలక్ష్మీచందే — గోధుమకుడుము

### ఆకలినొందినవారియెడ బాబా ఆదరణము.

446. లా. లా. చంద్ వాడకు వెళ్ళి మరల ఆకలితో (సాంజా) గోధుమకుడుము దొరకునను ఆశతో బాబా దగ్గఱకు వెళ్ళెను.

జోగ్:- బాబా! నైవేద్యమున కేమిసిద్ధపఱచుదును?

సా. బా:- (సాంజా) గోధుమకుడుము సిద్ధపఱచుము. ఆకలి నొందిన వారికదిమంచిది. (మరల) సాంజాసిద్ధమైనది-హారతి సేవత్వరగా కానిమ్ము!

## (44.) ధనికుని దత్తపుత్రుఁడు.

447. ఒక ధనికుని దత్తకుమారుఁడు అతికష్టము మీద శీర్డికిఁ గొనిరాఁబడెను. అతఁడు తనతండ్రి ప్రక్కన బాబా యెదుటఁగూర్చుండెను. ఆతఁడుతన దత్తపితకేనియుఁ జెప్పక శీర్డివిడిచి వెళ్ళవలయునని తనలోఁదలంచెను.

సా. బా:- (వెంటనే) నా ఆజ్ఞ లేనిదే యెవరును ఈరోజు శీర్డివిడిచి వెళ్ళరాదు.

ఆపిల్లవాఁడుతనతలంపును బాబాగ్రహించినాఁడని గుర్తించి, తానాదినమున శీర్డివిడిచి వెళ్ళఁదలంచిన విషయమును జెప్పుకొనెను.

## (45) పోలీసు ఉద్యోగి — 50 రూపాయలు

### దాని అవసరము.

448. సా. బా:- (పోలీసు ఉద్యోగితో) నాకు దక్షిణనిమ్ము!

పో. ఉ:- నాదగ్గఱ ఏమియులేదు.

సా. బా:- నీజేబులో చూడుము. 50 రూపాయల కరెన్సీ కాగితము కలదు.

పో. ఉ:- ఇదిగో బాబా! తీసికొనుము.

సా. బా:- వలదు. ఉంచుకొనుము. నీకు త్వరలో దా అవసరము కలుగును.

పోలీసు ఉద్యోగి తిరిగివెళ్లెను. తోడనే అతనికొక కష్ట కలిగెను. ఆపైకముతో అవసరము కలిగెను.

## బాబా-భూతముల సహాయముగల ఇంద్రజాలము.

449. (1) తత్వజ్ఞాన సమాజకురాలు:- (బాబాకు అత్యద్భుత శక్తిసామర్థ్యములు భూతముల సహాయముగల ఇంద్రజా మగునా? - అని తలంచెను.)

[గమనిక:- బాబా అద్భుతశక్తులు మంత్రానుష్టానాదులవల వానికి సంబంధించిన వివిధ నియమములను పాటించుటవలన కలిగిన కావు. అవి బాబా సహజస్థితిలోని అంశమై పెద్దకాలము గురుసే తత్పరతవలన గురుదేవుని అనుగ్రహమున పెంపొందినవి. భాగవతమ V-(5)-35 నందలి ఋషభుని వృత్తాంతము గమనింపుడు. ఋషభు బ్రహ్మజ్ఞుడై తనయందు సకలచేతనాఽచేతనాత్మక ప్రపంచమ వాసుదేవ పరబ్రహ్మమును జూడఁగలిగి యాతఁడు సంచరించుచుం సకల సిద్ధులు నాతని వరించినవి. 1. దూరగ్రహణము (దూరము గలుగు విషయములఁదెలిసికొనుట.) 2. అంతర్ధానము (దృశ్యమగు అదృశ్యమగుట.) (చూ. 352, 532), 3. మనోజవము. (సకలజీ మానసిక వ్యాపారములను తత్క్షణము గుర్తించుట) ప్రేరేచు మొదలగునవి. చూ. 406) 4. పరకాయప్రవేశము. (వివిధ తనువుఁ జేరుట- చూ- 321.) 5. వైహాయసగవనము. (ఎట్టి ఆటంకములులే ఎల్ల ప్రదేశముల సంచరింపగలుగుట—చూ. 75 - 87)

సా. బా:- కాలనువనుఁడా? - ఇతఁడు బ్రాహ్మణుఁడు - స్వచ్ఛ పావనబ్రాహ్మణుఁడు. వేనకువేలు జీవులను శుభ్రమార్గమున నడిపింపఁగ

సమర్థుడు (అనగా పవిత్రమార్గమున నడిపించి దైవమును జేర్పఁగల వాఁడు) కాలయవనుఁడిచట అడుగైన పెట్టఁజాలఁడు. ( చూ. – 57. )

450. (2) సా. బా:- (కుశబావుతో) ఆపుము! నీఇంద్రజాల విద్యలన్నియుఁగట్టిపెట్టుము. ఆపిదప ఇచటకురమ్ము!

451. (3) సా. బా:- (భూతప్రేరిత ఇంద్రజాలవిద్యా ప్రయోగ బాధితునితో) దైవము నిన్ననుగ్రహించును!

పార్వని నివాసియొకఁడీ భూతప్రేరిత ఇంద్రజాల విద్యా ప్రయోగమునకు గురియైనాఁడు. అన్నము వెంట్రుకలుగ గోచరించి, పేడకంపు కొట్టుచుండెను. అతఁడు పెక్కుపూజలు జరిపించెను. భూత వైద్యులచేత మంత్రోచ్చాటనలు చేయించెను. కాని ప్రయోజనము కలుగలేదు. చివరకు శీర్డికిజేరెను. బాబా ఆతని ననుగ్రహించెను. ఆతనిపై ప్రయోగింపఁబడిన ఇంద్రజాలశక్తి నిర్మూలనమయ్యెను.

452. (4) బాబాచేత, బాబాసాన్నిధ్యము మాత్రమున దుష్ట భూతప్రేతాదులచే బాధింపఁబడినవారు స్వస్థులైనారు.

(a) హన్సిరాజునకు దుష్టభూతముసోకెను. అతఁడు బాబాను ఆశ్రయించెను.

సా. బా:- (ఆతని నడిచేతితోఁగొట్టుచు) దుష్టభూతమా! పొమ్ము వెడలిపొమ్ము!

హన్సిరాజునకాపిదప దుష్టభూతబాధ తొలఁగెను. బాబా సన్నిధిని కొంతకాలముఁడుటచే నతనికి చాలకాలమునుండి బాధించు చున్న ఉబ్బసమువ్యాధియు నిర్మూలమయ్యెను.

(b) గాలిసోకిన (దయ్యముపట్టిన) టిప్నిస్‌సతి – బాబా సన్నిధికిఁ గొనిరాఁబడెను. బాబా అనుగ్రహలేశమున – ఆశీః ప్రభావమున ఆ దుష్టభూతమామెను విడిచివెళ్ళెను.

## భవిష్యత్తు నెఱుఁగుటవలన లాభములు

### ధైర్యము - సహనము.

453. 1) సా. బా:- (ఆర్. బి; పురందర్‌తో) నీవు ఏడువకుము - ఈ ఉబ్బసముబాధ అల్లానాకుఁగలిగించినాఁడు. రెండు నాలుగు రోజులలో తగ్గిపోవును.

454. సా. బా:- (హ. సీ. దీక్షిత్తుతో) నీకు జ్వరము తగులును. 8 రోజులలో నివారణమగును. దానికొఱకుఅందోళన పడవలదు.

దీక్షిత్తునకు జ్వరము తగిలెను. ఆతఁడెట్టి అందోళనము చెందలేదు. ఆతని మిత్రులెంతచెప్పినను వినక ఔషధములను సేవింపలేదు. రోగులకు అపథ్యమైనమున ఆహారపానీయములను తీసికొనెను. 8 దినములలో నతఁడు సంపూర్ణ ఆరోగ్యము పొందెను.

## బాబా - పూర్వవృత్తాంతములు.

### (A.) బాబా — ఇతరుల పూర్వజన్మల వృత్తాంతములు.

455. (1) సా. బా:- (బాలసాహెబ్ భాటేతో) నీ పూర్వభవమున నీవు ఒక "ఖాత్రి" వి. ఇప్పటినిభార్య-కుమారుఁడు వారి పూర్వభవమున 'సాలె' కులమువారు.

456. (2) సా. బా:- వాసుదేవ కాకా, పూర్వజన్మమున 'జయసింగ్'- అను పేరుగల రాజపుత్రుఁడు అతని కూతురుచెడి ఒక బార్వారు' నకు భార్యయైనది.

457. (3) సా. బా:- ఇటీవల (1912లో) మృతినొందిన కొండాజీ పుత్రుఁడు పూర్వభవమున నొక (మాంగ్) అంతకు పూర్వభవమున నా తాత. కుష్ఠువ్యాధిచే మరణించెను. ఈ మూఁడు పుట్టువులందు అతనికి తోడ్పడి, క్రీడించుచు నతని దగ్గఱనుంటిని. ( చూ. 473, 17. )

458. (4) మసీదు 'మించార్' పైననిపుడు (1912లో) గూడు కట్టుకొనిన పిచ్చుకలు పూర్వమక్కడే గూడు కట్టుకొనినవి, వానిని సర్పము భక్షించెను. అవిమరల పిచ్చికలుగపుట్టి ఆ చోటనే గూడు కట్టుకొనినవి.

459. (5) సా. బా:- కొన్ని శతాబ్దములుగ నితఁడు ఆర్. బి (పురందర్) నాతోసంబంధము కలిగియున్నాఁడు.

460. (6) సా. బా:- ఈసోదరి (చంద్రాబాయ్ బోర్కర్) ఏడు జన్మములందు నా సోదరియై యున్నది. నేనెక్కడ వెళ్ళినను నాకొఱకు అన్వేషించు చుండునది (చూ. 355 A.)

461. (7) సా. బా:- (శ్యామాతో) నీవు ఇతనిని (జి. జి. నార్కేను) నాకుపరిచయము చేయుచుంటివా? నే నీతనిని 30 జన్మములనుండి యెఱుగుదును.

462. (8) సా. బా:- శ్యామా! (మాధవరావు దేశపాండే) నేనునీతో 72 జన్మములనుండి సంబంధము కలిగియున్న వాఁడను. ఇంతకుముందెప్పుడు నిన్ను బుగ్గ మెలియపెట్టి యెఱుఁగను.

463. (9) సా. బా:- (జి. యస్. కపర్దేసతినిగూర్చి) ఈమె పూర్వభవముననొక కోమటి ఆవుగనుండి (నాకు) సమృద్ధిగక్షీర మొసఁగినది. తరువాత నొక తోటమాలి పుత్రిక యైపుట్టెను. ఒక క్షత్రియునిఁ జేరెను. తరువాత నొకవర్తకుని వివాహమాడెను. ఆపిదప బ్రాహ్మణ జన్మ మొందెను.

చాలకాలము గడచినపిదప నేనీమెను మరల చూచుచున్నాఁడను.

ఈమె నాకొసగు ఆహారము అతిమధురమైనది.

[ముందుగా సమర్పింపబడిన ఇతరుల నైవేద్యములను తాకక, జి. యస్. కపర్దే సతి సమర్పించిన నైవేద్యమునే ముందుగా స్వీకరించి, ఆమె యందు పక్షపాతము ప్రకటించుచున్నవాడవని శ్యామా. బాబాను ఆక్షేపింపగా దానికి బాబా తెలిపిన సమాధానమిది ]

## (10.) జి. యస్. కపర్దే

464. సా. బా:- (జి. యస్. కపర్దేతో) నీవుపూర్వ జన్మమున నాతో 2, 3, సంవత్సరములుంటివి. నీయింట సుఖ సంతోషములతో జీవించుటకు సమృద్ధిగనున్నను, నీవు ప్రభుసేవకొఱకు వెళ్ళితివి. (రాజకీయోద్యోగముచేసితివి.)

465. (11) రావుసాహెబ్ యశ్వంతరావు గాల్వంకర్-బాబా దగ్గఱకు 1917 న వెళ్ళెను.

సా. బా:- (తన అరచేతిని గాల్వంకర్ మస్తమున నిలిపి, ఆతనికి తన్మయత్వస్థితిని ప్రసాదించి) పూర్వభవము లందుఋజుత్వ పవిత్రతల గలిగినవాడితఁడు. అందుచే నీతని నిప్పటిమాతృ గర్భమున జనింపఁజేసితిని. నేటికిని ఆసద్గుణము లితనియందుండఁగలవు. (చూ.469)

466. (12) సా. బా:- (కల్యాణ్‌నివాసి. టి. ఎ. - కార్ణిక్‌తో (నేనునిన్ను రెండు వేల సంవత్సరములనుండి యెఱుఁగుదును. నీవెప్పుడు పెడబుద్ధియు. కోఁతియుక్తులు గలవాఁడవు.

## (13.) ఉరితీయువాఁడు — పగతీర్చుకొన తిరిగిపుట్టుట. పునర్జన్మము — కర్మఫలమనుభవించుట.

467. శిర్డిలో 'తాకియా' దగ్గఱనొక గ్రుడ్డి వాఁడుండెను. అతఁడు వధింపబడెను. గ్రామాధికారుల ఆజ్ఞలననుసరించి ఆహంతకుఁడు ఉరితీయఁబడెను. కాని, ఆ ఉరితీసినవాఁడు. ఆ హంతకునిపై వైరము ద్వేషముగల బుద్ధితో అపని కావించెను. కావున ఆఉరి తీయఁబడినవాఁడు ఉరితీసినవాని కుమారుఁడుగ జన్మించెను.

## (14.) నా. గో. చందోర్కర్.

468. నా.గో.చం:- (బాబాతో) బాబా! నన్నేల పిలిపించితివి?

సా. బా:- వేనకువేలు జనులు కలరు. నేను వారికొఱకు పిలువ నంపుదునా? నీవు నేను నాలుగు జన్మలనుండి సంబంధము గలిగి యున్నారము - నీవది యెఱుఁగవు. కాని నేనెఱుఁగుదును. నీకవకాశము గలిగినపుడు నాదగ్గఱకు వచ్చుచుండుము!

## (15.) కిష్య (నేక) పిష్య

469. సా. బా:- అతఁడు 'గోహిల్లా' అయియుండెను. ఆతఁడు నా అవ్వను వివాహమాడెను. మరణించెను. అతనిని ఇప్పటి మాతృ గర్భమున జనింపఁజేసితిని.

## (16.) బాబు ప్రధాన్.

470. శిర్డియందొక పవిత్రుఁడైన వృద్ధుడు 12 సంవత్స రములు నివసించెను. అతనిభార్య, పెద్దవారైన కుమారులు 'జాల్నా' లోనుండి ఆవృద్ధుని తమదగ్గఱకు రావలసినదిగ పలుమాఱులు ప్రార్థించిరి. చివరకతఁడు గుఱ్ఱముపై ప్రయాణము చేసివెళ్ళెను. నేనాతనివెంట బండిలో వెళ్ళితిని. కొంతకాలమైనతరువాత ఆవృద్ధుడు తనతమ్ముని చిన్నకుమార్తెను వివాహమాడెను. ఆమెవలన నొకకుమారుడు కలిగెను. ఆపిల్లవాఁడా రేండ్లవాఁడుగ నున్నపుడా ముసలి వాఁడు మరణించెను. ఓరాదారులాపిల్లవానికి విషముపెట్టి చంపిరి. ఆ పిల్లవాఁడు 'బాబు'గ (దాదా కేల్కారు సోదరుని కుమారుఁడుగ ) జన్మించెను. బాబు 1910 లో నిచట (శిర్డిలో) మృతినొంది బొంబాయిలో తిరిగి జన్మించెను.

1910 లో యం. డబ్లుయు. ప్రధాన్ దంపతులు బాబాను సందర్శించిరి.

సా. బా:- శ్యామా! ఈ ప్రధాన్ సతినా 'బాబు'-తల్లియగును.

ఆకాంత అప్పటికి గర్భిణికాదు. కాని పిదప 12 నెలల లోపల ఒక కుమారునిఁగని, ఆబిడ్డనుగూర్చి బాబా తెలిపిన కారణమున ఆబిడ్డకు 'బాబు'- అనిపేరు పెట్టుకొనిరి. ఆబిడ్డ జనించినకొన్ని నెలల తరువాత ఆదంపతులు తమబిడ్డను శీర్డికిఁగొనివచ్చి బాబా ముందుంచిరి.

సా. బా:- (ఆబిడ్డను చేతులలోని కెత్తుకొనుచు) బాబూ! నీ వెక్కడ నున్నావోయి! నాపై విసుగు కోపముగలిగినదా?

బాబామహాసమాధి నొందిన వెంటనే 1919 లో 'బాబు' గూడ పరమ పదించెను.

## బాబా — జీవులపూర్వజన్మ స్మృతులు—మేకలు.

471. ఒక సమయమున 'లేండి' వనము ప్రక్కగా పోవుచున్న మేకలమందనుండి బాబా రెండు మేకలను 32 రూపాయలకు కొనితెచ్చెను. అప్పటిలో ఆ మేకలగరిష్ఠమైన విలువ 8 రూపాయలగుటశ్యామా -తాత్యా - ఈ యిరువురు బాబా యీబేరమున మోసగింపఁ బడినాఁడని తలంచిరి. బాబా 4 శేర్ల పప్పుధాన్యముకొని ఆమేకలకు తినఁబెట్టించి, వానిని మరల ఆమందయుజమాని దగ్గఱకు పంపించెను.

సా. బా:- శ్యామా! తాత్యా! నేనువంచింపఁబడితినని మీరు తలంచు చున్నారా?- కాదు. ఈ మేకల వృత్తాంతము వినుఁడు! పూర్వభవమున ఈమేకలు నాపొరుగింటిమానవులు. తొలుతవారొండొరులు మిక్కిలి ప్రేమించుకొనువారు. నను ప్రేమించినారు. తరువాత వారు ద్వేషించు కొనఁదొడగిరి కలహించుకొని, యొండొరులు చంపుకొనిరి. ఇపుడు వారు మేకలై పుట్టిరి. అని (మేకలు) నా ప్రక్కగవెళ్ళుచు నావంకఁజూచినవి; వాని పూర్వగాథను గుర్తించితిని. వానియందు ప్రేమతిరిగి పొడముటచే వానిని మరల నా దగ్గఱకొంత తడవుంచుకొని తృప్తిగఁ దినఁబెట్టించుట కీధనము వెచ్చించితిని. నాబేరముమీకు అనిష్ట మగుటచే వానిని మందకాపరి దగ్గఱకు పంపితిని.

## జన్మజన్మముల గురువు భక్తులననుసరించును

## తార్కాడ్ సతి.

472. సా. బా:- (బొంబాయి నివాసులు. తార్కాడ్ సతి, ఆమె కుమారునితో) మీ పూర్వజన్మముల నెన్నిట మీతోనుంటిని! ఇంకఁ గలుగబోవు జన్మములనెన్నిట మీతో నుండఁగలను! మనము మరల మరల కలియుచుందుము.

నాకు సమర్పింపఁబడిన ప్రతిపైసాను గూర్చి (నన్ను శరణొంది ప్రతిజీవినిఁగూర్చి) భగవానునకు నేను లెక్క చెప్పుకొనవలయును.

472. (A.) (బాబా తనప్రస్తుతజన్మ వృత్తాంతమునుగూర్చి తనతో విస్పష్టముగఁదెలిపినట్లు మహల్సాపతి తరుచుగఁ జెప్పువాఁడు.) "నేను 'పత్రి' గ్రామమున బ్రాహ్మణ కుటుంబమున జన్మించితిని. నాతల్లి దండ్రులు నాబాల్యమున నన్నొక ఫకీరునకు ఇచ్చినారు." పత్రిగ్రామము లోని పలువుర పేర్లనుదెలిపి బాబా వారినిగూర్చి విచారించువాఁడు.)

472. (B.) (బాబా చెప్పినది దాస్‌గాణూ తెలిపినాఁడు.) "నాగురువు బ్రాహ్మణుఁడు- 'శేలు' నివాసి వేంకుశుఁడు."

"నాగురువు బ్రాహ్మణుఁడు-" అని, బాబా తెలిపినట్లు- జి. జి. నార్కే చెప్పుచున్నాఁడు.

బాబా తనగురువుపేరు తెలిపినట్లు-అది వ్-ష-శ్- అక్షరములతో నంతమయినట్లు- అది బహుశః "వేంకుశ్-" అయియుండునని- 'హెచ్. వి, సాఠే' చెప్పినాఁడు.

## 472. (C) బాబా పునర్జన్మము

(1) బాబా తనబిడ్డలను కనిపెట్టియుండుటకు మరల మరల జన్మించు చుందునని తెలిపినాఁడు-

ఉదా:- యం. బి. రేగే (చూ. 17) తార్కాడ్ కుమారుఁడు. (చూ. 472)

(2) సా. బా:- (నా. గో. చందోర్కర్‌తో) నానా: నీ (మాంఘట్) చేతిమణికట్టు కొంత కాలమునకు ముసలివాని మెడవలెచలించును, ఆ పిదపనేను బాపు (చందోర్కర్ కుమారుఁడు) బిడ్డగ జనింతును.

(3) బాబా తానుమరలజన్మించి, జనములకు 8 సంవత్సరములబిడ్డగ ప్రకటమగుదునని విస్పష్టముగఁ దెలిపినట్లు హ. సీ దీక్షిత్తు చెప్పినాఁడు. (దీక్షిత్తుడైరీ)

## స్వీయచరిత్రాత్మకములగు పూర్వజన్మస్మృతులు

## పాము—కప్ప—పగతీర్చుకొన మరల పుట్టుట—వాసనలపెంపు

## దైవనిర్ణయము—న్యాయము.

473 "సాధుసత్పురుషుల పాదములకు సంపూర్ణ శరణాగతిఁ జేసిన తప్ప జీవికావించిన పాపము నశింపదు." అని సాయీబాబా ఒక సందర్భమున పలికి, ఒక గాథ దృష్టాంతముగఁ దెలిపెను.

ఈ కథను పురస్కరించుకొని "ధనమునందు అత్యాశజీవిని అధోగతి (హీనజన్మముల) పాల్జేయును"- అను మఱి యొకనీతిని బాబా తెలిపినాఁడు.

సా. బా:- ఒకనాటి ఉదయము 8 గంటలకు నేను విహారమునకు వెళ్లితిని. నేనొక (రహతానదివలె) అగాధమైన నదిదగ్గఱకు వెళ్లితిని. అచట చెట్లనీడగల కాలిబాట, బండ్లబాటయు కలదు. పిల్లగాడ్పులు వీచుచుండెను. అచట నీడలోఁ గూర్చుండి, దట్టమైన చెట్ల ఆకుజొంపములఁజూచు చుంటిని. (చిలమ్) పొగగొట్టము తీసి పొగత్రాగుటకు చేతి చిఱుచేలమును తడుపుచుండగ నొకకప్ప గొణుగు (కూత) వినఁబడెను. చకుముకిరాళ్ళ రాపిడిచే పొగగొట్టమును వెలిగించితిని. ఒక బాటసారి వచ్చి నమస్కరించి, నాప్రక్కనఁ గూర్చుండి తన యింటికి భోజనము

నకు రమ్మని నన్నాహ్వానించెను. నేను సమ్మతించితిని. అతఁడు పొగ గొట్టమును వెలిగించి, నాకందించెను. అతఁడు కప్ప అఱుపువిని ఆరొదకు కారణమెమో తెలిసి కొనఁదలంచెను.

"అది కష్టములోనున్న ఒక కప్ప, దాని పూర్వకర్మ విషమఫల మనుభవించుచున్నది. చూడుము! మనపూర్వజన్మము లఁగావించిన కర్మముల ఫలముఇప్పుడు అనుభవించితీరవలె. ఇష్టడా (విధివిధానమును గూర్చి) పెద్దపెట్టున ఏడ్వనేల?-" అనినేను పలికితిని. అతఁడాకారణ మరయుటకు ఆధ్వనివచ్చు మార్గమున నడిచివెళ్లెను. ఆ కప్ప ఒక పెద్ద సర్పముచే పట్టుబడి యేడ్చుచున్నది - అని నేను చెప్పితిని. పూర్వ భవముల వారిరువురు దుష్టులే – ఆకర్మ ఫలమనుభవించుటకు ఈపుట్టువు లొందినారు. ఆబాటసారి నాపలుకుల సత్యము గ్రహించినాఁడు. ఒకపెద్ద కప్పను నోటఁబట్టుకొగిన ఒక పెద్ద కాలసర్పమచటనుండెను.

ఆతఁడు తిరిగివచ్చి 10, 20 నిమిషములలో ఆసర్పమా కప్పను పూర్తిగ మ్రింగివేయునని నాతోననెను. "నేను దాని (కప్ప) తండ్రిని. ఇక్కడనుంటిని. దాని నాసర్పమునోటఁ బడనీయుదునా? దాని నెట్లు విడిపింతునో చూడుము!" - అనిపలికి, ఆబాటసారిని వెంటఁబెట్టుకొని సర్పమున్న తావునకు వెళ్లితిని. అతఁడు ముందుగవెళ్ళి పామునుజూచి, భయభ్రాంతుడై తిరిగివచ్చి "ఆ సర్పము మనపైఁ బడునేమో! - మన మిచటనుండి పాఱిపోవుదము. దగ్గఱకు పోవలదు" – అనెను. అంతట నేను దగ్గఱకువెళ్ళి, ఆ పెనుగులాడు జీవులతో నిట్లంటిని "ఓయీ! వీరభద్రప్ప! ఇప్పటికేనియు నీశత్రువైన బసప్పపై నీకు జాలికలుగలేదా! అతఁడు కప్పగ నీవు సర్పముగ జన్మించితిరి మీ అన్యోన్య వైరములకు సిగ్గుపడుడు! ద్వేషమువిడిచి శాంతముగ బ్రతుకుండు!" అని పలికితిని.

ఆ మాటలు వినినతోడనే సర్పమాకప్పను విడిచెను. లోతు నీటిలోనికిఁజొచ్చి అదృశ్యమయ్యెను. ఆకప్పయువెడలి యొక చెట్టున దాగెను. "ఆమాటలువినినంత సర్పమాకప్పనేల విడిచెను? — వీరభద్రప్పయెవరు? బసప్పయెవరు? - వారియిరువుర వైరకారణమేమి?

ఆవిషయము నాకేమియు బోధపడలేదు. దానిని వివరింపుము!"–అని ఆబాలసారి నన్ను కోరెను. మేము తిరిగి నీడలోనికి వెళ్ళి పొగత్రావుచు ఆవిషయమంతయు నిట్లు ఱకపఱచితిని.

నా నివాసమునకు 2, 3, క్రోసులదూరముననొక పవిత్ర క్షేత్రముకలదు. అందు శిథిలావస్థలోన్న మహాదేవుని ఆలయము కలదు. ఆగ్రామములోనిజనులు దానినిపునరుద్ధరింప నిశ్చయించు కొనిరి. ఆకార్యమున కై ధనము (చందాలు) ప్రోగుచేసిరి. ఒక ధనికుడు కోశాధికారిగ నియమింపబడెను. అతఁడు 'జమాఖర్చులు' –సక్రమముగ వ్రాసియుంచువాఁడు కాని, యతడు పుటుకతోనేలోభి. ఆకోవెల పునరుద్ధణము పూర్తికాలేదు. మరల ధనము ప్రోగుచేసిరి. కాని, ఆదేవళము అసంపూర్తిగనేనిలిచెను. ఆకోశాధికారిభార్య స్వప్న మున భగవానుఁడు పొడమి "నీవు దేవాలయ పునరుద్ధరణకు వెచ్చించు ధనమునకు నూరుమడుంగులు శంకరుడునీకుప్రసాదించును "– అని, తెలిపెను. ఆవిషయమామె భర్తకుఁదెలిపెను. ఆపని తనకు ధనవ్య యమగునని అతఁడు తలంచి, ఆమాటలకు పరిహసించి, "అది ఒక కలమాత్రమే. దానిని విశ్వసించి మనమేపనియుఁజేయరాదు. కానిచో ఆభగవానుఁడునాదగ్గఱకు నాకేలతెలుపలేదు? నేను దూరముగ నుంటినా?" అనెను.

మరల భగవానుఁడు ఆమె స్వప్నమున గోచరించి, ఆమె భర్త ధనముతో నెట్టి సంబంధముఁ గల్పించుకొనక – ఆమెకు తలంపుగలిగిన ఆమె స్వంతధనమే మేనియున్న దానిని వెచ్చింపఁదగునని తెలిపెను ఆమెకు స్త్రీధనము ఆభరణములు కలవు. కావున ఆమె తన భర్తకా స్వప్న వృత్తాంతమును దెలిపి, తన ఆభరణములను దైవమునకు సమర్పింతు నని తన కోరికఁ దెలియఁజేసెను. ఆలోభి యీపనియందును దైవమును వంచింపఁ దలఁచెను. ఆమె నగలు వేయిరూపాయలు విలువ గలవి, వానినిఁ దీసికొని మహాదేవునిపేర భూమిని వ్రాసియిత్తునని యాతఁ డనెను. ఆభూమియు నొక వితంతు వాతని దగ్గఱ అప్పుతీసికొని తాకట్టు పెట్టి వదలుకొనినభూమి అది సాగులేనిది. మంచి ఋతువులందునే

పంటయుండునని ఒక తీరపుభూమి. దానినతఁడు ఆ దేవాలయ పూజారికి మహాదేవుని పూజార్థము ఈనాముగ వ్రాసియిచ్చెను. అంతట నొక పెద్ద తుపాను ఉరుములు మెఱుపులతో దాపరించి పిడుగులు పడెను. ఆపిడుగులవలన ఆలోభియిల్లు దగ్ధమై కూలెను. ఆదంపతులు మరణించిరి. మరుసటి జన్మమంతా ధనికుఁడు మధుర (ముత్ర) యందు జనించెను. ఆతని భార్య మహాదేవుని పూజరియొక్క పుత్రికయై పుట్టెను. ఆమెకు 'గౌరి' యను పేరుపెట్టిరి. ఆభూమి తాకట్టుపెట్టిన మనిషి (దుబాకి) మగవాఁడుగ జనించి 'బసప్ప' అనుపేరఁ బఱఁగెను. ఆ పూజరి వారసులకు దత్తుఁడయ్యెను. మధురలో జనించిన ధనికుఁడు "వీరభద్రప్ప" అనుపేరునఁబిలువఁబడెను, ఆపూజరినాకుఁ గూర్చు మిత్రుఁడు. తఱచుగ నాదగ్గఱకు వచ్చి పొగత్రాగుచుండువాఁడు. ఆతని పుత్రికయు నాయందు భక్తి కలది.

ఆపూజరి తన కూతురు వివాహమునకు తగినవరుఁడెవరా! యని ఆలోచనలోపడి నన్నడిగినాఁడు. "నీవు ఆందోళన చెందవలదు. ఆమెను వివాహమాడుటకు ఒకఁడు నీదగ్గఱకు వచ్చును.–" అని నేను చెప్పితిని. వీరభద్రప్ప తన పేద తలిదండ్రులను విడిచిపెట్టి వెడలి ఆయా తావుల నన్నము భిక్షించికొని తినుచు తుదకా మహాదేవుని పూజరి యింటికిఁ జేరెను ఆపూజరి కూతురను వివాహమాడుటకు సమ్మతించెను. వీరంద్రప్ప గౌరిని వివాహమాడెను. వీరభద్రప్పయు నాభక్తుఁడయ్యెను. కాని వాఁడెంతసేపు ధనలంపటుఁడు. ఆతని వివాహమునకు నేను కారకుఁడ నని ఆతనికి ధనముఁగూర్చు విషయమునఁ తోడ్పడవలయునని నన్ను కోరెను.

"ఆగుము! మంచి కాలము రానున్నది." అని నేను పలికితిని.

ఆ తీరపుభూమి విలువ తలవని తలంపుగ హెచ్చెను. అది ఒక లక్షరూపాయల కమ్మఁబఁడెను. సగము విలువ రొక్కము చెల్లింపఁబడి, తక్కిన సగము రెండువేలు చొప్పున 25 వాయిదాలుగ చెల్లించునట్లు

నిర్ణయింపఁబడినది. అందఱు ఈనిర్ణయమునకు సంతోషించిరి. అంతట వీరభద్రప్ప - బసప్ప యీ ధనమునుగూర్చి తగవులాడుకొనిరి. గౌరి - ఆపూజరి ఆస్తికి ఏకైక అధికారి - యని నేను చెప్పితిని. ఆ ఆస్తిని గౌరిమాత్రమే ఉంచుకొనఁదగునని, దానిపై నితరుల కెవరికి హక్కు నంగీకరింపవలదని ఆమె కలఁగనెను. గౌరి నారక్షణము నర్థించెను. ఆమెను సంరక్షించుటకు సప్తసముద్రములనైన దాటెదనని నేనామెకు అభయ మొసంగితిని. [ఆజన్మమున బాబా సకలసిద్ధులు గలిగిన ఒక ముస్లింగానుండి, మసీదులో నివసించువాఁడని తోచుచున్నది.]

వీరభద్రప్ప- బసప్పతో కలహించి, యిరువురు నాదగ్గఱకు వచ్చిరి. వీరభద్రప్పను సమాధానపఱుపనెంచి విఫలుడనైతిని. అతఁడు నాపై నాగ్రహించి, మతిచెడి, బసప్పను కండతుండెములుగ నరికి చంపుదునని బెదరించెను. పిరికివాఁడైన బసప్ప నారక్షణ మర్థించెను. పగబూనిన వీరభద్రప్ప దురాగ్రహమునుండి రక్షింతునని 'బసప్పకు' నే నభయమిచ్చితిని. దురాగ్రహావేశుండై మతిచెడిన వీరభద్రప్ప నన్ను, దక్కినవారలను చెడఁదిట్టి ఏవేవో శపథములఁబలికెను. వీరభద్రప్ప చచ్చిసర్పమై జనించెను. బసప్పమృతినొంది కప్పయై పుట్టెను. ఆపవ లోనున్న 'బసప్ప' కూయివిని, నాఅభయ ప్రదానమును జ్ఞప్తికిఁదెచ్చు కొని, సర్పమైన వీరభద్రప్ప బారినుండి కప్పయైన 'బసప్ప'ను రక్షించినామాటనిలుపుకొంటిని. భగవానుఁడునన్నుపంపి, తనభక్తుఁడైన బసప్పను కాపాడినాఁడు. ఇదియంతయు దైవలీల. (చూ1-ప.)

## బాబా - పూర్వజన్మ స్మృతులు

బాబాపూర్వ స్మృతులు — (వయో నిర్ణయములేదు) నిబద్ధపరిశ్రమ

474. నేనొకప్రదేశమున కేగితిని. అచటి పటేల్ నిర్బంధ మున ఒకవనమును ప్రతిష్ఠించితిని- దానిలో కాలిబాట నేర్పరచితిని.

475. ఒకసమయమునసాకు గుండెదడ యేర్పడినది. ప్రాణా పాయస్థితి నందుంటిని. నాఉరముపై విష్ణుసహస్రనామమును ఉంచి

గానినాడను భగవానుండునాదేహములోనికి దిగివచ్చినాడు. ఆవ్యాధి శమించెను. నేను సురక్షితుండనైతిని (చూ. 198.)

476. సా. బా:- ఒకతటి నేనొక బాలకుడను. తిండికి సంపాదించుకొన యత్నించితిని. వృత్తికై అన్వేషింపఁదొడంగితిని 'బీడ్-' అనుచోటునకేగి జరీఅంచు వస్త్రములనునేయు వృత్తిసంపాదించు కొంటిని. నాపనియందెప్పుడు విసుగునొందియెఱుగను. నాఫకీరు (యజమాని) విధానములవలన అలపుతలంపు తోచలేదు. ప్రతిదినము నలుగురుపిల్లలు చేయుపని చేసినాఁడను తడవకునొకబాలుఁడు 50 రూపాయల వస్త్రములను మఱియొకఁడు 100 రూపాయల వస్త్రమును యింకొకఁడు 150 రూపాయల వస్త్రమును తయారుచేసిన నేను 600 రూపాయల వస్త్రములను తయారుచేసితిని. నాయజమాని సంతోషించెను. నన్ను ప్రేమించి, యితరులయెదుటనన్ను ప్రశంశించినాఁడు. నాకు మంచి చక్కనిదినుసులను, తలపాగ, సాలువ నుత్తరీయముగ నొసఁగినాడు. వానిని నేనుపయోగించుకొనక ఇతరులకిచ్చితిని. ప్రభువు (దైవము) ఒసంగునది చిరస్థాయి యగును. నరుడొసగునదికాదు.

"పరమేశుఁడిడిన దెప్పటికినిఁజెడదు-
నరుఁడొసంగునది యెన్నడునిల్వబోదు."

477. నేను 'కబీరు'నై యుంటిని. నూలు వడకువాఁడను.

478. నేను నలుగురు సోదరులనుగలిగి యుంటిని. ధన మంతయు పెద్దవాని ఆధీనమున నుండెను. అతనిభార్య మమ్మందఱను వస్తుపెట్టినది. నేనొక వృత్తిని గుత్తకు తీసికొని ధనము సంపాదించి, సోదరులను పెద్దవానినిఁగూడ పోషించితిని. పెద్దవాఁడు కుష్ఠురోగి యగుట నెల్లరు పరిత్యజించిరి. తరిమివేసిరి. నేనతనిని సేవించి అవసర ములఁ దీర్చితిని. తుదకాతఁడు మరణించెను.

479. నేను 4 వేలజనులతో నుంటిని. అపుడొక అంటువ్యాధి వ్యాపించెను. అందఱు భయభ్రాంతులైరి. ఆజనులందఱుపారడి చి

"మిమ్ము మృతినొందనీయుటకుముందు నేనేమృతినొందుదును. మిమ్ము చావనిచ్చుట కంటెనేనే చత్తును " అని వారికి ధైర్యముఁగొలిపి. అభయ మిచ్చితిని.

480. ఈశిరిడియందే (బాబా) మసీదు ఉన్నతావున 'ముజఫర్‌షా' అనువాఁడుండెను. అతని కుమారుఁడు నివసించు 'నాంధుర్కి' - వరకు మైళ్ళకొలఁది అతనికి (ఆస్తి) భూసంపదగలదు. నేనతనిదగ్గఱ వంటవానిగ నుంటిని. ఈ మసీదునందు 'ధుని' వెలుగు చుండు తావున నతఁడు మరణించెను.

481. ఒక భక్తుఁడు:- బాబా! నీ జన్మస్థానమేది?

సా. బా:- నేను ఔరంగబాదునుండి యిచటకు వచ్చితిని, నా మేనమామ నన్నిటకు వెంటగొని వచ్చినాఁడు.

భక్తుఁడు:- ఆమేనమామ పేరేమి? ఇపుడాతఁడెచట నున్నాఁడు?

సా. బా:- ( నవ్వుచు ) అతఁడు పేరులేని పిచ్చివాఁడు. ఇపుడాతఁడెందో ఒకచోట నివసించు చుండును.

482. సా. బా:- నా సోదరుఁడొకప్పుడు చెడుగా ప్రవర్తించెను. అందుచేనతఁడు కులమునుండి వెలిపెట్టఁబడెను. నేనాతని యోగక్షేమ ముల నరసితిని. తుదకు ఆతనిని కులమునందుఁ జేర్చుకొనఁజేసితిని.

483. సా. బా:- (1913) లో బాబా తనపూర్వ జనములలో నొకజన్మమునకు సంబంధించిన నొకదీర్ఘగాథ నిట్లు తెలిపినాఁడు.

మేమిరువురు సోదరులము, మేమొక మార్గమునఁబోవు చుంటిమి. నా సోదరుడు ముందుగఁబోవుచుండెను. క్రూరజంతువు లాతనిఁగఱచినవి. వాఁడు మరణించెను, ఐదారుగురు మనుష్యులు నాదగ్గఱకువచ్చి "నీ సోదరుఁడేడి?" - అని, అడిగిరి, జరిగిన విషయ మెఱిఁగించి, యాతని శవముపై వస్త్రము కప్పితిననియుఁజెప్పితిని, నామాటలను విశ్వసింపక నేను వలదని చెప్పుచున్నను నా సోదరుని

వెదకుటకై వెడలి వారలును ఆ జంతువులచే చంపఁబడిరి. తరువాత నొకస్థూల దేహముగలకొంత నన్నుజేరి. యింతకు పూర్వము వారడిగిన ప్రశ్ననేయడిగి, నా సమాధానమును నమ్మక అన్వేషింపఁ బోయిన ఆమెకును పూర్వము వారిగతియే కలిగెను. ఆమె శవముపై గుడ్డ కప్పితిని. అంతటనేను ముందునకు సాగిపోవుచుండ నారుగు రేడుగురు మహమ్మదీయులొక గొఱ్ఱెతో నెదురైరి. వారు నాయెదుట దానిని చంపి; దానిమాంసమును నన్నుతినుమనిరి. నేను బ్రాహ్మణుఁడను. తినఁ జాలనంటిని. అంతటవారు ఆమాంసమును బలవంతముగ నానోటఁబెట్ట యత్నింపగ "దైవమును ప్రార్థించి భుజింతును"- అని నేను పలికితిని. నేనామాంసముపైనొక వస్త్రమునుగప్పి దైవమును ప్రార్థించితిని. ఆమాంసము పెద్ద రోజాపుష్పములుగ మాఱెను. ఏఒక గులాబి పుష్పము నేని నీ అఱచేతిలోని ముద్దుకొన్న జాలని యంత పెద్దది. ఆముస్లిములు వెడలిపోయిరి. నా మార్గమున నేను సాగితిని. కాలిబాటన నడుచుచు స్వచ్ఛమగు అపారజలప్రవాహముచే నావరింపఁబడితిని. అచటనుండి మార్గము కనబడలేదు. ఇదియంతయు దైవసంఘటనము.

సా. బా:- (శ్యామావైపునకుఁదిరుగుచు) మనవిధియేమి? సక్రమముగఁబ్రవర్తింపుము – అదిచాలును. వాడకు వెళ్ళుము – పారాయణము గావింపుము.

484. బాబా ఒక పరియిట్లనెను. నేను బాలుఁడుగ నున్నపుడు సాలువలు నేయుచుంటిని. నాపనినేర్పునకు నాతండ్రి మెచ్చుకొని నాకు 5 రూపాయలుకాబోలు! బహుమతినిచ్చినాఁడు.

485. నేనొకసమయమున తూర్పు తీరమున (కొరమాండల్ తీరమున) భుజించుచుంటిని. (నివసించుచుంటిని.)

4-6. సా. బా:- అహో! అక్బరు విషయమేమి? అతనిని శైశవమున రక్షించితిని. నన్నుగాంచి ఆశ్చర్య చకితుఁడైనాఁడు.

487. ఆపైతాను బ్రాహ్మణుని (ఏకనాథస్వామిని) నేనెఱుంగుదును. అట్టి సర్వోత్తములైన బ్రాహ్మణులను మనమీరోజులలోఁ జూడఁజాలము.

488. 'నాగుఱ్ఱము నెటకుఁదోలితివి?' – అని అడుగుచు "చాన్‌భాయి పటేల్" నాదగ్గఱకు వచ్చినాఁడు.

"నన్నేల నిందించెదవు? – వెళ్లి చూడుము! నీగుఱ్ఱమా పొద చాటున మేయుచున్నది." – అని సమాధాన మిచ్చితిని. (ఆ అశ్వమచట నుండెను.)

489. సా. బా:- (బాలకృష్ణఉపాసనీ శాస్త్రితో) ఝాన్సీ మహారాణి పాల్గొనిన యుద్ధమునందు నేనుంటిని. నేనా సేనలోనుంటిని.

490. ధనికుఁడగు నాతండ్రికి ధనపుపాతరలుండెను. నేనొక దానిపైఁగూర్చుంటిని. ఒక పెద్ద త్రాచునైతిని. కొంతకాలమైనపిదప ఆధనమును పిడిచిపెట్టితిని. తిరిగి మనుష్యరూపము నొందితిని.

491. సా. బా:- (జి. యస్. కపర్దే–తో) నేనిచట (శీర్డిలో– (లేక) గోదావరీతీరమున) 8, (లేక) 10 వేల సంవత్సరముల పూర్వమున నుంటిని.

492. ఈ ప్రదేశమున నొక ముసలిపటేల్ ఉండెడివాఁడు. అతఁడు నాదగ్గఱకు వచ్చుచుండువాఁడు. వేఁగువాండ్రు, 4 (లేక) 12 మంది కనిపెట్టి యుండువారు. ఆ ముసలివానితో వారికి అభిప్రాయ భేదముకలిగెను. ఒకపరి వారతనిపై కలియఁబడిరి. అప్పుడా ముసలి వానికి నేను తోడ్పడితిని. ఒకపరి వారతనిపని పట్టఁదలచి బలవంతముగ నీడ్చుకొని ఒక పెద్ద నగరమునకుఁ గొనిపోయిరి. నేను జోక్యము కల్పించుకొని ఆ ముసలివానిని విడిపింపఁజేసితిని.

493. నాచిన్నతనముగ 'జాల్నా' నుండి చాల దవ్వు వెళ్ళు చుంటిని. మార్గమున నొక మామిడిచెట్టుండెను. దాని పండ్లకన్నిటికి

పురుగులుపట్టెను. ఆ చెట్టు బోదెలో సినుపమేకులు దిగఁగొట్టితిని. ఆ లోపము చక్కబఁడెను. ఆపిదప పండ్లకొ పురుగులబాధ కలుగలేదు.

494. సా. బా:- నేను - (అంగోన్వావాడ్ నివాసి) సఖారాం. - ఇరువురము నొక గురువుదగ్గఱ విద్యనభ్యసించితిమి. మాచేతులతో మామిడిమొక్కలను నాటితిమి. నేనిపుడు (1909లో) ఆ చెట్లనుండి రెండు పండ్లను నీకు (కనిత్కార్ సతికి) పంపినాఁడను.

ఆమఱునాఁడు కనిత్కార్‌సతి ఆమెమార్గమున కోపర్గామునకుఁ జేర నచట దేవాలయములోని బ్రహ్మచారి "బాబా నీకొఱకు వీనిని పంపి నాఁడు" అని చెప్పచు, నాపండ్లను ఆమె కొసఁగెను.

495. నాచిన్నతనమున నొకనాటి ఉదయమున వెలుపలకు వెళ్లితిని. అదాటున నొకబాలికగ మారితిని. ఆపిదప కొంతకాల మావిధ ముగనుంటిని.

## (పూర్వజన్మమున) బాబాసాధనము

496. నేను మిక్కిలి కష్టించితిని. నెలల పర్యంతము భోజనము లేక వేఁప మొదలగు చెట్ల ఆకులనుతిని జీవించితిని. దైవము నాయెడ దయవహించినాఁడు. దేహమున రక్తమాంసములు క్షయించి శల్యమాత్రావశిష్టుఁడనైతిని. ఎముకలు సైతము చూర్ణముగానున్న స్థితిపట్టి నను ప్రాణము నిలిచినది.

## నిరంతర నిస్స్వార్థసేవ.

497. ఒక తోటలో 200 మంది రోహిల్లాలకు ఈతకల్లు విక్రయించుచున్న ఒక కన్యను నాతండ్రిచూచి ప్రేమించి (లేక) వివాహమాడి, ఆమెవలన పుత్రులను బడసెను. ఆమె ఆతని ననుసరింపక నితరులఁ బలువురఁ బ్రేమించెను. ఆమె పాదములకు పురుగులేర్పడెను. ఆమె నా తండ్రికి భార్యయగుటచే నామె పాదములకు చికిత్సచేసి వానినిఁ జక్క పఱచితిని. తరువాత ఆమె మరణించెను.

498. వస్త్రములు - తలపాగలు - పీతాంబరములు - తివాచీలు మొదలగువానిని వేసితిని. కాని, యిన్నిపనులు చేయఁజాలియు తిండి గడచినదికాదు.

499. నాతల్లి తనకు కుమారుడు (నేను) కలిగినాఁడని మిక్కిలి ఆనందించు చుండినది. ఆమె ప్రవర్తనమునుగూర్చి నాలో నే నాశ్చర్య పడుచుండువాఁడను. "ఆమె నన్నెప్పుడు కన్నది? నేనెప్పుడేని జన్మించితినా? నేనెల్లప్పుడునున్నవాఁ డనుకానా? దీనినిఁగూర్చి ఆమె ఏల ఆనందించుచున్నది?" - అని.

499. (A) నడుముఁదిగువభాగము చిలుకరూపముతాను పొంది నట్లు బాబా తెలిపినాఁడు.

## ఋణానుబంధము

ఋణానుబంధమునఁజేసి జనులను బాబా
తనదటికాకర్షించువాఁడు.

## (1) వా. గో. చందోర్కర్.

500. నానా:- బాబా! నన్నేలపిలువనంపితివి?

సా. బా:- ఈ ప్రపంచమున వేన వేలుగలరు. నేను వారందఱను పిలువనంపుదునా? నిన్ను పిలువనంపుటకు ప్రత్యేక కారణము లుండవలదా?

నానా:- ఉండవచ్చును. నేనెఱుఁగఁజాలకున్నాఁడను.

సా. బా:- నానా! నాలుగు జన్మములనుండిమన మిరువురము సంబంధముగలిగి యున్నారము. అది నీ వెఱుఁగవు, కాని, నేనెఱుఁగుదును. కావుననీకు అవకాశము గలిగినపుడు ఇక్కడకు వచ్చుచుండుము.

500. **A.** సా. బా:- ఒక బావికలదు. దానిదటినొక చెట్టు గలదు. ఆచెట్టుపై రెండుపక్షులు కూర్చుండెను. ఒకటిజారి బావిలోపడి

మునుగనుండెను. దాని ప్రియమిత్రము దానిని రక్షించుటకు వెంటనే బావిలోనికి దుమికెను. రక్షింపదుమికిన మిత్రమునకు ప్రాణముపోవునంత పనియైనను వెళ్ళుపటిదానిని రక్షించెను.

## (2) భగవంతరావు క్షీరసాగర్.

501. సా. బా:- విఠోబాను ఇతనితండ్రి సేవించినట్లితడు సేవింపడు. నైవేద్యము సమర్పింపడు. నన్ను-పిల్లలను వస్తు పెట్టుచున్నాడు. ఈ తనితండ్రి నామిత్రుడు. కావునవిఠోబాపూజ తిరిగి ప్రారంభింపజేయించుట కితని నిచట కాకర్షించితిని.

522. (3) పూర్వమొక జన్మమునందునేను.. నీవు (జి. యస్. కపర్దే) జోగ్. కాకా. (హ. సీ. దీక్షిత్తు) శ్యామా, దాదా కేల్కార్ - అందఱముకలిసి చీకటివీధియందు మనగురువు దగ్గఱనున్న వారము. కావున వీరలనందఱనొక చోటునకు మరలఁజేర్చినాఁడను.

(4) నానా! ఈతఁడొక బొక్కసము (పెట్టె) మున్నదగ్గఱనుంచినాఁడు. ఇపుడుదానిని తిరిగికోరుచున్నాఁడు, దానిని నిరాకరించుట తగదు. (నగా-పూర్వభవమున నితఁడు మనకొకమేలు కావించినాఁడు. మనమిపుడీతనికి తిరిగిమేలు చేయఁవలయును.) చూ. 527.

## (5) తరిమివేయుటతగదు.

503. ఋణానుబంధము (పూర్వజన్మ సంబంధము) లేనిదే ఎవరు మనదగ్గఱకురారు. కావున కుక్క-పిల్లి-పంది- ఈఁగ లేక-యే మనుష్యుఁడు మనదఱికిఁజేరిన "ఛీ-ఛీ-" అని. "పో-పో-" అని తరిమివేయకుము.

## (6) జంతువుల ఋణానుబంధము.

504. సా. బా:- (పులిమరణించినపుడు ప్రదర్శకునితో) పూర్వజన్మమున నీకు ఆపులి చెల్లించవలసిన ఋణము ఇప్పుడు తీరినది.

## బాబా-తాను జన్మమున బ్రాహ్మణుండవని సూచించుట

## 505. (a) ఇదియొక బ్రాహ్మణ మసీదు.

(b) ఇతఁడొక బ్రాహ్మణుఁడు. పావన బ్రాహ్మణుఁడు. వేన వేలు ప్రజలను శుభ్రమార్గమున మోసికొని పోవఁగల స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడు.

506. (c) (బాబాకు 8 అణాలు సమర్పింపఁ దలచి 4 అణాలు మాత్రమేయిచ్చి వెనుకకు పంపలిన 'చాబాల్‌సతి'తో) అమ్మా! అమిగిలిన 4 అణాలనీయక పేదబ్రాహ్మణుఁడనైన యీనన్ను మోసఁగింపనేల?

(b) సా. బా:- వి. సి. యస్-బాబాకు సమర్పింపుమని యిచ్చిన 2 అణాలు ఇచ్చుటమఱచి, తిరిగివెళ్ళుటకు సెలవీయుమని బాబానుకోరిన యస్. బి. నాచ్నేతో) మంచిది! 'చితాలీ' మీదుగపొమ్ము. కాని, ఒకపేద బ్రాహ్మణుని 2 అణాలు మోసగింపనేల!

### బాబా—భక్తుల యెడఁగల ప్రేమ.

### 1. బాబా-ప్రేమను అభినందించుట

### (a) వినాయక్. యస్, గిరిధర్ (మాలాడ్ నివాసి)

507. వి. యస్. గిరిధర్ భార్య బాబాయందు అపార భక్తి గలిగిన సాధ్వి. ప్రత్యేకశ్రమతీసికొని ఒకచక్కని పూలమాల సిద్ధపఱచి తన భర్తద్వారా బాబాకు పంపెను.

బాబా ఆపుష్పమాలను అత్యాదృతితో స్వీకరించి, కంఠమున ధరించి, చాలసేపు ఆ విరిదండ నుంచుకొనెను.

సా. బా:- ఇది అత్యధికభక్తితో సిద్ధపఱుపఁ బడినది. ఈవిధ ముగ ప్రతివారము నీ యింట నాపటమునకు ఒకపూల మాలనర్పింపుమని ఆమెకు చెప్పుము!

(చూ. టెండల్కార్ సతి-వకుళపుష్పమాలలు)

## (b) ఆర్. బి. పురందర్.

508. (1) సా. బా:- నేనాతని మఱువను. ఆతఁడు 2వేలమైళ్ళ దూరమున నున్నను జ్ఞప్తియందుంచుకొందును. ఉబ్బసము-ఆయాసము హెచ్చుగనుండెను. అతని విడిచి యే లవమేనియు భుజింపను.

(2) సా. బా:- పురందర్! గృహమును కట్టుకొనుము. ఎవరిని నొకపైసాకూడ అడుగవలదు. నేనే నీకు సహాయము చేయుదును.

అంతట పురందర్ తన ఆఫీసులో 500 రూపాయలు అప్పు తీసికొని ఒక ఇల్లు కట్టుకొనెను. అది ఊరివెలుపల పొలములోనున్న ఏకాంతగృహము.

సా. బా:- నీవేమియు భయపడవలదు. నేను స్వయముగ నచటఁగూర్చుండి నీయింటిని నీపిన్నవయస్సునను న్న భార్యను కాపాడుచుందును.

(ఆదంపతులు ఊరివెలుపల నేకాంతముగ నివాసమున్నను వారికెట్టి ఆపదలు కలుగలేదు.)

(3) 1915లో బాబా చాల జబ్బుగనుండెను. ఉబ్బసము ఆయాసము హెచ్చుగ నుండెను. ఈజబ్బు విషయ మెఱుఁగకయే పురందర్ శిర్డికివెళ్ళి బాబా మిక్కిలి ఆయాస పడుటచూచి బిట్టేడ్చెను.

సా. బా:- నీవేల ఏడ్చెదవు?

పురందర్:- బాబా! నీయీస్థితిఁజూచి నేను సహింపఁజాలకున్నాఁడను.

సా. బా:- భయపడకుము! 2, 4 దినములలో చక్కఁబడును. అల్లా నాకీవ్యాధి నొసఁగినాఁడు. ఈ గడువులోపల తిరిగి స్వస్థత కలిగించును. నీవు దుఃఖింపవలదు. 2 3 రోజులనుండి నిన్నుగూర్చి తలఁచు చున్నాఁడను. నిన్నిటకు రమ్మని ఉత్తరము వ్రాయవలసి

నదిగా కాకా (హ. సి. దీక్షిత్తు) తో చెప్పినాఁడను. [ఆ ఉత్తరము అందు లోపలనే పురందర్ శీర్డికి వెళ్లెను.]

(4) ఆర్. బి. పురందర్ తల్లి పండరికివెళ్ళి విఠోబాను దర్శింపఁ దలఁచెను.

అపుడు పురందర్ తల్లికి, పురందర్ భార్యకు విఠోబా రుక్మిణీ రూపమున శీర్డిలోని మసీదునందే బాబా దర్శనమిచ్చెను. వారు సంతృప్తి నొందిరి.

సా. బా:- (తరువాత) అమ్మా! నీవు పండరికి ఎపుడు వెళ్ళుదువు?

పురందర్ తల్లి:- నాదైవము శీర్డిలోనే యున్నాఁడు. ఇదియే నాపండరి.

( శిర్డిమాయే పండరిపూర్ - సాయీబాబారమావర్ )
( ఆరతి గేయము )

(5) సా. బా:- (పురందర్‌తో) నీవెల్లవేళల సత్యమును పాటింపుము. నీవిచ్చినమాటను చెల్లించు చుండుము. గాఢవిశ్వాసము- ఓర్పు- గలిగియుండుము. అపుడు నీ వెక్కడనున్నను ఎల్లవేళల నేను నీవెంటనే యుందును.

పురందర్:- బాబా? దయతో నన్నట్లు ప్రవర్తింపఁ జేయుము!

సా. బా:- నీవేసమయమున కలహించి పోరాడకుము. నీ వితరులతో కలహించునపుడు నేను విసుగునొంది బాధపడుదుము.

(చూ. 289)

509. బాబా నిత్యము భిక్షించుగృహములలో నందరామ్ - యస్. మార్వాడీ - గృహమొకటి, శీర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించి సందరామునకు జ్వరముతగిలెను. ఆతఁడు భయపడి శీర్డివిడిచి వెళ్ళఁ దలచెను. (చూ. 37

సా. బా:- వెళ్ళవలదు. నీవు మరణింపవు. నేను తనువు విడుచువరకు నిన్ను మృతినొందనీయను.

బాబా అతనికి ఊధిని ప్రసాదించెను. అతని జ్వరముతగ్గెను. అతఁడింకను (1940 నాటికిని) జీవించియే యున్నాఁడు.

510. 1914 శ్రీరామనవమియందు లక్షల జనము బాబాచుట్టుఁ జేరిరి. ఒక వృద్ధురాలు బిగ్గఱగ అఱచుచుండెను.

వృద్ధురాలు:- ఓ బాబా! ఈ ముసలిదానిపై కరుణ వహింపుము. ఓ బాబా! నీదర్శనము నాకు ప్రసాదింపుము.

శ్యామా వెలుపలకువెళ్ళి జనసమూహమును త్రోసికొనుచు, ఆ వృద్ధురాలిని బాబా సన్నిధికిఁ గొనివచ్చెను. ఆమె సంతోష బాష్పములను స్రవించుచు, తన రెండు చేతులతో బాబా నడుమును బంధించెను.

సా. బా:- అమ్మా! నీ కొఱకెంత కాలమునుండియో వేచి యుంటిని. నాకు ఏమేని తినుటకు తెచ్చితివా!

వృద్ధురాలు:- ఇదిగో చలిది రొట్టెముక్క - ఉల్లిగడ్డ, నేనొక రొట్టె రెండు ఉల్లిగడ్డలను తీసికొని ప్రయాణమై వచ్చితిని. ఈ ఉదయము ఆకలినొంది ఒక ఏటిదరిఁజేరి. సగము రొట్టె నొకఉల్లిని భక్షించితిని. శేషించినవి యివిగో - వీనిని నీవు భక్షింపుము.

సా. బా:- (ఆ చప్పని రొట్టెముక్క నమలుచు అత్యాసక్తితో తినుచు) అమ్మా! నీ రొట్టె ఎంత మధురముగా నున్నది!

(చూ. 515.)

511. 1913 న నామసప్తాహము జరుగు సమయమున పలువురు భక్తులు గుంపులు గుంపులుగ బాబాను క్రమ్ముకొని కూర్చుండిరి.

సా. బా:- శ్యామా! వెలవలకు వెళ్ళుము. ఆ గోడకు వెలుపల నొక వృద్ధుఁడు కూర్చున్నవాఁడు అతనిదగ్గఱ కలకండ కలదు. నాకై కొంచెము కలకండ అడిగితెమ్ము!

శ్యామాపెళ్ళి ఒకముసలివానినిఁజూచెను. అతని నోటినుండి చొంగకారుచు, బొమ్మపైఁగల కురుపునుండి చీము స్రవించుచు ఈగలు క్రమ్ముకొని యుండెను. శ్యామా జన సమూహమును ద్రోసికొనుచు నా వృద్ధుని వెంటఁగొనివచ్చి, "అతఁడిడుగో!" - అనెను. బాబాతన అభయహస్తమునతని మస్తముపైఁజేర్చి, ఆశీర్వదించి, అతనిమూట నుండి కొంచెకల కండతీసికోని, శేషించినది (ప్రసాదముగ) కొనిపొమ్ము"- అనెను.

512. 'బస్సీను' నివాసి, బాబావర్కర్ - బాబాకొఱకు ఒక అరటిపండ్లగెలను పంపెను. ఆగెలను మోసికొనివచ్చిన వాఁడు దాని నొసఁగక బాబా ఎదుట దూరముగ నిలిచియుండెను.

సా. బా:- ఓయీ! (ఆగెల తెచ్చిన మనిషితో) ఆగెలనుండి యొకపండు తీసియిమ్ము ! అతఁడు (వఖర్కర్) ఇంతవరకు భోజనము చేయలేదు. బాబా అరటిపండు భక్షించె నాఁడని తంతిపంపుము! అపుడాతఁడు భుజించును.

బాబా అపుడుపలికిన మాటలే వఖర్కర్ తనతోఁ జెప్పినట్లు ఆగెల తెచ్చినవాడు జ్ఞప్తికిఁదెచ్చుకొనెను.

513. 1915 జనవరిలో సంక్రాంతికి 8 రోజులు ముందు-

సా. బా:- సంక్రాంతి హల్వాపంపుము.

వార్తాహరుఁడొకఁడు మిఠాయి కొట్టునకువెళ్ళి తిరిగివచ్చి "సంక్రాంతి యింక 8 రోజులుండుటచే దొరకలేదు" - అనెను.

సా. బా:- సంక్రాంతి హల్వానాకిపుడు కావలయును.

వార్తాహర్తుఁడు మిఠాయి అంగడికి వెళ్ళెను. అప్పుడే తపాలా మనిషి ఒకబంగీ తెచ్చి బాబాచేతికిచ్చెను. భక్తుఁడొకడు ప్రత్యేకించి సిద్ధపఱచి ముందుగ రుచిచూచుటకై పంపిన (టిల్‌గుల్) సంక్రాంతిహల్వా

గలబంగి అది బాబా తన అంతర్జ్ఞానమున నది యెప్పుడు పంపఁబడినది - యెప్పుడు చేరునది తెలిసికొనఁగలిగినాఁడు.

514. సా. బా:- నాకు (కాచేరి) వంకాయ కారపు కాయ కావలయును.

అవి అపుడు అంగడిలోలేవు. పురందర్ భార్య కెవరో వంకాయలు పంపుటచే నామె బాబా కొఱకు (వేపుడు) కారపుకాయ సిద్ధముచేయు చుండెను. ఆ విధముగ నెవరు అడుగకయే తనకు అందింపఁబడిన ప్రేమపూర్వక బహుకృతిని గుర్తించి బాబాతన అభీష్టమును తెలిపినాఁడు.

515. సా. బా:- (గోవింద బాలకరాంమాన్కర్‌తో) నాకొఱకు ఏమైన నీవు తీసికొని వచ్చితివా?

గో. బా. మా:- ఏమియు తీసికొనిరాలేదు - బాబా

సా. బా:- నాకై తీసికొని వెళ్ళుమని ఎవరునేమియు నీయలేదా?

గో. బా. మాన్కర్;- లేదు - బాబా!

సా. బా:- నాయనా! నీవు బాంద్రానుండి బయలుదేరు నపుడు అతల్లి ఆర్. ఎ. తార్ఖాడ్‌సతి అత్యంతభక్తి ప్రేమలతో నాకీయు మని మిఠాయి (లడ్డు) నీకీయలేదా?

గో. మాన్కర్:- అవును - బాబా! ఇప్పుడు నాకు జ్ఞాపకమునకు వచ్చినది.

ఇంతకు ఆ లడ్డు ఎప్పుడోతయారు చేయఁబడి, బాంద్రాలో బాబా పటమునకు నివేదింపఁబడినది. మాన్కర్ ద్వారా బాబాకు పంపుటకు ఇతర మేమియు నప్పటికి లేనికారణమున ఆతార్ఖాడ్‌సతి అత్యంత భక్తి ప్రేమలతో ఆ పాత్ర మిఠాయి పంపినది.

516. బాబా ద్వారకామాయి మసీదునందు మధ్యాహ్నమున ఆసీనుఁడై యుండగ పలువురు భక్తులు పెక్కుపళ్లెరములలో నైవేద్యము

లను గొనివచ్చి బాబాముందు పెట్టిరి. కాని, బాబావాని నేమియుఁదాక లేదు. జి. యస్. కపర్దే సతి పళ్లెరములో నైవేద్యము తెచ్చి బాబా ముందుంచిన తోడనే బాబా ఆ పదార్థముల రుచి చూచెను.

శ్యామా:- దేవా! ఏమిది? యిదియెట్టి వేర్పాటు? ఇతరులు తెచ్చినవానిని నీవు తాకనైన తాకలేదు. ఈతల్లి పళ్లెరమున నైవేద్యము తెచ్చినతోడనే రుచి చూచితివి!

సా. బా:- ఈమె (జి. యస్. కపర్దేసతి) పూర్వమొక వైశ్యుని గోవు (నాకు) సమృద్ధిగ క్షీర మొసంగినది. తరువాత తోటమాలి కూతురుగ జనించి, క్షత్రియుని దగ్గఱఁజేరెను. అపుడొక కోమటిని వివాహ మాడెను. ఆ పిదప ఆమె బ్రాహ్మణ జన్మమొందెను. చాలా కాలము గడచిన పిదప ఆమెను మరలఁజూచుచున్నాఁడను. ఆమె నా కొసఁగు నాహారము (అపారప్రేమ రసమిశితమై) మిక్కిలి మధురముగ నుండును.

517. దుర్గంధముగలిగి దుర్బలుఁడైన ఒక కుష్ఠురోగి తన ముఱికి గుడ్డకొంగున పాల్కోవా (పేడా) పొట్లమును మూటకట్టుకొని, దానిని బాబాకు బహూకరించి, యందుకొంత తిరిగి ప్రసాదముగ స్వీక రించు తలంపుతో ద్వారకామాయి మసీదు మెట్లను మెల్లగ నెక్కుచు, 'ధుని' దగ్గఱకేగి, ఉఢినిఁజేకొని బాబాచేతియందుంచెను. సిగ్గు భయ ములు పీడింప ఆ పేడా పొట్లము బాబాకు బహూకరింపకయే మరలి వెళ్లుచుండెను బాబా దగ్గఱగఁ గూర్చున్న ఒకకాంత (సదాశివతార్కాడ్ సతి) ఆ చెడు కంపు కొట్టుచున్న ఆ కుష్ఠురోగి వెడలిపోవుటగని "బ్రతికి తిమి స్వామీ! యీ పీడవదలి పోయినది" – అని, తనలోఁ దలంచెను.

సా. బా:- (ఆమెపైపునకు తీవ్రనునిశితమైన దృష్టిని ప్రస రించుచు) ఓయీ! ఆ మనిషినిటు తిరిగి పిలువుము!

ఆ కుష్ఠురోగివచ్చి, ఆమిఠాయిపొట్లము తనచేతులలోనేయుంచు కొని ప్రణమిల్లెను.

సా. బా:- ( ఆపొట్లము తీసికొనివిప్పి ) అహో! ఏమి యిది? (పేడా) మిఠాయియా?

సా. బా:- (అందుకొంచెముతీసి తార్ఖాడ్ సతికి ఇచ్చి దీనిని భక్షింపుము!

అంతట బాబా ఆమిఠాయిలో కొంచెము తన నోటిలో వేసికొనెను.

ఆ సతికి చచ్చిసంతపనియైనను, తోటిజీవులందు సానుభూతి, గురువునందు గాఢవిశ్వాసము వహింప వలయునను పాఠమును తనకీ రూపమున బాబా బోధించుచున్నాఁడు - అని తలఁచి ఆమె ఆమిఠాయిని మ్రింగెను.

సా. బా:- (అందుమిగిలిన మిఠాయిని అక్కుర్కరోగికి తిరిగి యిచ్చుచు) ఈ ప్రసాదమును దీసికొనిపొమ్ము!

I నిర్మల మనస్సుతో సమర్పించు బహుమతులు

(A.) [ గార్డే - మామిడిపండ్లు X పండిట్ - శేషించిన లడ్లు. ]

5:8. కె. కె. గార్డే. (బి. ఎ; యల్. బి. నాగపూరు సబ్జడ్జి ఉద్యోగమునుండి విరమించినవాఁడు) పూనాలోని "రేమార్కెట్" నందు మంచి చక్కనిమామిడిపండ్లు మూటిసిఁగొని తెచ్చి వానిని బాబాకు సమర్పించెను.

సా. బా:- (వానిని స్వీకరించుచు) అహో! ఇతఁడు (గార్డే అంగడిలో నాకొఱకు కొనిన పండ్లన్నియు, మొన్న ఆపండిట్ చేసినట్లు గాక (వీనిలో నేమియుఁ దాను భక్షింపక) తీసికొనివచ్చి సమర్పించి నాఁడు. పండిట్ పొట్లములో కట్టిన లడ్లన్నిటిని నాకీయవలయునని తీసికొని వచ్చుచుండెను. కాని, మార్గమున గోదావరిలో స్నానముచేసి

ఆకలినొంది ఆపొట్లములోని లడ్లలోఁ గొన్నిటినిఁదిని శేషించినవితెచ్చి నాకిచ్చినాఁడు. ఈఫలములు ఆలడ్లవలె 'భుక్తశేషములు' కావు.

B మలినమనస్సుతో నొసఁగు బహుమతులు

ఖికూబాయి — పూలమాల కర్బూజ ఫలములు — పాల్కోవా.

519. ఖికూబాయి బయ్యాజిపటేల్ అహమ్మద్‌నగర్‌నుండి శీర్డికి తిరిగి ప్రయాణమై పూలమాల, కర్బూజాఫలములు - దూధ్‌పేడా వెంటఁగొని వచ్చుచుండెను. కోపర్గామునందు గోదావరినదినిదాటెను. తన సఖియొక్క దుర్మరణమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని అచట నేడ్చుచు, తన సఖిని ఆదుర్మరణమునుండి రక్షించినవాఁడుకాఁడని, బాబాను తన మనస్సున నిందించెను. కని, శీర్డికిఁజేరి, బాబాకు ఆ తెచ్చినవస్తువులు బహూకరించునపుడు అట్టితలఁపులన్నిటిని మఱచియే యుండెను.

సా. బా:- ఈ (తల్ - తల్) మానసిక వ్యాకులతతో గూడిన పూలమాల నాకువలదు.

అంతటనామె ఆ పూలమాలను రెండుచేతులతో తీసికొని బాబా మెడలో నిలుప దగ్గఱఁకుజేరెను. ఆశ్చర్యముగ నా పూలమాల ముత్తునియలై ఆమె రెండుచేతులలో రెండు ముక్కలు నిలిచి, నేలపై నొక ముక్కవడెను. అంతట నామె కర్బూజఫలములను పాల్కోవాను సమర్పింపఁబోయెను. బాబా వానిని నిరాకరించెను.

సా. బా:- ఈమె గోదావరితీరమున దుఃఖించుచు కన్నీరు కార్చుచుండెను. అట్టి వ్యాకులమనస్సుతో వీనిని దీసికొనివచ్చినది - కావున వీనిని స్వీకరింపను.

సంశయాత్మక బహూకృతులు -

కనిత్కార్ కాంత - ద్రాక్షఫలములు

520. కనిత్కార్‌సతి తన పుత్రికలతోఁగూడి, బాబాకు సమర్పింప ప్రత్యేకముగ మిక్కిలిప్రేమతో మంచి ద్రాక్షఫలములను బుట్టనిండుగఁదీసికొని వెళ్లెను.

సా. బా:- (కరుణాస్వరమున) నీవేమి తీసికొనివచ్చితివి? ద్రాక్షలా

క సతి:- అవును. బాబా! నీ కొఱకు వానిని నాశిక్‌నుండి తెచ్చితిని.

అంతట నామె ఆ పండ్లబుట్టను బాబాకు సమర్పించెను. బాబా ఆ ద్రాక్ష ఫలములు కొన్ని త్రిప్పిచూచుచుండఁగా - ఆమె కూతురు - బానూతాయి "ఈ పండ్లన్నియు బాబాచే పంచిపెట్టఁబడి వ్యర్థము కానున్నవి" - అని తలంచెను.

సా. బా:- (ఆబుట్టను కనిత్కార్ సతివైపునకుఁ ద్రోయుచు) నీ బుట్టను నీవు తీసికొనిపొమ్ము!

కనిత్కార్‌సతికి పై ప్రాణములుపైనపోయ్యేనట్లయ్యెను. ఆ తల్లిపొందిన మానసికబాధను బాబాగుర్తించి ఆ బుట్టనుండి యెండి పోయి పలికిరానిపండ్లను కొన్ని తీసికొని, శేషించిన వానిని తిరిగి యిచ్చుచు "ఇపుడు పొమ్ము! నీ బిడ్డలను వీనిఁదిన నిమ్ము" - అనెను.

కనిత్కార్‌సతి ఆమెకుమార్తెలు ఆ పండ్లబుట్టతో తిరిగి పోవు చుండగా "అమ్మా! నాకట్టి ఆలోచన ఏలకలిగెనో నే నెఱుఁగను. నీ వా బుట్టను బాబాకు బహూకరింపఁగా "ఏమి! ఈమె యీ పండ్ల బుట్ట నంతయు యిచ్చనదే! క్షణములో నివియన్నియు పంచిపెట్టఁబడును. బాబా ఏమియుఁదినఁడు. మన కేమియుఁదక్కవు" - అని తలంచితిని."- అని బానూతాయి తల్లితో పలికెను.

బాబాచర్యలు - వలుకులు - ఆ తల్లియొక్క ఆశయమును - ఆమె బహూకృతినిఁగూర్చిన తలంపు - ఆ కూతురుయొక్క అనిష్టత వలన చెఱుపఁబడినదిగ విశదీకరించినట్లు గమనింపఁదగును.

## 11 బాబా - భక్తులకొఱకు స్వార్థత్యాగము

### (a) బల్వంతు జి. కపర్దే ప్లేగువ్యాధిని తన చక్కికి బాబా ఆకర్షించుకొనుట.

521. 1911 - 12లో శిర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించెను. జి. యస్. కపర్దే - కుమారుఁడు బల్వంతునకు (ప్లేగు సంబంధమైన) జ్వరము తగిలెను.

జి. యస్. కపర్దేసతి:- బాబా! మేము వెళ్ళుటకు సెలవిమ్ము!

సా. బా:- మబ్బులు క్రమ్మినవి, పిదప వర్షించును. అంతట పైర్లు పెరిగిపండును. మబ్బులు విచ్చును. నీవు భయపడనేల?

కపర్దేసతి బాబాపలుకులను గ్రహింపలేక వెడలి పోయెను.

తరువాత - బాబా తన కుపినీ పైకెత్తి తనకడుపు మీద ప్లేగు బొబ్బలను చూపుచు - "అమ్మా! చూడుము! నీకష్టములను నివారించుటకై నేను మీ కొఱకు కష్టపడవలయును.

బల్వంతు తనువునుండి ఆప్లేగు బొబ్బల జ్వరమును బాబా ఆకర్షించుకొనెను. బాబా జ్వరముతోడ బల్వంతు జ్వరము రెండు మూఁడు దినములలో శమించెను.

(గమనిక) ఈ విధముగ 'గోవా' లోని పోలీసు సూపరింటెండెంటు ప్లేగువ్యాధినిఁగూడ, బాబా తనచక్కికి ఆకర్షించు కొనినాఁడు.

### (b) బాబా — తనకంఠమును సమర్పించుట.

522. ఆర్. ఎ. తార్ఖాడ్ - కంధహార్ నివాసి మీర్జమాన్ ఇంకను ఇతరులు చావడిలో బాబా సమీపమున నిద్రించుచుండిరి. మీర్జమాన్ అర్ధరాత్రిమున నిద్రలేచి బాబాతో నిట్లనెను.

మీ. జ:- బాబా! ఈ హైందవులు నిన్ను - ఇస్లాంమతమును చెఱచు చున్నారు. నా కనుజ్ఞనిమ్ము! నా ఖడ్గముతో వీరియందఱి కంఠములను క్షణములో తెగవ్రేయుదును.

సా. బా:- నేను (పాగల్) పిచ్చివాఁడను. నన్ను సేవించు ఈ హైందవులు పిచ్చివారు. వారి అత్యాచారములకు నేను బాధ్యుడను. నా ప్రవర్తనమునకు వారు బాధ్యులుకారు. నీ వెవరికంఠమునేని తెగ వ్రేయఁదలచితివా - నా కంఠమునే తెగవ్రేయుము!

అది మొదలు మీర్జమాన్ శాంతివహించెను.

## (c) బాబా — ఆరోగ్య త్యాగము

523. సా. బా:- 1910 (జి. యస్. కపర్దేతో) రెండు సంవత్సరములనుండి నేనురొట్టె - నీరము మాత్రము గొనుచు జబ్బుపడి యున్నాఁడను. నారకురుపు నా కేర్పడినది. జనులు క్రమ్ముకొని నాకు విశ్రాంతి నీయరు. నేను స్వస్థానముఁజేరు వరకు నీ విధముగనే జరుగును. నా ప్రాణములకంటె నా బిడ్డల రక్షణమేనా ప్రధాన లక్ష్యము. కావున వీనిని నేను లెక్కచేయను.

## III బాబా — భక్తుల తలంపులను మన్నించుట— ప్రతిఫలమును ప్రసాదించుట

## (a) తల్లియొక్క ప్రార్థనము - (హరిభావ్ - పన్సే)

524. దహన్కర్‌లోని హరిభావ్‌పన్సే - తనతల్లి వలదను చున్నను రామేశ్వరము యాత్రకు బయలుదేరెను. అతఁడు తిరిగివచ్చు వరకాతనితల్లి ఉపవసింపనిశ్చయించు కొనెను. తనసుతుఁడు శిర్డీయందు బాబా దగ్గఱనున్న వాఁడని తెలిసికొని బాబానిట్లు ప్రార్థించెను. "బాబా! నీవు సత్యముగ సాధుసత్పురుషుఁడ వగుదువేని నాకుమారుని తీర్థయాత్ర విరమింపఁజేసి, ఆతనిఁ దిరిగియింటికి వచ్చునట్లు చేయుము!"

సా. బా:- (హరిభావ్‌తో) నాకు దక్షిణనిమ్ము!

హరిభావ్ దగ్గఱనుండి దక్షిణరూపమున శీర్డినుండి రామేశ్వరమునకు వెళ్ళివచ్చుటకగు ప్రయాణముఖర్చు ధనమంతయుఁ దీసికొనెను.

సా. బా:- (హరిభావ్‌తో) ఇంటికిఁబొమ్ము! నీవు ఇల్లు విడిచి వచ్చినది మొదలు రామేశ్వరము వస్తుపడియున్నది. నీ విప్పుడు తిరిగి వెళ్ళవేని రామేశ్వరము అంతరించును. ఆ స్థానమును భద్రేశ్వర మాక్రమించును.

హరిభావ్ తిరిగి యింటికేగి తనతల్లి ఉపవాసము - ఆమె బాబానుగూర్చి కావించిన ప్రార్థనములు బాబా ఆమె ప్రార్థనమనుగ్రహించిన విధము సకలము గ్రహింపఁజాలెను.

## (b) కుశలభావ్ — పవిత్రమైన కోరికలు

525. బాబా ఒకనాఁడు హ. సీ. దీక్షిత్తును టాంగా మీద రహతాకువెళ్ళి, తనకుఁగూర్చు భక్తుఁడైన కుశల భావునుదోడ్కొని రమ్మని నియమించెను, కారణమేమి?- ఆకిందటి దినము - బాబాను దర్శించి చాలాకాలమైనది - అని కుశలభావ్ తలంచెను. ఆరాత్రి బాబా అతని స్వప్నమున గోచరించి "శీరిడికిరమ్ము!-" అని ఆదేశించెను. ఆమఱునాటి ఉదయమున టాంగామీద శీర్డికి వెళ్ళుటకు గుఱ్ఱములేని కారణమున తానువెళ్ళలేక తనకు మాఱుగ తనకుమారుని కాలినడకతో శీర్డికి పంపెను. ఆకుశలభావ్ కుమారుఁడు శీర్డికిఁజేరు పూర్వము.

సా. బా:- కాకా! (హ. సీ. దీక్షిత్తు) టాంగా తీసికొని రహతాకు వెళ్లి, కుశలభావునిటకుఁ దోడ్కొని రమ్ము!

హ. సీ. దీక్షిత్తు కుశలభావును జేరగా నతఁడు తాను వచ్చుటకు గుఱ్ఱములేదని చెప్పెను.

హ. సీ. దీక్షిత్తు:- అందుచేతనే టాంగాతీసికొని వెళ్లినిన్ను దోడ్కొనిరమ్మని బాబా నియమించినాఁడు.

కుశలభావ్ తానుమిక్కిలిగ నభిలషించుచున్న బాబా సందర్శనము చేసికొనఁగలిగెను.

(c) బాబా — భక్తులతలంపులను మన్నించుట — (మావుషే)

526. సా. బా:- (ఒకనాండు) నాకడువు నొప్పిగనున్నది.

అంతట 'మావుషే' కాల్చిన యిటుకరాతితో బాబా పొత్తికడుపు మీద కాపుకాచెను. ఆపిదపనామె తనబలము కొలంది అతితీవ్రముగ బాబా పొత్తికడుపు ఇరుపక్కల నొత్తుచుండెను. అచటనున్న యస్. బి. నాచ్నే- "ఆపుము! ఆపుము! మెల్లగనొత్తుము। బాబాకు బాధకలుగును-" అనెను.

సా. బా:- వెలుపలకు పొమ్ము! జోక్యముంగల్పించు కొనకుము!

(d) బాబా - నాచ్నే అత్తగారిదగ్గఱనుండి ఉల్లిగడ్డలను తీసికొనుమని దాదాకేల్కారును నియమించుట (చూ. 264)

(e) వధవ్కర్ - ఆకలి

527. సదాశివ - టి - వధవ్కర్, బాబానుజేరి ఎదుటం గూర్చుండెను. అతనికి ఆకలి పీడించుచున్నను చెప్పుకొన జంకెను. ఒకరు పేడా (లడ్డు) పొట్లమొక దానిని బాబాకు సమర్పించెను. ఏమేని కొనిరాంబడిన సాధారణముగ బాబా తాకడు. ఈతఱి, ఆ పొట్లామును విప్పివధవ్కర్ తొడమీదనొకలడ్డు విసరివైచెను. వదవ్కర్ దానిని తన దానిని తన చేతిలో నుంచుకొనెను.

సా. బా:- నీచేతిలోనుంచుకొనుటకు దాని నీయలేదు.

అంతట వధవ్కర్ దానిని తినెను. సగము ఆకలి తీఱెను. అంతట మఱియొక లడ్డును బాబా పడవైచెను. వధవ్కర్ ఇంటికిం దీసికొనవెళ్లందలంచి తనచేతిలో నుంచుకొనెను.

సా. బా:- దానిని దాచుకొనుటకు నీకీయులేదు.

వధవ్కర్ దానిని భక్షించెను. ఆకలి పూర్తిగశమించెను. బాబా ఆ పిదప అతనివైపునకు లడ్డు పడవేయులేదు.

528. (1) 1911న బి. వి. వైద్య - కుటుంబముతో రాత్రి 1 గంటకు శీర్డికిఁజేరి సాతేవాడలో విడిసెను. ఏదో అల్పాహారము (ఫరల్) తీసికొని నిద్రించెను. (ఆ మరునాటి ఉదయమున)

సా. బా:- (కోపముతో - ఆ వాడలోని మనుష్యులతో) నా బిడ్డలు వచ్చిరి. ఎవ్వరు వారినిఁగూర్చి విచారించిన వారు కారు వారిని పస్తుపరుండనిచ్చిరి.

(అని పలుకుచు మసీదుఁజేరిన భక్తులనందఱను బాబా తఱిమివేసెను)

(2) శీర్డినివిడిచి నాశిక్ వెళ్లదలంచి 'వైద్య' బాబానుజేరి సెలవు కోరెను.

సా. బా:- నాశిక్‌నకు వెళ్లుచున్నావా? అచటకేల వెళ్ల వలయును? అచట ప్లేగుగలదు. వెళ్లవలదు. నీ కుటుంబముతో నింటికి పొమ్ము-

(3) వైద్య బాబా చిత్రపటమును దీసికొని వెళ్ళి బాబా చేతు లందుంచెను. బాబా దానిని స్పృశించి (పూజించుకొనుటకు) అతనికి తిరిగి యిచ్చెను.

సా. బా:- నీ విప్పుడు వెళ్ళుము.

'వైద్య' తన కుటుంబముతో ప్రయాణముచేసి రైలుస్టేషన్ చేరునప్పటికి రైలుతప్పెను. అదివారి దురదృష్టమనుకొని, తరువాత బండికొరకా స్టేషన్‌లో కొన్నిగంటలుగడపిరి. అటుపిమ్మట వచ్చిన రైలులో 'మన్మాడ్' చేరిరి. అంతకుముందు వెడలిన బండిలో ప్రయాణముచేసి మన్మాడ్‌లో బండిమారి మఱియొక బండిలో వెళ్ళినయెడల ఆబండికి కలిగిన ప్రమాదములో నొక పెట్టె తుత్తునియలగుటచే బాబా తమకా అపాయము కలుగనీయక కోపర్గాములో బండిసి తప్పించెనని వారు తెలిసికొనిరి.

(4) ఒక సమయమున వచ్చినపుడు సెలవుదాటిన తరువాత గూడ 'వైద్య'ను అతని కుటుంబమును బాబా శిర్డీయందు నిలిపెను.

సా. బా:- ఊరకుండుము. భయము వలదు.

సెలవు గడువుదాటిన 3 రోజుల తరువాత తిరిగివెళ్ళి సెలవు పొడిగింపుమని కోరుచు జి. ఐ. పి. రైల్వే అధికారులకు కాగితము వ్రాసి కొనగా నెట్టి కష్టము లేక సెలవు ఈయఁబడినది.

(g) బాబా — ప్రధాన్ సతి పసిబిడ్డ ఏడ్పులాలించుట.

529. యం. డబ్లుయు- ప్రధాన్‌సతి ద్వారకామాయి మసీదు నందు బాబా పూజకావించుచుండెను. అదాటుగ బాబా ఆమె కావించు పూజను ఆపెను.

సా. బా:- ఆపుము! నీవిడిదికి (వాడకు) వెళ్ళుము!

ఆమె పూజనాపి విడిదికి వెళ్లెను. ఆమె పసిబిడ్డ యేడ్చు చుండుట కనెను. ఆబిడ్డనోదార్చి. నిద్రపుచ్చి తిరిగి బాబా దగ్గఱకుఁ జేరెను.

సా. బా:- ఇపుడు నీపూజకానిమ్ము?

ఆమె విడిది మసీదునకు చాల దూరముననున్నను బాబా తన అంతర్జ్ఞానముచే నాబిడ్డ ఏడ్పు వినెను. అట్టి వినికిడినిఁగూర్చి ప్రసిద్ధమైన గేయమునందిట్లు తెలుపఁబడినది.

" ముంగీకీపావ్‌మే ఆవాజ్ హోవే
ఓభీ సాయీ సుంతాహై "

(చినచీమ అడుగువేసిన నవ్వడేని
విననేర్చుసాయి యీపృథివినెందేని.)

### (h) పురందర్ యొక్క మూర్ఖపు పట్టుదల

530. భక్తులు వెండిపాలకిని సంపాదించిరి. దానికి పూన్చిన వెండి గుఱ్ఱము అపహరింపఁబడెను. ఆర్. బి. పురందర్ అతని మిత్రులా వెండి పాలకిని భద్రపఱచుటకు మసీదు ఉత్తరముపైపున నొకగదిని నిర్మింపదలచిరి. గదిని నిర్మించుటకు బాబా లేనిసమయమున మసీదు గోడకు పురందర్ రంధ్రములు తొలుచుచుండెను. బాబావచ్చి ఆపనిని ఆపుమని ఆజ్ఞాపించెను. బాబా బెదరించుచున్నను పురందర్ ఆపనిని సాగించుచునే యుండెను. తన భోజనమువేళ దాటినను దానిని పాటింపక పురందర్ తన పనియందే నిమగ్నుఁడయ్యెను.

సా. బా:- ఇది యెంత దుస్సహమో - గమనింపుడు. ఇతఁడు నామాటలను వినఁడు. దీని నంతయు నేను సహింప వలయును.

సా. బా:- (మరల) నీవు భోజనమునకు వెళ్ళుము.

అర్. బి. పు:- బాబా! నేను వెళ్ళను. నేనులేని సమయమున నేనుచేసిన పనినంతయి నీవు తారుమారు చేయుదువు.

సా. బా:- అట్లుచేయను. నీవు భోజనమునకు వెళ్ళుము.

అంతట పురందర్ భోజనమునకు వెళ్ళెను.

సా. బా:- ఏమి చేయవలె? బిడ్డ మనకాలిపై మలమువిసర్జించిన మనము కాలునరుకుదుమా? బిడ్డను ఛేదింతుమా? దానిని మనము సహింపవలయును.

### (i) వార్డే — మూర్ఖపుపట్టుదల

531. వార్డే:- బాబా! మసీదునందు సత్యనారాయణ పూజ కావించుటకు నా కనుజ్ఞనిమ్ము!

సా. బా:- నీవు చేసికొనుము.

అంతట వార్డేవెళ్ళి అరటిపిలకలను గొనివచ్చి, బాబా నొక విగ్రహముగ భావించి, బాబాకు అన్ని వైపుల ఆపిలకలనుంచెను.

సా. బా:- అటులచేయకుము. నేనటుల జరుగనీయను.

అంతట వార్డే పెద్ద పెట్టున నేడ్వఁదొడఁగెను. ఆరోదన మంత కంతకు హెచ్చుటచే తుదకు బాబా సమ్మతించవలసి వచ్చెను - అపుడు -

వార్డే:- ఖర్చులకు నాదగ్గఱ ధనములేదు.

సా. బా:- నీకెంత కావలయును.

వార్డే:- రు. 2-8-0 లు.

సా. బా:- (జయకర్‌నుచూపుచు) ఈతనిదగ్గఱ కలదు. అతని దగ్గఱనుండి అప్పు తీసికొనుము.

జయకర్ దగ్గఱనున్నది ఆమాత్రమే అయినను అతఁడు అప్పు నీయక తప్పినదికాదు. వార్డే సత్యనారాయణ వ్రతము కావించెను.

## (IV) బాబా — బిడ్డలను ప్రేమతో కనిపెట్టి రక్షించుట.

### (I) ధులియా — బహాల్కర్ బిడ్డ జబ్బు

532. 1913 మార్చి- "రావుజీ బాలకృష్ణ ఉపాసనీ బహాల్కర్" యొక్క చిన్నబిడ్డకు 5, 6 రోజులు పెద్ద పెట్టున జ్వరముతగిలెను. వైద్యులాసలుడిగిరి. బహాల్కర్ బాబా పటము మ్రోలగూర్చుండి ప్రార్థించెను. రాత్రి 2 గంటలకు ధులియాలోని అతని గదిలో బాబా పొడమి, అబిడ్డకు 'ఊధి' పెట్టుచు "ఇంకమీరు ఆందోళన చెందవలదు. 2 3, గంటలలో బిడ్డకు చెమటపోయును, ఉదయమున కీబిడ్డ కోలు కొనును. పూర్తి ఆరోగ్యము పడసినపిదప బిడ్డను నాదగ్గఱకు తీసికొని రమ్ము!" - అనెను.

ఉదయమున ఆబిడ్డ కోలుకొనెను. ఇది 6-3-1913 ఆ ప్రాంత మున జరిగిన విషయము.

8. 3. 1913న శ్యామా-రావుజీకి ఉత్తరము వ్రాసెను. అందు "ధులియాలోని నీ మిత్రుని యింటికి నేను వెళ్లినాను." అని బాబా చెప్పినాఁడు. "ఆమిత్రుఁడెవరు?-" అని నేను ప్రశ్నించితిని. "ఉపాసనీ భహాల్కర్ రావుజీ. నేను ప్రతిదినము అతని యింటికి వెళ్ళుచున్నాను. నీ వాతనికి ఉత్తరమువ్రాసి చూడుము!- "అని బాబా పలికినాఁడు. అందుచే ఈ ఉత్తరము వ్రాయుచున్నాఁడను."

15 దినములు గడచిన తరువాత రావుజీ- అతని కుమారుఁడు శిర్డికి వెళ్ళుచుండిరి. మార్గమున కోపర్గామునందు టాంగాతోలువాఁడు జాగుచేయుచుండెను. ఆరతి సమయమున

సా. బా:- శ్యామా! కొంచెముసేపు ఆగి ఆరతి ప్రారంభించుఁడు! నీధూలియా మిత్రుడు వచ్చుచున్నాఁడు. ఆటాంగా తోలువాఁడు వారికిఁగష్టము కలిగించుచున్నాఁడు.

రావూజీ – ఆతని కుమారుడు పేళకుఁజేరి ప్రాసాదము నందు కొనిరి.

సా. బా:- (బాలునితో) బిడ్డా! నీకు జబ్బుచేసినపుడు ధూలియాకు వచ్చితిని. నీకు జ్ఞాపకమున్నదా?.

## (2) మహాల్సాపతి – సర్పములు.

533. (1) సా. బా:- భగత్! రెండు సర్పములు మీయింటివద్ద తిరుగుచున్నవి.

బాబాచే 'భగత్' (భక్తుడా!) అని పిలువఁబడు మహాల్సాపతి ద్వారకామాయి మసీదునుండి యింటికి తిరిగివెళ్ళి. అతని తలుపుదగ్గఱ నొక సర్పమును, అచట కుమ్మరివాని దిండుక్రింద నొక సర్పముఁను జూచెను.

(2) సా. బా:- భగత్! నీవీరాత్రి వచ్చునపుడు లాంతరు చేగొనిరమ్ము. గ్రామద్వారమువద్ద దొంగలేదురు పడుదురు.

ఆ రాత్రి లాంతరు తీసికొని మహల్సాపతి వచ్చుచు గ్రామ ద్వారమువద్ద సర్పమును జూచెను.

534. ఒక భక్తుఁడు మసకచీకటిలో మలవిసర్జనమునకు వెళ్లెను. అచట నతఁడేమియో ఆకులకదలిక చప్పుడువినెను. అదియొక సర్పమని నమ్మి త్వరప్వరగా అతని విడిదికి వెళ్లెను. తరువాత బాబానుజేరెను.

సా. బా:- నీవు వెలుపలకు వెళ్లిన తావున నేనులేనా? నీవు భయపడనేల?

(3.) (చూ:- పూనా నివాసి సదాశివతార్కాడ్‌సతి సర్పముమీద పాదమునిలుపఁబోవుచు అంతర్జ్ఞానముచే అదాటున వెనుకకుతగ్గిన విషయము.)

## (4) మిరికరునకు అభయము — సర్పము.

535. సర్దార్ మిరికర్ (బాబా భక్తులలో నొకఁడు) కుమారుఁడు 'బాలుసాహెబ్ మిరికర్' – మామ్లత్ దార్ – బాబా సెలవు తీసికొనఁ గోరెను.

సా. బా:- మన ద్వారకామాయికలదని నీవు ఎఱుఁగుదువా?

మిరికర్ గ్రహింపఁజాలక ఆందోళన చెందెను.

సా. బా:- ఇచట నీవు కూర్చుండి యున్నది ద్వారకామాయి. ఇది తన బిడ్డల అపాయములను ఆందోళనలను తొలఁగించును. ఈమా సూది ఆయి మిక్కిలి దయామయి. తనను గాఢముగ విశ్వసించు బిడ్డలందఱికీమె అనుఁగుతల్లి. ఆపత్కాలమున తనవారి నీమెరక్షించును. ఒకసారి విశ్వసించి ఆశ్రయించిన వాని కష్టములన్నియు నివారణ మగును. (చూ.1)

సా. బా:- (ఊధిని ప్రసాదించుచు మఱియు నిట్లనెను. ఆ పొడపైన పెద్దమనిషిని నీ వెఱుఁగుదువా? (బాబా బారచాచి) ఒక అరచేతిని (త్రాచుపాము పడగవలె కదలించుచు) అతఁడు మిక్కిలి భయంకరుఁడు. కాని, ద్వారకామాయి బిడ్డలనది యేమిచేయఁగలదు? అది కనఁబడిన మనము వినోదముగఁ జూతుము. ద్వారకామాయి రక్షింపనున్నపుడు సర్పము తాకఁగలదా!

మిరికర్ వెంట వెళ్ళుమని శ్యామాను బాబా ఆజ్ఞాపించెను. ఆరాత్రి 9 గంటలకు మిరికర్ - శ్యామా మఱి కొందరు 'చితాలీ'కిఁజేరి మారుతి దేవాలయము వద్దనుండిరి. మిరికర్ వార్తా పత్రికలఁ జదువు చుండెను. తటాలున వార్తా పత్రికలమీద కదలిక చప్పుడు 'జవాను' వినెను. లాంతరు తెచ్చిచూచెను. మిరికర్ ఉత్తరీయమున కొంత భాగము ఆవార్తా పత్రికల మీదకలదు. ఆ వస్త్రముచివర ఒక సర్పము చేరియుండెను.

'సర్పము' - 'సర్పము' - అని అజవాను అరచెను. అది మిరికర్ దగ్గఱనుండి తొలఁగిపోయెను. జనులుచేరి ఆ సర్పమును కఱ్ఱలతో కొట్టిచంపిరి. మిరికర్ వినోదముగ దానినిఁజూచెనేకాని, భయ భ్రాంతుఁడు కాలేదు.

**555. A.** శిర్డిలో బాబా ఒకనాఁడు (ప్రాణాపాయ) విచార సూచక శంఖారావము. గావించుచు – "అహో! నానా చావనున్నవాఁడు కాని నేను చావనీయుదునా?" - అనెను. అ సమయమున, నా. గో. చందోర్కర్ - లేలే శాస్త్రియు పూనాదగ్గఱ టాంగాలో ప్రయాణముఁజేయు చుండిరి. గుఱ్ఱము టాంగాను వెనుకకు నెట్టుకొని పోయి దానిని తలక్రిందులుచేసెను. చందోర్కరు - లేలే శాస్త్రి ప్రాణాపాయస్థితిలో నుండిరి. వారు మెల్లగలేచి యెట్టిగాయములు తగులలేదని గుర్తించిరి. తరువాత వారు శిర్డికి వెళ్లినపుడు బాబా పైనఁదెలిపిన విధమున వారికి కలుగనున్న ఆపదను గనిపెట్టి రక్షించినట్లు తెలిసికొనిరి.

535. B. ఆర్. వి. మోదక్ – తనకొక ప్రత్యేక పరీక్ష జరుపఁబడునని, దానికతఁడు హాజరైన యెడల ఉద్యోగాభివృద్ధిపొందుటో లేక అతని అసమర్థత కారణముగ ఉద్యోగమునుండి తొలఁగింపఁబడుటో జరుగునని యాతఁడు భయపడుచుండెను. ఆతఁడు బాబాదగ్గఱకువెళ్లెను. బొంబాయిలో పరీక్ష గడువుదాటిపోవువరకు బాబా అతనినట నిలిపెను. ఆపరీక్ష తేదీ దాటిపోయిన తరువాత.

సా. బా:- పొమ్ము.

మోదక్:- బాబా! ఎక్కడకు? ఇంటికా? బొంబాయికా?

సా. బా:- ఇంటికిపొమ్ము! నీ బిడ్డలు నీకొఱకు నిరీక్షించుచున్నారు.

## (5) బూటీగండము - బాబా అభయము.

536. నానా సాహేబ్ రేంగ్లే ప్రసిద్ధ జ్యోతిష్కుఁడు. ఆతఁడొకతతి నాదినమున 'బూటీకి' ప్రాణగండము కలదని చెప్పెను. తరువాత వారిరువురు బాబాదగ్గఱకేగిరి.

సా. బా:- నానా ఏమిచెప్పుచున్నాఁడు? నీకు మృతి ఆసన్నమైనదని తెలుపుచున్నాడా? ఏమి? మనము భయపడవలసిన పనిలేదు. తాకుము! తాకుము! నీవెట్లు తాకిచంపుదువో నేను చూచెదనుగాక!

ఆ తరువాత 'బూటీ' మలవిసర్జనమునకు వెళ్లెను. అచట నొక సర్పముండెను. సేవకుఁడు దానినిఁజూచి ఒక రాతినిఁజేకొని పైకెత్తెను. "దానికంటె ఒక కఱ్ఱ మేలు. క్షేమకరము" - అని, బూటీ అనెను. సేవకుఁడు కఱ్ఱతెచ్చులోపల ఆసర్పము వెడలిపోయెను.

"మృత్యుదేవత రానూవచ్చినది. ప్రాణాపాయము గలిగింపక పోనూపోయినది."

## V బాబా — భక్తుల ఆరోగ్యవిషయమై ఆలోచన బాలసింపి.

537. ఆదరించువారెవ్వరు లేక మిక్కిలి వ్యాధిగ్రస్తుండై బాట ప్రక్కన పడియున్న 'బాలసింపి'ని బాబాచూచెను. బాబా నిత్యము భిక్షించు గృహములలో వాతని గృహము ఒకటి. ఆతని కుటుంబమునెడ బాబాకు మిక్కిలి ఆదరము కలదు. 'నింగోను' లోనున్న నానాసాహెబ్ డేంగ్లే దగ్గఱకు వెళ్ళుమని బాబా బాలషింపితో చెప్పెను, ఆ సమయమున నానాసాహెబ్ స్వప్నమున బాబాపొడమి "నీదగ్గఱకుంజేరు 'బాలషింపి' విషయమై తగుశ్రద్ధతీసికొనుము" — అని ఆదేశించెను. కావున బాలషింపి ఆతని దగ్గఱకువెళ్ళగా డేంగ్లే ఆతనిని మిక్కిలి ఆదరముతో పోషించెను.

### బాబా - కుష్ఠరోగులయెడ ఆదరణము

538 (a). సా. బా:- భీమాబాయి! ఈ కుష్ఠ రోగియైన కాంతను నీ యింటికింగొనిపోయి పోషింపుము.

భీమాబాయి:- బాబా? ఆమెకుష్ఠురోగి.

సా. బా:- దానిని లెక్కింపకుము. ఐననేమి? ఆమె నా సహోదరి. ఆమెను నీ యింటికింగొనిపొమ్ము!

భీమాబాయి ఆ కుష్ఠురోగిని తనయింటికిం బిలుచుకొనిపోయి ఒక నెలరోజులు పోషించెను. అంతట ఆరోగి మృతినొందెను.

(b) సా. బా:- (బాలాజి పటేల్ - నివాస్కర్‌తో) బాలా! నీ వింటికి పోవలదు. ఇచటనుండి, ఈ డగ్డుభావ్‌ను (ముస్లిం కుష్ఠురోగిని) పోషింపుము.

బాబా ఆజ్ఞననుసరించి బాలా ఆకుష్ఠురోగిని ఒకనెల దినములు పోషించెను. పిదపనతండు మరణించెను.

## IV సహాయములు - సంతతి ననుగ్రహించుట

### (a) డి. యస్. రసానే

539. దామోదర్ - సావల్రాం - రసానే - మొదటి భార్య యందు సంతానము కలుగని కారణమున మఱియొక భార్యను చేపట్టెను. కాని ఆమెయందు సంతతి కలుగలేదు. అతని జాతకమున జన్మలగ్నము నకు పంచమస్థానమున పాపగ్రహముండెను. గ్రహములతనికి ప్రతికూల ములుగ నుండెను. కాని, అతనికి బాబాయందు గాఢవిశ్వాసముకలదు. అతఁడు శిర్డికి వెళ్ళినపుడు బాబా అతనికొఱకు నిరీక్షించుచుండెను. అతనికి 4 మామిడిపండ్ల నిచ్చుచు-

సా. బా:- దామియా! ఈపండ్ల నిపుడు తీసికొనిపొమ్ము. వీనిని తిని చావుము!

దామియా భయ చకితుడయ్యెను. సంతతిఁబడసి, సంసార మగ్నుఁడగుట ఆధ్యాత్మిక మృతియే - యని, అతఁడు గుర్తించిన వాఁడుకాఁడు.

సా. బా:- ఈ పండ్లను నీవుతినవలదు. నీ భార్యకు వీని నీయుము!

దామియా:- ఏ భార్యకు?

సా. బా:- నీ రెండవ భార్యకు. ఆమెను ఈ పండ్లను దిన నిమ్ము. ఆమె యందు ఇరువురు పుత్రులు జనింతురు. మొదటిబిడ్డకు 'దౌలత్‌షా' - అని రెండవ బిడ్డకు 'తానాషా-' అని పేర్లు పెట్టుము.

(ఆ తరువాత) అతనికి ఎనమండుగురు బిడ్డలు జనింతు రనియు బాబా తెలిపెను. ఆ విధముగనే జరిగెను. దామియాకు మొదట ఇరువురు కొమరులు కలిగిరి. అతఁడు మొదటిబిడ్డ జనించినపుడా బిడ్డను

బాబా దగ్గఱకుఁ గొనిపోయి "బాబా! ఈ బిడ్డకేమిపేరు పెట్టమందువు?-
అని అడిగెను.

సా. బా:- నేను నీకుఁదెలిపినది మఱచితివా? నీనోటు పుస్తక
ములో ౩వ పేజీలో వ్రాసికొంటివి ఈ బిడ్డకు 'దౌలత్‌షా' - అనుపేరు
పెట్టుమని నేను చెప్పలేదా?

(గమనిక:-ఇతఁడు (దౌలత్ షా) నానా సాహెబ్ రసానే - శిర్డి
సాయి సంస్థానముకు ధర్మకర్త.)

(b) రావ్‌బహద్దూర్. హెచ్ వి. సాతే.

540. హెచ్. వి. సాతే డిప్యూటి కలెక్టరు. 50వ సంవత్సర
మున భార్యావియోగము కలిగెను. అతనికి ఇరువురు కుమార్తెలు
మాత్రముకలరు. మగసంతానములేదు. పురుషసంతతికొఱకు మఱల
వివాహము చేసికొన నతడు మిక్కిలి సందేహించుచుండెను. 1904 న
అతఁడు మామ్లత్ దారుతో కలిసి శీర్డికి వెళ్ళెను.

మామ్లత్ దార్:- బాబా! సాహెబ్‌నకు పురుష సంతతిలేదు.

సా. బా:- సాహెబ్ వివాహమాడిన భగవానుఁడు ఇతనికి
కుమారుని ప్రసాదించెను.

ఆ విధముగ బాబావలన అభయము పొంది సాతే మరల
వివాహమాడ సిద్ధపడెను. మరుసటి సంవత్సరమున దాదా కేల్కారు
తనకుమార్తెను సాతేకు ఈయఁదలచెను. కానిసాతే బాబాసలహా తీసి
కొనఁగోరెను. శ్యామా - దాదా కేల్కారు ఆకన్యను బాబా దగ్గఱకు
వెంటఁగొని వెళ్ళగ బాబా ఆకన్య నొసట కుంకుమము పెట్టుచు "ఈబిడ్డను
అహమ్మదాబాదునకు (హెచ్. వి. సాతే. నివసించుచోటు) పంపుడు-"
అనెను.

హెచ్. వి. సాతే - ఆకన్యను 1906 న పరిణయమాడెను.
తరువాత 6 సంవత్సరములలో ఇరువురు కుమార్తెలు మాత్రము జనించిరి.

1912 న దాదా కేల్కారు సతీసమేతముగ బాబాను జేరిమ్రొక్కి "బాబా! మాకు దౌహిత్రునిం జూచుభాగ్య మెప్పటికి ?"- అనెను.

సా.బా:- నేను అల్లాను ప్రార్థించుచున్నాండను. నాప్రార్థనము మన్నించును.

[1913 నందు సాఠేకు కుమారుండు జనించెను. 1940 (ఈ గ్రంథరచన కాలమునకును) అతండు మంచి ఆరోగ్యమునను న్న వాండు]

(c) స ప త్నే క ర్.

541. సపత్నేకర్ :- అనునతండు న్యాయశాస్త్ర విద్యార్థి. న్యాయశాస్త్ర పట్టపరీక్షకు సరియగు పరిశ్రమ లేకయె ఎట్లు విజయము పొందంగలవు? - అని తనతోడి విద్యార్థి నతండు ప్రశ్నించెను. తన విద్యాపరిశ్రమ యందెట్టి కొఱతలున్నను తనకు విజయము తప్పక కలుగు ననిన సాయీబాబా అభయ ప్రదానముపై నాధారపడియున్న వాండనని ఆ మిత్రుండు సమాధానమిచ్చెను. అంతట సపత్నేకర్ అమిత్రుని సాయీ బాబాను గూడ అవహేళనము చేసెను ఆపిదప పరీక్షా ఫలితములు ప్రకటనమై బాబా అభయప్రదానమును యదార్థముంగావించినవి. ఏమైనను ఆవరీక్షలో తన మిత్రుని విజయమొక "గుడ్డిప్రేటు-"గ పేర్కొని యింకను బాబాయందు నిరాదరణబుద్ధినే వెలింబుచ్చెను. ఆ సపత్నేకర్ అకల్కోటయందు న్యాయవాదిగ పనిచేసెను. పదిసంవత్సర ములు గడిచిన పిదప తన ఏకైక సుతునింగోల్పోయెను. అతని అంతరాత్మ ఆతని బాధింపందొడంగెను. బాబాను సందర్శించి, క్షమా పణముం జెప్పుకొనందలంచెను. అతండు శీర్డికింజేరి బాబాకు ప్రణమిల్లెను.

సా. బా:- "చల్-హట్" (వెడలిపొమ్ము!) కొంత తడవువేచి మరల బాబాకు ప్రణమిల్లెను.

సా. బా:- ఇక్కడనుండి వెడలి పొమ్ము.

సపత్నేకర్ శీర్డివిడిచి యింటికి వెళ్ళెను.

ఒక సంవత్సరము గడచినపిదప బాబా సపత్నేకర్ భార్య స్వప్నమునఁగోచరించి, ఆదంపతులను తనదగ్గఱకు రమ్మని ఆహ్వానించెను. ఈ సమయమున సపత్నేకర్ తన పూర్వద్వేష ప్రవర్తనమునకు క్షమాపణము అతి వినయమునఁ దెలుపుకొనెను. అంతటబాబా వివిధ కాలము లందు వివిధప్రదేశములఁ జరుగు చున్నవిషయములన్నియు తాను గుర్తించుచునేయున్న వాఁడని సపత్నేకర్ తెలిసికొనునట్లు అతని వృత్తాంతమంతయు స్వీయ వృత్తాంతముగ అతని ఎదుటనే ఒక గొల్లపడతితోఁ జెప్పెను. బాబా మఱియు ఆగొల్ల పొలతితో

సా. బా:- ఈతఁడు (సపత్నేకరును చూపుచు) తన పుత్రుని నేను చంపితినని నన్ను నిందించుచున్నాఁడు. క్రిమ్మఱ నేనాజీవాత్మనే యీతని సతీగర్భమునఁ జేర్చుదును.

బాబా అంతట సపత్నేకర్ వైపునకుదిరిగి అతని మస్తమున తనహస్తమునిలిపి "నీ ఆశయమతిశీఘ్రముగ ఫలించును." - అని, ఆశీర్వదించెను.

సపత్నేకర్ పరమానందభరితుఁ డయ్యెను. బాబాతన అంతర్జ్ఞానము నంతకంత కధికముగ ప్రకటించిన కొలఁది అతనికి బాబాయందు గాఢవిశ్వాసము పొడుకొనెను.

ఉదా:- సపత్నేకర్ సతికిఁగలుగనున్న వ్యాధినిఁగూర్చి దానికిఁ గావింపఁదగు చికిత్సనుగూర్చి బాబాముందుగఁ దెలిపినాఁడు. స్వానుభవమున నిట్టి విషయములను గ్రహింపఁజాలిన సపత్నేకరునకు విద్యార్థి దశలోవలె బాబాయందు అవిశ్వాసము ఎన్నటికిని పొసగబోదు. ఆదంపతులు సెలవుతీసికొను సమయమున బాబా సపత్నేకరునకు కొబ్బరికాయను ప్రసాదించి "దీనిని నీ భార్య పైటకొంగున నుంచుకొని ఆనందమున వెళ్లుడు!"- అని ఆశీర్వదించెను.

12 నెలలలో వతనికి పుత్రుఁడు జనించెను. ఆదంపతులు తమసుతుని బాబా దగ్గఱకుఁ గొనివచ్చిరి.

శ్యామా:- ఈ కాంత తన గర్భములోబిడ్డ ఆ విధముగా దొరల యునని ప్రార్థించుచున్నది. అట్టి ఆశీస్సుతో ఆ నారికేళమును ప్రసాదింపుము!

సా. బా:- ఆమెకిచ్చిన కొబ్బరికాయ బిడ్డగా మాఱునా? అట్టి ఆలోచనలుగల మనుష్యులెంత అవివేకులు!

శ్యామా:- దేవా! నీ ఆశీః ప్రభావమును ఆనారికేళము నేనెఱుఁగుదును. ఆ కొబ్బరికాయను ఆశీస్సులతో ప్రసాదింపుము!

అటుల ఇరుమాఱు- ముమ్మాఱు శ్యామా బాబాను ప్రార్థించెను.

సా. బా:- ఆమెకు సంతానముకలుగును.

శ్యామా:- కాని, ఎప్పుడు?

సా. బా:- 12 నెలలలోపల.

అంతట ఆకొబ్బరికాయను పగులఁగొట్టి సగము ఆకాంతకు బాబా ప్రసాదించెను.

శ్యామా:- అమ్మా! ఈయన మాటలను వినినావుకదా! నీకు 12 నెలలలో సంతతి కలుగకున్న ఒక కొబ్బరికాయ ఈయన తలపై పగుల గొట్టి, యీ మసీదునుండి, యీయనను వెలువలకు ఈడ్చివైచుదును అటుల కావింపనా – నన్ను "మాధవరావు" – అనిపిలుచుకొనను.

సంవత్సరములోపల నామెకు కుమారుఁడు కలిగెను. ఆబిడ్డను 5వ నెలలో బాబా దగ్గఱకుఁగొనివచ్చిరి. తండ్రి బాబాకు 500 రూపాయలు సమర్పించెను. ఆ ద్రవ్యముతో బాబా అశ్వము (శ్యామకర్ణము) నకు ఒక కొట్టము నిర్మింపబడినది.

(ఙ) చింతామణిరావు

534. సా. బా:- (మహల్సాపతితో) అతఁడు మరల వివాహము చేసికొనిన ఒక పుత్రుడు ఒక పుత్రిక జనింతురని అతనితో (చింతామణి రావుతో) చెప్పుము.

చింతామణిరావు తిరిగి వివాహము చేసికొనెను. ఒక కుమారుఁడు ఒక కుమార్తె మాత్రమే జనించిరి.

## (f) మ హ ల్సా ప తి

544. మహల్సాపతికి స్త్రీసంతతి మాత్రమే కలదు. అటులయ్యు నతడు బ్రహ్మచర్య నిష్ఠగలిగి బాబా వెంట మసీదునందు చావడియందు నిద్రించువాఁడు

సా. బా:- భగత్! వెళ్ళి నీయింట నుండుము. నీకు సుతుఁడు జనించును. సుతుఁడు చూతఫలము (మామిడిపండు) సుత తింత్రిణీ ఫలము. (చింతకాయ)

భగత్ మహల్సాపతి గోకులాష్టమినాఁడు యింటికి వెళ్ళెను. మరల గోకులాష్టమిలోపల నతనికి పుత్రుడు పుట్టెను.

## (g) ర త న్జీ సే ఠ్

545. (నైజామ్ రాష్ట్రములోని) నాందేడ్ నివాసి 'రతన్‌జీ-సపూర్జీ-వాడియా'కు సంతానములేదు. ఒకనాఁడు దాస్‌గాణూమహారాజు-మౌలీసాహెబ్ (మౌలానా) లకు రు 3-14-0 లు వెచ్చించి అల్పాహార విందు కావించి. సంతానప్రాప్తికి బాబా ఆశీస్సులఁబడయఁగోరి శిర్డీకి వెళ్ళి బాబాకు మ్రొక్కెను.

సా. బా:- నీవిదివరకు రు 3-14-0 లు ఇచ్చినావు. నాకిపుడు రు 2-2-0 లు దక్షిణనిమ్ము.

రతన్‌జీ ఆపైకమిచ్చెను. కాని, తానంతవరకు బాబాను దర్శింపక, యేమియు ధనము పంపనివాడగుటచే తాను బాబాకు రు 3-14-0 లు సమర్పించుట యెట్లుపొసఁగెనా! యని ఆశ్చర్యపడెను.

సా. బా:- నీహృదయ కామితమును భగవానుఁడను గ్రహించును.

బాబా ఆశీస్సులుపడసి రతన్జీతిరిగి యింటికి వెళ్లెను. బాబా లోఁగడ ధనము స్వీకరించుట - మౌలానా రూపమున బాబా స్వీకరించినాఁడని దాస్‌గాణూ మహారాజు విశదపఱచెను. రతన్జీ తనలెక్కలను చూచుకొనెను. మౌలానా మౌలీసాహెబునకు అల్పాహారవిందునకై తాను వెచ్చించినది సరిగ రు. 3-14-0 లు అగుట అతఁడు గుర్తించెను - తరువాత బాబా అనుగ్రహమున రతన్జీకి పుత్రుడు జనించెను.

(h) నారాయణ గోండ్ సింధే

నా. గొ. సింధేకు ఏడుగురు పుత్రికలు జనించిరి. పురుష సంతానములేదు. అతని ప్రారబ్ధకర్మమునను సరించి పుత్రసంతానప్రాప్తి లేకున్నను అతఁడు దత్తస్వామిని ప్రార్థించిన కారణమున బాబా అతనికి సుతుని ప్రసాదించిన విషయము 1903లో బాబా తెలిపినాఁడు (చూ. 399)

## 545 A. బిడ్డలకు బాబా దీర్ఘాయువును ప్రసాదించుట

సా. బా:- జి. జి. నార్కేకు బిడ్డలు కలరా?

భక్తుఁడు:- బాబా! అతని బిడ్డలు మిక్కిలి బాల్యముననే మృతినొందిరి.

సా. బా:- అల్లా అనుగ్రహించును.

ఆ తరువాత నార్కేకు నలుగురు బిడ్డలుకలిగిరి. అందఱు దీర్ఘాయువుగలవారైరి.

(గమనిక:- బాబా, 'బిడావే' సతినిఁగూడ యీవిధముగ ననుగ్రహించినాడు.)

## VII. భక్తుల సంసార విషయములు

## బా బా స హా య ము

### (a) నిమోన్కర్ దంపతులు.

546. నానానిమోన్కర్:- (భార్యతో) బేలాపూరులోని మన పిల్లవానిని చూచి, వెంటనే తిరిగిరమ్ము.

ని. భార్య:- ఎట్లు రాఁగలను? అక్కడ చూడవలసిన బంధువులు పలువురు గలరు.

నా. ని:- నేను వేచియుండఁజాలను. మఱునాఁడు అమావాస్య - కావున నీవు వెంటనే తిరిగిరమ్ము.

నిమోన్కర్ సతి మిక్కిలి కలత నొందెను. ఆ సమయముననే మసీదునుండి నిమోన్కర్ దంపతులున్న తావునకువచ్చి.

సా. బా:- (నిమోన్కర్ సతితో) అమ్మా! జబ్బుపడి కోల్కొనుచున్నబిడ్డను చూచివచ్చుటకు బేలాపూరు వెళ్ళుచున్నావా? - త్వరగా వెళ్ళుము. ఎట్టి అందోళనచెందక వెళ్ళుము. అచట మీ బంధువు లందఱఁజూడుము. రెండు లేక నాలుగు దినము లచటనుండి శిర్డికి తిరిగి రమ్ము.

ఈ విధముగా బాబా (పైకోర్టు) తీర్పు నానానిమోన్కర్ (క్రిందికోర్టు) ఆదేశమును త్రోసి రాజనెను.

నానా తలంపు తెలుపువాఁడు - బాబా తీర్మానించువాఁడు.

## (b) హెచ్. ఐ. సాతే – దంపతులు

547. శిర్డిసమీపమున సాతే నూతనముగ కొనిన భూమినిఁ జూచివచ్చుటకు అతని భార్య తొలుతసమ్మతించినది. కాని ఆమె అటుల వెళ్ళిన 'బాబు' భార్య (వితంతువు) తనకును ఆభూమిలో హక్కుకలదని ఏవేవియో పేచీలు-కష్టములు కలిగించునను తలంపులతో ఆమెతండ్రి (దాదా కేల్కారు) ప్రేరణమున వెళ్ళనని నిశ్చయించుకొనెను. నాతేవాడ ముందు బండివచ్చి నిలిచెను. భర్త ఆమెను బండిలోని కెక్కుమనెను. ఆమె నిరాకరించెను. కుపితుఁడైన భర్త (సాతే) బండివాని చేతిలోని కొరడాలాగికొని భార్యను దండించుటకా కొరడాపై కెత్తెను. వెంటనే మేఘుఁడు - (మేఘశ్యామ) పరుగునవచ్చి

మేఘ:- బాబా నిన్ను వెంటనే ద్వారకామాయి మసీదునకు రావలసినదిగా ఆదేశించుచున్నాడు.

సాతే ఆకొరడాను క్రిందపాఱవైచి, బాబా దగ్గఱకేగెను.

సా. బా:- ఏమి? ఆవిషయము. ఏమిజరిగినది? నీ భూమి అచటనేకలదు. వెళ్ళి దానిని చూడవలసిన అవసరమేమి కలిగినది?

హ. వి. సాతే తనభార్యను కొరడాతో కొట్టదలచిన ప్రయత్నమునకు సిగ్గుపడెను. తనయెడ తనకుటుంబమునెడ నిరంతరము జాగ్రుతితో ప్రసరించుచున్న బాబా కరుణార్ద్ర దృష్టినిదలంచుకొని సాతే మిక్కిలి సంతోషించెను.

## VIII వ్యాపారమున సహాయము

### (a) డి. యస్. ర సా నే

548. దామోదర్ – సావలారాం – రసానే బొంబాయిలోని ఒక దలారి ద్వారా ప్రత్తి చట్టా వ్యాపార సంబంధమైన బేరముకలిగెను. ఆదలారి ఆచట్టావ్యాపారమున లక్షలకొలది లాభము కలుగునని రసానేకు తెలిపెను. ఈ విషయమున బాబా సమ్మతి తీసికొనుమని రసానే-శీర్డీలోని శ్యామాకు ఉత్తరమువ్రాసెను. శ్యామా ఆ ఉత్తరమును బాబాదగ్గఱకుగొనిపోయెను. దానిని తెఱచి చదువు పూర్వమే –

సా. బా:- దామియా - ఆకాశమునందు కొనజూచు చున్నాడు దైవము ప్రసాదించినది నిలుపుకొని దానితో సంతృప్తి నొందుటలేదు దామియామతి భ్రమించుచున్నది. అతని ప్రస్తుతస్థితి యెట్టిలోటులేదని వ్రాయుము. అతనికిపుడు గల సగమురొట్టె చాలును. లక్షలనుగూర్చి ఆందోళన చెందవలదని తెలుపుము

అంతట దామియా ఆ చట్టావ్యాపారము చేయవలయునని అందులభించు లాభములో బాబాకు భాగమీయవలయునను తలంపున స్వయముగ శీర్డీకివెళ్లి బాబాను దర్శించి, బాబా పాదములొత్తుచుండెను.

సా. బా:- (బిగ్గఱగ) దామియా! నేను దేనిలోలేను. అనగా - నాకీ సంసారమున దేనితో సంబంధము (లాభములు పంచుకొనుట మొదలగువానితో సంబంధము) కల్పించుకొనను.

(కావున 'దామియా' ఆ ప్రయత్నము మానెను)

తరువాత కొంతకాలమునకు దామియాకు ఒక తలంపు గలిగెను. ధాన్యమును పెద్ద మొత్తములుగకొని, నెలలు సంవత్సరములు నిలవచేసి, ధర హెచ్చిన పిదప అమ్మవలయునను ఉద్దేశముకలిగెను. దామియా బాబాదగ్గఱకువెళ్ళి "బాబా! నేను ధాన్యవ్యాపారమును చేయుదునా?" అని అడిగెను.

సా. బా:- వలదు. నీవు 5 సేర్లు చొప్పున కొని 7 సేర్లు చొప్పున అమ్ముదువు.

కాని కొన్ని వారములవరకు ధాన్యముధర హెచ్చుచుండెను. బాబా భవిష్యత్భాషణలసత్యములా - యనునట్లుండెను. కాని ఒకటి రెండు నెలల తరువాత - శ్రావణమున అంతట వర్షములు సమృద్ధిగఁ గురిసెను. ధాన్యము ధరలు తలవని తలంపుగ తగ్గుచునటుల చాల కాలముండెను. ధాన్యము నిలువచేసిన వర్తకులు మిక్కిలిగ నష్టముల పాలైరి. బాబా, దామియాను అట్టిదుర్గతినుండి తప్పించెను.

## (b) బయ్యాజి పటేల్.

549. (1) సంవత్సరముల తరబడి బాబా బయ్యాజి-అప్పాజీ-పటేలునకు నిత్యము 4 రూపాయలు చొప్పున నిచ్చుచుండెను.

సా. బా:- ఈ ధనము నెవరికి అప్పు ఈయవలదు. ఇతరులకు దానధర్మములు చేయవలదు. నీ సంసారమున నిత్య భోజనాదులకు వ్యయ పెట్టవలదు.

ఆ ధనముతో నతఁడు భూమికొనవలయునని బాబా అభిప్రాయము. ఆ విధముఁగ బయ్యాజి ఆధనముతో 84 ఎకరముల భూమినికొని యిప్పటికిని నిలుపు కొనినాఁడు.

(2) చెఱకుపంట పండించుట అచట రైతుల కాచారమైనది. గోదావరి లోయయందు ప్రతి కృషీవలుఁడు చెఱకుపైరు వేయుచుండును.

బయ్యాజి:- బాబా! నేను చెఱకుపైరు వేయుదునా?

సా. బా:- వలదు.

కాని, యితరులు కావించు పనిచూచి చెఱకులో గొప్ప లాభముల గడింపవలయునను తలంపుతో బాబా మాటలను పాటింపక బయ్యాజి చెఱకు నాటెను. వర్యవసానమున చెఱకు తోటలకు పెట్టినపెట్టుబడి 400 రూపాయలు నష్టమగుటయేకాక, ఇతరములగు మెట్టపైరులవలన వచ్చు ధాన్యము-పశుగ్రాసము మొదలగు వానినిఁగోల్పోయినాఁడు.

(c) రావ్ బహద్దూర్ — యస్. బి. ధుమాల్

550. నాశిక్‌లో పబ్లిక్ ప్రాసిక్యూటర్ – (ప్రభుత్వపక్ష న్యాయవాది) ఉద్యోగమునఁ జేరవలసినదిగ ధూమాల్‌నకు పిలుపు వచ్చెను. బాబా అంగీకారముకొఱకు ధుమాల్ శీర్డిలోని శ్యామాకు ఉత్తరము వ్రాసెను.

సా. బా:- ఆ క్రొత్త ఉద్యోగము నతఁడంగీకరింపనేల? ప్రాత పదవియే చాలును.

యస్. బి. ధుమాల్ ఆ ప్రభుత్వ న్యాయవాది పదవిని నిరాకరించెను. ఆతని ఆదాయమున కెట్టి కొఱతయుఁ గలుగలేదు.

IX భక్తుల ప్రేమకులోఁగి బాబా తనపూజకు సమ్మతించుట.

551. భక్తులు తన భౌతిక తనువును పూజించుట బాబాకు మొదటినుండియు నిష్టములేదు. వారించినాఁడు. కాని తీవ్రమైన భక్తి గల మహల్సాపతి బాబా పూజను ప్రారంభించెను. బాబా కాదనలేక పోయెను. నా. గో. చందోర్కరు కుమారుఁడు 'బాపు'– 4 ఏండ్ల బిడ్డ దీనిని కొనసాగించెను. ఆబిడ్డవలె అందఱు ఆస్వాతంత్ర్యమును చూఱగొన

దొడంగిరి. అప్పటికిని బాబా తన ముఖమున గంధముతో అడ్డముగ త్రిపుండ్రములను పెట్టుటకు సమ్మతించలేదు. కాని డాక్టర్ పండిట్ వచ్చి బాబా ముఖమున గంధముతో త్రిపుండ్రములను అడ్డముగ పెట్టినాడు. బాబా ప్రశాంతముగ నోర్చుకొనినాడు.

దాదాకేల్కార్:- బాబా! ఏమిది? చందన తిలకమును నిరాకరించువాడవు నీవిపుడు సమ్మతించితివేల?

సా. బా:- ఈ పండిట్ తన బ్రాహ్మణ గురువు ధోపేశ్వర్‌లోని కాకామహారాజుగ నన్ను మనస్సున భావించి, తన గురువునకు గంధము తిలకము దిద్దినట్లు నానుదుటనుంచినాడు. కావున నేను నిరాకరింపజాలనైతిని.

తరువాత అబ్దుల్‌రంగారి (ముస్లిం) వచ్చి బాబానిట్లు ప్రశ్నించెను.

అ. రం:- బాబా! ఏమిది? నీనుదుట గంధమలదబడినదే! ఇది మన ఆచారముకాదు.

సా. బా:- "జైనాదేశ్ – వైసావేష్" – మన పరిసరముల ననుసరించి మనము వర్తింపవలె. ఈ హైందవులు వారిదైవముగ నన్ను పూజించుచున్నారు. వారి మనస్సును నేను బాధింపనేల? వారినటుల కావించుటకు సమ్మతించితిని. నేను భగవానుని భక్తుడనే.

### బాబా – గురుపూర్ణిమ జరుప నియమించుట.

552. 1909 నుండి బాబా నిత్యసమిష్టి ఆరతిపూజలు ప్రారంభమైనవి. కాని గురుపూర్ణిమ (అషాఢశుద్ధపూర్ణిమ) నాడు బాబా ప్రత్యేక పూజారాధనలు జరుపు ఆచారములేదు. 1909 గురుపూర్ణిమనాడు బాబా స్వయముగ దాదాకేల్కారును పిలువనంపెను. "ఈదినము గురుపూర్ణిమ యని నీ వెఱుగవా? పూజా ద్రవ్యములఁగొనివచ్చి గురుపూజ గావింపుము" - అనెను. ఆ దినమున గురుపూజ కావింపఁబడినది. అది

మొదలు బాబా భక్తులందరు గురుపూర్ణిమనాఁడు ప్రత్యేకగురుపూజ గావించు ఆచారము ప్రారంభమై నేటికిని జరుపఁబడుచున్నది.

కాని, శివరాత్రినాఁడు అర్ధరాత్రిమున రహస్యముగ బాబా పూజ జరుపుచున్న హ. వి. సాతేను బాబా వారించెను.

## X భక్తులయెడ బాబా జాగరూకత

### (a) నా. గో. చందోర్కర్.

553. నా.గో. చందోర్కర్- పండరిపురమునకు బదిలీచేయఁబడి, అచట ఉద్యోగములోఁజేరు పూర్వము బాబా సెలవు తీసికొన శిర్డికివచ్చు చుండెను. బాబా అచటఁజేరిన భక్తుల - మహల్సాపతి, కాశీరాం, అప్పా సింధీలను సంబోధించుచు నిట్లనెను." మనము నలువురము భజనచేయు దము. పండరిద్వారము చక్కగ తెరువఁబడినది. మన మానందముతో భజనముచేయుదము. బాబా గేయమునిట్లు ప్రారంభించెను.

పండరికిని దారి పట్టి పోవుదము
ఉండు దమిఁక నందె యుండు వారలము
చక్కగ నట నివాసంబుఁ జేయుదము
అక్కడ మన ప్రభు వలరారుఁ జిరము.

వారు ఈ కీర్తనము గానము చేయుచుండఁగా నానాసాహెబ్ చందోర్కరు మసీదుఁజేరెను.

554. తానాప్లిడరు 'జోషి' తమ్ముఁడుచిన్నజోషి శిర్డికివెళ్లి బాబాను దర్శింపఁదలచెను. కాని వెళ్ళుటకతనికి సాధ్యపడలేదు. కొన్ని దినముల తరువాత ఒక కొంకణాస్థ బ్రాహ్మణుఁడు బొంబాయికి వెళ్ళుటకు బాబా సెలవు కోరుచుండెను.

సా. బా:- (కొం. బ్రా. తో) ఈ ఉధిపొట్లము దీసికొనివెళ్లి, నీవు ప్రయాణముచేయు రైలులో నీ దగ్గఱకుఁజేరి, కూర్చుండుటకు కొంచెము 'జాగా' నీయుమని కోరునతనికి దీనినీయుము.

కొం. బ్రా:- (ఆ ఉధిపొట్లము తీసికొని) నాకెవరు సందర్భపడనియెడల దీనిని తిరిగి మీకు పంపుదును.

సా. బా:- నీ వా మనుష్యునిఁజూతువు.

అంతట కొం, బ్రాహ్మణుఁడు కోపర్గామునుండి బొంబాయికి రైలులో బయలుదేరెను. కల్యాణ్ స్టేషన్ వరకు నెవ్వరు తటస్థపడలేదు. కల్యాణ్ దగ్గఱ రైలుబండిలోని పెట్టెలు- ఈ బ్రాహ్మణుఁడున్న పెట్టె క్రిక్కిఱిసి యుండెను. ఆ చిన్నజోషి యాతఁడున్న పెట్టెలోనికిఁజేరి కొద్దిగా జాగా నిమ్మని ఆ బ్రాహ్మణునికోరెను. కొం. బ్రాహ్మణుడు కొంచెమెడమిచ్చి, ఆఉధిపొట్లమును ఆతని కొసంగెను.

355. 1915 అక్టోబరు 3వ వారమున సాయంత్రము 5 గంటలకు కాకామహాజని, తనయుజమాని సేత్‌యొక్క కుమారునిఁగలిసెను.

సేత్. కుమారుఁడు!- నాతండ్రి తాను నాశిక్‌లో ఇంకా కొన్ని దినములుండుమనునో – లేక – బొంబాయికిఁజేరుమనునో – బాబా ఆదేశమేమిటో తెలిసికొనుమని నాశిక్‌నుండి ఉత్తరము వ్రాసినాఁడు. కావున దయతో శీర్డికివెళ్ళి బాబానడిగి తెలిసికొనుము.

సా. మ:- హ. సీ. దీక్షిత్తు శీర్డిలోనున్నవాఁడు. ఆయనకు ఉత్తరము వ్రాసి బాబా ఆజ్ఞను తెలిసికొందము.

సేత్ కుమారుడు:- వలదు – వలదు. నీవు స్వయముగావెళ్లి బాబా ఆదేశమును తెలిసికొని రావలసినదిగా తండ్రిగారు వ్రాసినారు.

కా. మ:- సరే – నేను వెళ్ళుదును.

ఆ సమయమున బాబా మసీదులో హ. సీ. దీక్షిత్తు మఱి 24 గురు భక్తులతో నున్నవాఁడు.

సా. బా:- (హ. సీ. దీక్షిత్తు వంకకుతిరిగి) అహో! ఏమి! ఆ విషయములు – వాదములు – ఆలోచనలు?

మరునాఁడు కాకామహాజని శిర్డికి వెళ్ళెను.

సా. బా:- (కా. మ తో) నీవువచ్చి మంచిపని చేసితివి.

"(దీక్షిత్‌పై పునకుతిరిగి) నిన్నసాయంత్రమీవిషయమై తలంచు చుంటినిగదా!

అంతట కా. మహాజని. హ. సీ, దీక్షిత్తు ఇరువురు కలియఁ బలుకుకొని, బాబా తన భక్తులను శిర్డియందు బొంబాయియందు నొకే కాలమున నెట్లు జాగృతమై కనిపెట్టియున్నది గుర్తించిరి. (చూ. ౯)

(b) రావుబహద్దూర్. యం. డబ్లుయు - ప్రధాన్ - తల్లి

556. సా. బా:- (ప్రధాన్‌తో) నాకీపార్శ్వమున మిక్కిలిగ నొప్పి యేర్పడినది. 2 లేక 4 దినములలో తగ్గిపోవును.

బాబా పై మాటలు పలుకునపుడు ఆరోగ్యముగనే యున్నవాఁడు. ప్రధాన్ ఆమాటలపుడు గ్రహింపలేకపోయెను. అతఁడు బొంబాయిలోని తనయింటికిఁజేరగా తన తల్లికి పక్షవాతము సంబంధమగు నొప్పి తీవ్ర ముగఁగలిగి 2, 4 దినములలో తగ్గినట్లు తెలిసికొనెను.

(c) (మేనేజర్) సదాశివతార్కాడ్ — సేవకుఁడు.

557. సా. బా:- (తార్కాడ్ ఎదుట) నాకాలు నొప్పిగా నున్నది. కలబందచీల్చి నిప్పుపై వెచ్చచేసి కాలిపై కాపుకాచిన అది తగ్గిపోవును.

అది తార్కాడ్ సేవకునకు కలిగిన (బోదెకాలు) నొప్పి. బాబా తెలిపిన ఆ ప్రక్రియ చేయగా నతని కాలునొప్పి తగ్గినది.

(XI) బాబా జాగృతి — భవిష్యత్ జ్ఞానము.

(a) జి. జి. నార్కే - (చూ. 608)

558. 1916 న బాబా నిత్యహారతి వేళకు శీర్డిలో హల్వా రొట్టె తయారు చేసిపంపువాఁడు ప్లేగువ్యాధిచే మరణించెను.

సా. బా:- (నార్కేతో) హల్వాయి అంగడికివెళ్లి నైవేద్యము తీసికొనిరమ్ము.

నార్కే:- (అచటకువెళ్లి హల్వాయి భార్యతో) బాబా నైవేద్యమును పంపుమనుచున్నాఁడు.

హ. భార్య:- అటుచూడుము. ప్లేగువ్యాధిచే మరణించిన నాభర్త కళేబరమదిగో - హల్వా ఆ అలమరలోనున్నది. నీ కిష్టమేని తీసికొనిపొమ్ము.

జి, జి. నార్కే ఆహల్వా నైవేద్యము స్వీకరించు తనకు ఇతరులకు ప్లేగువ్యాధి ఆపాదించునను భయముతో గడ-గడ వణకుచు ఆహల్వా తీసికొనివెళ్లి బాబా ముందుంచెను.

సా. బా:- నీవు శీర్డికి దూరముగనుండిన బ్రతుకుదు వనియు, శీర్డిలోనున్న మరణింతువనియుఁ దలఁచుచుంటివా? అటులెన్నటికినికాదు. దైవయోగమున ఎవరెవరు వేరిటుపడ వలసియుందురో వారే ప్రేటు పడుదురు. ఎవరెవరు చావవలసి యుండిరో వారేచత్తురు. ఎవరెవరు లాలింపఁబడవలసి యుందురో వారేలాలింపఁబడుదురు. (చూ. 288, 608)

ఆ హల్వా నైవేద్యమందరకుఁ బెట్టఁబడెను. దానివలన నెవరికి ప్లేగువ్యాధికలుగలేదు.

## (b) యస్. బి. ధుమాల్.

559. ధుమాల్ — తానునివసించు నాశిక్ పురమున ప్లేగు వ్యాపించి తన యింటిలో ఎలుకలు చచ్చిపడుట గమనించెను. తన గృహమును విడిచి దూరనుగనున్న బంగాళాలో చేరుట మంచిదేమో

బాబానడిగి తెలుపుమని ధుమాల్ శిర్డీలోని శ్యామాకు ఉత్తరము వ్రాసెను. బంగాళాలోఁ జేరుమని బాబా అనుమతి అందెను కాని, బంగాళాలోచేరిన రాత్రియే మంచములం దొకదానిపైన చచ్చిన ఎలుక పడియుండెను. అంతట ఆ బంగాళావిడిచి మఱియొక తావునకు వెళ్ళుటతగునో తగదో తెలుపుమని ఉత్తరముద్వారా ధుమాల్, బాబాను కోరెను. సమాధానము వచ్చువరకు అచటనే యుండెను. బంగాళా లోనే యుండుమని సమాధానము వచ్చెను.

ఆ పిదప ఇరుగు పొరుగు గృహములందువలె బంగాళాలో నెల్లెడల, సేవకుల నివాసమున, బావియందు చచ్చిన ఎలుకలు కనఁ బడెను. మరల ధుమాల్ బాబాకు జాబువ్రాసి, సమాధానమందు పూర్వమే బంగాళాలోని తన సామానులు సర్దుకొని, తిరిగి (నాశిక్) పురమున తన యింటిలోఁజేరు తలంపున ఇంటి తలుపు తాళముతీయుచుండగ బాబా సమాధానము అందెను. "ఇప్పుడున్న నివాసముమనమేల మార్చ వలయును?" అని సమాధానము.

వెంటనే ధుమాల్ తిరిగివెళ్ళి బంగాళాలోఁజేరి అచటనే నివసించెను. బాబా పరిరక్షణముననున్న ధుమాలునకు, అతని కుటుంబ మునకు ఎట్టి ఆపదలు కలుగలేదు.

559 A. శిర్డిగ్రామజనులు:- (అప్పాకులకర్ణిమృతి పిదప) బాబా! గ్రామములో కలరావ్యాధి అతిభయంకరముగ వ్యాపించుచున్నది. మమ్ము రక్షింపుము!

సా. బా:- భయపడవలదు. ఏడుగురు మాత్రమే మృతి నొందుదురు. ఆ పిదప ఈ వ్యాధి అంతరించును.

## xii బాబా - తన భక్తుల అధిపతి - యజమాని స్థానము వహించుట

### (a) కాకా మహాజని

560. సా. బా:- థాకర్సే (సేత్) ఎట్లు కాకామహాజన యజమానికాఁగలఁడు? అతనికి పరమానందము ప్రసాదింపగల వేఱొక యజమాని కలఁడు.

(b) ఆర్. బి. పురందర్ విషయము

561. ఒకభక్తుఁడు:- అతఁడు (పురందర్) సెలవు అతిక్రమించి యిచటనుండిన యజమాని అతనిపై కఠినచర్య తీసికొనును.

సా. బా:- నేనే అతని యజమానిని.

562. భక్తుఁడు:- రైలు అందుకొనుటకు నాకు సెలవు ప్రసాదింపుము. లేకున్న ఉద్యోగమునుండి తొలఁగింపఁబడుదును.

సా. బా:- (నీకు నాకంటె) ఇక్కడ ఉన్నతాధికారి యెవఁడు లేఁడు. భోజనముచేసి సాయంత్రము వెళ్ళుము.

బాబా ఆజ్ఞను చలింపని విధేయతతో పాటించుట అత్యంత క్షేమకరవిధానముగ భక్తులెల్లరు గుర్తింపఁగలిగిరి.

## xiii. అపరాధుల (నేరముకావించినవారి) యెడను బాబాకరుణ

563. 1915 దసరాలో నొకదినమున.

సా. బా:- (హ. సీ. దీక్షితులతో) కాకా! మనదర్బారునందు మంచివారివలె చెడ్డవారును (వత్తురు). చేరుదురు. మనము నిష్పక్షపాతబుద్ధితో వారి నాదరించవలె - కాదా?

అపుడొక గుమాస్తావచ్చి బాబా పాదములపై సాగిలఁబడెను. అతడు తన యజమాని ధనము నపహరించిన కారణమున అతనిఁబట్టుకొని తెచ్చుటకు వారంటు (అధికార పత్రము) జారీచేయఁబడియుండెను. మసీదునందపుడొకని, పై అధికారి యొకఁడుకలఁడు. తాను వెంటనేవెళ్లి పోలీసులకు తెలుపవలదా? - యని యతడు తలంచెను.

బాబా అంతట వాస్తవమైనపేర్లు రాక (ఖాటీ - తాలీ) ఇతర పేర్లను పేర్కొనుచు ధనాపహరణము కావించుట - అతనిపై వారంటు మొదలగువాన్నిని గూర్చి పలికెను.

సా. బా:- (ఆ గుమాస్తాతో) నీవువెళ్ళి వెంటనే భోజనము చేయుము.

సా. బా:- (పై అధికారితో) నీ విక్కడనే యుండుము!

సా. బా:- (భోజనము చేసివచ్చి బాబాతో ఏకాంతముగ మాటాడిన ఆ గుమాస్తాతో) నీ విపుడు వెళ్ళిపొమ్ము.

సా. బా:- (ఆ గుమాస్తాను పాటిపోనిచ్చినందులకు తనపై అధికారులు తన్ను నిందింతురేమోయని భయపడుచున్న పై అధికారితో) నీవు భయపడుచుంటివా?

పై అధికారి:- లేదు. బాబా!

పై అధికారికి 3, 4 రోజుల తరువాత శీర్డినుండి వెళ్ళుటకు బాబా అనుమతి నిచ్చెను. అతనిపై ఉద్యోగులాతని నిందింపలేదు. ధనాపహరణముచేసిన గుమాస్తా (బాబా బోధలను పాటించుటచే) స్వయముగ న్యాయాధికారులయెదుటఁబడి, తననేరమునొప్పుకొనెను. ఆతని యజమాని కఠినశిక్ష విధింపుడనికోరని కారణమున ఆ గుమాస్తాను స్వల్పశిక్షతో న్యాయాధిపతులు విడిచిరి.

## xiv ప్రయాణములందు బాబా సహాయము

564. సా. బా:- [హరిదాసు దా. గా. తోనున్న నానాతో] భోజనముచేసి రైలుకు వెళ్ళుఁడు.

[హరిదాసు, (దా. గా.) బాబాయందు విశ్వాసములేని కారణమున భోజనముచేయకయే బయలుదేరివెళ్లెను. నా. గో. చందోర్కరు భోజనముచేసి రైలువచ్చుపూర్వమే స్టేషనునకు చేరుకొనగలిగెను.]

నానా చందోర్కరు భోజనముచేసి, మరల బాబా సెలవు తీసికొనిన పిదవ బయలుదేరెను. ఇంతజాగుచేసినను ఆ బండి కొన్ని గంటలాలస్యమగుటచే రైలువచ్చువేళకుఁ జేరఁగలిగినాఁడు.

## కోపర్గామునకు 'బేరే' ప్రయాణము

564 a. 'గణేష్ - విష్ణు - బేరే' (వ్యవసాయశాఖ ఇన్స్పెక్టరు) దాస్‌గాణూతో కలిసి టాంగాపై కోపర్గామునకువెళ్ళి రైలునందుకొన వలయునని బాబా సెలవు కోరెను.

సా. బా:- త్వరపడుము. ఆలసింపకుము. నీవు స్టేషన్ జేరువరకు టాంగా నెక్కడ నాపనీయకుము!

ఆ విధముగ నిరువురు టాంగాపై శిర్డీనుండి బయలుదేరిరి. రైలువచ్చుటకింకను వ్యవధికలదు. కావున ఇతర టాంగాలవాండ్రు 'బేరే'యున్న టాంగానుకొంచెముసేపు ఆపుమని కోరిరి. వారిమాటలను లెక్కింపక బేరే రైలువేళకు చాలముందుగనే కోపర్గామునకు క్షేమముగం జేరెను. తరువాత ఇతర టాంగాలు రైలువేళకుచేరికొనినవి. కాని ఆ టాంగాలను దారిదోపిడి దొంగలడ్డగించిరి. బాబా త్వరపెట్టిన కారణ మపుడు బేరేకు విశదమయ్యెను.

565. సా. బా:- (పురందర్‌తో) నాశిక్‌లో రెండు రోజులుండి వెళ్ళుము.

(ఆర్. బి. పురందర్ బిడ్డలకు జబ్బుచేసిన కారణమున నాశిక్‌లో 2 రోజులుండి వెళ్ళవలసి వచ్చినది.)

566. సా. బా:- (నాశిక్- వెళ్ళదలచిన, బి. వి. వైద్యతో) నాశిక్‌లో ప్లేగువ్యాధికలదు. నీ బిడ్డలతో నింటికి తిరిగి వెళ్ళుము.

567. సా. బా:- (కోర్టుకు హాజరు కావలసినదిగా ఉత్తరువు లందిన 'తాత్యా'తో) ఈరోజున నీవు కోర్టుకు వెళ్లవలదు. [తలవని తలంపుగ ఆ దినమున కోర్టు మూసివేయబడినది.]

568. సా. బా:- (తాత్యాతో) నీవు మార్కెటునకు వెళ్లవద్దు. కావా - శ్యామాను వెంటందీసికొనిపొమ్ము.

కలెక్టరు ఆ రోజు కార్యక్రమము తంతిద్వారా రద్దుచేసికొని, ఆమఱునాఁడు కోపర్గామునకు 'మకాం' ఏర్పాటుచేసికొనెను. ఆ విషయము చందోర్కరెఱుఁగడు, బాబా తన అంతర్జ్ఞానముఁదెలిసికొనఁ జాలినాఁడు—

573. సా. బా:- (పండరిపురన్యాయవాదితో) నీవీరోజున బయలు దేరవలదు. నీపండరి వ్యాజ్యముకొఱకు రేపు ప్రయాణమగుము.

ప్రతిపక్షి – ప్రభుత్వన్యాయవాది తనకెట్టి సమాచారమందింప కయే మఱునాటికి వాయిదా వేయించికొనినట్లు పండరి న్యాయవాది తరువాత తెలిసికొనెను.

574. హ. సీ. దీక్షిత్తు:- (బాబాతో) 6–2–1916 న 'విల్' దావా విచారణమునకువచ్చును. కావుని బొంబాయిలోనివారు నన్నిపుడు బయలుదేరి సాక్ష్యమిచ్చుటకు రావలసినదిగా కోరుచున్నారు.

సా. బా:- వలదు –వలదు –మనము వేచిచూచెదము.

హ. సీ. దీక్షిత్తు :- (తరువాత) ఆదావా 9వ తేదీకి వాయిదా వేయఁబడినట్లున్నది.

సా. బా:- మనము వేచిచూచెదముగాక!

హ. సీ. దీక్షిత్తు :- బాబా! ఆదావా 13 వ తేదీకి వాయిదా వేయబడినది.

సా. బా:- మనము నిదానించిచూచెదము–

బాబా – హసీదీక్షిత్తును 14 వ తేదీన బయలుదేరుటకు సెల విచ్చెను. బొంబాయిలో ఆదావా సరిగ 15వ తేదీన విచారణకుఁ దీసి కొనఁబడెను. ఆ విధముగ దీక్షిత్తు శీర్డిలో నిలుపఁబడుట బొంబాయిలోని దానిసంబంధీకులకు ప్రమాదకరముగ నుండెను. వారు దీక్షిత్తునకు 'వారంటు' పంప నాలోచించుచుండిరి. 14వ తేదీన బాబా, దీక్షిత్తును పంపుటచే ఆవివాదాంశము (వారంటు జారీచేయించుపని) తొలఁగి పోయెను.

574. A. బాబా - చంద్రాబాయిబోర్కరును పండరిపురము నకు వెళ్లుమనెను. అచట ఆమెభర్త బోర్కర్ ఉద్యోగము చేయుచున్న స్థలము, ఆమెవెళ్ళి తనభర్త మఱియొక తావునకు బదిలీఆయినట్లు తెలిసికొని అచటిధర్మశాలకుఁజేరి విచారముగఁగూర్చుండెను. ఒక ఫకీరు ఆమె దగ్గఱకువచ్చి, ఆమెభర్త "ధోండు" నకు బదిలీఅయినట్లు తెలిపి, టిక్కెట్లుఇచ్చి, ఆమె నటకుఁగొనిపోవుటకొక మనిషిని తోడుగనిచ్చి పంపెను.

## XV వివాహవిషయముల బాబా సహాయము

### a) ఆదామ్ దలాలీ

575. ఆదామ్‌దలాలీ:- (బాబాతో) నా కుమారునకు వివాహముకావలయును. నీవనుగ్రహించి ఆశీస్సులొసఁగిన తప్ప, ఆ కార్యమునకు నాకు ధనమెట్లుచేకూరును.?

సా. బా:- వేచియుండుము.

సా. బా:- (కొంతకాలము జరిగిన తరువాత ఆ. దలాలీతో) ఇపుడు నీకుమారుని వివాహము జరుపుము.

ఆ. దలాలీ ఒక మంచి దలారీ వ్యాపారము సంపాదించు కొనెను. దానివలన లభించిన ధనముతో అతని పెద్దకుమారుని వివాహము జరిపెను.

ఆవిధముగ ఆ. దలాలీ యొక్క తక్కిన యిరువురు కుమారుల వివాహములు బాబా ఆశీఃప్రభావమున కావింపఁబడెను.

### (b) యల్. జి. మున్గే

576. లక్ష్మణ్ - గోవింద్ - మున్గే. 1890లో రహాతాకువెళ్లెను. అచట సాయీ బాబాను కలిసెను.

సా. బా:- బిడ్డా! రమ్ము. నిన్న నీ విషయమై తలంచు చుంటిని. రమ్ము. ఈ మామిడిపండుతిని. నాపాదముల నొత్తుము. నీ వెందుకు వచ్చితివి?

మున్గే:- నా వివాహము నిశ్చయింపఁబడినది. నాకు ఆభరణ ములులేవు. (నాబంధువుల వద్దనుండి) ఆభరణములను అరువు తీసి కొనుటకు వచ్చితిని.

సా బా:- ఎవఁడు ఎవనివాఁడు? ఇచ్చువాఁడెవఁడు? తీసికొను వాఁడెవఁడు? సమయమున కెవ్వరు సాయపడరు. నీకు 1000 లేక 2000 రూపాయలు (విలువగల ఆభరణములు) కావలయునా-నాదగ్గఱ నుండియే తీసికొనుము.

మున్గే:- (తనలో) ఈ పేదఫకీరు నాకు 2.వేల రూపాయలు విలువగల ఆభరణము లెట్లీయఁగలఁడు?

అతని బంధువులు (బాబా ముందుగ దెలిపినటుల) సహాయము చేయ నిరాకరించిరి. మున్గేమిత్రుని ప్రేరణమున 'సిన్నేరు' ఒకగుజ రాతీషాహుకారు 25 రూపాయలు రొక్కముతీసికొని 2 వేలరూపాయలు విలువగల ఆభరణముల నతనికి అరువుగనిచ్చెను. ఆ విధమున' మున్గే' వివాహము జరిగెను.

## (c) దామోదర్ రసానే.

577. దామోదర్ రసానే పెద్ద కుమారుఁడు 'నానా దౌలత్‌షా'కు నాలుగు పెండ్లి సంబంధములు వచ్చినవి. అందొకరు 2500 (లేక) 3000 రూపాయలు కట్నము నిత్తుమనిరి.

దా. రసానే:- ఈ నలువురు కన్యల జాతకముల ననుసరించి యేకన్యను నాకుమారునకుఁ జేసికొనమందువు?

సా. బా:- (పెదకన్యయొక్క జాతకముతీసికొని) దామియా! ఈబిడ్డను నీకోడలుగా స్వీకరింపుము! (ఆకన్యను దౌలత్‌షా వివాహ మాడెను. ఆనిర్ణయము మిక్కిలి శుభకరమైనది.

## (d) యస్. బి. ధుమాల్

యస్. బి. ధుమాలునకు 36 వ ఏట భార్య వియోగము కలిగెను. అతనికి సంతతిలేదు. అతనిమామ రావుబహద్దూర్. బి. డి. కింఖేడ్ – ధుమాలునుతిరిగి పెండ్లిచేసికొను మనెను. కింఖేడ్ – బాబాను దర్శించి యావిషయమునుదెలుప బాబా నేత్రములు ఆసమ్మతిని సూచించెను. బాబా ధుమాలును పునర్వివాహముం జేసికొననీయలేదు. కావున రావుబహద్దూర్, యస్. బి. ధుమాల్ జీవితపర్యంతము ఏకాకిగనే గడపెను.

## XVI యం. బి. రేగేయెడ బాబాప్రేమ

578. సా. బా:- (పట్టభద్రుండై ప్రప్రథమున శీర్డికిఁజేరి బాబాపాదములకు ప్రణమిల్లిన యం. బి. రేగే-తో) ఏమి, నీవు ఒక మానవునకు మ్రొక్కుదువా?

యం. బి. రేగే ఆ ఆక్షేపణ (ప్రతిఘటనము) చే నిస్పృహ నొందిస్తబ్ధుండయ్యెను. తుదకు బాబా ఏకాంతముగ నున్నపుడు ఆతఁడు బాబాను సమీపించెను. బాబా అతనిఁజేరఁబిలిచి, యతఁడు తన శిరమును బాబా పాదములఁజేర్చి మ్రొక్కినతోడనే రేగేను కౌగిలించు కొని, తనసమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొనెను.

సా. బా:- నీవు నాబిడ్డవు. ఇతరులు (క్రొత్తవారు) దగ్గఱ నుండగా బిడ్డలను జేరనీయక దూరముగ నుంచుదుము.

తరువాత కొంతకాలమునకు రేగే శీర్డికి వచ్చినపుడు తనవిడిదిలో సాయీనామజపము చేయుచుండెను. బాబా రేగేను పిలువనంపెను.

సా. బా:- ఈఉదయమున ఏమిచేయుచుంటివి?

రేగే:- జపము.

సా. బా:- ఏ నామము?

రేగే:- నాదైవము యొక్క నామము.

సా. బా:- నీదైవ మెవరు?

రేగే:- నీవది యెఱుఁగుదువు.

సా. బా:- (చిరునగవుతో) మంచిది!

ఆ రూపమున బాబా-సాయీనామ జపమును-భక్తుని ఆధ్యాత్మిక సాధనావిషయ గోపనమును గూర్చి తనసమ్మతిని విశదము చేసినాఁడు.

ఒక సమయమున (గురుపూర్ణిమ కావచ్చును.) భక్తులందఱు (రేగేతప్ప) పూలదండలఁ దెచ్చి బాబాకు సమర్పించిరి. అపుడు రేగే తానుగూడ పుష్పమాలఁ గొని రాకపోవుటకు మనస్సున మిక్కిలి బాధ నొందెను. అంతట బాబా తనపైనున్న పూలమాలల నన్నిటిని పైకెత్తి పట్టుకొని రేగే వైపు చూపి, "ఇవి యన్నియు నీవే!"-అనెను.

1915. శ్రీరామనవమి సమయమున రేగే బాబాకు - తనకు అభేదస్థితిఁ బాటించుచు- బాబా యీవిషయమున తన సమ్మతిఁ దెలుపుచు- తమ యిరువుర అభేదస్థితినిఁ బ్రకటించ వలయునని తలంచెను. శ్రీరామ నవమినాఁడు భక్తులు నూత వస్త్రములఁ గొనివచ్చి బాబా ముందుంచిరి. బాబా తన దివ్యహస్తమున వానిని స్పృశించి తిరిగి ప్రసాదించుట కటులఁ గావించిరి. రేగే 85 రూపాయలకు చక్కని (డెక్కామస్లిన్) పట్టుశాలువ ముడిచి కాగితమునఁ జుట్టి, జేబులో పెట్టుకొని వచ్చి, బాబా పాదములకు మ్రొక్కుచు ఎవరి కంటఁ బడకుండ ఆ శాలువ ముడిచిన పొట్లము బాబా కూర్చున్న గద్దెక్రిందఁ బెట్టెను. అటుల చేయుచు తనకు బాబాకు అభేద మగుటచే బాబా తన ప్రేమను సత్యముగ పాటించువాఁడే అయిన ఆ శాలువను తిరిగి యీయక బాబా దానిని ధరించవలయునని తన

మనస్సున నిశ్చయించు కొనెను. భక్తులు తెచ్చిన వస్త్రముల నన్నిటిని తిరిగి యిచ్చి వేసిన పిదప బాబా తన గద్దెపై నుండి లేచెను.

సా. బా:- ఈగద్దెమీద నున్నవాని నన్నిటిని తీసివేసి, దులిపి శుభ్రము చేయుండు!

ఆగద్దెను తీసిదులుపునపుడు ఆసాలువ ముడిచిన చిన్న కట్ట బయటపడెను.

సా. బా:- (దానిని తీసికొని, విప్పి వఱచి) అహో! ఏమిది? సాలువ! దీనిని నేను తిరిగియీయను. ఇదినాది!

సా. బా:- (దానిని తనపై కప్పుకొని, యం. బి. రేగేవైతిరిగి) దీనిని ధరించిన నేను చక్కగలేనా?

బాబా తమ అభేదస్థితి నంగీకరించి ఆబహుకృతిని అట్టి తలంపుతో స్వీకరించినాడని రేగే మిక్కిలిగ సుప్పొంగినాడు.

## XVII ప్రాణరక్షణము

### (a) యస్. బి. నాచ్నే.

579. సా. బా:- (1913న. యస్. బి. నాచ్నే - ఇంకను పలువురు భక్తులయెదుట) పిచ్చివారలను మనమెప్పుడు విశ్వసింపరాదు.

1914 న, నాచ్నే తనయింట పూజంగావించుచుండెను. ఒక పిచ్చివాడు లోనికిజొరబడి నాచ్నే కంఠమును పట్టుకొని "నీరక్తము నేను త్రావుదును." అనుచు నోరు లెస్సగ తెఱచి కంఠమును కొఱుకం బోయెను. నాచ్నే తన చేతిలోనున్న ఉద్ధరణను ఆపిచ్చివాడు తెఱచిన నోటిలోనికిజొనిపి, వెంటనే స్మృతి తప్పెను. ఇతరులు వెంటనేవచ్చి నాచ్నే ప్రాణములను కాపాడిరి. తరువాత నాచ్నే శిర్డికివెళ్ళి బాబాను దర్శింపంగా.

సా. బా:- (యస్. బి. నాచ్నేను చూపుచు అన్నా చించ్నికర్‌తో) అన్నా నేనొకక్షణ మాలసించిన ఈతఁడు మరణించి యుండెడివాఁడే ఇతని కంఠమును ఆపిచ్చివాఁడు తన చేతులతో పట్టుకొనెను. నేనా పిచ్చి వానిని త్రోసివైచితిని. ఏమి చేయవలెను? నా బిడ్డలను నేను రక్షింప కున్న నింక రక్షించు వారెవరుకలరు?

## (b) నిమోన్కర్ బిడ్డ.

580. యస్. యస్. డి. నిమోన్కర్. (సి. ఐ. డి. ఇన్స్పెక్టర్) పూనానుండి బయలుదేరి, బిడ్డనుకనిన తన సోదరుని భార్యను చూచుటకు 'నిమోన్' అను చోటునకు వెళ్ళుచు మార్గమున శీర్డికిఁజేరి బాబాను సందర్శించెను.

సా. బా:- (సెలవొసంగుచు అందఱకువలె 'ఊధి' ని ప్రసా దించుచు నిమోన్కర్‌తో) ఆ బిడ్డప్రాణములఁగాపాడుము!

నిమోన్కర్- 'నిమోను' చేరగా నూతనముగ జనించిన బిడ్డ ప్రమాదస్థితిలోనుండి, కాళ్ళుచేతులు చల్లబడి కంపమేర్పడినది. తల్లిదండ్రులాబిడ్డపై ఆసలుడిగిరి. బాబా ప్రసాదించిన ఊధకొఱకు నిమోన్కరు వెదకెను. కానరాలేదు. అంతట ఆబిడ్డను చేతులలోనికిఁ దీసికొని, ఆబిడ్డప్రాణముల కాపాడుమని నిమోన్కర్ బాబాను ప్రార్థిం చెను. 15 నిముషములలో ఆబిడ్డ కోలుకొనెను. స్వస్థతకలిగెను.

## బాబా — సర్వతంత్ర స్వతంత్రిత

## (a) ధులియా కోర్టు కమిషన్

581. నగలు సొమ్ము అపహరించిన కారణమున నొకఁడు నేరము మోపఁబడి ధులియా మేజస్ట్రేటుకోర్టునకుఁ గొనిరాఁబడెను. తన కాసొమ్ములు నగలు శీర్డిలోని సాయి బాబా ఇచ్చినాఁడని ఆ ముద్దాయి కోర్టులో తెలుపుకొని బాబాను సాక్ష్యముగవేసికొనెను. కోర్టు ఉత్తరువులు జారీచేయబడినవి.

పోలీసు:- బాబా! నీకు కోర్టువారి ఉత్తరువులివిగో?

సా. బా:- వానిని తీసికొని వెళ్ళి అనిప్పలోపడవేయుడు.

ఎవరో ఆకోర్టు సమన్లుతీసికొని నిప్పులోపడవేసిరి. సమన్లు అందింపబడినట్లు కోర్టువారికి తెలుపబడినది. విచారణనాడు బాబావెళ్ళని కారణమున బాబాకు 'వారంటు' జారీచేయబడెను.

పోలీసు గణపతిరాం - బాబా! ఆకోర్టువారు వారంటు పంపినారు. దయయుంచి నాతో ధూలియాకువత్తువా?

సా. బా:- (కోపముతో) ఆ కాగితము ముక్కలు ఆవల పారవేయుము. (అనుచు బాబా ఏమియోతిట్టెను)

ఆపోలీసున కేమియు తోచలేదు. నా. గో. చందోర్కరు సలహాపై శిర్డిలోని జనులు పలువుర సంతకములతో నొక 'మహజర్' పంపఁబడెను. అందు "సాయిబాబా వేనవేలు జనులచే దైవముగ భావింపఁబడుచున్నవాఁడు. అట్టియెడ బాబాకు కోర్టుసమన్లు - వారంటు తగనివి. ఆపేక్షణీయములుకావు. బాబా సాక్షమే అవసరమనితోచిన ఒక కమిషనరును నియమించిపంపుటమేలు" - అని తెలిపిరి. నానాజోషి- మొదటి తరగతి మేజస్ట్రేటును బాబాసాక్ష్యము తీసికొనుటకు 'కమిషనరు' గా ధులియా కోర్టువారుపంపిరి.

కమిషనర్:- నీపేరేమి?

సా. బా:- నన్ను 'సాయీబాబా' అని పిలుతురు.

కమిషనర్:- నీతండ్రెవరు?

సా. బా:- నాతండ్రిపేరు- సాయీబాబా.

కమీషనర్:- నీగురువు పేరు?

సా. బా:- వేంకుశ.

కమీషనర్:- మతము?

సా. బా:- కబీర్.

కమీషనర్:- కులము-శాఖ.

సా. బా:- పర్వర్దగర్- (దైవ)

కమీషనర్;- వయస్సెండి?

సా. బా:- లక్షల సంవత్సరములు.

కమీషనర్:- నీవు చెప్పఁబోవునది సత్యమని ప్రమాణముచేసి చెప్పగలవా!

సా. బా:- సత్యము.

కమీషనర్:- నేరముచేసిన (ఫలాని) వానిని నీవెఱుఁగుదువా?

సా. బా:- ఎఱుగుదును. ఆతని నెఱుఁగుదును-ఎల్లఱ నెఱుఁగుదును.

కమిషనర్:- అతఁడు నీభక్తుఁడని, నీదగ్గఱ నున్నవాఁడని చెప్పుచున్నాఁడు. అవునా?

సా. బా:- అవును. నేను ప్రతివానితోడ నుందును. అందఱు నావారే.

కమిషనర్:- ఆఁతడు చెప్పినట్లు ఆ నగలను నీవిచ్చితివా?

సా. బా:- అవును. నేనిచ్చితిని. ఎవరు వేని నెవరికిత్తురు?

కమిషనర్:- నీవానగలతనికిచ్చిన అవి నీకెట్లులభించినవి?

సా. బా:- సకలము నాదే.

కమీషనర్:- బాబా! ఇది దొంగతనమునకు సంబంధించిన పెద్దనేరము అతఁడు నీవే నగల నాతనికి ఇచ్చితివని చెప్పుచున్నాఁడు.

సా. బా:- ఏమి యీరగడఅంత? ఆగొడవతో నాకేమి సంబంధము?

కమిషనర్ మిక్కిలి అయోమయస్థితి నొందెను. అంతట ఆశిర్డి గ్రామమునకుఁజేరు క్రొత్తవారి పేర్లుగుర్తింపఁబడు 'డైరీ' ని తెప్పించిరి. ఆదొంగ తెలిపినట్లు అతఁడు శిర్డికి వచ్చినట్లు-ఉన్నట్లు ఆడైరీలో లేదు. బాబా శిర్డికి విడిచి యెక్కడకువెళ్ళి యుండలేదను విషయమెల్లరకు విదితమే.

ఈవిషయముల నన్నిటిని కమిషనర్ బాబా యెదుటపెట్టెను బాబా అవిసత్యములని చెప్పెను. దానితో కమిషనర్ విచారణము పూర్తియయ్యెను. బాబాను సంతకముచేయుమనిగాని, వ్రేలిముద్ర వేయుమనికాని కమీషనర్ కోరలేదు. అటుల బాబా ఎప్పుడు చేసి యుండలేదు.

## (b) సర్. జి. సేమోర్‌కర్టిస్ - బాబాను దర్శించుట

582. 1910-11 లో నొకనాఁడు బాబా ద్వారకామాయి మసీదునందిట్లనెను. "దుష్టుడు - నన్ను చూచుటకు వచ్చుచున్నాఁడు! నాకేమికలదు? మానవాయువములుగల దిగంబరఫకీరును!

బాబా ఎవరినిఁగూర్చి పలుకుచున్నాడా - యని జనులాశ్చర్య పడిరి. అంత కొంచెముతరువాత మసీదుప్రక్కగ (ఉద్యోగులగుంపు) రివిన్యూకమిషనర్ - కర్టిస్, అతనిభార్య, కలెక్టరు మాక్నైల్, తదితర ఉద్యోగుల గుంపు నడిచెను. వారందఱు చావడికిఁజేరిరి.

ఆసిస్టెంటు కమిషనర్:- (యన్. ఆర్. యన్. తో) ఉద్యోగులు దర్శింపవలయునని కోరుచున్నారు. కావున సాయిబాబాను తనఉదయకాలవిధులు త్వరగా పూర్తిచేసి కొనుమని చెప్పుము.

యస్. ఆర్. యస్:- సాయిబాబా విషయమున అట్టి సందేశములు - ఆనాలోచనీయములు - తగనివి వారితో మీకేమైనను పనియున్నచో వారిఅనుగ్రహమునకు వేచి యుండవలయును.

అరగంటకు బాబా ఆప్రక్కగావెళ్ళెను. కర్టిస్‌సతి బాబాకు నమస్కరించి, "మహరాజ్! మీతో కొంచెము మాటాడవలయునని కోరుచున్నాము - అనెను.

సా. బా:- అరగంట వేచియుండుడు! నేను వెళ్ళి భిక్షించుకొనవలయును. (అని చెప్పుచు బాబావెడలిపోయి పదినిమిషములలో తిరిగివచ్చెను.) మరం కర్టిస్ సతి నమస్కరించి, తనకోరికను దెలిపెను.

సా. బా:- ఒకగంటవేచియుండుడు! (అని పలుకుచు బాబా మసీదునకు వెళ్ళెను.)

ఆఉద్యోగులు త్వరలోనుండిరి. వారు వేచియుండలేదు. బాబా అనుగ్రహమున సంతానము పడయవలయునను కర్టిస్ సతి కోరిక నెరవేరలేదు.

## బాబా నిర్భయము

### బాబా — గంధసమర్చనము — ముస్లిములు కర్రలతోఁజేరుట

583. పలువురుభక్తులు బాబాను పుష్పములు మొదలగు వానితో పూజించువారు. చందనము పూతవిషయమున మహల్సాపతి మాత్రము బాబాకంఠమున మాత్రము మంచి గంధమునలందువాఁడు. బాబా నిరాకరించుటచే నుదుట మాత్రము గంధముపెట్టఁడు. ఒక దినమున బాబాముఖమున గంధముధరించినట్లు కలలో తోచెను. అది మొదలు మహల్సాపతి బాబాముఖమున గంధము తిలకము పెట్టుచుండెను. బాబా నిరాకరించలేదు. కాని కొందఱు ముస్లిములు ఆక్షేపణ తెలిపిరి. బాబావారితలంపులను లెక్కచేయలేదు. అంతట

మహమ్మదీయులందఱు కలిసి 'సంగంనేరు' లోని కాజీతో నాలోచించి, బాబాముఖమున గంధమలందు వారిని కొట్టవలయునని తీర్మానించుకొనిరి. 'తాంబులి' అనునతఁడీ విషయమును మహల్సాపతికిఁ దెలిపెను. ఆదినము మహల్సాపతి మసీదు ఆవరణకు వెలుపలనుండి అచటనే బాబా పూజఁగావించు చుండెను. బాబా మహల్సాపతినిఁజేరఁ బిలిచి.

సా. బా:– నీవచట నేమిచేయుచుంటివి?

మహల్సా:– బాబా? నీపూజచేయుచుంటిని.

సా. బా:– లోపలకురమ్ము. నాముఖమున, ఉరమున, అంతట చందనమలందుము. ఎవరునిన్ను కొట్టెదరో నేనుచూచెదనుగాక!

ముస్లిములు భయపడి వెడలిపోయిరి. ఆదిమొదలు హైందవ దేవాలయములందువలె చందనకైంకర్యము పూజలు నిరాటంకముగా సాగెను.

## బాబా – న్యాయ విధానము.

584. 1913–14న పూనాలో ప్లేగు వ్యాపించెను. ఆర్. కె. డూబే–శిర్డీకి వెళ్ళుదునని మ్రొక్కుకొనినవాఁడు అటులఁగావింపక 'సాసర్వాడ' కు వెళ్ళెను. ఆప్రయాణమున నతఁడు పసిబిడ్డను, కోల్పోయెను. అతనిభార్య మిక్కిలి జబ్బుపడి ప్రమాదస్థితిలో నుండెను. డూబే– బాబాను ప్రార్థించినాడు.

సా. బా:– (అతనిస్వప్నమున పొడమి) మనుష్యుడు కావించు మ్రొక్కుబడులు చెల్లించుకొనవలయును. లేనియెడల ఈవిధముగ శిక్ష సహించవలయును.

అంతట డూబే సతి నొసట ఉధిని పెట్టి బాబా అదృశ్యుఁడయ్యెను.

డూబేనిద్రలేచి ఆమెనుదుట ఊధినిఁజూచెను. ఆమరునాఁడు ఆమె ఆరోగ్యము పొందెను.

తరువాత డూబే దంపతులు శిర్డికి వెళ్ళిరి. బాబాపై విషయముల నన్నిటినచటవారికిఁదెలిపెను.

## బాబానీతి—సమత్వము

### సమోఽహం సర్వ భూతేషు.

585. ఈ ప్రపంచము నవ్వుపుట్టించుచున్నది. అందఱు నా ప్రజలే. అందఱియెడ సమదృష్టిఁబఱపుదును. కాని కొందఱుదొంగలగుచున్నారు. వారి విషయమున నేనేమి చేయగలను? వీరునాయెడ అవజ్ఞత వఱపినన్ను మిక్కిలిగ బాధించుచున్నారు. నేనేమియు పలుకక ఊరకున్నాఁడను. దైవము మహాప్రభువు. అంతట మిక్కిలి సమర్థులైన ప్రతినిధుల నేర్పఱచినాఁడు. నరుఁడు తనకుఁగలదానితో సంతృప్తి సంతుష్టులబొంది యుండవలయును. నేను మిక్కిలిశక్తివంతుఁడను. నేనచట 8, లేక 10 వేల సంవత్సరములకు పూర్వమున వుంటిని.

(జి. యస్. కపర్దే—డైరీ)

### (a) వేప చెట్టు కొమ్మ

586. గర్భమున పెడతిరిగిన బిడ్డనేని నీవు కండతుండెములుగ ఖండించి వెలువరింపవలయును— (అని, యీమాటలు పలుకుచు బాబా సాతేవాడ గోడనిర్మించుటకు అడ్డమువచ్చిన మధుర నింబవృక్షముశాఖను ఛేదించెను.)

### (b) యస్. బి. నాచ్నే అత్తగారి ప్రతీకారము

587. దాదాకేల్కార్:- నామనుమరాలి కంటికలకకు కాపుకాయుటకు ఉల్లిగడ్డ ఎచట తెచ్చుకొనగలను?

సా. బా:- (నాచ్నే అత్తగారిని చూపుచు) ఈతల్లి దగ్గఱ నుండి తెచ్చుకొనుము.

నాచ్నే అత్త:- బాబా! ఈదాదా, నేను ఉల్లి తఱుగుచుండగా ఈ ఉదయమున నన్ను తిట్టినాఁడు. ఈతని కేమియు నిచ్చుటకు నా కిష్టములేదు. కాని, నీవాజ్ఞాపించిన ఇచ్చెదను.

సా. బా:- ఈయుము!

(బాబానీతియుక్తమైన ఆజ్ఞలచే, దాదాకేల్కారు కావించిన కీడునకు నాచ్నే అత్త తిరిగిమేలుచేసి, చక్కనిప్రతీకారము సాధించినది.)

## (c) బాలా పటేల్

588. దామియా (దామోదర్ - సావ్రాం - రసానే) బాబానుజేరి, నిమ్నజాతికిఁజెందిన బాబాసేవకుఁడు 'బాలపటిల్' ను - బాబాకు ప్రతినిధిగా తనయింటజరుగు విందునకు పంపుమనికోరెను.

సా: బా:- మంచిది! కాని, 'ధట్ - ధట్' (ఎడముగనుండుము- ఎడముగనుండుము) అని, అతనిననవలదు. నీవు భుజించు తావునకు దూరముగ నతని నుంచకుము.

దామియా బాబా బోధనుపాటించి, బాలపటిల్ ను తన అతిథిగ భావించి, అతనిని యింటివెలుపలఁగాకుండ, భోజనమునకు తనసమీప మునఁ గూర్చుండఁజేసెను.

## (d) చక్రనారాయణ

589. చక్రనారాయణ - అను క్రైస్తవుఁడు కోపర్గామున ఫౌజుదారుగ నియమింపఁబడినపుడు -

ఒకభక్తుఁడు:- బాబా ఫౌజుదారుగనొక క్రైస్తవుఁడు మనకు వచ్చినాఁడు.

సా. బా:- అయిననేమి? - అతఁడునాసోదరుడు.

(e) పెస్టన్ జామాస్

590. 1915 నందు పెస్టన్ జామాస్ - అతని బావమఱది సాయీ మహారాజును సందర్శించుటకు శీర్డికివెళ్ళిరి. అపుడు దీక్షిత్ వాడలో జనము క్రిక్కిరిసియుండిరి. ధనికులకు మాత్రమే మేడపైన వసతిఁగూర్చఁబడినది. ఈయిరువురు పార్శీలు దిగువభాగమున నుండిరి.

"ఈ దర్బారులో ఇదేమి న్యాయము? గొప్పవారుపైన సుఖమనుభవించుచుండ పేదలుక్రింద ఇరుకున కష్టపడుచున్నారు" అని, యీయిరువురు పార్శీలు తలంచిరి. వారు మసీదుఁజేరి బాబాను సందర్శించిరి.

సా. బా:- (అచటనున్నవారితో) ఈయిరువురనుపైకితీసికొనిపొండు!

వారికిమేడపై-భాగమున వసతిచూపబడెను.

(f) తుకారాఁబర్కు

591. తుకారాంబర్కు - ఒకమహల్ (హరిజనుడు). నౌకరికొఱకు అతడు శీర్డివిడిచివెళ్ళుచుండెను. బాబా అతనిని కలిసి తన బాహువు నతనిమెడచుట్టుఁజేర్చి.

సా. బా:- (బర్కుతో) నీవువెళ్ళవలదు.

బర్కు:- నేను వెళ్ళి సంపాదించుకొనవలయును.

సా. బా:- వెళ్ళవలదు.

బాబా ఆ దేశము నిరాకరించి బర్కువెళ్ళి, జబ్బుపడి, చాలా కాలము బాధలొంది ఏమియు సంపాదించుకొన లేకయే తిరిగివచ్చెను.

బా బా — జ ం తు వు లు

592. నానాసాహేబ్ డేంగ్లే - ఒకవెండిపళ్లెరములో మంచి రుచికర పదార్థములఁగొనివచ్చి, బాబాకు సమర్పించి, తినుమని

ప్రార్థించెను. బాబా చప్పటులఁజఱచెను. ఒకనల్ల కుక్కవచ్చి ఆ ఆహార పదార్థములను దినెను. నానాసాహేబ్ విసుగునొంది, "ఈ ఛండాలపు కుక్కకొఱకా నేనీ పదార్థముల సిద్ధపరచినది?" – అని తనమనస్సున తలంచెను.

సా. బా:- (ఆపళ్లెరమునావలకుత్రోయుచు) దీనిని తీసికొని పొమ్ము.

592. A. లక్ష్మీభాయిసింధి తెచ్చిన రొట్టెలను బాబా కుక్కకు పెట్టిన వృత్తాంతము. (చూ. 68)

## బాబా – మతసామరస్యము – సర్వజన సమ్మతత్వము
## (ఉదారబుద్ధి)

593:- సా. బా:- ఎల్లదైవములు ఒకరే. హైందవునకు మహమ్మదీయునకు భేదముఁలేదు, మసీదు – దేవాలయము — ఒకటే. అటులయ్యును మీఆశయములను నేను గౌరవింతును. (మహల్సాపతి ఆక్షేపణము కారణముగ) (ఖండోబా) ఆ దేవాలయమున నేను ప్రవేశింపను.

## చోకామేళుని వృత్తాంతాము గమనింపుడు!

594. సా. బా:- (తనగృహమున దీక్షిత్ వాదయందు క్రీస్తునుగూర్చి, క్రైస్తవ మతమునుగూర్చి నిందింపవచ్చిన హ. సి. దీక్షిత్తుతో) పొమ్ము – నాపాదముల నొత్తవలదు.

హ. సీ, దీక్షిత్తు తన ప్రవర్తనమునకు పశ్చాత్తాపముఁజెంది, తిరిగివచ్చి బాబా పాదముల నొత్తునపుడు బాబా ఆక్షేపించలేదు,

## బాబా–మతాంతరీకరణమును నిరసించుట.

595. బడేబాబా (ఫకీర్‌బాబా) హిందూమతము విడిచి ముస్లిం మతమును స్వీకరించినవానిని (ఇబ్రహీం) మసీదునకుఁ దీసికొనివచ్చి బాబా కెఱుక పఱచినపుడు–

సా. బా:- (ఆమంతాంతరస్వీకృతుని చెంపపై కొట్టి) ఆ! నీ అబ్బను మార్చుకొంటివా?

బాబా — ప్రార్థనలు.

596. సా, బా:- నేనిక్కడ పలుకుదును. (నాపలుకుల కనుగుణముగ) అవి అక్కడ జరుగును. ఇది యంతయు దైవలీల!

(యం. డబ్లుయు — ప్రధాన్ విషయమున,)

సా. బా:- ఓ భగవాన్! ఆ వర్షమును ఆపుము! నా బిడ్డలు ఇంటికి వెళ్ళవలయును. వారిని క్షేమముగ వెళ్ళనిమ్ము. (ప్రధాన్ కుటుంబము రైలుస్టేషన్‌జేరువరకు వానఆగెను,)

596. A. హెచ్. వి. సాతే విషయమున

దాదా కేల్కార్:- బాబా! మేము మనుమని (దౌహిత్రుని) పడయుట ఎపుడు?

సా. బా:- నేను అల్లాను ప్రార్థించు చున్నాఁడను. అతఁడు నా ప్రార్థనము మన్నించును. (మరుసటి సంవత్సరమున మనుమఁడుపుట్టెను.)

597. నేను దీర్ఘముగ నాలోచించుచు రేయింబవళ్ళు తలంచు చున్నాఁడను. అందఱు దొంగలే, కాని, మనము వారితో మెలగ వలయును. వారినిఁ జక్కపఱుపుమని లేదా తొలఁగింపుమని భగవాను నెల్లవేళలఁ బ్రార్థించు చున్నవాఁడను. దైవమాలకించి, నాతలంపు మన్నించి, యనుగ్రహించుట లేదు. నేనొకటి రెండు నెలలు వేచి చూచెదను.

కాని, బ్రతుకనీ చావనీ నేను ప్రార్థించునది సాధించితీరుదును. నేను (తేలి - వాణి) వారి వీరి దగ్గఱకు వెళ్ళను. నేను వారిని ప్రార్థింపను. జనులు సత్ప్రవర్తనులై భగవద్భక్తినిఁగాంచరు. బుద్ధి

స్థిరములేదు. చంచల స్వాంతులు ఎవరో కొందఱు మిత్రులు బ్రహ్మ జ్ఞానమునుగూర్చి చర్చించుదురు. స్థిమితముగఁ గూర్చుండి ధ్యానింతురు.

( జి. యస్. కపర్దే – డైరి )

598. సా. బా:- (1886 న మహల్సాపతితో) నేను దైవము దగ్గఱకు వెళ్ళుచున్నాను.

599. సా. బా:- (తన కాలినచేతినిఁగూర్చి ఇది అంతయు దైవలీల. అతఁడే దీనిని నివారించును. మనమాందోళనఁజెందనేల? అల్లా – నావైద్యుఁడు.

సా. బా:- (ఆర్. బి. పురందర్‌తో) 2, 4, రోజులలో నేను స్వస్థత నొందుదును. అల్లా ఈ వ్యాధి నా కొసఁగినాఁడు. ఈ గడువు లోపల తిరిగి చక్కఁజేయును. నీవు ఏడువవలదు.

బాబా – విజ్ఞానము. (అనుభవజ్ఞానము)

వై రా గ్య ము

600. బాబా మసీదునఁ గూర్చుండెను. సీతాఫలముల ఋతువు అప్పుడే ప్రారంభమయ్యెను. ఒకకాంత ఆఫలములను దెచ్చి వానిని కొనుమని మంచిమాటలఁ బల్కుచుండెను మొదటనామె ఆ పండ్లకు ఎక్కువధరచెప్పెను.

సా. బా:- నీఫలములు నాకువలదు-తీసికొనిపొమ్ము.

అంతటనామె 6 పండ్లు 10 అణాలకు తీసికొనుమని బాబాను ప్రార్థించెను. బాబావానిని తీసికొనెను (ఆ కాంతకు డబ్బు ఇచ్చు లోపల) కొంచెముసేపు తరువాత సీతాఫలములను మఱియొకతె తెచ్చెను. బాబా బేరముచేసెను.

సా. బా:- పదిఫలములకు నీకు ఆరుఅణాలనిత్తును.

ఆమె సమ్మతించెను.

సా. బా:- శ్యామా! ఈయిరువురకు మనమీయవలసిన మొత్త మెంత?

శ్యామా:- దేవా! ఒకరూపాయి.

సా. బా:- (అచటనున్నవారిలో నొకనితో - కాకా మహాజనితో) భావ్! నాకు 2 రూపాయలిత్తువా?

బాబాకోరిన 2 రూపాయలతడిచ్చెను.

అంతటబాబా మొదటి పండ్లమనిషినిపిలిచి, 'దీనిని తీసికొని పొమ్ము' - అని ఒకరూపాయి ఇచ్చెను.

పిదప రెండవ మనిషినిపిలిచి ఆమెకు ఒకరూపాయి ఇచ్చెను.

రెండు రూపాయలిచ్చినభక్తుడు:- బాబా! ఇదంతయు నాకేమియు బోధపడలేదు. నేను గ్రహించునట్లు చేయుదువా?

సా. బా:- ఇందుకష్టమేమికలదు?

మొదటి పండ్లబుట్ట వచ్చినపుడు పండ్లు అరుదుగ నుండెను. అందుచే 6 పండ్లకు 10 అణాలు బేరము స్థిరపడుపబడినది.

రెండవబుట్ట వచ్చినపుడు పండ్లు అంత 'గిరాకిగ' లేవు. అందుచే 10 పండ్లు 6 అణాలకు నిర్ణయింపబడినవి. ఇకపైకము (మూల్యము) చెల్లించువిషయమా! - ఈ ఇరువురు వారి వారి భాగ్యము (పూర్వకర్మము) ననుసరించి ధనము వడసిరి. (ఈయబడెను.)

601. 1890లో నానాసాహెబు నిమోన్కర్ బాబాకు 10 రూపాయల కరెన్సీనోటు ఇచ్చెను.

సా. బా:- నేను తీసికొనను. నేనొకఫకీరును.

602. 1907 న 'కనిత్కార్' కుటుంబముతో శిర్డికి వెళ్ళెను. బాబాను చావడిలోఁజూచెను. అపుడు బాబా ఏమేమియో దూషించుచు అసహ్యకరములైన మాటలాడుచుండెను. అదికని అతఁడాశ్చర్యపడెను. అతని గుమాస్తాలు బాబా మహాసాధువని తెలిపిరి. "నాకుటుంబమునుండి తీసికొనిన దక్షిణలన్నియుఁ దిరిగి యిచ్చిన బాబా మహా సాధువని నేను భావింతును" - అని, కనిత్కార్ పలికెను.

తరువాత అతనిభార్య కుటుంబము బాబానుజేరగా

సా. బా:- మీరింతవరకు నాకిచ్చిన ధనమిదిగో తీసికొనిపొండు!

కనిత్కార్‌సతి:- బాబా! కట్టెలు మొదలగునవి కొనుటకు అవసరమగును. కావున ఉంచుకొనుము.

సా. బా:- నాకిది అవసరములేదు.

603. సా. బా:- (యస్. బి. నాచ్నేతో) నీవు ఏమిచేసిన దానిని సంపూర్ణముగఁజేయుము - లేదా - ఆపని నంగీకరింపకుము.

604. సా. బా:- విందులకు-పండుగలకు యాత్రలకు ప్రయాణములకు అప్పుతీసికొనకుము!

605. సా. బా:- నీవు ప్రయాణముచేయు ముందు భోజనము చేసి బయలు దేరుము!

బాబా — పూర్వాచార పాలనము.

మృతాఽశౌచము—భక్తులు పాటించు సందర్భము.

606. సా. బా:- (హరిభాల్ కార్ణిక్‌తో) మసీదు మెట్లెక్కకుము. నేరుగ మీ గృహమునకు (దహన్) మధ్యదారిలో ఆలసింపక వెళ్ళుము!

హరిభావ్ తిరిగివెళ్లి బాబాశిర్డిలో పైమాటలు పలికిన 2 గంటలకు పూర్వము అతని మనుమని భార్య మృతినొందినట్లు తెలిసికొనెను.

607. గోఖేలుసతి ఇతరులతోఁగలసి మసీదులోనికి వచ్చుచుండెను.

సా. బా:- (గోఖేలుసతితో) మసీదులోనికిరావలదు.

ఆమె తిరిగివెళ్లి స్నానముచేసి శుభ్రవస్త్రముల ధరించివచ్చి మసీదు మెట్లెక్కఁబోయెను.

సా. బా:- (మరల) లోనికిరాకుము!

అంతట గోఖేల్‌సతి (యింటికి) స్వస్థానమునకు తిరిగివెళ్ళి తాను శిర్డిలోని మసీదులోపలకు వేళ్లబోవునప్పుడు తన బంధువుల మృతివలన ఆశౌచమున నున్నట్లు గ్రహించెను.

బాబా — నిగూఢ ఆచార ధర్మము — ఎఱుక

608 (a) శిర్డికాంత:- (బాబాతో) బాబా! నీవు గోధుమలు పిండి విసరుచున్నాఁడవు- మమ్ము తోడ్పడనిమ్ము.

సా. బా:- మంచిది.

(కొంతసేపు పిండి విసరిన పిదప)

శిర్డికాంత:- బాబా! నీవు రొట్టెలు చేసికొనవుగదా! మేమీ పిండిని తీసికొని పోదుము,

సా. బా:- వలదు- వలదు. రండు! మనము పిండిని మోసికొనిపోవుదము.

అంతట బాబా శిర్డికి ఉత్తరసరిహద్దుగాగల వాగుదగ్గఱకు దారితీసెను.

సా. బా:- ఈ పిండినంతయు వాగుగట్టు పొడవునపోయుదము. ఈ అంటువ్యాధులు - కలరా. ప్లేగు మొదలగునవి దేవతల రూపమున గ్రామములోనికిఁ బ్రవేశించును. వారీ పిండితో తృప్తినొంది, గ్రామములోనికిఁ బ్రవేశింపక వెడలి పోవుదురు.

బాబా ఆవిధముగ శీర్డి గ్రామము ఉత్తరమునగలవాగు గట్టు పొడవున ఆపిండిని పోయుటచే యథార్థముగ ఆభయం కరమైన అంటు వ్యాధులు శీర్డిలోనికిఁ బ్రవేశింపలేదు.

(b) బాబా — నాణెములను రుద్దుట.

బాబా ఏకాంతముగనున్నపుడు తనజేబులోనుండి నాణెములను వెలుపలకుఁదీసి తనవ్రేళ్ళతో వాని పై భాగమున రుద్దుచు (అటులఁగావించుటచే అనాణెముల పైనున్న అక్షరములు మొదలగునవి అఱిగి పోయినవి.) నానాచే- నానాచే (నానాయొక్క-నానాయొక్క) కాకాచే,- కాకాచే, సోమియాచే-సోమియాచే, మొదలగు పేర్ల నుచ్చరించుచుండును.

ఇట్లు కావించుటచే వీరికిఁగలుగు ప్రతిబంధకములు తొలఁగి పోవుచుండును. (తుడిచివేయఁబడుచుండును.) బాబా భక్తు లావిధముగఁ దలఁచి విశ్వసించినారు.

(c) బాబా — తనభక్తులక్షేమ మరయుట.

సా. బా:- (అబ్దుల్‌తో) అబ్దుల్! ఆ అఖండము (లేండివనము నందుంచఁబడినదీపము. అఖండము) ప్రక్క బొక్కెనలతో నీరముంచుము - ఆ అఖండజ్యోతి ఆరి పోవకుండ కనిపెట్టి, అవసరమైనపుడు ఎప్పటికప్పుడు నూనెతో నింపుచుండుము!

ఆ విధముగ అఖండము ప్రక్కన నీటితో నింపఁబడిన బొక్కెనలు సిద్ధపఱుపఁబడినపిదప, బాబా ఆ నీరముచేతితో తీసికొని అన్నిమూలలఁ జల్లుచుండును. లేచి, యెనిమిది దిక్కుల ఒక్కొక్క దిశవైపునకు కొన్ని అడుగులువేసి, మూలమూలయందు ఆకాశమువైపున దృష్టినిలిపి ఏవి యేవియోపలుకు చుండును. తన భక్తులకుఁ గలుగు ఆపదల గమనించుచు, వానినిఁదొలఁగించుట కటులఁగావించుచుండునని తెలియుచున్నది.

(b) బాబా ఒక దినమున తనచేతిని మోచేతివరకు (ధుని) అగ్నిలోనికిఁజూనిపెను. చర్మముకాలెను.

శ్యామా:- బాబా! నీవటులేలచేసెదవు? (అనుచు బాబాచేతిని వెలుపలకులాగెను.)

సా. బా:- ఈ పాపిష్టిహస్తమును పోనిమ్ము- ఒకబిడ్డ అగ్నిలో పడెను. ఆ బిడ్డనందుండి వెలికిఁదీయుచున్నాఁడను.

తరువాత శిర్డీసమీపప్రదేశమున నొకబైట కమ్మరి కొలిమిలో నొకబిడ్డపడెననియు ఆ బిడ్డకు ప్రాణాపాయము కలుగకముందే ఆబిడ్డ అగ్నినుండి వెలికిఁదీయఁబడినదను వార్త శిర్డీకిఁజేరెను.

## బాబా — రహస్య క్రియలు.

### (e) 1921 మార్చిలో ఆరతికిపూర్వము,

సా. బా:- అహా! నాకడుపులో విపరీతమైన నొప్పిగానున్నది. తలపాగతీసికొనిరండు.

తలపాగను తెచ్చిరి. బాబాదాని తనదేహము మధ్య భాగమునఁజుట్టి ఇరువురు మనుష్యులను కుడి, యెడమపార్శ్వముల నిలిచి తలపాగకొనలను పట్టుకొని గట్టిగలాగుడు- అనెను. వారులాగుచుండిరి

సా. బా:- లాగుడు! ఇంకనులాగుడు. ఇంకను బాధ తగ్గలేదు

(తరువాత) సా. బా:- ఇప్పుడింకనాపుడు బాధతగ్గినది.

ఆ విషయమేమో! యెవరు తెలిసికొనలేకపోయిరి. శిర్డీకి 2 మైళ్ళ దూరమునగల 'నింగోన్'లో నొకబాబాభక్తురాలు దుర్భరమైన కాన్పు నొప్పులతో బాధపడినదనియు ఆపిదపసుఖ ప్రసూతి జరిగినదను వార్త కొంతసేపటికి శిర్డీకిఁజేరెను. కావున ఈ నిగూఢక్రియకాన్పు విషయమునఁ దోడ్పడినట్లు విశదమగుచున్నది.

(f) బాబాను సమీపించి యెప్పుడేని దర్శన భాగ్యము పొందుట కవకాశమీయఁబడని యొక భక్తురాలు మిక్కిలి వ్యాధిగ్రస్తయై యుండెను. ఆమె వ్యాధిని నివారించుటకు బాబా ఆరోగియున్న ప్రక్క

యింటిపై కెక్కి పై భాగమున నడిచి, ఆరోగియింటిపై కిపెళ్ళి, అచటనుండి ఆ వలయింటి పై గానడిచి అచటనుండి నిచ్చెన తెప్పించుకొని దిగివచ్చి ఆనిచ్చెన తెచ్చిన వానికి 2 రూపాయలిచ్చుచు. "మనము ఇతరుల సేవల నుచితముగ స్వీకరింపరాదు." – అని అచటనున్న వారితోఁ జెప్పెను. ( చూ. 226. )

ఆభక్తురాలు ఆరోగ్యము పొందెను.

(g) వాస్తుపూజ మొ॥

1911లో శిర్డిలోని మసీదు పునర్నిర్మాణము గావింపఁబడినపుడు బేల్దారివాండ్రు కావించు కట్టడములను తఱచుగ బాబా కూల్చివేయు చుండువాఁడు, ఆనిర్మాణకార్యము పూర్తియైన పిదప మసీదు ముందున్న ఖాళీస్థలములో తుత్తునాగరము రేకులతో నొక పందిరి వేయుటకు స్తంభములను పాతుచుండిరి. వాస్తుశాస్త్రమునఁ దెలుపబడిన దిక్కుల విషయమువారు గుర్తింపకుండిరి. బాబా కోపమునవచ్చి, తాత్యాపటే లును పట్టుకొని, అప్పుడేపాతిన ఒక స్తంభము నూడఁబెఱికి తాత్యాపటేల్ పైవస్త్రమునుతీసి తగులఁబెట్టి. ఆమసిని, ఒక వెండి నాణెమును ఆ స్తంభమునకుఁదీసిన గుంటలోవైచి, ఆ స్తంభమును మరలపాతి పని జరుగనిచ్చెను. బాబా – గృహములు – దేవాలయములకు సంబంధిం చిన వాస్తుశాస్త్ర నియమములను పాటించుచుండెనని తోచుచున్నది.

(h) బాబాతఱచుగ చేతులతోడనో, చేతి వ్రేళ్ల తోడనో, చేతిలోఁ దాల్చు (సట్కా) చిన్న కర్రతోడనో ఏవేవో సైగలు చేయుచుండు వాఁడు. (1) ధునిముందు. (2) చావడిముందు (3) మసీదునుండి చావ డికి ఊరేగింపు సందర్భమున మారుతి దేవాలయము కనఁబడు నొక నియమిత స్థలముఁజేరినపుడు (చూ. 85) (4) మసీదున జి. యస్. కపర్దేయెదుట. (5) ఇతర సమయముల నితర ప్రదేశములందు సైగలు చేయువాఁడు. వీని యన్నిట నేవియో ప్రత్యేక ప్రాముఖ్యతలు కలవు.

(i) ఒకనాటి మధ్యాహ్నమున భయంకర తీవ్రాతప సమయ మున నొక మేకపిల్ల మసీదుదగ్గఱకుఁజేరి గిరగిరతిరిగి చచ్చినట్లు పడి

యుండెను. బాబా దాని చుట్టుదిరిగి నీటిబిందువులను దానిపైఁజల్లెను. అదిలేచి గంతుపైచి పాఱిపోయెను.

ఆవిధముగ శీర్డిలోని మార్వాడి గడ్డివామి తగులఁబడుచుండగా ఆగడ్డివామిచుట్టు నీరము సన్నని ధారగాపోసి "ఈ మాత్రమే తగులఁబడును" – అనెను. పెద్దగాడ్పులు వీచుచున్నను దానిచుట్టు ప్రక్కల నున్న గడ్డివాముల కెట్టినష్టము కలుగలేదు. (చూ. 342)

(j) అబ్దుల్ కదిర్ – వైరాగ్య యోగనిష్ఠలద్వారా ఆధ్యాత్మికోన్నతిఁగోరి బాబాను ఆశ్రయించెను, బాబాపిడికిలిఁబట్టి చేతినిపైకెత్తి, ఆతనిపైకి నేవోవిసరినట్లు పిడికిటి తెఱచుచు 'లేవ్!' అనెను. ఆక్షణము మొదలతనికి గాఢవైరాగ్యముగలిగి లౌకికవిషయ విముఖుఁడయ్యెను. ఆతని బంధువులందఱు మిక్కిలి బాధ – అసంతుష్టినొందిరి. అతఁడును నియమ విహీనముగ సంచరింపఁదొడఁగెను, అంతట బాబా అతని వైపునకు చేతినిచాచి; పిడికిలిఁబట్టి తనవైపునకు లాగుచు 'లావో!' (తిరిగి యిమ్ము) అనెను అది మొదలతఁడు సాధారణస్థితి, బుద్ధినొంది లౌకిక విషయములఁ బాల్గొనఁదొడఁగెను, ఈ విషయములను 'ఛోటేఖాన్' – గుర్తించినాఁడు.

## వివిధ విషయములు.

### 1. తన చరిత్ర (రచన) విషయమున బాబా ఆదేశము.

609. సా. బా:- చరిత్రవ్రాయుటకు తగిన విధానము.

(1) భక్తుల అనుభవ వృత్తాంతముల విచారించి ప్రోగు చేయుము.

(2) చరిత్రకారుఁడు స్వాభిమాన గర్వముల – హేతు వాదముల జోలికి పోరాదు. పక్షపాతబుద్ధి, అన్యపక్షనిరసన రూపములగు చర్చలు తగవు.

(3) రచయిత శ్రీసాయిబాబా చింతనామృతాంబుధియందు మునిఁగి, తన ఆత్మను, అహంభావమును సంపూర్ణ సమర్పణముఁ గావించి, పదప చరిత్ర రచనకుఁ గడంగవలయును.

(4) బాబా జీవిత చరిత్రను పఠించుట- రచించుట- చింతించుటవలన ఫలము.

భక్తి పెంపొందును- అజ్ఞానము నిర్మూలమగును. వివాదాత్మక బుద్ధితో గ్రంథమును రచించిన అజ్ఞానము హెచ్చును.

(5) విశ్వాసబుద్ధితో నన్ను (బాబా) సేవించువానిని దైవమనుగ్రహించును.

బాబా పలుకులందు ప్రత్యేకత – వైపరీత్య భావము

610. హ. సీ. దీక్షిత్తునకు అతనివాడలో (నివాసమున) విఠోబా (పండరినాథ) దర్శనప్రాప్తి కలిగెను. తరువాత అతఁడు బాబాను జేరెను.

సా. బా:- విఠల్ పటేల్‌రాలేదా? నీవాతనిఁజూడలేదా? ఆవిఠల్ క్షణములో తప్పించుకొని పోవువాఁడు. అతనిని గట్టిగ బంధింపుము. ఏమఱుపాటున అతనిని కనిపెట్టుట మఱచితివా అతఁడదృశ్యుఁడగును

(గమనిక:- విఠోబా క్షణిక సాక్షాత్కారమైనను దాస్‌గాణూ
(మహారాజునకు ప్రాప్తింపలేదు. చూ. 180)

611. దాస్‌గాణూ మహారాజు "ఈశావాశ్యోపనిషత్తు" భావము గ్రహింపఁజాలక తికమికఁజెంది బాబానుజేరెను.

సా. బా:- నాయనా! ఇందేమికష్టముఁకలదు? విల్లిపెర్లిలో కాకా (హ. సీ. దీక్షిత్తు) యింటికిఁబొమ్ము. అతని మోల్కారిన్ (ఇంటఁబనిచేయు కాపుపిల్ల) నీ సందేహముఁలను దొలగించును.

దాస్‌గాణూ అచటకు వెళ్లెను. అచట 'కుంబి' కులమునకుఁ జెందిన 8 ఏండ్ల పనిచేయుపిల్ల ఉండెను. ఆ పిల్ల అతని కష్టముల నెఱుంగకయే, తానతని సందేహముల నివారించుచుంటినను భావము లేకయే, పలికిన పలుకులు ఆ పిల్ల ప్రవర్తనలు ఆ ఉపనిషత్తులలోని విషయముల నాతనికి బోధపఱచినవి,

612. శ్యామాను పాము కఱచెను. ఆతఁడు బాబా ఉన్న మసీదుఁజేరెను.

సా. బా:- బ్రాహ్మణ! పై కెక్కుము - దిగిపొమ్ము!

బాబా తనను మెట్లెక్కి రావలదనుచున్నాఁడని శ్యామా తలంచెను.

సా. బా:- (కొంచెము తరువాత) పై కిరమ్ము! అఫకీరు (దైవము) దయామయుఁడు. నీకు నివారణమగును.

[ బాబా మొదట పలికిన పలుకులు సర్పవిషము బ్రాహ్మణు తనువుపై కెక్కక దిగుమని ఆజ్ఞాపించినాఁడని, శ్యామా అపుడు గుర్తించెను. ]

613. ఉద్ధవేశభావ్ 15 రోజుల కొకసారి (ఏకాదశినాఁడు) బాబాకు ఉత్తరము వ్రాయుచుండును. బాబా మహాసమాధికి కొన్ని నెలలముందు శీర్డికివచ్చి బాబాను సందర్శించెను. తరువాత సెలవు తీసికొని వెళ్ళునపుడు,

సా. బా:- మంచిది! వెళ్ళుము. నీవు ప్రతిపక్షము ఇక్కడకు రానక్కరలేదు. నేనెప్పుడు నీతోడనే యున్నాను. ఎప్పుడు నుందును. అచట జనులకందఱకు (అటుల) దెలుపుము. (నా ఆశీస్సులనందఱ కందింపుము.)

ఇవి యదార్థముగ వీడ్కోలు వాక్కులు. ఉద్ధవేశభావ్ ఆ మాటలలోని భావము గ్రహింపలేదు. ఏమైననేమి – మఱుపుచేత తరువాత ఏకాదశులందు ఉత్తరములు వ్రాయలేదు. 15 రోజులకొకమాఱు వచ్చుట అను బాబా మాటలు ఉత్తరములను సూచించునవియగుట స్పష్టము.

614. (1) సా. బా:- (నిరుపేదయు పవిత్రుఁడైన ఒక మనుష్యునిఁగూర్చి) అతఁడు అధికమగు పైసా (ధనము) కలవాఁడు.

(2) బ్రాహ్మణులు వారి ప్రవర్తనలచేత అధికమగు పైసా నార్జింతురు. (పైసా - అనిన, బాబా అభిప్రాయమున - పుణ్యము - అపూర్వము - అని గ్రహింపఁదగును.)

615. సా. బా:- (అప్పుడేమృతినొందిన 'హర్దా' నివాసినిఁ గూర్చి) అతఁడెట్లు మరణించును? ఉదయమున జీవించును.

(ఆ మృతినొందినవాని బంధువులు అతఁడు తిరిగి బ్రతుకునని ఆ శవమును కనిపెట్టికొని యుండిరి. తుదకు నిరాశనొందిరి. బాబా తెలిపినది ఆత్మ నిత్యత్వము - తరువాత జన్మమున నూతన తనువు ధరించుట.)

616. ఆ ఫకీరు ఎల్లరయెడ దయగలవాఁడు. [ఫకీరు– అనుమాటచే బాబా తనదైవమును గురువును గూర్చి పలికినాఁడు]

617. హ. సీ. దీక్షిత్తు:- (బాబాతో) బాబా! నానాసాహెబ్ కరంబెల్కార్. తనభార్య, సోదరుఁడు జబ్బుగా నున్నారని వారు తిరిగి కోలుకొనుటకు నీ అనుగ్రహము నర్థించుచు ఉత్తరము వ్రాసినాఁడు.

సా. బా:- అతని సోదరుఁడు కోలుకొనును.

హ. సి. దీ:- అతని భార్య?

సా. బా:- ఆమె వచ్చినదా?

హ. సీ. దీ:- ఆమె నిటకు పిలిపించుదుమా!

సా. బా:- పిలిపింపుము.

[ సోదరుడు కోల్పోయెను. భార్య మరణించెను. "ఆమె వచ్చినదా?" - అనుటలో మృతినొందిన పిదప సూక్ష్మశరీరమున - అని భావము ]

618. హ. సీ. దీక్షిత్తు - ఎట్టి బహుమతులను స్వీకరింపక, మిక్కిలి ఆర్థిక సంకటములలోనున్న శిర్డిలోని ఒక భక్తునకు ధన సహాయము చేయదలంచెను. కొంత పైకము (కరెన్సీనోట్లు) ఒక కవరులోపెట్టి తీసికొని బాబా దగ్గఱకు వెళ్లెను.

హ. సీ. దీ:- బాబా! ఈ 'కవరు'ను పంపుదునా?

సా. బా:- పంపుము.

హ. సీ దీక్షిత్తు వెంటనే పంపెను. అది స్వీకరింపఁబడెను.

ఆభక్తుఁడిటుల వివరించి తెలిపెను. అంతకు 2 గంటల పూర్వము ఆభక్తుని భార్య బాబా దగ్గఱకు వెళ్ళెను. "అమ్మా! నేను మీ యింటికివచ్చు చున్నాఁడను. నన్ను నిరాకరించవలదని నీ భర్తతోఁ జెప్పుము"- అని బాబా తెలిపినాఁడు.

## III. బాబా ప్రత్యేక హాస్యము — చిన్నపుచ్చుట — హేళనము

619. ఒక సమయమున వస్తువడికృశించి, చావనున్న ముసలి మేక యొకటి మసీదులోనికి వచ్చెను.

సా. బా:- (బడేబాబాతో) ఒక ప్రేటున ఆ మేకను తెగ వ్రేయుము!

బడేబాబా:- (దానివంక జాలితో చూచుచు) మనము దీనినెట్లు చంపఁగలము? - (అనిపలుకుచు నతఁడు మసీదునుండి వెడలిపోయెను.)

సా. బా:- శ్యామా! నీవు దీనిని నఱుకుము! రాధాకృష్ణఆయి దగ్గఱనుండి కత్తినిఁదీసికొనిరమ్ము.

(ఆయి, కత్తి నిపంపెను. ఆ పనియేమో తెలిసికొని, దానిని తిరిగి తెప్పించుకొనెను.)

శ్యామా:- నేనింటికివెళ్ళి కత్తి తెచ్చెదను.

(శ్యామా యింటికివెళ్ళి అచటనే నిలిచిపోయెను)

సా. బా:- (అంతట, హ. సీ. దీక్షిత్తుతో) నీవు కత్తి తెచ్చి దీనిని చంపుము.

హ. సీ. దీక్షిత్తు వెళ్ళి కత్తి తెచ్చెను.

హ. సీ. దీ:- బాబా! దీనిని చంపుదునా?

సా. బా:- చంపుము!

హ. సీ. దీ:- (కత్తి పైకెత్తి జాగుచేయుచు పట్టుకొని యుండెను)

సా. బా:- నీవేమి ఆలోచించుచుంటివి? కొట్టుము!

దీక్షిత్తు విధేయుఁడై కత్తి దింపఁబోవుచుండెను.

సా. బా:- ఆపుము! ఆజంతువును నిలువనిమ్ము. నేనే దీనిని చంపెదను. కాని మసీదులోకాదు.

అంతట బాబా ఆ జంతువును కొన్ని గజములదూరము మోసికొని పోయెను. ఆ పిదప అది క్రిందపడి చచ్చెను,

620. జి. డి. పండిట్ (హెలాస్పెనివాసి) వచ్చి బాబాకు ప్రణమిల్లెను.

సా. బా:- (ఒకరితో) బాపూసాహెబ్- ఏమి చేయుచున్నాఁడు?

నారాయణ్:- నిద్రపోవు చున్నాఁడు.

సా. బా:- నారాయణ్! ఇక్కడకువచ్చి నపుడువానిని బాగుగ కొట్టుము! నాకు 3-4 వేలరూపాయలు బాకీపడి యిచ్చుటకు జాగుచేయు చున్నాఁడు.

ఇది జి. డి. పండట్ బాకీదారుఁడు బాపూసాహెబ్ అను నతనిని గూర్చిన విషయము. అతఁడా ధనమునీయక జాగుచేయు చున్నవాడని సూచింపఁబడినది. కాని, అప్పుడపుడు బాబా ఖజానాదారుఁడుగ పనిచేయు బాపూసాహెబ్ బోగ్-తనపై బాబా అన్యాయముగ నిందమోపినాఁడని తలంచి కోపముతో తానంతధనము బాకీలేనని నిస్పష్టముగఁబలికెను. (ఇచటనిరువురపేర్లు ఒకటియగుట గుర్తింపఁదగును.)

## IV బాబా — ప్రత్యేకబోధా విధానము.

621. మాధవరావు బాబాయెదుటఁగూర్చొండి "బాబా తనకు "హంస" (సాధువు) ను గూర్చి బోధించవలయు" నని తనలోఁదలంచెను.

సా. బా:- (మాధవరావుతో) వెళ్ళి (హ. సి. దీక్షిత్తుచదువు) పురాణము వినుము!

మాధవరావు దీక్షిత్తుదగ్గఱకు వెళ్లెను. దీక్షిత్తు ఏకనాథ భాగవత మున 11వ స్కంధము 18 అధ్యాయము 27-37 శ్లోకములలో "హంస-పరమహంస" వివరణము చదువు చుండుట గమనించెను.

622. ఒక ప్రార్థనా సమాజకుఁడు బాబాయొక్క శక్తి-స్వభావ-(ప్రవర్తనలద్వారా (1) అవతారములు సాధ్యములు - విశ్వసనీయములు. (2) భక్త సంరక్షణార్థమై దైవము అవతరించుచుండును, (3) దైవము నకు అవతారములకు హారతి నైవేద్యములు సమర్పించుటయుక్తములు - అని గుర్తించినవాఁడు శిర్డీకివచ్చి బాబా ఎదుటఁగూర్చుండి. "బాబా! నాభారములన్నియు నీపై నిలుపుదునా?" అను ప్రశ్నను మనస్సునఁ దలంచెను.

సా. బా:- (బిగ్గఱగా) నిలుపుము!

ప్రా. స:- బాబా! ఎల్లరయెడ సమదృష్టిని ప్రసరింతువా?

సా. బా:- ప్రశ్నించుటకు కొంత వివేకముండవలయును. ఎట్టి కొంటెప్రశ్నము నీవడుగుచున్నాఁడవు! నే నెల్లఱయెడ సమదృష్టినిఁ బఱపుచుందును.

ప్రా. స. తాను సేవించి పూజించుటకొక ఇష్టదేవత (రూపము) కావలయునని తనమనస్సునఁదలఁచెను. అతఁడు ప్రాతశాలవైపునకుఁ దిరిగెను. అచటనొక చక్కని స్త్రీదేవతా రూపము నిలుచుండి, అతనివంకఁ జూచుచున్నట్లు గోచరించెను. అతఁడు బాబావైపునకుఁదిరిగెను. బాబా చిఱునగవు తోఁప అతని వంకఁజూచెను. ఆసందర్భమున నిట్టిదృశ్యమతఁడు వలుమాఱులుచూచెను.

ప్రా. స. తాను చూచినరూపము అన్నపూర్ణాదేవియని గుర్తించి. తన ఇష్టదేవతగ నిర్ణయించుకొనెను.

ఆ ప్రార్థనా సమాజికుఁడు రెండవతూరి శిర్డికి వెళ్ళినపుడు ఎవరో 'సాయీబాబా స్థితప్రజ్ఞుఁడగునా?- శిర్డికివెళ్ళుట వలన లాభము లేమి?- యని ఏమేమియో అతనితో చర్చించిరి. ఆచర్చలతని విశ్వాస మును సడలించినవి. అతఁడు వెళ్ళి బాబా ఎదుటఁగూర్చుండెను.

సా. బా:- శ్యామా! ఈతనినిఁ దీసికొని పొమ్ము. ఏదొక విషయముఁ దెలుపుము!

శ్యామా అతనిని వెలుపలకుఁదీసికొనివెళ్ళి "ఇతరుల పలుకులు- ఆ పలుకుల మూలమున నీ విశ్వాసము సడలుట అంతయు బాబా లీల. ప్రపంచ ప్రలాపములను ప్రపంచము కల్పించు కష్టములను నీమనస్సున పాటింపకుము. నీ మనస్సును బాబా పదములందు లగ్నముచేయుము. అపుడు బాబా నీకు శాంతినిఁ బ్రసాదించును." అని బోధించెను.

వారిరువురు తిరిగి మసీదులోనికి వెళ్ళగా

సా. బా:- (ప్రా. స. తో.) శ్యామాకావించిన బోధపాటించి అనుసరింపుము.

623. సా. బా:- (రాధాబాయి దేశముఖితో) మీ కానాలా దుస్కారాగురు నహ్వై- (నేను చెవికొఱుకు గురువునుకాదు. నేను చెవిలో మంత్రములుపదేశించువాఁడనుకాను,) ఆమాచఘరాణోం నిరాళా ఆహే (మాసాంప్రదాయములు-పద్ధతులు ప్రత్యేకములు.)

624. సా. బా:- (ఉపాసనీ మహారాజుతో) నాచెంతన చేరుము. ఊరక ఉండుము. తక్కినపని నేను కావింతును.

నారాయణ ఆశ్రమ యోగివిషయమునవలె యీ భక్తుని (ఉ. బా) మనసును తన అధీనముఁజేసికొని చక్కదిద్దినాఁడు. స్వప్న ముల ద్వారగాక, ప్రత్యక్షప్రబోధ మేమియు చేసి యెఱుగఁడు.

625. శ్యామారావు. ఆర్. శ్రోత్రి. (ధానాజిల్లాకోర్టు రికార్డు గుమాస్తా) ఒక ప్రశ్న మనస్సున నుంచుకొని బాబా యెదుటఁ గూర్చుండెను.

సా. బా:- 'బాయి' దగ్గఱకుపొమ్ము. ఆమె దేవాలయములో పురాణము చదువుచున్నది.

'శ్రోత్రి' అచటకువెళ్ళి వినెను. ఆమె చదివిన దానిలో తన ప్రశ్నకు సమాధానముండుట అతడు గమనించెను.

తన భక్తులకు బాబా సమాధానమిచ్చు మార్గములలో నిదియొకటి.

## V బాబా ఛాయాపటముతీయు విషయము

626. సా. బా:- శ్యామా! ఆపిల్ల లిచటకేల వచ్చిరి?

శ్యామా:- బాబా! నీఛాయాపటము తీయుటకు.

సా. బా:- నా ( సహజాకారముఁగనుటకు ) ఛాయాపటము తీయవలదని ఆ పిల్లలతోఁజెప్పుము. ఆగోడపడఁగూల్చిన చాలును.

[గమనిక:- గోడ (1) దేహమైయున్నదని (2) దేహమే మనము అనుభావము గలిగియున్నవారమని - బాబాసహజాకారము బ్రహ్మమై యున్నది అని భావము.]

## VI బాబా నీతికథలు

627. బంగారుమూటలతో నింపిన గాడిదలను పెక్కు గొనివచ్చితిని. మార్గమున దొంగలు వాని నన్నిటినిఁజూచిరి. కావున దొంగల (సమీపమున) యింటియందుండుట కష్టము. నీవు (భావ్‌సాహెబ్ ప్రిధాన్ - సబ్‌రిజిష్ట్రార్) నావలన ఈ విషయముఁ దెలిసికొనుటకు ఇక్కడకు పంపబడినావు. ఈ నిస్సారమైన ప్రపంచముననుండుట మిక్కిలి కష్టము. నేనుగ్రహించినది (బోధింపఁబడినది) అదియే. నా సోదరుఁడు మహాదేవ్‌నాథ మహారాజునకిమాత్రము తెలుపుము.

627 A నా ధనమును జనులపహరించుకొని పోయిరి. నేనేమియుఁబలుకలేదు. కాని, మెల్లగా వారిననుసరించి వెళ్ళి, వారిని చంపి, నా ధనమును తిరిగి సంపాదించుకొంటిని.

628. సా. బా:- నాదేహముదిగువభాగము చిలుక ఆకారముగ మార్చుకొంటిని. ఒక సంవత్సరమటులనుభవించిన తరువాత దానినొక సహింపరాని నష్టముగఁ దెలిసికొంటిని. నేనొక లక్షరూపాయలను గోల్పడితిని. (లక్ష్యమును గోల్పడితిని)

629. సా. బా:- నేనొక స్తంభము దగ్గఱఁగూర్చుంటిని. అపుడొక పెద్దసర్పము మేల్కొని మిక్కిలి ఆగ్రహించెను. అది పైకెగురుచు పైనుండి క్రిందికిఁబడఁ దొడఁగెను.

630. సా. బా:- ఒకనికి ఒక చక్కని గుఱ్ఱముండెను. వాడెంత ప్రయత్నించినను అది జతకలియదు. దాని నెక్కడనుండి తెచ్చెనో

అచటకు (దాని మూలస్థానమునకు) ందీసికొని పొమ్మని ఒక విద్వాంసుఁడు తెలిపెను. ఆవిధముగఁజేయఁబడెను. ఆ పిదప అది ఆధీనమై, ఉపయోగ కరమయ్యెను.

631. సా. బా:- (బి. వి. దేవ్‌తో) నీవు నాలుగు ఇచ్చితివి. నిజమే, కాని, బాబాకుఁజెందునది - పొందునది మాత్రమొక్కటే.

632. సా. బా:- (జి. యస్. కపర్దేతో) మబ్బులు క్రమ్మినవి-వర్షములు కురియును. పైర్లుపెరిగి పంటపండును. మబ్బులువిచ్చును. నీవు భయపడనేల?

633. సా. బా:- ఒకఁడు ఒంటెపై స్వారిచేయుచుండెను. అది మలము విసర్జించెను. ఆ మలమంతయు ప్రోగుచేసి నేను తింటిని. నా కడుపు ఉబికివాచెను. స్మృతితప్పి పడిపోతిని. అరౌతు నాపై జాలి పొందెను. నాకు నాలుగు పెనగగింజల నిచ్చెను నేనుతింటిని. నీరు త్రాగితిని. నా దుస్సహమైనబాధ శమించెను. నా కడుపు ఉబ్బరము తగ్గెను. ఇఁక స్వస్థత కలుగును.

634. శ్యామా! నీవు తిరుగలితో ధాన్యమేల విసరుచున్నాఁడవు?

సా. బా:- ఇక్కడకు (నాదగ్గఱకు) వచ్చువారి కొఱకు నేను విసరవలయును.

## శ్రీసాయిబాబా — కాశీనాధ ఉపాసనీ
## మహారాజుతో పలికిన పలుకులు

635. సా. బా:- అహో! కాశీనాథ్! నీవిక్కడనుండి వెడలు నపుడు 8 రోజులలో తిరిగిరాఁజాలనని ప్రతిఘటించితివి!

కాశీ:- ఇది యెట్లుజరిగెనో నేను తెలిసికొనఁజాలకున్నాఁడను. ఇదంతయు నీకార్యమే!

సా. బా:- నాయనా! ఈ 8 దినములు నేను నీ వెనుకనే యుంటిని, ఇపుడు వెళ్ళుము - వాడలో (దీక్షిత్ వాడలో) నుండుము.

సా. బా:- (అచట జనులనుద్దేశించి) ఒక దినమున నేను దారిన పోవుచుండ నొక గర్భిణీస్త్రీనిఁ జూచితిని. ఆమె కడుపు ఉబికి యున్నది. చేతులు పాదములు మిక్కిలి కృశించియున్నవి. ఆమె ఒంటరిగ నుండెను. ఒక కట్టె ఆధారము లేక నడువఁజాలని స్థితిలో నుండెను. "నీవు పెక్కు సంవత్సరములుగ గర్భము ధరించినట్లున్న దానవు. ఇంతవరకేల ప్రసవింపలేదు?" అని నేను ప్రశ్నించితిని. ఆమె సమాధానము లేదు. "మూత్రవిసర్జనము చేయుము. వేడినీరు మాత్రము త్రాగుము. అపుడు ప్రసూతి తేలికయగును" అని తెలిపితిని. ఆమె నా మాటలఁ బాటింపక చన్నీరు త్రాగుటకొక వాగుదగ్గఱకుఁ జేరెను. అపుడు నేను "అహో! ఈమె నిష్కారణముగ మరణించును. ఈమెతోగూడ ఈమె గర్భమునగల అసంఖ్యాకములగు బిడ్డలును మరణింతురు" అని తలంచి, ఆమెను సమీపించి, "అమ్మా! చల్లని నీరు త్రాగవలదని నేను నీకుఁజెప్పలేదా? నీ వీ వాగుదగ్గఱకేలవచ్చితివి? ఊరిలోనికివెళ్ళి త్రాగుటకు వేడినీరు సంపాదించుకొనుము" - అని, చెప్పితిని. ఆదినము మొదలామెవేడినీరు త్రాగెను. ఇప్పుడామె క్షేమముగనున్నది. ఇదంతయు కేవలము వాతమే. (వాయువు) సాయిబాబా యీ మాటలు పలుకుచు అపుడపుడు కాశీనాథునివైపుజూపుచు నతనివంకఁ జూచెను. కాశీనాథుఁడు వెంటనే గ్రహించెను.

"రాహురి - యందు వేడినీరు త్రాగుమని నాకుఁ జెప్పినది సాయియే-అచటకు 15 మైళ్ళ దూరమున నున్న 'జజూరి' యందు వేడినీరు త్రాగుమని నన్ను నిర్బంధించినది సాయియే, అతఁడు దయామయుఁడైన రక్షకుఁడు. ఏ వైద్యులకు నలవికాని నాబాధను తొలఁగించినాఁడు" - అని ఉపాసనీమహారాజు తెలిసికొనెను.

636. మనయిరువురకు ఋణానుబంధముకలదు. మన కుటుంబములు వందలు వేలు సంవత్సరములనుండి పరస్పర ఋణకారణమున బంధింపఁబడినవి. కావున నీకును నాకును భేదములేదు.

637. సా. బా:- కాశీనాథుఁడు శిర్డీవిడిచివెళ్లు పూర్వము అతని లెక్కలన్నియుఁ బరిష్కారముచేసికొని పోవలయును.

శ్యామా:- ఏమి లెక్కలు?

సా. బా:- నాదగ్గఱకుఁజేరువారి లెక్కల నన్నిటిని పరిష్కారము చేయుదును. (కొన్ని వారముల తరువాత) 2, 4, బండ్ల లెక్కలుతప్ప తక్కిన లెక్కలన్నియు పరిష్కారమైనవి. (శ్రావణము - జులై, ఆగష్టు 1911) అన్ని లెక్కలు సరిచూడఁ బడినవి. దాని ఫలితముగ కాశీనాథుఁడు శిర్డీయందు నాలుగు సంవత్సరములుండవలయును.

శ్యామా:- ఇచట 4 సంవత్సరములతఁడేమి చేయవలయును!

సా. బా:- అతఁడూరక విఠోబా దేవాలయములోఁ గూర్చుండి యుండవలయును. ఏమియుఁజేయనక్కఱలేదు. అతఁడు రొట్టెకూరలు మాత్రము తినుచు ఊరకఉండ వలయును. నేను కోరునది సంపూర్తి చేయుదును.

సా. బా:- (కాశీనాథునితో) ఎవరితో నెట్టి సంబంధము నీవు కల్పించుకొనకుము. నీ భవిష్యత్తు మిక్కిలి శుభాస్పదము.

సా. బా:- (ఇతరులతో) అతని విలువ అట్టిది! ఈ విశ్వ మంతయు త్రాసుతో నొకపళ్లెరమున - ఈతని మఱియొకటి నిలుపఁ దగును.

బొంబాయి ప్రభు:- ఏమి? బాబా! నీ సంపూర్ణానుగ్రహము అతనికి రాగిరేకుమీద శాశనము లిఖించి యీయుచుంటివా?

సా. బా:- నేను పలికినది – 'నాకుగల సర్వస్వము ఈతని కనుగ్రహింపఁబడినది'- అనియే.

సా. బా:- (కాశీనాథునితో) నీ వెక్కడనున్నను నీవు దైవమవు. బంగారు రేకుపైనా 'ఫర్మానా' నీచేతులందున్నదని నీవు గ్రహింపుము!

నీవు తఱచుగ నా దగ్గఱకురావలదు. అప్పుడపుడు మాత్రమురమ్ము. నాతో సంభాషింపవలదు. నేను నీతో సంభాషింపను. 4 సంవత్సరముల తరువాత మహల్సాపతి యొక్క సంపూర్ణ ఆదరణము నీవు పడయఁగలవు. నీవు సకలము నెఱుఁగ గలవు. నీవునన్ను గుర్తింపలేదు. నేనునిన్ను పరిపూర్ణముగ గుర్తించితిని. పెక్కు సంవత్సరములనుండి నిన్నుగూర్చి అతి తీవ్రముగ తలంచుచుంటిని. నీవిపుడెక్కడకు పోవలె? ఎక్కడకు రావలె? నీవేమియుఁజేయ నేరవా- ఊరక యుండుము. నేను స్వయముగా నీవెంటవచ్చి టికెట్టు తెచ్చి నిన్నురైలు ఎక్కించి, నీగమ్యమునకు నీవుచేరుకొనునట్లు చేసెదను. (చూచెదను.)

ప్రభు:- ఏమి? బాబా! ఈవ్యక్తికి నీ సర్వస్వము ప్రసాదించితివా?

సా. బా:- అవును! అవును! సకలము ప్రసాదింపఁబడినది. మంచివాఁడుకాని - చెడ్డవాఁడుకాని - అతఁడు నావాఁడు.

నాకు - అతనికి భేదమేమియులేదు. అతనికి సంబంధించిన సకల బాధ్యతలు నాపైన నిలిచియున్నవి.

638. సా. బా:- (కాశీనాథునిలో) నీవున్న ఖండోబా దేవాలయమునకు నేను వచ్చుచుందును.

నేనచటకు వచ్చినపుడు నన్ను గుర్తించి పొగత్రాగుటకు 'చిలిమ్' (పొగగొట్టము) ఇచ్చుచుందువా?

కాశీ:- బాబా! నిన్నుగ్రహింపఁజాలకున్నాను.

639. సా. బా:- (కాశీనాథునితో) నీ ప్రసాదము నాకవసరము లేదు. నీవింతదూరము తీసికొని వచ్చుటకు శ్రమపడనేల? నేనచటనే యుంటిని.

కాశీ:- బాబా! అచట నొక నల్లకుక్క తప్ప మఱి యెవరును లేరు.

సా. బా:- అవును. నల్లకుక్కను నేనే.

640. సా. బా:- (కాశీనాథునితో) నన్ను తఱిమివేసితివి.

కాశీ - అచట ఒక రోగియైన శూద్రుడుతప్ప మఱెవ్వరు లేరు- బాబా!

సా. బా:- అతఁడు నేనే.

కాశీ:- నీవాతఁడ వగుదువా?

సా. బా:- నేను సకలమునందు - దాని కావలఁగూడ నున్న వాఁడను.

641. కాశీనాథుఁడు:- (బాబాతో) నీవు ఆవలకుత్రోసి తగులఁ బెట్టిన వ్యక్తి నేనే.

సా. బా:- అవును; నీవాపాప రూపమున నున్నవాఁడవు. ఆతని నిర్మూలించితిని, నీవిపుడు పాప విముక్తుఁడ వైతివి. మన యిరువుర కృషివలన ఇఁకముందు కావింపఁదగినవి చాలకలవు. పాపము శేషించిన అదియెట్లు సాధ్యమగును?

642. సా. బా:- (కాశీనాథునితో) ఆమనిషివంకఁ జూడుము! అది నీవే, నీ పుణ్యపురుషుఁడు! = (112)

కాశీ:- బాబా! ఈతఁడు నాపుణ్యపురుషుఁడే అయిన - నీవు ఇంతకుముందు తగుల బెట్టినది నాపాపపురుషుఁడే అయిన - నేనెవఁడను?

సా. బా:- నీవీ (రెంటికి) యిరువురకు అతీతుఁడవు. నేను ఎవఁడనో నీవు అతఁడవే? నీవు - నేనే!

643. సా. బా:- (కాశీనాథునితో) శతాబ్దములకొలఁది పెరిగి వర్ధిల్లునటుల 14 అశ్వత్థ వృక్షములను (రావిచెట్లను) నాటుము!

ఓమ్ తత్సత్! శ్రీ సాయీనాథార్పణమస్తు!

శ్రీ సాయినాథాయనమః

# " ఏమిరా! నిన్నుపేక్షింతునా ? "

శ్రీయున్ భాగ్యము భోగముల్ గృహములున్ క్షేత్రంబులున్ విద్యలిం
కేయేవానినిఁ గోరనెంచెదవొ - సాయిన్ - నన్నె యర్థింపు; నీ
కే యే యర్థము లెంతలేఁదగునొ నేనేకూర్తు; నన్జేరు నాఁ
డే యీ నీ భరముల్ వహింప నొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? ౧

వారిన్ వీరినిఁజేరి దైన్యము వహింపన్ జూతువే? బేల! నన్
జేరన్ జాలిన చీమనేనిఁ గరుణన్ జేపట్టి రక్షింపనే?
ఈ రేడౌ భువనంబులందుఁగల సాయీ భక్తులౌ వార లం
దేరేన్ గందరు - కుందరం చెఱుఁగు: ఏమీ, నిన్నుపేక్షింతునా? ౨

పదునాల్గేడులనుండి యేమఱక కాపాడంగ లేదొక్కొ? వృ
త్తి దశన్ బాయుడు జీవితంబుఁ గెడవన్ దీరేమియా? యంచు నీ
మది భీతిన్ గననేల? నన్ను భజియింపన్ నేర్చియున్ జంకు దే
మిది? నాయున్కిని విస్మరించెదవ? - ఏమీ, నిన్నుపేక్షింతునా? ౩

"నను సేవించుచు నాదు బోధల ననన్యశ్రద్ధఁ జిత్తంబునన్
మననంబున్ బొనరించు నాశ్రితునిఁబ్రేమన్ జేరఁగాఁదీసి ర
క్షణమున్ గూర్చెద" - అన్న! నావగు ప్రతిజ్ఞా వాక్యముల్ పొల్లవో
యెనె ఏ నాఁడును! జంకఁగాఁదగవె? - ఏమీ, నిన్నుపేక్షింతునా? ౪

ఎవరేమాడిన నోర్పునన్ వినుము; వాదింపంగరాదెందు నే
నవుఁగాదంచును, సత్యవస్తువగు బ్రహ్మంబీ కుతర్కంబులన్
దవులన్ బోపదు; భక్తి సత్సహన చిత్తస్థైర్యముల్ ప్రాపు; నీ
కివి చేఁగూర్చెద; శాంతిమై మనుమి! ఏమీ, నిన్నుపేక్షింతునా? ౫

ధనముల్ లేవని చింత నొందకుము స్వాంతంబందు; నీవీధనం
బున శాంతిన్‌గనలేవు; చేరు దురితంబుల్: నీకు నీవారికిన్
దినఁగట్టన్ గొదువేమియున్ బఱుపకే నీచెంత నేనుండి పే
ర్మిని వేకన్నులఁగాచుటల్ కనవె? ఏమీ, నిన్నుపేక్షింతునా? ౬

హరియన్నన్ హరుఁడన్న సూర్యుఁడన దత్తాత్రేయుఁడన్నన్ గణే
శ్వరుఁడన్నన్ మఱి కాళియన్న విధి నాబ్రహ్మంబుఁ గర్మంబుఁ గ్రి
స్తరయన్ గౌతమ బుద్ధుఁడర్హుడన నాయల్లాయటంచన్న నీ
కెఱుఁగన్ జేయనె? "సాయి" యిన్నియని; ఏమీ, నిన్నుపేక్షింతునా? ౭

తొలిజన్మంబుల భాగ్యభోగముల యందున్ గాంక్షఁ దత్తత్క్రియా
దులఁగావింప మిఁగాన వీభవము నందున్; గాని, యీ నా పదా
మలసేవా మహనీయ భాగ్యమును సంపాదింపఁగాఁ గంటి వ
ర్మిలి; నన్యంబులతో నిఁకేటిపని? ఏమీ, నిన్నుపేక్షింతునా? ౮

పెనులోభాదుల జాడలవ్ విడిచి నీ విధ్యుక్త ధర్మంబులన్
బొనరింపన్‌దగు న్యాయసమ్మత పథంబున్ బాయకే సాధ్యమౌ
ఫణితిన్; దక్కు భరంబులన్నియును నాపై నిల్పు మెందేని లే
మిని నీకున్ గలిగింప-నమ్ముమిది; ఏమీ, నిన్నుపేక్షింతునా? ౯

ధరయందున్ నినులోభపెట్టునవి కాంతా కాంచనంబుల్; మహా
దురితంబుల్ పచరించు నీయుగళినిన్ దూరంబుఁ గావించి, యీ
శ్వర సంజ్ఞన్ సచరాచరాత్మకము విశ్వంబందు వ్యాపించు న
న్నెఱుఁగన్ జేసెద; శాంతిమై మనుమి; ఏమీ, నిన్నుపేక్షింతునా? ౧౦

పరమప్రేమ సుధారసంబు సతమున్ వర్షించి యెవ్వేళనే
మఱకే కంటికి రెప్పచందమున సంబాళించి, తోడై దురం
తర దుష్కంటక దుర్గతిన్ మెలపి శుద్ధస్నిగ్ధ మార్గంబు నే
నెఱుఁగన్ జేయనె? నాదుబిడ్డలకు; ఏమీ, నిన్నుపేక్షింతునా? ౧౧

వదలన్నేరిచి పాపముల్ విషయ సంబంధంబుఁ దద్వాసనల్,
హృదినిన్ నిర్మలశాంతి మందిరముఁ గావింపన్ సమర్థుండ వే
నెద సర్వేశుఁడు చొచ్చు, వెల్గునిడు - భాషించున్ ప్రబోధించు న
మ్మిది పాటింపు మటంచుఁ దెల్పనొకొ? - ఏమీ, నిన్నుపేక్షింతునా? ౧౨

అవతారంబులు సాధుసద్గురులు ప్రత్యక్షంబు నాదైవ, మ
ట్లవుటన్ వారి కొలందు లెన్నఁదగ, దవ్యాజానురాగాన వే
కవిధిన్ జీవులనుద్ధరించుటకు లోకంబంధు వర్తింత్రు వా
రెవరేన్ సేవ్యులటంచుఁ దెల్పనొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? ౧౩

ధనముల్ విద్యలు రాజకీయ పదవుల్ తథ్యంబు నన్జేర్ప వెం
దును; నిర్వంచిత భక్తికేను వశమౌదున్; బిడ్డ! మత్ప్రేమభా
జనుఁడై మన్ననకెక్కఁ జాలిన మహాల్సానాథు చందాన నె
మ్మిని సేవించిన రక్షణంబిడనె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 1

తొలి జన్మంపు ఋణానుబంధమున భక్తుండైన నావాఁడు భూ
తల మందెచ్చట నున్నరాఁబనిచి, మత్పాదాశ్రయుంజేసి, బా
ములు లేముల్ పెడఁబాపి, యుక్తవిధిఁ బ్రాపున్గాపునై బోధ మ
ర్మిలి చందోర్కరు నట్లు గూర్తుఁజుమి: ఏమీ; నిన్నుపేక్షింతునా? 2

నను నెందేన్ శరణొంది యోగ్యగతిఁగానన్లేక వ్యామోహ బు
ద్ధినెవండేన్ బెడదారిఁబడ్డ, దగురీతిన్ శిక్షఁగల్పించి, య
త్యను కంపన్హితమున్ ఘటించుచు గణూదాసున్ బలెన్మోక్ష గా
మినిఁ గావించెద: విశ్వసింపుమిది; ఏమీ, నిన్నుపేక్షింతునా? 3

తొలిజన్మంపు ఋణాను బంధమున నెందున్ జేరినన్ నాదు బి
డ్డల నాచెంతకుఁ జేర్చుకొందు, విడనాడన్ యోగమున్ క్షేత్రమున్
గలుగన్జేసి సముద్ధరింతును; కాకాదీక్షితున్ దిద్ది, య
ర్మిలి రక్షించినరీతిఁ గన్గొనవ? - ఏమీ, నిన్నుపేక్షింతునా? 4

వ్యామోహంబును స్వార్థచింతన మమత్వాహంకృతుల్ నాదు లీ
లా మాధుర్య కథా సుధారసముఁ గ్రోలన్ వైళమేడిందు; నే
ప్రేమన్ నీ భరముల్ వహింతుఁ బరితృప్తిన్‌గూర్చు నిందందు, మా
హేమాద్పంతును బోచుటల్ గనవె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 5

క్రమరీతిన్ నిగమాదులన్ జదివినన్ గష్టించి అష్టాంగ యో
గములన్ సాధనఁజేయఁజాలినను, సాక్షాద్దైవమౌ సద్గురూ
త్తమ కారుణ్య కటాక్ష వీక్షణ మహద్భాగ్యాప్తితోఁ బొల్పు నా
నె? మదిన్‌నిల్పు ఉపాసనీ చరిత; ఏమీ, నిన్నుపేక్షింతునా? 6

ప్రకృతి ప్రేరిత వాంఛితార్థ రతినేన్ బ్రార్థించు నా వాని కో
రికలన్‌దీర్చి హితంబుఁగూర్తు, బరమ శ్రేయస్కరంబైన దా
రికిఁదార్తున్, మఱిమేన నేన్‌విడ, ఁగృతార్థీభూతుఁగావింతు సు
మ్మీ! కపర్దే చరితంబునన్ గనవె? – ఏమీ, నిన్నుపేక్షింతునా? 7

నను ప్రేమించుచు సర్వభూత హృదయాంతర్వర్తిఁగానన్నుఁ గ
న్గొను నాభక్తున కేను జిక్కఁబడుచుందున్; వాఁడెపో ప్రేమి; ప్రా
క్తన పుణ్యాతిశయున్ పురందరుని వృత్తంబీవు నాలింపఁ బో
వె? ననున్‌జేరిన చీమనేన్ విడువ; ఏమీ, నిన్నుపేక్షింతునా? 8

ఇతరుల్ వాకొను వాక్కులూ కొనక నీ హృత్సీమ నన్నిల్పి, నీ
కృతులన్ సమ్మతిమై నొరర్పుమిక నీయీ వారికిన్ నీకు సు
స్థితిఁగల్పించి సముద్ధరించెదను; నాచ్ఛే వృత్తమాలింపవే?
హితమున్ గూర్పనె! తోడు నీడనయి; ఏమీ, నిన్నుపేక్షింతునా? 9

"గురు నీయేడు గడంచునమ్ము, మిలనీకున్‌గల్లు సర్వంబు స
ద్గురు కారుణ్య కటాక్షలబ్ధమని సంతుష్టిన్‌గనన్ జూడు;" మే
ఘలపున్ గానవు; దామియా కటుహితాభీష్టంబులన్ గూర్చి ని
ర్నిరవున్ జేర్చెద – విశ్వసింపుమిది; ఏమీ, నిన్నుపేక్షింతునా? 10

పరతత్త్వజ్ఞుని సాధుసత్పురుషుఁగొల్వన్ తత్కృపావీక్షణం
పురహస్యంబది స్వానుభూతమయగున్; మూఢుల్ పరప్రత్యయుల్;
పెర 'ఔఁగాముల' తోడనేమిపని; బీ. వీ. దేవు వృత్తంబు నం
దెఱుఁగన్‌జేయుతె? మద్విధానముల; ఏమీ, నిన్నుపేక్షింతునా? 23

మది నిర్వంచితభక్తి నన్ను భజియింవన్‌నేర్చు నావానికె
కొదవల్ కల్గవు; వానిభారములఁగైకొందున్; వృథాచింతనల్
గదురన్ వ్యాకుల మందనేపని? - నిమోన్కర్ వృత్తమున్ నిల్పుమీ
హృది, సుశ్రేయ పథంబునీకిడుదు; ఏమీ, నిన్నుపేక్షింతునా? 24

కృతులన్ లాఘవగౌరవంపు తలఁపున్ గీలింపకే, స్వార్థమే
గతినిన్‌జేరఁగనీక, ప్రేమఁ బఱుపం జూడుమీ! జీవసం
తతి; 'అబ్దుల్' చరితంబునేమఱకు స్వాంతంబందు; నీప్రాపునై
కృతకృత్యున్ బొనరింతు; నమ్ముమిది; ఏమీ, నిన్నుపేక్షింతునా? 25

క్షితి నీకర్తృతలేని కామితము లాసింపంగరా: దే నొసం
గితి నా నిల్పు కొవంగనేర; వనురక్తిన్ నన్ను జింతింపు! స
ద్గతిఁజేకూర్చెద; నిల్పు నాపయిని యోగక్షేమ భారంబు; నీ
యితరాలోచనలెల్ల మానుమిఁక; ఏమీ, నిన్నుపేక్షింతునా? 26

కల, యీజాతి మతాదులన్నిటను లోకస్వామితా నొక్కఁడై
వెలయున్; భక్తులు నామరూప పదముల్ వేర్వేఱఁ గల్పింత్రు; త్రో
వలు వేరైనను గమ్యమేక, మిది విస్పష్టంబు: నీబాట న
ర్మిలి నీవేగుట శ్రేయమౌననవె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 27

నను గుర్తింపఁగ లేక విభ్రమతుఁడై నన్ నాకు సంబంధియౌ
జను, నేనేదటిఁజేర్చుకొందు, నిఁక వైషమ్యానురాగాల రెం
టినిఁ బోకార్చుదుఁ జక్కదిద్దెదను; భాటేన్‌రామదాసా నుయా
యిని, రక్షించిన చందమున్ గనవె? ఏమీ, నిన్నుపేక్షింతునా? 28

నను సేవించుచు నాదు నామము ననన్య శ్రద్ధస్వాంతంబునన్
మననంబున్ బొనరించు నాశ్రితుల, సంబంధీయులౌ వారి చెం
తన నేనుందు, హితంబుఁ గూర్చుదును; చంద్రాబాయినిన్ ప్రేమనో
మిన వృత్తాంబు సమాలకింప వొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 29

ప్రతిమన్ జిత్రపటంబునందునను సంభావించినన్ లేక, ప్రా
కృత దేహంబునఁగొల్చినన్ సమమ; నాయీ సర్వ, భూతాత్మక
స్థితి మాత్రంబెద విస్మరింపకు మినన్ సేవింప! 'బాలాబువా'
యితి వృత్తాంబునఁ బోధఁజేయనొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 30

దురహంకార దురాగ్రహంబులవి శత్రుల్ వాని, ఁబోకార్చి, యె
త్తఱినిన్ లౌకికవాంఛలన్ దవిలి కుందన్బోక, వైరాగ్య వి
స్ఫురణన్ నిర్మల భక్తి సేయు, మిట బాపూసాహెబున్ జోగు నా
యిరవున్జేర్చి యనుగ్రహింప నొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 31

అనురాగంబున భక్తి తత్పరత నీవర్పించునే స్వల్పమై
నను సంప్రీతినిఁ గొందు! జీవచయమున్ నన్నట్టులీవాదృతిన్
దనుపన్ జూచెదవేని మెలిడుదు; మూతార్కాడ్ కుటుంబంబునో
మిన వృత్తాంబు సమాలకింపవొకొ? ఏమీ, నిన్నుపేక్షింతునా? 32

అవతారంబులు సద్గురూత్తములు ప్రత్యక్షంబునౌ దైవ, మ
ట్లవుటన్ సందియముల్ త్యజించి, చిరమత్యాసక్తి నేకైక ల
క్ష్యవిధిన్ గొల్వుమి, నమ్మియోరిమి, పిపేలంబాడెకర్ పంతు లం
దెవరిన్గాదని త్రోసిపుచ్చితిన? ఏమీ, నిన్నుపేక్షింతునా? 33

చలచిత్తంబుఁ ద్యజింపు మీవిఁకను విశ్వంబందు బ్రహ్మజ్ఞులా
కల రెందెందఱొ; వారభిన్నులని, యేకంబంచు గుర్తింపు; మె
వ్వలనన్ నీగురుదేవునే కనుమి; ఆవస్తే యుదంతంబు నం
దిఃమిన్ దెల్పెనె సత్యతత్త్వమిట; ఏమీ, నిన్నుపేక్షింతునా? 34

కలుముల్ లేములు, సౌఖ్యదుఃఖములు ప్రాక్కర్మాను సారంబుగాఁ
గలుగున్ జీవికిఁ, గాని నేన్ శ్రితునకై కల్పించు మార్గాలు మో
హలతాచ్ఛేద కరంబులౌను, నరసింహస్వామి వృత్తాంతమం
దెలమిన్ దెల్పనె? మద్విధానముల; ఏమీ, నిన్నుపేక్షింతునా? 35

—:[o]:—

# కృతి సమర్పణము

జలనిధి జలములఁగొని యా
జలనిధికిన్ దర్పణంబొసంగునటుల నీ
పలికిన పలుకులఁదెలుగునఁ
బలికి సమర్పింతు, సాయివ్యాసా! కొనవే!

# పూజ్యులు శ్రీ బి. వి. నరసింహ స్వామీజీ



## అంజలి

శ్రీసాయినాథ కథారసమును, విశ్వమంతటఁ దాగింపఁ బెట్టినాఁడు,
సాయీమహారాజ సత్సూక్తులభయప్రదానబోధలఁ బ్రజన్ దనిపినాఁడు,
సాయిబాబా విశిష్టావతారాంచిత, వృత్త మెల్లర కెఱిఁగించినాఁడు,
సాయీశ పదభక్తి – జాతిమతాది వైషమ్యదూరంబని చాటినాఁడు,

అఖిల భారతసాయి సంఘాధినేత
సాయి సద్గురు వ్యాసుఁడౌ, స్వామి – బీ. వి.
నారసింహుని దివ్యపాదారవింద
ములకు భక్తిమై నిత్యమంజలి ఘటింతు.

# మంగళ హారతి

శ్రీరామసాయి! సిద్ధావతార! – శ్రితజనమందార !
ద్వారకామాయీ భవనవిహారా! – భవభయ పరిహార !
హారతి– కప్పురహారతి– మంగళ– హారతినర్పింతు.
కారుణ్యమున జీవాళినిం బ్రోతు– కరములజోడింతు.
నీబిడ్డలమిదె! నీపదరజమున– నెమ్మినిత్రావాలెదము
బాబా! ఆసల పాల్పడంజేయక– పరమపదంబిడుము !
ఎవరెవ రెటులాశ్రయింతురో వారి– నీవటులేలుదువు.
వివరింప నీ మహత్త్వమపారము– విశ్వాధారుండవు.
నీనామతరణి నిశ్చయముగ భవ–నీరధి దాటించు
దీనజనంబుల దిక్కువు సాయీ–దేవా! కరుణించు !
సగుణబ్రహ్మముగ జగతిం బొడమితి–సాయీ! హరివీవు.
అగణితనిగమాగమాదులేన్ ని–న్నరయంగ నేరవు.
శరణాగతదీన రక్షకుడవను– శపథంబు నిల్పుము !
వరదా! వరదా౽భయ కరముంబట్టి – ప్రణతుండన్నోముము !
అనయము నీశుభ పదసేవన భా–గ్యంబును మాకిడుము !
హనూమచాతకమును సాయీవన - దాంబువులం దన్పుము!

తో॥ నీరాజనంబు నీకిదె–సాయీ! - నితాంతజగదాధార !
ద్వారకమాయీ భవనవిహారా! స్వాశ్రిత జనమందార ;



మాతృశ్రీ ప్రింటర్సు, బాపట్ల - 522 101.

శ్రీసాయీ నిలయము ప్రచురణములు:

కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారి రచనలు.

1. "ఏమీ ! నిన్ను పేక్షింతునా?
శ్రీ షిర్డి సాయీబాబా జీవిత చరిత్ర - భక్తుల అనుభవములు
5 సంపుటములు 1200 పుటలు. రు. 30/-
2. శ్రీసాయీ అనుసరణము 354 పుటలు రు. 12/-
3. శ్రీసాయీబాబా పూజా స్తవములు 88 పుటలు రు. 2/-
4. శ్రీరామా! ఆపదుద్ధారకా! (శతకము) రు. 1/-
5. శ్రీ హనుమాన్ చాలీసా! రు. 1/-
6. శ్రీ సాయిదేవ శతకము రు. 1/-
7. శ్రీవేంకటేశ్వర సుప్రభాత గీతములు మరియు శ్రీలక్ష్మీ
నారాయణ స్తోత్ర మంజరి. రు. 3/-
8. శ్రీమద్భగవద్గీతామృతము రు. 12/-
9. సాయీబాబా కూడ దేవుడేనా? ఉన్న దేవుళ్ళు చాలకనా?
(సందేహ నివృత్తి) రు. 8/-
10. శ్రీసాయీ సుభాషితములు రు. 8/-
11. శ్రీహనుమ గీతికా తారావళి రు. 1/-
12. శ్రీసాయీనాథ బోధామృతము 432 పుటలు రు. 20/-

(తపాలా ఖర్చులు ఉచితము)

ప్రతులకు:-

బాపట్ల వేంకట పార్థసారధి

శ్రీసాయీ నిలయమ్, చెరువు (P.O)

గుంటూరు జిల్లా; PIN 522113.